శ్రీమతే రామానుజాయనమః

# భక్తినివేదన

[ వేదాంతమాసపత్రిక ]

సంపుటి ౧౩ శార్వరి 1960

సంచిక ౧ చైత్రము మే



శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మ

సంపాదకులు :- న్యాయవేదాన్త విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

# గోపికాగీతలు

## 10 వ శ్లోకము

శ్లో॥ ప్రహసితం ప్రియ ప్రేమవీక్షితం
విహరణం చ తే ధ్యానమంగళం।
రహసి సంవిదో యా హృది స్పృశః
కుహక నో మనః క్షోభయన్తి హి॥

—: అర్థము :—

హే ప్రియా = ఓ ప్రియుడా
హే కుహక = ఓ వంచకుడా,
తవ = నీ యొక్క,
ప్రహసితం = చిరునవ్వును,
ప్రేమవీక్షితం = ప్రేమపూరితమైన చూపును,
ధ్యానమంగళం = ధ్యానముచేతనే మంగళ ప్రదమైన,
విహరణం + చ = విహారమున్ను,
యాః = ఏ

రహసి = రహస్యమందలి.
సంవిదః = చేష్టలు,
హృది స్పృశః = హృదయమున నారూఢములైయున్నవో
తాః = అవి,
నః = మా యొక్క,
మనః = మనస్సును,
క్షోభయన్తి + హి = బాధించుచున్నవి సుమా

*:— తాత్పర్యము :—*

ఓ కృష్ణా! నీ గుణచేష్టలను అను-సంధించుకొనుచు కాలము గడుపుదమన్నను మేమటుల నుండజాల కున్నాము. ఏలననగ నీవు మమ్ములను వంచించి నీ వలలో దగుల్కొన జేసితివి. నీవు మాపై విసరిన యా అమంద మందహాసములును, తలముక్కలుగా మమ్ములను ముంచెత్తిన యా ప్రేమ మధుర కటాక్ష వీక్షణములను, తలంచినంతనే మా మనోనయనముల కావేగమును కల్గించుచున్నవి. మరచిపోవుదమన్నను మరపురాని యా స్వైరవిహారములును, రహస్యమునందు నీ వొనర్చిన యా రసమంజుల చేష్టావిశేషములును మా మనస్సుల జిక్కుకొని బాధించుచున్నవి. మరల నీ దివ్యమంగళ విగ్రహ సందర్శనము గల్గిననేగాని నేత్రములు చల్లబడవు. నీ మృదు మధురాంగక సంస్పర్శచే గాని యీ శరీరము శాంతి నొందజాలదు. నీ సుమధుర - రసమయ - వాక్యముల వినిననేగాని ఈ శ్రవణములు తృప్తిని బొందవు. నీ స్మరణము అంతకంతకు బాధకమేగాని సుఖసాధకము గాకున్నది. గావున ఒక్కసారి నీసందర్శన మొసగి కాపాడుమా.

శ్రీమతే రామానుజాయనమః



శ్రీ కూర్మము న

# పశ్చిమ ధ్వజస్తంభ ప్రతిష్ఠాహ్వాన పత్రిక

## శ్రీ కూర్మము - (శ్రీకాకుళము జిల్లా)

సుమారు 900 ల సంవత్సరముల క్రిందట భగవద్రామానుజులచే శ్రీకాకుళం జిల్లాలోని శ్రీ కూర్మ గ్రామమందలి శ్రీకూర్మ నాథుని దేవాలయము విష్ణ్వాలయముగ స్థిరీకరింపబడి, శ్రీ కూర్మనాథుడు తన నిజ స్వరూపముతో పశ్చిమాభి ముఖముగ తిరిగి భక్తులకు దర్శన మొసంగినప్పుడు, గర్భాలయమునకు పశ్చిమ పార్శ్వమున ఒక ధ్వజస్తంభము ప్రతిష్ఠింపబడినది. ఆ స్తంభము సుమారు 20 సంవత్సరముల క్రిందట గాలివానలకు పడిపోయినది-అందువలన ఆ స్థానమున క్రొత్త కాంక్రీట ధ్వజస్తంభమును ప్రతిష్ఠించుటకు సంకల్పింపబడినది.

స్వస్తిశ్రీ శార్వరినామ సంవత్సర వైశాఖ శుద్ధ 3 బుధవారము (ది 27-4-1960 తేది) సాయంకాలమున అంకురారోపణముతో ప్రారంభింపబడి పంచాహ్నికదీక్షతో ఈ వైశాఖ శు|| 8 సోమవారము (ది 2-5-1960 తేది) ఉదయమున శ్రీ కూర్మములో శ్రీ కూర్మనాథుని పశ్చిమ ధ్వజస్తంభప్రతిష్ఠామహోత్సవము జరుగును గాన భక్తులందరును విచ్చేసి ఈ ఉత్సవమున స్వామిని యారాధింప గోరుచున్నాము.

ఇట్లు
శ్రీ కూర్మభక్తబృందము

ఈ ప్రతిష్ఠకు వలయు ద్రవ్యము ఇది వరలో కొంతవరకు విరాళములుగ సేకరింపబడినది-గాని అది సరిపోదు. కనీసము ఇంకొక వేయి రూప్యములైనను కావలసియున్నవి. ఇది, చాల మహత్తరమైన సత్కార్యము. భగవద్రామానుజులువారు స్వ సాంప్రదాయ-సిద్ధాంత స్థాపనరూపముగ స్థాపించిన దీ ధ్వజస్తంభము. గాన భక్తులందరును స్వహస్త పరహస్తముల ద్వారా ఈ కైంకర్యమునందన్వయించి విరివిరిగ విరాళములను సమర్పించుకొని ధన్యులు కావలసినదిగా గోరుచున్నాము.

మకాం
శ్రీ కూర్మం
(శ్రీకాకుళం జిల్లా)
27—5—60

ఇట్లు
శ్రీమన్నారాయణ రామానుజ జీయర్

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ కూర్మములో

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ

# వైశాఖపండితసభ

# ఆహ్వానపత్రిక

---

శ్రీకాకుళంజిల్లా శ్రీకూర్మములో శ్రీకూర్మనాథస్వామివారి సన్నిధిలో శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారి అధ్యక్షత క్రింద వైశాఖమాస పండితసభలు. 31–4–60 వ తేది మొదలు 2–5–1960 వ తేది వరకు వరుసగా 3 రోజులు జరుగునుగాన ఆస్తికులగు భక్తులందరు ఇందు పాల్గొని ఆనందించగోరు చున్నాము.

శ్రీ కూర్మం,
28 -4–60

ప్రధాన కార్యదర్శి,
తె. కం. గోపాలాచార్యులు.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 258 | వృషభః | అభిగచ్ఛద్భక్తజనాన్<br>సుధావర్షణతోఽన్వహమ్<br>వృషభశ్చై సమాఖ్యాతః<br>సిఞ్చన్ భయహరో మనుః॥ | తన కభిముఖులైన భక్తవర్యులకు సంసారతాప ముపశమించునట్లు ప్రతిదినమందును అమృతమును వర్షించి తడుపుచుండువాడు. |
| 259 | విష్ణుః | విష్ణుస్స్యాదవినాభావా<br>ద్వ్యాప్య వ్యాపక భావతః | ప్రపంచమునందుండు పదార్థము లన్నిటియందును ఎల్లప్పుడును విడువక వ్యాపించి యుండువాడు. |
| 260 | వృషపర్వా | వృషా వర్ణాశ్రమా ధర్మాః<br>పర్వాణ్యారోహణే తు తే<br>యస్యసన్తి సదా సోఽయం<br>వృషపర్వా ప్రకీర్తితః॥ | వర్ణాశ్రమ ధర్మములను తనను పొందుటకు సర్వదా అనుకూలమైన మెట్ల పంక్తిగా (సోపానపరంపరగా) కలవాడు. |
| 261 | వృషోదరః | భక్తైరుపాహృతాం పూజాం<br>ఉపహారాంశ్చ ధర్మతః<br>కృత్వాదరే యోజయతి<br>స వృషోదర ఉచ్యతే॥ | ధార్మికమైన ఉదరము కలవాడు. అనగా భక్తులు భక్తితో సమర్పించిన ధార్మికమగు పూజలను, నైవేద్యములను గర్భమున ధరించువాడు. |
| 262 | వర్ధనః | మాతృవజ్జఠరే కృత్వా<br>భక్తాన్వర్ధయతి స్వయం<br>వర్ధనః ప్రోచ్యతే నిత్యం.<br>సప్తార్ణో వృద్ధిదో మనుః॥ | భక్తులను తల్లివలె తనకడుపున నిడుకొని స్వయముగ నెల్లప్పుడును పోషించువాడు. దీనిని 'ఓమ్ వర్ధనాయనమః' అని మంత్రమువలె నాచరించినచో నిది వృద్ధి నొసంగును. |
| 263 | వర్ధమానః | వర్ధయంస్తాన్ స్వయమపి<br>వర్ధమానశ్చ వర్ధనాత్॥ | తన భక్తుల నట్లు వృద్ధిని పొందించుచు తానును వృద్ధి పొందువాడు. |
| 264 | వివిక్తః | లోకోత్తరార్ధి వృత్తాన్తాత్<br>స్వైకాన్తా దుణబృంహితాత్<br>వివిక్త ఇతి విఖ్యాతః<br>పావనత్వ ప్రదో మనుః॥ | లోకవిలక్షణమైన వృత్తాంతము కలవాడగుట వలనను తనకే యసాధారణమైన కల్యాణ గుణసమూహము కలవాడగుటవలనను లోకతీతుడగువాడు దీనిని ఓమ్ వివిక్తాయనమః అని మంత్రముగా నాచరించినచో నిది పవిత్రత నొసంగును. |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 265 | శ్రుతిసాగరః | నదీనాం సాగర ఇవ<br>స్వగుణోక్తి విధాజుషామ్<br>శ్రుతీనా మవసానత్వాత్<br>కథ్యతే శ్రుతిసాగరః॥ | సముద్రమెట్లు నదులకు పర్యవసాన భూమియగుచున్నదో అట్లే తన కల్యాణగుణములను జెప్పెడు శ్రుతివాక్యము లన్నిటికిని తానే పర్యవసానభూమిగానుండు వాడు (ముగింపు స్థానమైనవాడు) |
| 266 | సుభుజః | ప్రపన్న భరణే ధుర్య<br>భుజోయ స్యభుజస్తు నః॥ | భక్తులభారమును వహింపదగిన సమర్థమైన సుందర భుజములు కలవాడు. |
| 267 | దుర్ధరః | పరై ర్దుర్వార వేగోయః<br>దుర్ధరస్సచ కథ్యతే | పరులచే నాపబడజాలని వేగము కలవాడు. |
| 268 | వాగ్మీ | వేదలక్షణ వక్తృత్వాత్<br>వాగ్మీ ప్రియహితోక్తితః॥ | వేదరూపమగుటచేతను. జయశీలను, మధురము గంభీరము ప్రియము హితమును అగుటచేతను ప్రశస్తమైనవాక్కు కలవాడు. |
| 269 | మహేన్ద్రః | పరమైశ్వర్యవత్త్వేన<br>మహేన్ద్ర ఇతి శబ్ద్యతే॥ | పరమైశ్వర్య సంపన్నుండగుటచే మహేంద్రు డనబడుచున్నాడు. |
| 270 | వసుదః | వసుదో ధనదానాచ్చ<br>ధనాయదోర్భ్య విశేషతః॥ | ధనము నపేక్షించు ఇంద్రకుబేరాదులకును ధనమునిచ్చువాడు. |
| 271 | వసుః | సర్వస్య హరిరూపత్వాత్<br>ధనం యస్మా న్వసు స్తతః॥ | మహాత్ములకు సర్వమును సర్వేశ్వరుడే గావున వారికి ధనమును తానే యగువాడు. |
| 272 | నైకరూపః | యస్సదా బహురూపశ్చ<br>నైకరూప స్సకీర్తితః<br>తత్తజ్జన జ్ఞాన యోగ్యం<br>రూపం యస్య విశేషతః<br>నైకరూప స్సముద్దిష్టః<br>సర్వప్రత్యక్ష గోచరః॥ | భక్తులు కోరినటుల అనేకరూపములను ధరించువాడు గావున నొకే రూపుతో నుండనివాడు.<br>ఆయాభక్తులు తమతమ సంకల్పానుసారముగ ప్రార్థించి తమతమ యభీష్టానుసారముగ సేవించి తరించునటుల విశేషించి ఆయారూపముల ధరించువాడు. |
| 273 | బృహద్రూపః | వ్యాప్యన్నివ ద్యస్య రూపన్తు<br>బృహద్రూప స్సకీర్తితః॥ | ఆ రూపములనైనను అంతటను వ్యాపించునట్లు ధరించువాడు. |

శ్రీ హయగ్రీవాయనమః

# నవవిధభక్తులు

శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

[వెనుక సంచిక తరువాయి]

శ్లో॥ ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా
కస్మైచి దఞ్జలిభరం వహతే వితీర్య।
అస్మై న కిఞ్చి దుచితం కృత మిత్య థాంబ
త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః॥

(శ్రీ గుణరత్నకోశం)

తనకు నమస్కరించినవాడెవ్వడైనను గానిండు. లక్ష్మీదేవి వానికి నిహలోకమున నైశ్వర్యమును, కైవల్యమును, చివరకు పరమపదమును ప్రసాదించియు 'అయ్యో! వీడు గావించిన వందనమునకు తగిన ప్రతిఫలము నొసంగజాలనైతినే యని సిగ్గుపడును. ఆహా! ఇదియేమి ఔదార్యము?.

శ్లో॥ గోవిందేతి యదా క్రన్ద త్కృష్ణా మాం దూరవాసినం
ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాప సర్పతి॥

ద్రౌపది తననిండు ఆపద సమయమున దూరముననున్న నన్ను 'గోవిందా!' యని పిలచిన పిలుపు చక్ర (కాంపౌండు) వడ్డీతో పెరిగిన ఋణమువలె నా హృదయమును బాయకున్నదని శ్రీకృష్ణు డవతారమును జాలించుతరి ఉద్ధవునితో నానతిచ్చెను. చూచితిరా! ఆ దయామయుని స్వభావము. ఇక మొదట చెప్పినట్లు సాష్టాంగ వందన మాచరించినవారి పట్ల నా యుదారుని హృదయ మెట్లుండునో మీరే యూహించుకొనుడు.

—0—

## :— ★ దాస్యము ★ —:

దాసుడు అనగా కింకరుడు. దాస్యమనగా యజమానుని సంతుష్టిపరచుటకై శ్రద్ధాభక్తులతో జేయుపనులు. అవి తిరుకట్ట మొదలు తిరువారాధన వరకును అనేక విధములు సర్వశేషి సర్వేశ్వరుడు. మనమాతనికి దాసులము.

శ్లో॥ దాసభూతా స్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః
నాన్యథా లక్షణం తేషాం బన్ధే మోక్షే తథైవ చ॥

ఇది ఆత్మలక్షణము. బద్ధావస్థలోనేమి, ముక్తావస్థలోనేమి దాసులైయుండుటయే ఆత్మలకు స్వరూపము, 'దాసభూతాః' అను పదమునకు 'దాహిశ్చ తే భూతాశ్చ' భూసత్తాయాం దాసులైననే ఉన్నవారుగా పరిగణింపబడుదురు. (లేనిచో లేనివారని చెప్పనవసరము లేదుకదా) అనియర్థము. ఏమియు విలువలేని సున్నలు ఒకసంఖ్య చెంతజేరినచో నెన్నిచేరిన నంతకు పది పది రెట్లుగా విలువ పెరిగినటుల ఆత్మలకును 'ఏకోవ వైనారాయణ ఆసీత్' అను నారాయణుని చెంతచేరి సేవజేసిననే విలువయుండు ననెడు రహస్యము నెఱింగిన లక్ష్మణస్వామియు సీతామాతయు శ్రీరామచంద్రు డడవికేగుచుండగా–

శ్లో॥ న చ సీతా త్వయా హీనా న చాఽహ మపి రాఘవ।
ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యా వివోద్ధృతౌ॥

శ్రీరామా! నేనుకాని సీతాదేవిగాని నీవులేనిచో నీటినుండి బయటవేసిన చేప లెట్లు తడియారువరకు మాత్రమే జీవించునో యట్లే యొక్కనిమిషము (నీవు సీతో తీసికొని వెళ్ళగల వను ఆశ విడుచువరకు) మాత్రమే జీవింతుముసుమా! కావున

శ్లో॥ కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే।
కృతార్థో ఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే॥

నన్ను నీదాసునిగా చేసికొనుము ఇది మన యుభయుల స్వరూపానుగుణమే నేను కృతార్థుడనగుదును. ని పనులు సమకూరును నాపనులేమియుందువా?

శ్లో॥ అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే।
భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే॥

ఉభయచేర్తికి దాస్యమును గావించువాడే యుజ్జీవించు ననెడు రహస్యము నెఱుంగువాడు గావున నీవు నిద్రించునపుడును మేల్కొనునపుడును సర్వవిధకైంకర్యములును చేయుటకివిగో నాచేతి పరికరములను చూడుము ఈ గంప, గునపముచ్చు, జాగ్రదవస్థలో నాహారాదులు సేకరించుటకును, ఈ ధనుర్బాణములు నిద్రించునపుడు రక్షించుటకును అని విన్నవించి–

శ్లో॥ స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునన్దనః
సీతా మువాచా తియశాః రాఘవం చ మహావ్రతమ్॥

సీతామాతపురుషకార పురస్సరముగా శ్రీరామచంద్రుని చరణములు దృఢముగా నవలంబించెను. అట్లే సర్వవిధకైంకర్యములను జేసెను. సీతను విడచి శ్రీరామచంద్రుడు పది మాసములైనను యుండగలిగెను కాని లక్ష్మణుని విడచి ఒక్కరోజుండలేకపోయెను. హను

మంతునకు తమ పరిచయమును గలుగజేయునపుడు (శ్రీ)రాముని యతిశయము నంతయు వర్ణించి చెప్పి తన్నుగూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు

శ్లో॥ 'అహ మస్యా వరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగతః॥'

నన్ను రాఘవుడు సోదరునిగా భావించును. కాని నేనాతని సద్గుణములకు భృత్యుడనైన దాసుడనుసుమా! అని తెలియజేసెను. '(లోపశ్శాకల్యస్య' అను సూత్రమున 'శాకల్యస్య' యను షష్ఠ్యంతమునకు శాకల్యునిమతమున అనుచటులే ఇచ్చటను అస్య అనగా ఈతని మత మున ననియర్థమును చెప్పినచే శ్లోకమన్వయించును) సీతల్లి సెలవు గైకొనిరమ్మని (శ్రీ)రామ చంద్రుని అజ్ఞచొప్పున తల్లికీవార్త విన్నవించగా 'సృష్ట స్త్వం వనవాసాయ' నాయనా! నీవు పుట్టినదిందులకే. 'రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం' అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథా సుఖం' నాయనా! నీకు రాముడేతండ్రి సీతమ్మయేతల్లి. అరణ్యమే అయోధ్య. సుఖముగా వెళ్ళుమని సెలవిచ్చెను. ఆత్మ పరమాత్మలకు గల సంబంధము నెఱింగిన రామాయణ స్త్రీలలో నీమె మొదటిదిగదా!

సీతామాతయు (శ్రీ)రామచంద్రునితో:-

శ్లో॥ శుశ్రూషమాణా తే నిత్యం నియతా బ్రహ్మచారిణి

(రా. అయో. 28స. 1వ శ్లో)

నాథా! కామకురాలనై గ్రామ్య సుఖాభిలాషతో నీతో నేతెంచ నిశ్చయించుట లేదు నియతేంద్రియనై బ్రహ్మచర్యవ్రతమును పాలించుచు నీకు నిత్యము సేవజేయుచుందును. ఇదియే స్వరూపమునకు తగినవృత్తి.

శ్లో॥ వనే నివత్స్యామి యథా పితు ర్గృహే
తవైవ పాదా వుపగృహ్య సంయతా॥ (రా అ. 28 స 22 శ్లో)

'జితేంద్రియనై నీపాదముల నాదరించుచు నాపుట్టింట నుండునట్లు నీతో నరణ్యమున నివసింతునని ప్రార్థించెను.

ఆంజనేయులు రాక్షసులకు తన పరాక్రమము నెఱింగించుచు తాను నిజమునకు సుగ్రీవుని బంటైనను

శ్లో॥ దాసో ఽహం కోసలేంద్రస్య రామస్యా క్లిష్టకర్మణః॥
(రా. సుం. 34 స. 34 శ్లో॥)

నేను (శ్రీ)రామచంద్రుని దాసుడనని యుద్ఘోషించెను. అనగా సుగ్రీవదాస్య మీతనికి ఔపాధికమున్ను, శ్రీరామదాస్యము సహజమనియు నభిప్రాయము.

(శ్రీ)కృష్ణపరమాత్మయు శరణాగతుడగు ప్రియభక్తుడైన యర్జునునకు ఏకాదశాధ్యాయావసానమున తనను పొందుటకు ముఖ్యసాధనమైన భక్త్యవస్థావిశేషమును వివరించుచు

శ్లో॥ మత్కర్మకృత్ మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ॥

అనుశ్లోకమున నొకపదముయొక్క అర్థముతో ఒకపదముయొక్క అర్థమునకు విశేషణ విశేష్యభావముగా నన్వయించుచు తానాచరించు సమస్తవ్యాపారములను నాకొఱకుగా జేయనిచో జీవించజాలక వాటికి నన్నే పరమోద్దేశ్యముగా నమ్మి ఎవరిని ద్వేషించక యెవడు నాయారాధన రూపముగా నాచరించుచున్నాడో వాడు నన్నే పొందుననియు, తరించుటకు సుకర, సుకరతర, సుకరతమో పాయములను విధించుచు 12వ అధ్యాయము-

శ్లో॥ అభ్యాసే ప్యసమర్థో ఽసి మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి॥
(గీత 12 అ. 10 శ్లో)

అను శ్లోకమున నన్ను నిరంతరము ధ్యానించుట కభ్యసించుటయు దుర్లభమని తోచినచో మత్కర్మ పరమోభవ అనగా నాకొఱకాలయములను నిర్మించుట, తోటలు నాటుట నామందిరమున దీపము వెలిగించుట నా మందిరముల నూడ్చుట నీళ్లుజల్లుట అలుకుట పుష్పములు సమర్పించుట పూజించుట సంకీర్తనము జేయుట, ప్రదక్షిణములు గావించుట, స్తోత్రము జేయుట నమస్కరించుట మొదలగు పనులు చేసినను క్రమముగా ధ్యానమున కలవాటుపడి కొంతకాలమునకు నాయందు స్థిరముగా చిత్తమునుంచి నన్ను పొందగలవు. అని యుపదేశించెను.

తనయాజ్ఞను పాలించుటచేగదా భృత్యుడు తన ప్రీతికి పాత్రుడగును. వానికేకదా ఫలము కరతలామలకము భగవంతుని యాజ్ఞయేది? 'శ్రుతి స్మృతి ర్మమై వాజ్ఞా' వేదము-తదర్థ ప్రతిపాదకమగుటచే నుపబృంహణము లనబడు గీతాది స్మృతులే భగవదాజ్ఞ. అందలి ధర్మములను గీటువాసియైనను తప్పక ఆచరించుటయే ఆభగవానుని యనుగ్రహపాత్రమై పరమపురుషార్థమును బడయుటకు ఘంటాపథము.

ఇట్టిదాస్యమునందు ప్రవృత్తికలుగుట కాభగవానునితో మనకుగల నవవిధ సంబంధముల నెఱుంగవలెను. అవి-

శ్లో॥ పితా చ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో (రమాపతిః)
స్వా మ్యాధారో మమా త్మా చ భోక్తా (చాద్య మనూదితః)

ఆయనతండ్రి-మనము బిడ్డలము అనెడు పితాపుత్రసంబంధము.
ఆతడు రక్షకుడు-మనము రక్షింపబడువారము అనెడు రక్ష్యరక్షక సంబంధము.
ఆతడు ప్రభువు - మనమాతనికి కింకరులమనెడు శేష శేషి సంబంధము.
ఆయన భరించువాడు-మనము భరింపబడువారమనెడు భర్తృభార్యా సంబంధము.

# వార్తామాల

[వెనుక సంచిక తరువాయి]

విషయములను స్మరించుకొనుటచే బ్రహ్మలోకప్రాప్తియందలి పురుషార్థబుద్ధి నశించును. కైవల్య ప్రాప్తియందలి పురుషార్థబుద్ధి యెట్లుల నశించుననగా:- కైవల్యము విభవాలంకారమువలె తనను తాను యనుభవించుట మాత్రమె అయియున్నది మరియు అల్పమైనట్టిది. ఈ విషయమును పూర్తిగ తెలుసుకొని స్మరించుకొనుటచే కైవల్యప్రాప్తియందలిపురుషార్థబుద్ధి నశించును. పురుషార్థ మనగా !- అల్పముకానిదై, అస్థిరముకానిదై, అభోగ్యముకానిదై అప్రాప్యముకానిదై యుండు నట్టిదేదియో అట్టిదే కదా స్వరూపానుకూల ప్రయుక్తమై యుండును.

అట్టి పరమపురుషార్థము. దేశవిశేషమందు దేహాంతరమున కలుగగల సర్వేశ్వరునియొక్క- నిత్య - నిరవచ్ఛిన్న - నిరతిశయ-నిరూపాధిక - నిరుపమాన - ప్రీతికారితాశేష శేషతైరూప కైంకర్య సంజనిత యానంద విశేషముమాత్రమే అయియున్నది.

## 22. ఇరువది రెండవవార్త.

శరీరమునకును - శరీరమునకధీనమై శరీరమందుగల యాత్మకును గల భేదమేమి?

| | | |
|---|---|---|
| శరీరము జడము | — | ఆత్మజ్ఞానమయము. |
| శరీరము దుఃఖాత్మకము | — | ఆత్మ ఆనందమయము |
| శరీరము మలభూయిష్టమైనది | — | ఆత్మ నిర్మలమైనది. |
| శరీము నశించునట్టిది | — | ఆత్మ నిత్యమైనట్టిది. |
| శరీరము పరిణామము జెందునది | — | ఆత్మ ఏకరూపమైనది. |
| శరీరము విభువైనది | — | ఆత్మ అణువైనది. |
| శరీరము చీకటిమయమైనది | — | ఆత్మ ప్రకాశమైనది. |
| శరీరము నిద్రగా యుండును | — | ఆత్మ మెళుకువగానుండును. |
| శరీరము కోపముగానుండును | — | ఆత్మ శాంతిగనుండును. |
| శరీరము అశుద్ధముగానుండును | — | ఆత్మ పరిశుద్ధముగనుండును. |

ఒకే శరీరములో ఒకేచోట కలసియుండు జీవాత్మ - పరమాత్మలకు గల భేద మేమి?

పరమాత్మ రక్షకుడైయుండును - జీవాత్మ రక్ష్యభూతుడైయుండును.
పరమాత్మ శేషియైయుండును - జీవాత్మ శేషభూతుడై యుండును.

పరమాత్మ కారణుడై యుండును - జీవాత్మ కార్యమై యుండును.
పరమాత్మ శరీరియై యుండును - జీవాత్మ తచ్ఛరీరమైయుండును,
పరమాత్మ ధారకుడైయుండును - జీవాత్మ ధార్యమైయుండును.
పరమాత్మ వ్యాపకుడై యుండును - జీవాత్మ వ్యాప్యుడైయుండును.
పరమాత్మ నియంతయై యుండును - జీవాత్మ నియామ్యుడై యుండును.
పరమాత్మ స్వతంత్రుడై యుండును - జీవాత్మ పరతంత్రుడై యుండును.
పరమాత్మ శరణ్యుడై యుండును - జీవాత్మ శరణాగతుడై యుండును.
పరమాత్మ స్వామియైయుండును - జీవాత్మ సేవకుడై యుండును.
పరమాత్మ నాయకుడై యుండును - జీవాత్మ దాసుడైయుండును.

## 23. ఇరువదిమూడవ వార్త.

ఆత్మయొక్క యదార్థస్వరూపమేమి ?

ఆత్మ యనునది అతీంద్రియమైన దగుటవలన లోకములో దానియొక్క స్వరూప యాదార్థ్యమును నిర్ణయించుటలో వారి వారి మనో సంస్కార - వాసనా - వివేకాదులను బట్టి వివిధములగు అభిప్రాయభేదములు కలవు. - కొందరు అవయవములనే ఆత్మ యందురు మరి కొందరు ఇన్ద్రియములను ఆత్మ యందురు. కొందరు మనస్సును ఆత్మ యందురు. మరి కొందరు ప్రాణమును ఆత్మయందురు. కొందరు ఇవి వేరువేరుగా ఆత్మయని పేర్కొందురు. మరికొందరు వీటన్నిటియొక్క సముదాయమే ఆత్మ యందురు. కొందరు ప్రకృతిని యాత్మ యందురు: కొందరు ఆత్మక్షణికమైన దందురు మరికొందరు ఆత్మను జ్ఞానమందురు. మరికొందరు ఆత్మను విభువందురు. కొందరు ఆత్మను అనిత్యమందురు. కొందరు ఆత్మ ఒకటిమాత్రమే యందురు. కొందరు ఆత్మ పరిణమించు నట్టి దందురు. కొందరు ఆత్మ స్వతంత్రమైనదనియందురు. మరి కొందరు ఆత్మపరతంత్రమైనదనియు అనగా కర్మకు పంత్రమైనదని చెప్పుదురు.

కొందరు ఆత్మ మాతాపితరులకు పరతంత్రమైన దందురు. మరికొందరు ఆత్మ పితృదేవతలకు పరతంత్రమైనదందురు. కొందరు ఆత్మ తనభార్యలకు పరతంత్రమైనదందురు. కొందరు ఆత్మ అగ్నికి పరతంత్రమైన దందురు. కొందరు ఆత్మ ఇంద్రునికి పరతంత్రమైనదందురు. కొందరు ఆత్మ చతుర్ముఖబ్రహ్మకు పరతంత్రమైనదందురు మరికొందరు ఆత్మ రుద్రునికి పరతంత్రమైనదందురు. కొందరు ఆత్మ కేవలము ఒక్క సర్వేశ్వరుని కిమాత్రమేపరతంత్ర మందురు.

ఈవిధముగా అనేకవిధములైన పరస్పర విరుద్ధాభిప్రాయములను గలవారై యున్నారు. ఇవన్నియును విరుద్ధాభిప్రాయములే అయి యున్నవి ఇటుల చెప్పుటకు కారణమేమి యనగా:—

## ప్రచార విభాగము

## ముఖ్య గమనిక

# శ్రీ భగవద్విషయ కాలక్షేప గోష్ఠి

శ్రీమదిత్యాది శ్రీమాన్ మన త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు - గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా నడిగడ్డపాలెమున - శ్రీ వాసుదాసాశ్రమమునందు శ్రీ కోదండరామ స్వామివారి సన్నిధిలో

శార్వరినామ సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశి మంగళవారము అనగా (5—7—1960 వ తేది మొదలు) కార్తీకశుద్ధ ద్వాదశివరకు అనగా (31—10—1960 వ తేది వరకు చాతుర్మాసదీక్షలో వేంచేసి యుండి 4 మాసములు శ్రీ భగవద్విషయ కాలక్షేపమును సాయించుదురు ఈ కాలక్షేపమునకు వేంచేయ వలసినదిగ అందరిని ఆహ్వానించుచున్నాము, ఇందు విద్యార్థులుగ వేంచేయువారికి ఈ క్రిందివిధముగ సౌకర్య ములు సమకూర్చబడును.

1. తిరువాయి మొజిమూలముమీద అర్థముతో నోటికివచ్చి ఈడువ్యాఖ్యలో పంక్తిమీద అర్థము గ్రహించి మరల కాలక్షేపముగల సమర్థతగలవారికి మాసమునకు సాపాటువగైరాల నిమిత్తం ఉపకార వేతనముగా 57/ లు ఇవ్వబడును.

2. ఇతర సంప్రదాయ గ్రంథములు కొంతవరకు సేవించి ద్రావిడ ప్రబంధములయందు కొద్ది సాహిత్యమున్నవారికి మాసమునకు 25/ లు ఉచిత వేతనముగా సమర్పింపబడును.

కేవలము శ్రవణ కైంకర్యార్థమై విచ్చేయువారు తమ బస సాపాటు వగైరాలు ఏర్పాట్లు తామే చేసుకొనవలయును.

కాలక్షేపములో పూర్తిగా అన్వయించి చివరపరీక్షలో ఉత్తీర్ణులైనవారికి భగవద్విషయ కోశములు ఉచితముగా సమర్పించుటకు ప్రయత్నింప బడును. కాలక్షేపమునకు వేంచేయదలచినవారు వెంటనే తెలియజేయవలసినది.

శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం (P. O.)
(వయా) చేబ్రోలు., గుంటూరు జిల్లా.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము.
తె. కం. గోపాలాచార్యులు,
గు. రామానుజాచార్యులు
కార్యదర్శులు.

శ్రీమతే రామానుజాయ నమః



# గొప్ప - అదృష్ట అవకాశము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమువారిచే బదరికాశ్రమములో ప్రారంభింపబడిన అష్టాక్షరీ క్షేత్రము, సత్సంగసదనముల కట్టడములు శ్రియఃపతి కటాక్షముచే పరిపూర్తి అయినవి ప్రస్తుతము ఆసత్సంగ సదనములో మన బదరీ శ్రీనివాస రామానుజస్వామివార్లు వేంచేసియుండుటకు ఒక మంటపము నిర్మించుటకు సంకల్పమై కొంతపని ప్రారంభింపబడినది.

ఆ మంటపమున పరమపదములో పరమ పదనాథుడు వేంచేసియున్నట్లుగా మొదట కూర్మపీఠము. తదుపరి శేషపీఠము. ఆమీద అష్టదళపద్మము ఆ అష్టదళములలో 8 మంది అప్సరలు వింజామరలు వీచుచున్నట్లుగానున్న అంచు మధ్య దివ్యసింహాసనము నిర్మింపబడును ఆసన్నివేశములో మన శ్రీనివాస పెరుమాళ్ళు వేంచేసియుందురు. లోపలనంతయు మంచి అద్దములో జగన్మోహనముగా బిగించబడి యుండును. ఈ రీతిగా మందిరము నిర్మించుటకు 1',000 పదివేలు అగును ఇందుకుగాను పదిమంది భాగస్థులు చేరుటకు అవకాశము కలిపించబడినది. భాగము 1కి 1000/ లు. ఇప్పటికి పాలకొల్లులో 3 భాగములు వచ్చినవి. మిగతా భాగములు కావలెను. ఆ కైంకర్యములో అన్వయించదలచినవారు వెంటనే మాకు తెలియజేయవలెను. రాబోవు సంవత్సరమునుండి ఆ సన్నిధిలో బదరికివచ్చు యాత్రీకులందరకు శ్రీనివాస రామానుజులకు నివేదించిన ప్రసాదము. తీర్థము ఇవ్వబడును. 6 మాసములు అనంతులకు ఇందు తదీయారాధన జరుపబడును. 100 మందికి అన్నదానము చేయించదలచినవారు 2 బస్తాలు బియ్యం సమర్పించవలెను. 50 మందికి అరబస్తా 25 మందికి పావుబస్తాయు, 6 మాసములు రోజు ఒక్కరికిచొప్పున తదీయారాధన జరుపువారు 3 బస్తాలబియ్యం సమర్పించవలసి యుండును. ఈ అవకాశమును అందరు ఉపయోగించుకొందురుగాక.

విశిష్టాద్వైత ప్రచారకసంఘము,
తె. కం. గోపాలాచార్యులు.

## బదరీ శ్రీనివాస, రామానుజ స్వామివారల శాశ్వత, తాత్కాలిక, పూజావిరాళాలు

## అ ష్టా క్ష రీ క్షే త్ర వి రా ళ ము

(1) శ్రీ చెక్కా రంగనాయకులుగారు పాలకొల్లు వీరలోగడ జ్మ ఇచ్చినది 2000/ లు గాక ఇప్పుడు పూర్తిగా ఇచ్చిన విరాళము. 1500/ లు.

## స త్సం గ స ద న వి రా ళ ము లు

(2) శ్రీ జూపూడి పురుషోత్తంగారు పాలకొల్లు లోగడ ఇచ్చినది రు. 1500/ లు గాక ఇప్పుడిచ్చినది రు. 100/ లు.

(3) శ్రీ కంచెర్ల నరసింహంగారు. కుమారుడు శ్రీ పురుషోత్తంగారు, భార్య విజయరామమ్మ (దంపతులు) పాలకొల్లు. సత్సంగసదన విరాళముగా రు 1600/- లు. సమర్పించిరి.

## శ్రీ రా మా ను జ దే వా ల య వి రా ళ ము లు

(4) బదరీ సత్సంగసదనములో భగవద్రామానుజుల వారికి ఆలయమును నిర్మించుటకు గాను ఒక వాటాక్రింద రు. 1000/ లు శ్రీ కంతేటి సీతారాంబ్రహ్మంగారు పాలకొల్లు సమర్పించిరి.

(5) మరియొకభక్తులు పై రామానుజ దేవాలయ నిర్మాణమునకు ఒక వాటా క్రింద రు. 1000/ లు సమర్పించిరి.

(6) పుల్లంపర్రు వాస్తవ్యులగు శ్రీమదిత్యాది శ్రీమాన్ పూ. కృష్ణమాచార్యులుగారు ఒక వాటా క్రింద రు. 1000/ లును సమర్పింప వాగ్దానము గావించిరి.

శ్రీ గూడూరు రామానుజరావుగారు
ఆత్మకూరు — రు. 275/ లు.

శ్రీ తుమ్మలపల్లి సుభద్రమ్మగారు
.. పాలకొల్లు - రు. 29/ లు.

శ్రీ కారుమూరి వెంకటరత్నమ్మ గారు
పాలకొల్లు - రు. 116/ లు

శ్రీ వాడవల్లి రామకోటయ్యగారు
గాదెవారిపాలెం - 29/ లు.

శ్రీ వడ్డీ సూర్యకాంతమ్మగారు
పాలకొల్లు — రు 29/ లు

శ్రీ బంగారు వెంకట సత్యనారాయణ గారు
పాలకొల్లు - రు 29/ లు

శ్రీ కర్రి నరిసిరెడ్డిభార్య సీతమ్మ
అర్తమూరు - రు 29/ లు

శ్రీ శ్రీకాకొల్లు కోమయ్యగారి కుమారుడు
మాణిక్యాలరావుగారు పాలకొల్లు — రు 116/ లు

శ్రీ కారుమూరి సుబ్బారావుగారి కుమారుడు
శ్రీరామమూర్తిగారు పాలకొల్లు — రు 29/ లు

శ్రీ బోడా వెంకట్రాజుగారు
పాలకొల్లు - రు 29/ లు

శ్రీ బంగారు రంగనాథం అండ్ బ్రదర్స్
పాలకొల్లు - రు 29/ లు

శ్రీ టి. కం. రంగనాయకమ్మగారు
నూజివీడు వాగ్దానం రు 58/ లో
ఇప్పుడు జమ రు 29/ లు

శ్రీ శేషభట్టర్ గోవిందాచార్యులు గారు
భార్య శారదమ్మాళ్ దంపతులు పాలకొల్లు - రు 116/ లు

శ్రీ శేపాక లక్ష్మణరావుగారి భార్య
సుబ్బరాజుగారు — పాలకొల్లు రు 116/ లు

## శాశ్వత తదీయారాధన విరాళము

బదరీ సత్సంగసదనములో శాశ్వతముగా తదీయారాధన జరుపుటకు గాను శ్రీ నండూరు రంగనాయకమ్మగారు రు 500/ లు సమర్పించిరి.

శ్రీ మాడ కొమాండూరి అప్పలాచార్యులుగారు
దొడ్డిపట్ల రు 116/ లు

శ్రీ శేట్టిలూరి విజయసారథిగారు దొడ్డిపట్ల రు 116/ లు

శ్రీ వేలమూరి వెంకట కృష్ణమాచార్యులుగారు
బూరుగపల్లి - రు 116/ లు

శ్రీ మాడభూషి సీతా పెరుందేవమ్మ తాయారమ్మ
గారు దొడ్డిపట్ల లోగడ యిచ్చినది రు 75/ లు
గాక ఇప్పుడిచ్చినది - రు 41/ లు

శ్రీ లేపాక లక్ష్మణరావు గారు భార్య మీనాక్షమ్మ
గారు (దంపతులు) పాలకొల్లు - రు 116/ లు

శ్రీ నాగవరపు వెంకటరత్నంగారు పాలకొల్లు రు 29/ లు

శ్రీ మోటమర్రి సుబ్బారావుగారి భార్య అప్పల నరసమ్మ
గారు దంపతులు, పాలకొల్లు - రు 29/ లు

శ్రీ కొల్లేపర సూర్యకాంతంగారు పాలకొల్లు - రు 29/ లు

శ్రీ లేపాక నరసింహామూర్తిగారి భార్య సీతామహా
లక్ష్మమ్మ గారు పాలకొల్లు - రు 29/ లు

శ్రీ శేట్టిలూరి శ్రీరామ నరసింహం అయ్యంగారు
రాజోలు - రు 29/ లు

## బదరి సత్సంగ విరాళములు

శ్రీ బంగారు వెంకట సత్యనారాయణ గారు
పాలకొల్లు - రు 16/ లు

శ్రీ బంగారురంగనాథం అండ్ బ్రదర్స్
పాలకొల్లు - రు 16/ లు

శ్రీ కొలుసోలు నారాయణమూర్తిగారు
పాలకొల్లు రు 16/ లు

## తాత్కాలిక పూజలు.

శ్రీ. న. చ. వెంకటరామ గోపాలాచార్యులకు గాను శ్రీ. న. చ. పట్టాభిరామాచార్యులుగారు (ఏలూరు) సమర్పించినది రు 11/ లు

శ్రీ కారుమూరి సుబ్బారావుగారు 25 మందికి తదీయారాధనకుగాను సమర్పించినది (పాలకొల్లు) రు 35/లు

శ్రీ సుతాపల్లి సూర్యనారాయణమూర్తిగారు
రాజోలు - రు 11/ లు

శ్రీ పొన్నాడ వీరభద్ర విశ్వేశ్వరరావుగారు
రాజోలు - రు 11/ లు

శ్రీ యతిపతి వీరికందరకు సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక.

—C—

# శ్రీ జియ్యర్‌స్వామివారి ప్రచార సమాచారము

శ్రీ జియ్యర్ స్వామివారు పాలకొల్లులో అష్టభుజస్వామివారి సన్నిధిలో జరిగిన అష్టాక్షరీకోటి ...వస యాగములో 24 రోజులు అన్వయించి 10—4—60 వ తేదీ సాయంకాలమునకు దొడ్డిపట్లకు వేంచేసిరి.

## వారి కార్యక్రమము

11—4—60 వ తేది సాయంకాలము దొడ్డిపట్లనుండి రాజోలుకు ప్రయాణం :-

12—4—60 రాజోలు మన శ్రీ జియ్యర్‌స్వామివారు పూర్వాశ్రమములో రాజోలులో ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానమును దివ్యస్థలము గావించి ఆసన్నిధికి స్థానాచార్యులుగా వేంచేసియుండిరి ఈ సన్నిధి వారికిఅభిమానపాత్రమైన సన్నిధులలో వకటి.

13—4—60 సాయంత్రం అంతర్వేదిపాలెం మకాము.

14—4—60 సాయంకాలమునకు అంతర్వేదిక్షేత్రము

15—4—60 ఉదయం రామేశ్వరం

15—4—60 సాయంకాలానికి నరసాపురం

16—4—60 నరసాపురం

17—4—60 కొత్తాలపర్రు మకాం

18—4—60 సాయంకాలమునకు భీమవరం

భీమవరంలో 19 20, 21, వ తేదీలలో పండితసభ గావింతురు.

ఆతరువాత శ్రీ కూర్మమునకు వేంచేసి 1—5—60., 2—5—60 తేదీలలో ధ్వజప్రతిష్ఠ గావింతురు -

—*—

శ్రీమతే రామానుజాయనమః

భీమవరంలో

# శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘ చైత్రమాససభలు

భీమవరంలో శ్రీ సీతారామస్వామివారి దేవస్థానమునందు, శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షత క్రింద చైత్రమాస పండితసభలు 3 రోజులు, 19—4—60 మొదలు 21—4—60 వరకు పరమ విలక్షణముగా జరిగినవి. ఈ సభలో పాల్గొనిన పండితులు.

1. శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు
2. శ్రీమాన్ ఉ. వే. న్యాయవేదాంత విద్వాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు
3. శ్రీమాన్. ఉ. వే. పరాశర సుదర్శన భట్టర్ అయ్యవార్లం గారు.
4. శ్రీమాన్. ఉ. వే. కవిరత్న గుడిమెళ్ళ రామానుజా చార్యులుగారు.
5. శ్రీమాన్. ఉ. వే. తిరుమల పురిహెళ్ళ వెంకటాచార్యులు అయ్యవార్లంగారు.
6. శ్రీమాన్. తె. కం. అప్పన కొండమాచార్యులుగారు.

ఈ సభలను ఉత్సాహముగా శ్రీ గుండు ,కృష్ణావతారంగారు, శ్రీమాన్. తి. కొండూరు రాఘవాచార్యులు అయ్యవార్లంగారు నిర్వహించిరి.

—***—

# బదరీవార్తలు

బదరీనాథ్‌లోని బదరీనారాయణుని దేవాలయము యొక్క తలుపులను ఈ సంవత్సరము మే నెల పదకొండవ తేదీన తెరచుదురు. ఆ నాడే జ్యోతిర్దర్శనము. అప్పటినుండియు బదరీనారాయణునికి మానవులచే మామూలు అర్చనారాధనలు ప్రారంభింపబడి సక్రమముగా ఆరుమాసములు జరుపబడును.

మన శ్రీనివాసరామానుజస్వామివారు కూడ సపరివారముగా ఆ నాటికే శేషధారనుండి బదరీనాథునకు వేంచేసి నవా రామానుజకూటములో అర్చనారాధనములను తిరువుళ్ళము పట్టుదురు

మన అష్టాక్షరిక్షేత్రములోని రామానుజకూట సత్సంగ సదనములకు ఇంకను కొన్ని తలుపులువగైరాలు బిగించుట సమస్తమంతయు వెల్లలు - రంగులు వేయుట, కాంపౌండుగోడలపై ఇనుప చట్రముల బిగించుట, వంటగదులకు లోపల బయట సిమెంటు చేయుట బల్లపరంని పూర్తిచేయుట వగైరా పనులు పూర్తికావలసి యున్నవి. ఇవన్నియును ఈ సంవత్సరమున పూర్తి చేయబడగల

సత్సంగ సదనములో శ్రీనివాస రామానుజుల వేంచేపు చేయుటకై మంటపముయొక్క కట్టుబడి నిరుడే ప్రారంభమైనది. ఈ మంటప నిర్మాణమునకు ప్రత్యేకముగ పదివేల రూపాయలు ఖర్చు అగునని అంచనా వేయబడినది. ఈ నిర్మాణమును పదిభాగములుగ (వాటాలుగ) విభజించి, భాగము (వాటా) ఒక్కింటికి వేయిరూపాయలు చొప్పున నిర్ణయించి, వేయిరూపాయలు ఇచ్చిన దాతల పేరుతో శిలాశాసనమును చెక్కించి అచ్చట స్థాపించుటకు నిర్ణయించుటమైనది. ఇప్పటికి మూడు (భాగములు) వాటాలకు ముగ్గురు దాతలు మూడువేల రూపాయలను సమర్పించిరి. ఇంకను ఏడువాటాలు మాత్రము మిగిలియున్నవి బదరినాథములో శ్రీనివాస రామానుజ స్వామివారికి కైంకర్యమును చేయదలచిన భక్తులకు ఇది మంచి అవకాశము. గాన త్వరపడి దాతలు వాటా ఒక్కంటికి వేయిరూపాయలు చొప్పున సమర్పించుకొని ధన్యులు గావలసినది.

బదరినాథములో ఈ సంవత్సరమున మంచు చాల తక్కువగ పడినదట సామాన్యముగ ప్రతి సంవత్సరమునను చలికాలములో మంచువలన యిళ్ళన్నియును కప్పడిపోవుటయు, చైత్రమాసాంతమునకు గాని అది కరిగి మార్గము లేర్పడకపోవుటయు మామూలు కాని ఈ సంవత్సరమున చైత్రమాస ప్రారంభమునాటికే పడిన కొద్ది మంచుకూడ కరగిపోయి మార్గములన్నియు శుభ్రముగా యుండి జన సంచారయోగ్యముగ నున్నదట మన సుష్టివగైరాలు ఫాల్గుణ మాసములోను చైత్రమాసములోను బదరినాథునకు వెళ్ళి చూచి వచ్చి మన అష్టాక్షరి క్షేత్రము మంచువలన ఎట్టినష్టమును పొందక సురక్షితముగ నున్నదని తెలిపిరి.

ఈ సంవత్సరమున అచ్చటి పనుల నిర్వహణమునకై మన రాజుగారును, శ్రీమదిత్యాది శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారును వారికూడ మరియొక స్వామియును బదరినాథునకు వెళ్ళుచున్నారు. శ్రీరాజుగారు ఈ నెలలోనే వెళ్ళుచున్నారు శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు మాత్రము జూన్ నెల మొదటి వారములో వెళ్ళగలరు ఈ సంవత్సరమున శ్రీనివాస రామానుజస్వామి సన్నిధిలో అధ్యాపక కైంకర్యము నిమిత్తమై కృష్ణాజిల్లా లోని వేణుగోపాలపురం వాస్తవ్యులైన శ్రీమాన్ నల్లాని చక్రవర్తి రఘునాథాచార్యులుగారు వేంచేయగలరు.

శ్రీ శ్రీనివాసరామానుజుల నిత్యారాధనకై కనీసము ఒక లక్ష రూపాయలనిధిని ఏర్పాటుచేయవలెననుకొంటిమి. అందు సుమారు 70 వేల రూపాయలు వరకు మాత్రమే వసూలు అయినది. మిగత సొమ్ము ఈ చతుర్మాస్యము లోపు గనైన పూర్తి కావలసియున్నది.

ఏలనవగా చాతుర్మాస్యమునకే శ్రీరామ క్రతువు (అశ్వమేధప్రక్రియ ననుసరించి) కార్యక్రమమును ప్రారంభించి ఆ యాత్రలోనే తిరుమలలో "శ్రీభాష్యోత్సవము శ్రీరంగమున" "శ్రీ భగవద్విషయోత్సవము" వగైరాలను జరిపించ వలెనని యున్నది. ఆ కార్యక్రమము ప్రారంభము గాకముందే ఈ బదరి శాశ్వత పూజనిధి పూర్తియైనచో బాగుండు ననియున్నది.

ఇదివరలో ఇందు నిమిత్తమై వాగ్దానము జేసినవారు తమను తిర్గి హెచ్చరించక పోవుటచే ఇంతవరకు తమ వాగ్దానపు సొమ్మును పంపలేదనియును, మరియు నూతనముగ సభ్యులుగ చేరదలచినవారు తమను ఎవరైన ప్రేరేపించి నచో విరాళములను సమర్పింపదలచితి మనియు తెలుపుచున్నటుల తెలియుచున్నది.

ఈ మహాత్కార్యమునకు ప్రేరేపకుడు శ్రీమన్నారాయణుడే ప్రచారకులు శ్రీ రామానుజులే గాన వారిద్దరే దాతలను ఈ సత్కార్యమున తమ సద్ద్రవ్యమును సమర్పించుకొని తరించునటుల ప్రేరేపింతురు గాక. వీరిద్దరియందును భక్తిశ్రద్ధలు గలిగి శ్రీమదష్టాక్షరి మహామంత్ర దీక్షితులై, ఇతరులుగూడ బదరియందలి శ్రీనివాసరామానుజులతో శాశ్వత సంబంధమును గలవారై తరించవలెనను తలంపుగలిగిన వారందరును కూడ ఈ కార్యనిర్వాహణమున బాధ్యత గలవారైయున్నారు. ఇప్పటికే చాలమంది భక్తులు అటులనే తమ బాధ్యతానిర్వహణమును నిర్వహించుచున్నారు.

అందును స్త్రీలలో ఉనికిలి వాస్తవ్యులుగా చి. సౌ. చింతపల్లి దమయంతమ్మయును, నరసాపురం వాస్తవ్యులుగా శ్రీమతి శాతలూరి చుంచుకోడుతమ్మ గారును మేము కోరినటుల చెరొక వేయిరూపాయలను అతి స్వల్ప వ్యవధిలో భక్తులవల్ల సమర్పింపజేయగలిగిరి. ఇటులనే మిగత ప్రచారకులును కార్యకర్తలును ప్రయత్నించినచో మిగత ద్రవ్యము త్వరలో పూర్తియగుటలో సందేహమేమి ?

ప్రచారకులును, కార్యకర్తలును ఈ కైంకర్య ప్రయత్నములో ఒక్క విషయమును ముఖ్యముగ గమనించ వలెను. దాతల నెవరిని కూడ బలవంత పరచుటగాని, మొహమాట పెట్టుటగాని, ఎట్టి బలత్కారమును చేయుటగాని కూడదు విషయమును తెల్పుట మాత్రమే వీరికర్తవ్యము. వారి వారిసుకృత విశేషముచే, భగవద్భాగవత కైంకర్య మందుగల భక్తితో, శ్రద్ధతో ఎవరు ఈ కైంకర్యమును చేసుకొనవలెనని ఉత్సాహపడుదురో, ఎవరి ద్రవ్యమందు పవిత్రత గలదో అట్టివారు చేసుకొనదలచిన కైంకర్యమునకు తపాలా ఉద్యోగివలె తోడ్పడి ఆ కైంకర్యమును బదరి శ్రీనివాస రామానుజులుకు చేర్చుట మాత్రమే ప్రచారకుల కార్యకర్తల కర్తవ్యము—భక్తి శ్రద్ధ విరహితముగ సమ ర్పింప బడు ద్రవ్యము ఒక్క పైసకూడ ఈ సత్కార్యమున కుపయోగించరాదు. ఇది ప్రధానవిషయమైయున్నది.

గావున ఈ బదరీ శ్రీనివాసరామానుజుల కైంకర్యమునందు ఆసక్తి గలవారందరును ఇదివరలో వాగ్దానము జేసియున్నచో అట్టి వాగ్దానపు సొమ్మును, వాగ్దానము చేసియుండనిచో యిపుడు తమ యుత్సాహావకాశముల ననుస రించి స్వహస్త పరహస్తములద్వారా ఈ బదరి కైంకర్యమును జేసి తరితురు గాక యని సర్వేశ్వరుని ప్రార్థించుచు తమకందరికిని మంగళ శాసనముల గావించుచున్నాము.

శ్రీమన్నారాయణ రామానుజజీయర్



శ్రీ బదరీ శ్రీనివాస రామానుజ స్వామివారల

# శాశ్వత - తాత్కాలిక - పూజావిరాళములు

శ్రీ గోట సత్యనారాయణ గారు రాజమండ్రి బదరిలో మన అష్టాక్షరీ క్షేత్రమునకు నీటిసౌకర్యము నిమిత్తం లోగడయిచ్చిన 3000/ లు గాక ఇంకా ఇవ్వవలసిన 1000/ లలో ఈనాడు శ్రీ. తి. పు. వెంకటాచార్యులగారి ద్వారా పంపిన విరాళము — 500-0

శ్రీ రుద్రరాజు గంగరాజు గారు అంతర్వేదిపాలెం 29-0

శ్రీ రుద్రరాజు సీతారామరాజు గారు అంతర్వేదిపాలెం 29-0

శ్రీ శేట్లులూరి త్యాగరాజు గారు నరసాపురం 116-0

శ్రీ ముడుంబై సత్యనారాయణాచార్యులు గారు నరసాపురం 30-0

శ్రీ ముడుంబై జనార్ధనాచార్యులుగారు నరసాపురం 29-0

శ్రీ గాదె సత్యనారాయణమూర్తి అండ్ కనకరాజుగార్లు అమలాపురం 30-0

శ్రీ తుమ్మలపల్లి వెంకటసూర్యనారాయణగారు కొత్తాలపల్లి. 29-0

శ్రీ ఆకిపీటి నరసయ్యగారి భార్య వెంకటరత్నమ్మగారు మునమల్రు 29-0

శ్రీ ఎలసేటి శ్రీరాములుగారిభార్య శేషమ్మగారు దేవగ్రామం వాగ్దానం 58/ లో అడ్వాన్సు - 2-0

శ్రీ అత్యం కామరాజుగారు పెనుగొండ వాగ్దానం 275/ లో అడ్వాన్సుగాయిచ్చినది 25-0

## తాత్కాలిక పూజలు

శ్రీ మాడభూషి యతిరాజమ్మగారు శివకోడు - 11-0

శ్రీ సామవేదం సీతమ్మగారు శివకోడు - 11-0

శ్రీ అల్లూరి శ్రీరామరాజుగారు అంతర్వేదిపాలెం 11-0

శ్రీ జక్కం కృష్ణారావుగారు కొత్తాలపల్లి 11-0

శ్రీ ముడుంబై వెంకటాచార్యులుగారు కొత్తాలపల్లి 11-0

శ్రీ కంతేటి సూరమ్మ కొత్తాలపల్లి 11-0

శ్రీ జక్కుల అన్నమ్మ కొత్తాలపల్లి 11-0

—:o:—

# కట్నములు

రాజమండ్రి వాస్తవ్యులగు శ్రీమాన్ ముడుంబై వరాహ నరసింహాచార్యులు గారి రెండవకుమార్తె చి॥ సౌ॥ రంగనాయకమ్మను అనపర్తివాస్తవ్యులగు శ్రీమాన్ వంగల నమ్మాళ్వార్లగారి కుమారులు చి॥ నమ్మాళ్వార్ల కిచ్చి వివాహము జరిపిన సందర్భములో కన్యాదాత, మన సంఘమునకు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులు గారి ద్వారా పంపిన కట్నం రు. 20–0.

కటికినేని రాజ్యలక్ష్మమ్మగారు బదరీతాత్కాలిక పూజకుగాను సమర్పించినది పుస్తేలు 11–0

శ్రీ అతికు అలివేలుమంగతాయారమ్మగారు బదరీనారాయణలో శ్రీనివాస రామానుజ సన్నిధిలో తదీయారాధనకుగాను సమర్పించినది రు 100-0

తెనాలి.

చావలి యతిరాజసేవా మహిళామండలివారు గోదా కళ్యాణసందర్భమునకు కట్నం సమర్పించినది 3–0

చావలిలో కంచె వెంకటకోటయ్యగారి కుమార్తె కోటేశ్వరమ్మను యార్లగడ్డ వెంకటేశ్వర రావుకు యిచ్చి వివాహము జరిగిన సందర్భమున సంఘమునకు కట్నం సమర్పించినది 2-0

మేనేజరు ట్రస్టీగారు - టెక్కలిగ్రామ శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి సన్నిధిలో శుక్రవారంపూజలు సందర్భమున కట్నంసమర్పించినది 2-0

# గీతా కాలక్షేపము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ప్రధాన కార్యదర్శులగు శ్రీమదిత్యాది శ్రీమాన్ న్యాయవేదాంత విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు 7—5—1960 వ తేదినుండి బందరులో శ్రీ యతిరాజ భవనమునగీతా కాలక్షేపములు సుమారు ౧ మాసంరోజులు గావింతురు.



# శ్రీ గుణరత్నకోశము

## 10 వ శ్లోకము

శ్లో॥ దేవి శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంస
స్త్వత్సద్గుణౌఘ మణికోశగృహం గృణన్తి।
తద్ద్వారపాటనపటూని చ నేతిహాస
సంతర్కణ - స్మృతి - పురాణ - పురస్సరాణి॥.

:— * అర్థము * —:

హే దేవి = ఓ లక్ష్మీదేవి,
ప్రథమే = పూర్వులైన.
పుమాంసః = మహాత్ములు,
భగవతీం = పూజనీయమైన,
శ్రుతిం = వేదమును,
త్వత్సద్గుణౌఘమణికోశగృహం
త్వత్ = నీ యొక్క
సద్గుణ = సద్గుణములయొక్క,
ఓఘ = సమూహమనెడి,
మణి = మణులయొక్క,
కోశ = కొశములయొక్క,
గృహం = స్థానమునుగాను,
నేతిహాససంతర్కణ స్మృతి పురాణ పురస్సరాణి,
నేతిహాస = ఇతిహాసములతోగూడిన,
సంతర్కణ = న్యాయములును,
స్మృతి = స్మృతులును,
పురాణ = పురాణములును,
పురస్సరాణి = మొదలైనవి,
తద్ద్వారపాటన పటూని,
తత్ = ఆవేదకోశములయొక్క
ద్వారా = తలుపులయొక్క
పాటన = తెరచుటయందు
పటూని = సమర్థములైనవిగాను,
గృణన్తి = గ్రహించుచున్నారు.

:— ! తాత్పర్యము ! —:

ఓ లక్ష్మీదేవి ! మహాత్ములగు ఆళ్వారాదులును, పూర్వాచార్యులును పరమప్రమాణతయా పూజనీయమైన, వేదమును, నీ సద్గుణగణములను మణిగణములకు, నిధినిగాను, వేదోపబృంహణములగు భారత రామాయణములును, న్యాయమీమాంసాదులును, మన్వాది స్మృతులును, శ్రీవిష్ణు పురాణాదులును, ఇవన్నియును ఆ వేదమందలి నీ విషయములయొక్క రహస్యార్థములను వెల్లడించునట్టివనియును తాము తెలుసుకొని, ఇతరులకు తెలుపుచున్నారు.

## పుస్తకప్రకటన

శ్రీమాన్ కవిరత్న నడిమెళ్ళ రామానుజాచార్యుల వారిచే రచింపబడిన "శబరి" రెండవముద్రణ పూర్తి అయినది. ప్రతులు వెలకు సిద్ధముగానున్నవి.

ప్రతి 1 టికి 0-75

| | |
|---|---|
| ఊర్మిళ [లక్ష్మణునిభార్య] | 0-75 |
| మాండవి [భరతునిభార్య] | 0-75 |
| సరమ [విభీషణునిభార్య] | 0-75 |
| ధనుర్దాసుడు | 1-00 |
| పండితగోష్ఠి | 1-00 |
| శరద్రాత్రి | 1-00 |
| గీతా సంకీర్తనము | 0-50 |
| పల్లాండు వైభవము | 0-50 |
| ఋష్యమూకము | 0-75 |

## శ్రీ జియ్యర్ స్వామివారి ఆంధ్రానువాదములు

| | |
|---|---|
| ముముక్షుప్పడి | 1-00 |
| అర్థపంచకము | 0-75 |
| తని ప్రణవము | 0-50 |
| సారసంగ్రహము | 0-50 |
| యాదృచ్ఛికప్పడి | 0-50 |
| శ్రీ వచనభూషణము | |
| శ్రీరామనామ వైభవము | 0-25 |
| తిరునామ వైభవము | 0-25 |
| శ్రీమాన్. తె. కం. గోపాలాచార్య స్వామివారి రచనలు | |
| భగవద్గీత | 4-00 |
| గీతా ప్రశ్నోత్తరావళులు 3 భాగములు | 3-00 |
| సాధుపరిత్రాణము | 0-25 |
| గీతోపదేశసారము | 1-00 |

## భక్తినివేదన - వేదాన్తమాసపత్రిక

ఇది ప్రతిమాసము ఇంగ్లీషు నెల ప్రకారము 1వ తేదికి ప్రచురింపబడుచుండును. ఇందు భక్తి జ్ఞాన వైరాగ్యబోధకములగు వ్యాసములుండును. మరియు శ్రీ విష్ణు సహస్రనామములకు అర్థము, అనుష్ఠాన విశేషములు వార్తామాలలు, ప్రచురింపబడును. సం॥ చందా రు. 5/ లు.

---

సాలుచందా రు. 5 లు **భక్తినివేదన - BOOK POST** రి. నెం. A 195

శ్రీ వాసుదాసాశ్రమం:— నడిగడ్డపాలెం (పోష్టు) [వయా-చేబ్రోలు] గుంటూరు జిల్లా



గారికి

**Edited and Published by Sri T· K Gopalacharyulu Garu and Printed at Liberty press, Tenali For Sriman Press, Nadigaddapalem**

# గోపికాగీతలు

## 11 వ శ్లోకము

శ్లో॥ చలసి యద్వ్రజా చ్చారయ న్పశూన్
నళినసుందరం నాథ తే పదమ్
శిలతృణాంకురై స్సీదతీతి నః
కలిలతాం మనః కాన్త గచ్ఛతి॥

:— * అర్థము * —:

హే నాథ = ఓ నాథుడా;
హే కాన్త = ఓ మనోహరుడా;
యత్ = ఎపుడు,
వ్రజాత్ = వ్రేపల్లెనుండి,
పశూన్ = పశువులను,
చారయన్ = తోలుకొని వెళ్లెదవో,
తత్ = అపుడు,
నళినసుందరం = పద్మములకంటెను సుందరమైన,
తే = నీ యొక్క,
పదమ్ = పాదములు,
శిలతృణాంకురైః = రాళ్ళచేతను, గడ్డి మొలకలచేతను,
సీదతి = బాధింపబడుచున్నవి,
ఇతి = అని,
నః = మాయొక్క
మనః = మనస్సు,
కలిలతాం = బాధను,
గచ్ఛతి = పొందుచున్నది.

*:— తాత్పర్యము :—*

ఓ కృష్ణా. నీవు లోకనాథుడవు, జగత్పతివి. మేము ఆ లోకములో, ఆజగత్తులో చేరినవారము కాదా. మమ్ముల నీ శరీరములో బంధించి ఈ శరీరముల కొక నాథుల కట్టబెట్టి నిర్బంధించితివి. మమ్ముల ఈ వ్రజపల్లెను దాటకుండగ కట్టడజేసితివి. నీవు కూడ మా ఎదుటనున్నచో ఏమిజేసినను పరవాలేదు. గాని ఆత్మనాథుడవైన నీవు పశువులను తోలుకొని అడవులకు పోవుచున్నావు. వాటిని మేపుకొనుచు నచ్చటనే తిరుగాడుచుందువే గాని నీకు శేషభూతులమై నీ గుణభోగులమైన మాకు గనుపించవు. మాకు నాహారము నీవు. పశువులు మాత్రమే సదా పశ్యంతులు కావలెనా ? మేము సకృత్పశ్యంతులమైన గాకూడదా ? గోవృష్టములు మాత్రమే సదాదర్శనీయము లాయెనా ? మా ముఖకమలములు సకృద్దర్శనీయములైన గాకూడదా, నిన్ను కోరని పశువులకు కసవును మేపుదువే గాని నిన్నుమాత్రమే కోరిన గోపికలకు కసరులుకూడ కరువాయనా ? నిన్ను నాథునిగ వరించినందులకు కలుగుచున్న ఫలిత మిదియేనా ?

పోనీతెమ్ము. మేము నీ దర్శన - స్పర్శనములకై వాపోయుటలేదు. మా హృదయకమలములు నీ పాద కమలముల నాశ్రయించి యున్నవి. మా మనసు నీ పాదముల నంటియున్నది. మా ఆత్మ, అంతరాత్మ భూతుడవైన నీకు శరీరమై అచ్ఛాదించియున్నది. నీవు అడవిలో తిరుగుటచే అచ్చటి అచ్చటి కలుకురాళ్ళు, గడ్డిమొల్కలు నీపాద ముల నాశ్రయించి, వాటినంటుకొని, వాని కాచ్ఛాదకముగ నున్న మా హృదయ మనస్సులకు గ్రుచ్చుకొని వజ్రాయుధమువలె, పిడుగుపాటువలె బాధించుచున్నవి వాని బాధ మాకేగాని నీకేమి తెలుసును. గనుకనే నీవు కాన్తుడవై విరాజిల్లుచున్నావు.

అవ, నిత్యనైమిత్తిక కర్మలను గూడ కామ్యకర్మలకువలెనే ఫలములతో గూడినవిగా శాస్త్రములు విధించుచున్నవి. కావున ఫలములను గోరక యాచరించినను బీజములవలె ఫలముల నొసంగకమానవు. అట్టితరి మోక్షార్థికి కర్మలు త్యాజ్యములేగాని ఉపాదేయములు కావుగదా! అనెడు శంకకుత్తరమొసంగుచున్నాడు.

12. శ్లో. అనిష్ట మిష్టం మిశ్రం చ । త్రివిధం కర్మణః ఫలమ్
భవత్య త్యాగినాం ప్రేత్య । న తు సన్న్యాసినాం క్వచిత్॥

అర్థము :– కర్మణః = కర్మకు, అనిష్టం = నరకాదికమును, ఇష్టం = స్వర్గాదికమును, మిశ్రం చ = సుఖదుఃఖములు కలిసియున్న పుత్రపశ్వాదికమును నగు త్రివిధం = మూడువిధములైన, ఫలం = ఫలము, ప్రేత్య = కర్మల నాచరించినపిమ్మట, అత్యాగినాం = ఫలసంగ కర్తృత్వములను విడువని వారికి, భవతి = కలుగుచున్నది. సన్న్యాసినాం = వాటిని విడిచినవారికి, క్వచిత్ అపి = ఒకానొకప్పుడున్ను న (భవతి) = కల్గదు.

తా॥ కర్మఫలములు అనిష్టములనియు, ఇష్టములనియు, మిశ్రములనియు మూడు విధములు. దుఃఖజనకములైన నరకాదు లనిష్టములు, సుఖకరములైన స్వర్గాదు లిష్టములు. సుఖదుఃఖములు కలిసి యుండు పుత్ర పశ్వాదులు మిశ్రములు. ఫలాశతో కర్మల నాచరించు వారికీ మూడింటిలో నేదోయొక ఫలము తప్పక కలుగును. ఫలసంగకర్తృత్వత్యాగముతో కర్మల నాచరించువారికి మోక్ష విరోధియగు ఫలమెన్నడును కలుగదు.

అవ. మూడువిధములగు త్యాగములలో కర్తృత్వత్యాగము ముఖ్యమైనది. అది సిద్ధించిన మిగిలినవి తమంతనే సిద్ధించును. అది యన్నింటికిని నంతర్యామిగా నుండు భగవంతుడే కర్తయని యనుసంధించుటచే సిద్ధించునని చెప్పుచున్నాడు—

(భగవంతుడు కర్తయనగా - భగవంతుడు తనకు శరీరమువలె పరాధీనుడగు జీవునిగూని తనవియే యనదగిన నాతని కరణకళేబరాదులతో తన లీలకై కర్మలను చేయించుచున్నాడని తలంచవలెను)

13. శ్లో. పఞ్చైతాని మహాబాహో । కారణాని నిబోధ మే
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని । సిద్ధయే సర్వకర్మణామ్॥

అర్థము :— హే మహాబాహో ! = అర్జునా ! సర్వకర్మణామ్ = సకల కర్మలయొక్క సిద్ధయే = పుట్టుకకై, సాఙ్ఖ్యే = తత్త్వవిషయమైన బుద్ధితో ననుసంధింపబడు, కృతాన్తే = సిద్ధాన్తమునందు, ప్రోక్తాని = చెప్పబడిన, ఏతాని = ఈ, పఞ్చ = ఐదైన, కారణాని = కారణములను, మే = నానుండి, నిబోధ = తెలిసికొనుము.

తా॥ నిజమైన తత్త్వమును నిర్ణయించుటకొఱకు కేర్పడిన వేదభాగము నెఱింగినవారు చేయు నిర్ణయమునందు సమస్త కర్మలయొక్క ఉత్పత్తికీ యైదు కారణములున్ను చెప్పబడినవి. వాటిని నావలన నెఱుంగుము.

అవ. ఆ కారణములనైదింటిని చెప్పుచున్నాడు—

14. శ్లో. అధిష్ఠానం తథా కర్తా । కరణం చ పృథగ్విధమ్
వివిధా చ పృథక్చేష్టా । దైవం చైవాత్ర పఞ్చమమ్॥

అర్థము :— అధిష్ఠానం = శరీరము, తథా = అట్లే, కర్తా = జీవాత్మ, పృథగ్విధమ్ = వేఱువేఱు వ్యాపారములుగల, కరణంచ = మనస్సు, కర్మేంద్రియములైదును, పృథక్ = వేఱువేఱుగా, వివిధా = నానావిధమైన, చేష్టా = ప్రాణాదిపంచవాయువుల వ్యాపారమున్ను, పఞ్చమమ్ = ఐదవదియగు, దైవంచ ఏవ = పరమాత్మయు. (ఏతే = ఈ, పఞ్చ = ఐదును, అత్ర = ఈకర్మలు పుట్టుటలో, హేతవః = కారణములు, భవన్తి = అగుచున్నవి) (అని ముందుశ్లోకముతో సంబంధము)

తా॥ శరీరము, జీవాత్మ, ఐదు కర్మేంద్రియములు, మనస్సున్ను, ప్రాణాపానాది ఐదువాయువులయొక్క వేఱువేఱు వ్యాపారములున్ను, అంతర్యామియగు పరమాత్మయు (అనెడు నివి కర్మ పుట్టుటకు ముఖ్యకారణములు.

అవ. ఇవి యెట్టికర్మలకు కారణభూతములో చెప్పుచున్నాడు.

15. శ్లో. శరీరవాఙ్మనోభి ర్య । త్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా । పఞ్చైతే తస్య హేతవః॥

అర్థము :— నరః = మనుష్యుడు, శరీరవాఙ్మనోభిః = శరీరము వాక్కుమనస్సులచేత, న్యాయ్యం వా = శాస్త్రీయమైనదైనను, విపరీతం వా = శాస్త్రీయము కానిదైనను, యత్ కర్మ = ఏకర్మను, ప్రారభతే = ఆరంభించుచున్నాడో, తస్య = ఆ కర్మకు, ఏతే = ఈ, పఞ్చ = ఐదున్ను, హేతవః = కారణములు, భవన్తి = అగుచున్నవి.

తా॥ శరీరము వాక్కు మనస్సులతో శాస్త్రములో చెప్పబడినట్టిగాని చెప్పబడనట్టిగాని కూడదని చెప్పబడినట్టిగాని ఏ కర్మల నే మానవుడు చేసినను ఈ చెప్పబడిన ఐదును వాటికి కారణము లగుచున్నవి.

అవ. ఆత్మ నిజమునకు కర్తయైయుండగా అకర్తృత్వానుసంధాన మెట్లు ఘటించుననగా— అకర్తృత్వాను సంధానమనగా— వెనుక చెప్పబడి నట్లు ఐదుకారణములచే నిర్వహింపబడు కర్మకు తానొక్కడే కర్తయని తలంచకుండుటయే యని చెప్పుచున్నాడు.

16. శ్లో. తత్రైవం సతి కర్తార । మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృత బుద్ధిత్వా । న్న పశ్యతి సదుర్మతిః॥

అర్థము :— తత్ర = ఆవిధముగ కర్మ ప్రారంభకారణముల విషయమై, ఏవం సతి = జీవుని కర్తృత్వము పరమాత్మయొక్క అనుమతిమూలకమై యుండగా, కేవలం ఆత్మానం తు = ఒక ఆత్మనుమాత్రమే, కర్తారం = కర్తనుగా, యః = ఎవ్వడు, పశ్యతి = తలంచుచున్నాడో, సః = అట్టి, దుర్మతిః = అవివేకి, అకృతబుద్ధిత్వాత్ = వస్తుతత్వమును వాస్తవముగ నెఱుంగని బుద్ధికలవాడగుటవలన, పశ్యతి = కర్తను నిజముగ నెఱుంగజాలడు.

తా॥ ఈ విధముగ ఆయా కర్మలయొక్క ప్రారంభమునకు హేతువుల విషయమై జీవునియొక్క కర్తృత్వము, పరమాత్మానుమతి మూలకమైయుండగా తనను మాత్రమే కర్తయని తలంచువాడు వస్తుతత్వజ్ఞానము లేనివాడేగాన కర్తను నిజరూపమున నెఱుంగ జాలడు.

అవ. తనను కర్తనుకానని తలంచుటకు ప్రయోజనమును జెప్పుచున్నాడు. ఇట్టివాడే సుమతి.

17. శ్లో. యస్య నాహంకృతో భావో । బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాల్లోకా । న్న హన్తి న నిబధ్యతే॥

అర్థము:- యస్య = ఎవనియొక్క, భావః = కర్తృత్వమునుగూర్చిన మనోవ్యాపారము, అహం కృతః = నేను చేయుచున్నాననెడు జ్ఞానముతో కూడినది. న = కాదో, యస్య = ఎవనియొక్క, బుద్ధిః = కర్మనుగూర్చిన బుద్ధి, న లిప్యతే = ఫలసంగముకలది కాదో, సః = వాడు, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకులనందఱను, హత్వా అపి = చంపియును, న హన్తి = చంపినవాడు కాడు, న నిబధ్యతే = బంధింపబడడు.

తా॥ పరమాత్మయే కర్తయని తలంచి కర్మలను చేయించుటచే నెవనికి 'నేనే చేయుచున్నా' ననెడు యభిమానముండదో "నేను కర్తను కాకుండుటచే దీని ఫలము నన్నంట" దనెడు బుద్ధి యెవనికి జనించునో వా డీ కౌరవసేననే కాదు లోకుల నందరను సంహ

అవ. ఇట్టి యనుసంధానము సత్త్వగుణాభివృద్ధివలననే కలుగునుగాన సత్త్వగుణమును పెంపొందించుకొనవలెనని తెలుపుటకై కర్మలయందు సత్త్వాదిగుణములచే కలుగు భేదములను సవిస్తరముగా చెప్పదలంచుచు ముందుగ కర్మల విధించురీతిని జెప్పుచున్నాడు.

18. శ్లో. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా । త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి । త్రివిధః కర్మ సఙ్గ్రహః॥

అర్థము :— జ్ఞానం = కర్మస్వరూపముయొక్క యెఱుకయు, జ్ఞేయం = చేయదగిన కర్మయు, పరిజ్ఞాతా = ఆ కర్మను తెలుసుకొనువాడును (అని) కర్మ చోదనా = కర్మవిధి, త్రివిధా = మూడువిధములైనది, కరణం = సాధనమగు ద్రవ్యాదికము, కర్మ = యాగాదికము, కర్తా = చేయువాడు, ఇతి = అని, త్రివిధః = మూడువిధములుగా, కర్మసఙ్గ్రహః = కర్మయొక్క సంగ్రహము (భవతి = అగుచున్నది).

తా॥ చేయదగిన కర్మజ్ఞానము, చేయదగినకర్మ, దాని నెఱింగినవాడని కర్మవిధి మూడింటితో గూడియున్నది. వాట్నియందు తెలియదగిన కర్మయు, తిరిగి యాగాదికర్మ, ద్రవ్యాదులనెడు సాధనములు, చేయునట్టి కర్తయని మూడు విధములుగా సంగ్రహింపబడుచున్నది.

అవ. వెనుక చెప్పబడిన జ్ఞానజ్ఞేయ పరిజ్ఞాతలనెడు పదార్థములే యీ శ్లోకములో తిరిగి చెప్పబడుచున్నవి.

19. శ్లో. జ్ఞానం కర్మ చ కర్తా చ । త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే । యథావ చ్ఛృణు తాన్యపి॥

అర్థము :— జ్ఞానం = చేయదగిన కర్మజ్ఞానము, కర్మచ = చేయదగిన కర్మ, కర్తా చ = చేయువాడును, గుణభేదతః = సత్త్వాది గుణభేదములనుబట్టి, త్రిధా ఏవ = మూడువిధములుగానే, గుణసఙ్ఖ్యానే = సత్త్వాది గుణ కార్యములను లెక్కపెట్టు ప్రకరణములో, ప్రోచ్యతే = చెప్పబడుచున్నది. తాని అపి = వాటినికూడా, యథావత్ = వాస్తవముగ, శ్రుణు = వినుము.

తా॥ చేయదగిన కర్మజ్ఞానము, చేయవలసిన కర్మ, దానిని చేయుకర్తయున్ను ఒక్కొక్కటి సత్త్వాది గుణభేదములచే మూడుమూడు విధములని చెప్పబడుచున్నవి. ఇట్లు సత్త్వాది గుణములను గణించు ప్రకరణములో జెప్పబడిన యీ గుణములచే భేదించు జ్ఞానాదులనున్ను తెలియదగిన రీతిగా తెలుసుకొనుము.

అవ. సాత్త్విక జ్ఞానస్వరూపము నెఱింగించుచున్నాడు.
(ఇవి చెప్పుట కర్తృత్వము గుణాధీనమని తెలుపుటకే)

20. శ్లో. సర్వభూతేషు యేనైకం । భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు । త జ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥

అర్థము :- విభక్తేషు = బ్రాహ్మణ క్షత్రియాదులుగా విభజింపబడిన, సర్వభూతేషు = కర్మలుచేయుటకుతగిన సకలప్రాణులయందును, ఏకం = ఏకాకారముగల, భావం = ఆత్మను, అవిభక్తం = విభాగములులేనిదానినిగాను, అవ్యయం = నిర్వికారమైన దానినిగాను, యేన = ఏజ్ఞానముచే, ఈక్షతే = తెలిసికొనుచున్నాడో, తత్ = ఆ, జ్ఞానం = జ్ఞానమును, సాత్త్వికం = సత్త్వగుణాభివృద్ధిచే కలిగినదానినిగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ కర్మాధికారులు బ్రాహ్మణ క్షత్రియాది వర్ణస్థులుగాను బ్రహ్మచర్యాది ఆశ్రమస్థులుగాను విభజింపబడియున్నారు. ఇట్టి వికారములు శరీరములకు సంబంధించినవియేగాని ఆత్మలన్నియు ఒకే జ్ఞానాకారముగా నుండుటచే వాటికి విభాగము లేదనియు, ఆ శరీరములు వికారించినను ఆత్మమాత్రము నిర్వికారమై ఫలముతో సంబంధమునకు తగనిదై యుండుననియు, తెలుపుజ్ఞానము కర్మానుష్ఠాన వేళయందున్నచో నా జ్ఞానము సాత్త్విక మనబడును.

అవ. రాజస జ్ఞాన స్వరూపము నెఱింగించుచున్నాడు.

21. శ్లో. పృథక్త్వేన తు యజ్ఞానం । నానా భావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు । తజ్ఞానం విద్ధి రాజసమ్॥

అర్థము :- సర్వేషు భూతేషు = సమస్త ప్రాణులయందును, భావాన్ = ఆత్మలను, పృథక్త్వేన = బ్రాహ్మణాది ఆకారములు వేఱగుటచేత, నానా = అనేకస్వరూపములు కలవిగాను, పృథగ్విధాన్ = పైకిగాన్పించుచుండుపరిమాణము మొదలైన గుణములనుబట్టి వేరైనవిగాను, యత్ జ్ఞానం = ఏజ్ఞానము, వేత్తి = ఎఱుంగుచున్నదో, తత్ జ్ఞానం = అజ్ఞానము, రాజసం = రజోగుణాభివృద్ధిచే కలిగినదని, విద్ధి = ఎఱుంగుము.

తా॥ సకల భూతములయందునుగల బ్రాహ్మణా ద్యాకారములును గుణములును వేఱువేఱుగా నుండుటచే వాటియందున్న ఆత్మలు కూడా అట్లే వేఱువేఱు ఆకారములును గుణములును కలవనెడు జ్ఞానము కర్మాధికార సమయమున నున్నచో నా జ్ఞానము రాజసమనబడును.

(ఈ శ్లోకమున పృథక్త్వశబ్దము బ్రాహ్మణాదిజాతినిబట్టియు, నానాశబ్దము వస్తుస్వరూపమును బట్టియు, పృథగ్విధశబ్దము గుణములనుబట్టియు ప్రయోగింపబడినవి.)

అవ. గుణభేదమునుబట్టి కర్త మూడువిధములని చెప్పదలంచి సాత్త్వికకర్తయొక్క స్వరూపము నెఱింగించుచున్నాడు.

22. శ్లో. యత్తుకృత్స్నవ దేకస్మి । న్కార్యే సక్త మహేతుకమ్
అతత్త్వార్థవ దల్పం చ । తత్తామస ముదాహృతమ్॥

అర్థము :- యత్ = ఏ, జ్ఞానం తు = జ్ఞానమైతే, ఏకస్మిన్ కార్యే = చేయదగిన యొక పనియందే, కృత్స్నవత్ = సకలఫలసాధనమగు కర్మయందువలెనే, సక్తం = ఆసక్తిగలదియు, అహేతుకం = ఆ యాసక్తికి తగినకారణము

లేనిదియు, అతత్త్వార్థవత్ = ఆత్మలు స్వరూపస్వభావములలో వేరైనవని తలచునదియు, అల్పంచ = అల్పమైనదియునైయుండునో, తత్ = ఆజ్ఞానము, తామసం = తామసజ్ఞానమని, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ అల్పఫల మొసంగు భూతప్రేత గణారాధన యొక్కటియే సకల ఫల సాధనమను భ్రాంతితో నాసక్తిని పుట్టించునదియు, నిజమునకా కర్మ కట్టిశక్తి లేనందున దానియం దట్టి సంగముండుటకు తగిన కారణము లేనిదియు, ఆత్మలు వేఱువేఱనుకొనుట మొదలగు మిథ్యార్థములు కలదియు, అల్పఫలము కలదియు, నీచ దేవతారాధనకు పురికొల్పుటచే నీచమైనదియు నగు జ్ఞానము తామస మనబడును.

అవ. అనుష్ఠింపదగినకర్మ సత్త్వాదిగుణములచే మూడు విధములగునని చెప్పుచున్నాడు.

23. శ్లో. నియతం సఙ్గరహిత । మరాగద్వేషతః కృతమ్
అఫల ప్రేప్సునా కర్మ । యత్త త్సాత్త్విక ముచ్యతే॥

అర్థము :- అఫలప్రేప్సునా = ఫలాశలేనివానిచే, నియతం = తనవర్ణాశ్రమమునకు తగినట్టియు, సఙ్గరహితం = కర్తృత్వాదిసంగములేనట్టియు, అరాగద్వేషతః = కీర్తియందాశయు అపకీర్తియందు ద్వేషము (దంభము) లేక, కృతం = చేయబడిన, యత్‌కర్మ = ఏకర్మ (అస్తి = కలదో), తత్ = అది, సాత్త్వికం = సత్త్వగుణ ప్రధానమైనదిగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ఫలమునం దాశనువీడి తన వర్ణాశ్రమమునకు తగినకర్మ కీర్తియందాశను అపకీర్తియందు ద్వేషమును లేక తాను కర్తనుకానని తలంచుచు చేయబడునెడల నది సాత్త్వికకర్మగా జెప్పబడుచున్నది.

అవ. రాజసకర్మ స్వరూపము నెఱింగించుచున్నాడు.

24. శ్లో. యత్తు కామేప్సునా కర్మ । సాహఙ్కారేణవా పునః
క్రియతే బహుళాఽఽయాసం । తద్రాజస ముదాహృతమ్॥

అర్థము :- యత్ కర్మ తు పునః = ఏకర్మ అయితే, కామేప్సునా = ఫలాశకలిగినట్టియు సాహఙ్కారేణవా = కర్తృత్వాభిమానముతో కూడినట్టివానిచేత, బహుళాయాసం = మిక్కిలి శ్రమకలుగునట్లుగా, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = ఆకర్మ, రాజసం = రాజసకర్మగా, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ ఫలాశతో నేను కర్తను. యీ కర్మ నాది. దీనిఫలమును నే ననుభవింతునను సంకల్పముతో తిగనిశ్రమల నోర్చి చేయబడు కర్మ రాజసమనబడుచున్నది.

అవ. తామస కర్మస్వరూపము నెఱింగించుచున్నాడు.

25. శ్లో. అనుబన్ధం క్షయం హింసా । మనవేక్ష్య చ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ । యత్తత్తామస ముచ్యతే॥

అర్థము :- అనుబంధం = కర్మలు చేయనపుడుకలుగు దుఃఖమును, క్షయం = ధననాశమును, హింసాం = అందుగావింపబడు ప్రాణిపీడను, పౌరుషం = తన శక్తిని, అనవేక్ష్య = చూడక, మోహాత్ = పరమపురుషుడే కర్తయని యెఱుంగక, యత్ కర్మ = ఏకర్మ, ఆరభ్యతే = ప్రారంభింపబడుచున్నదో, తత్ = ఆకర్మ, తామసం = తామసముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ తాను చేయదలంచిన కర్మలను చేయుచుండగా కలుగునట్టి దుఃఖమునుగాని దానికై అగునట్టి ధనవ్యయమునుగాని, అందు కొఱకై చేయవలసిన ప్రాణిహింసనుగాని, ఆపనికి కావలసిన తన శక్తినిగాని పాటించకయే, పరమాత్మశేషియై అతనికి శరీరమువలె పరతంత్రుడగు తనచే చేయించుచున్నాడు. గాన నిజమునకు కర్త యాతడేయని యెఱుంగక చేయుకర్మ తమోగుణోద్రేకముచే చేయబడినదని చెప్పబడుచున్నది.

అవ. గుణభేదమునుబట్టి కర్త మూడువిధములని చెప్పదలంచి సాత్త్విక కర్తయొక్క స్వరూపము నెఱింగించుచున్నాడు.

26. శ్లో. ముక్తసఙ్గోఽనహంవాదీ । ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః । కర్తా సాత్త్విక ఉచ్యతే॥

అర్థము :- ముక్తసఙ్గః = ఫలమునందాశలేనట్టియు, అనహంవాదీ = నేనే కర్తననెడు అభిమానములేనట్టియు, ధృత్యుత్సాహసమన్వితః — ధృతి = ఆరంభించినపని పూర్తియగువరకు తప్పనిసరియగు దుఃఖములను నిర్లక్ష్యముగా భరించుట, ఉత్సాహ = కార్యమును కొనసాగించుటలో మనస్సునకుగల ప్రోత్సాహము (అను నీరెండింటితో) సమన్వితః = కూడుకొని యుండునట్టియు. సిద్ధ్య సిద్ధ్యోః = ఫలము సిద్ధించుట సిద్ధించకుండుట విషయమై, నిర్వికారః = మార్పుచెందని చిత్తముకలిగినట్టియు. కర్తా = కర్త, సాత్త్వికః = సత్త్వగుణము ప్రధానముగా కలవాడుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఫలమునందాశలేక, తనను కర్తనుగా తలంచక, కర్మలను చేయుచుండగా తటస్థించిన దుఃఖములను సుఖములుగనే తలంచుచు, కార్యదీక్షయందంతకంత కభివృద్ధిచెందు ఉత్సాహము కలవాడై ఆ కర్మకుగాని తత్సంబంధి ద్రవ్యార్జనాదులకుగాని ఫలము సిద్ధించినను సిద్ధించకున్నను మార్పుచెందని చిత్తముకలవాడు సాత్త్వికకర్తగా పరిగణించబడుచున్నాడు.

అవ. రాజసకర్తయొక్క స్వరూపమును తెలుపుచున్నాడు—

27. శ్లో. రాగీ కర్మఫల ప్రేప్సు । ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా । రాజసః పరికీర్తితః॥

అర్థము :- రాగీ = కీర్తిని కోరువాడును, కర్మఫలప్రేప్సుః = చేసినపనికి ఫలము నపేక్షించువాడును, లుబ్ధః = కర్మకుకావలసిన ధనమును ఖర్చుచేయనివాడును, హింసాత్మకః = పరులను పీడించి పనిచేయించుకొనువాడును,

అశుచిః = ఆ కర్మకవసరమైన శాస్త్రోక్తశుద్ధిలేనివాడును, హర్షశోకాన్వితః = లాభనష్టములకు పొంగుక్రుంగులు కలవాడునునగు, కర్తా = కర్త, రాజసః = రజోగుణ ప్రధానుడుగా, పరికీర్తితః = చెప్పబడుచున్నాడు.

తా॥ కీర్తిని కోరి కర్మల నాచరించునట్టియు, ఫలము నాశించి కర్మలను చేయునట్టియు, అవసరమగు ధన వ్యయమును చేయుటకు సంకోచించునట్టియు, పరులను బాధించి తన పనిచేయించుకొనునట్టియు, ఆ కర్మలకు అవసరమైన శాస్త్రోక్త శుద్ధి లేనట్టియు, కర్మల లాభనష్టములకు పొంగు క్రుంగులు గలవాడును రాజస కర్తగా లెక్కించబడుచున్నాడు.

అవ. తామసకర్తయొక్క స్వరూపమును జెప్పుచున్నాడు—

28. శ్లో. అయుక్తః ప్రాకృతస్తబ్ధః । శఠో నైకృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ । కర్తా తామస ఉచ్యతే॥

అర్థము :- అయుక్తః = శాస్త్రోక్తకర్మ కధికారములేనివాడును, ప్రాకృతః = చదువులేనివాడును, స్తబ్ధః = బద్ధకముగలవాడును, శఠః = చేతబడి మొదలగు కర్మలయం దభిరుచికలవాడును, నైకృతికః = మోసగాడును, అలసః = మందముగా పనులనుచేయువాడును, విషాదీ = కొద్దినష్టమున కపరిమిత నిరుత్సాహమును చెందువాడును, దీర్ఘసూత్రీ = అభిచారాదులచే పరులకు చాలకాలముండునట్టి యనర్థములను సంకల్పించువాడును (అగు) కర్తా = కర్త, తామసః = తామసుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ తనకు తగని శాస్త్రీయ కర్మల నారంభించునట్టియు, దానికి తగిన విద్యలేనట్టియు, మిక్కిలి బద్ధకము కలిగినట్టియు, పరుల కనర్థదాయకములైన చేతబడి మొదలగు కర్మలయందే అభిరుచి కలిగినట్టియు, మోసగాడును, అతి నెమ్మదిగా పనిచేయువాడును, కొద్దిపాటి నష్టమునకే అపరిమిత నిరుత్సాహమును

చెందువాడును, పరులకు చాలకాలముండునట్టి కష్టములకు కారణమైన పనులనే సదా ఆలోచించువాడును నగు కర్త తామసుడుగా జెప్పబడుచున్నాడు.

అవ. సకల తత్త్వములకు, నిఖిల పురుషార్థములకు సంబంధించిన నిశ్చయ రూపమైన బుద్ధియొక్కయు, ధృతియొక్కయు, సత్త్వాదిగుణముల వలన కలుగు త్రైవిధ్యమును జెప్పుచున్నాడు.

29. శ్లో. బుద్ధే ర్భేదం ధృతేశ్చైవ । గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ । పృథక్త్వేన ధనఞ్జయ ! ॥

అర్థము :— ధనఞ్జయ ! = అర్జునా ! బుద్ధేః = బుద్ధియొక్కయు, ధృతేః = ధృతియొక్కయు, గుణతః = సత్త్వాదిగుణములవలన కలుగునట్టి, త్రివిధం = మూడువిధములైన, భేదం = భేదమును, పృథక్త్వేన = వేఱువేఱుగా, ప్రోచ్యమానం = చెప్పబడుచున్నదానిని, అశేషేణ = సమగ్రముగా, శృణు = వినుము.

తా॥ బుద్ధియనగా వివేకముతో చేయబడిన నిశ్చయ రూపమైన జ్ఞానము. ధృతి యనగా ఆరంభింపబడిన పనిని యెన్ని ఆటంకములు వచ్చినను విడువని పట్టుదల. ఈ రెండును సత్త్వ రజస్తమో గుణములనుబట్టి ఒకొక్కటి మూడు మూడు విధములుగా నుండును. వాటిని వేఱువేఱుగా చెప్పుచున్నాను గాన అర్జునా! పూర్తిగా వినుము.

అవ. సాత్త్వికబుద్ధియొక్క స్వరూపమును గూర్చి చెప్పుచున్నాడు—

30. శ్లో. ప్రవృత్తిం చ నివృత్తిం చ । కార్యాకార్యే భయాభయే
బన్ధం మోక్షం చ యావేత్తి । బుద్ధి స్సా పార్థ ! సాత్త్వికీ॥

అర్థము :— పార్థ ! = అర్జునా ! ప్రవృత్తిం చ = ఇహలోక పరలోకసుఖములకు సాధనమైన ధర్మమునున్ను, నివృత్తిం చ = మోక్షసాధన భూతమైన

ధర్మమునున్ను. కార్యాకార్యే = ఈ చోటున నీవేళ నిది చేయవచ్చును ఇది చేయరాదనిన్ని. భయాభయే = శాస్త్రము నుల్లంఘించుట భయమనియు. శాస్త్రమును పాటించుట అభయమనిన్ని. బన్ధం = సంసారనిజస్థితిని. మోక్షంచ = సంసారవిమోచన నిజస్థితినిన్ని. యా = ఏబుద్ధి. వేత్తి = తెలుసుకొనుచున్నదో. సాబుద్ధిః = ఆబుద్ధి. సాత్త్వికీ = సత్త్వగుణ ప్రధానమైనది. (భవతి = అగుచున్నది)

తా॥ అర్జునా! ఈ ధర్మము ఇహలోక సుఖములకు సాధనము, ఈ ధర్మము మోక్షసాధనము, ఈ చోటన నీవేళ దీనిని చేయవలెను, దీనిని చేయరాదు, శాస్త్రమును లక్ష్యము చేయకున్న భయము, దానిని పాటించిన అభయము, సంసారముయొక్క నిజస్థితి యిది, మోక్షము యొక్క నిజస్థితి ఇది యని యిట్లు తెలుసుకొనగల బుద్ధి సాత్త్వికబుద్ధి యనబడును.

అవ. రాజస బుద్ధియొక్క స్వరూపమును దెలుపుచున్నాడు.

31. శ్లో. యయా ధర్మ మధర్మం చ । కార్యం చాకార్య మేవ చ
అయథావ త్ప్రజానాతి । బుద్ధి స్సాపార్థ! రాజసీ॥

అర్థము :– పార్థ ! = అర్జునా ! ధర్మం = ధర్మమును, అధర్మంచ = అధర్మమును, కార్యంచ = చేయదగినదానిని, అకార్యం ఏవచ = చేయరానిదానిని, యయా = ఏబుద్ధిచే, అయథావత్ = విపరీతముగా, ప్రజానాతి = తెలుసుకొనుచున్నాడో. సా = ఆబుద్ధి. రాజసీ = రజోగుణము ప్రధానమైనది (భవతి = అగుచున్నది)

తా॥ అర్జునా! వెనుక శ్లోకమున చెప్పినట్లుగా ఇహలోక పరలోక సుఖసాధనమగు ప్రవృత్తి ధర్మమునుగాని మోక్షసాధనమగు నివృత్తి ధర్మమునుగాని, దేశకాలములనుబట్టి జేయదగినదానినిగాని చేయరానిదానినిగాని నిజముగ నెఱుంగ జాలని బుద్ధి రాజసమనబడును.

అవ. తామస బుద్ధియొక్క స్వరూపమును తెలుపుచున్నాడు.

32. శ్లో. అధర్మం ధర్మ మితియా । మన్యతే తమసాఽఽవృతా
సర్వార్థా న్విపరీతాం శ్చ । బుద్ధి స్సా పార్థ! తామసీ॥

అర్థము :– పార్థ ! = అర్జునా ! యా = ఏ. బుద్ధిః = బుద్ధి. తమసా = తమోగుణముచే. ఆవృతా = ఆవరింపబడినదై. అధర్మం = అధర్మమును. ధర్మం ఇతి = ధర్మమనిన్నీ. సర్వార్థాన్ = సకలపదార్థములను. విపరీతాన్ చ = తారుమారుగాను. మన్యతే = తలంచుచున్నదో, సా = ఆబుద్ధి. తామసీ = తమోగుణప్రధానమైనది. (భవతి = అగుచున్నది)

తా॥ అర్జునా ! తమోగుణముచే నావరింపబడిన బుద్ధి తామసి యనబడును. అది యధర్మమును ధర్మమనియు, ధర్మమును అధర్మమనియు, ఉన్నదానిని లేదనియు, లేనిదానిని ఉన్నదనియు, పరతత్వమును తక్కువదనియు, నీచతత్వమును పరతత్వమనియు నిట్లు విపరీతముగా తోచింపజేయును.

అవ. సాత్త్విక ధృతియొక్క స్వరూపమును తెలుపుచున్నాడు.

33. శ్లో. ధృత్యా యయా ధారయతే । మనః ప్రాణేన్ద్రియ క్రియాః
యోగేనా వ్యభిచారిణ్యా । ధృతి స్సా పార్థ ! సాత్త్వికీ॥

అర్థము :– అవ్యభిచారిణ్యా = ఫలాంతరములకు ప్రాకులాడని. యయాధృత్యా = ఏధృతితో. యోగేన = మోక్షసాధనమగు భగవదుపాసన నిమిత్తముగా. మనఃప్రాణేన్ద్రియక్రియాః = మనస్సు. ప్రాణము. బాహ్యేంద్రియముల యొక్క వ్యాపారములను. (పురుషః = పురుషుడు) ధారయతే = నిలబెట్టుచున్నాడో, సా ధృతిః = ఆధృతి. సాత్త్వికీ = సత్త్వగుణము. ప్రధానమైనది (భవతి = అగుచున్నది)

తా॥ ధృతియనగా ఆరంభించిన దానిని విడవక ముగింపజేయు పట్టుదల. పురుషుడు, ఫలాంతరముల ప్రక్కకు మనస్సును పోనీయుని యే పట్టుదలతో భగవదుపాసనకొఱకై మనస్సు ప్రాణము కర్మేంద్రియముల యొక్క పనులను నిశ్చలముగా నిలబెట్టి యుంచునో ఆధృతి (పట్టుదల) సాత్త్విక ధృతియనబడుచున్నది.

శ్రీ హయగ్రీవాయ నమః

# నవవిధభక్తులు

శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

[వెనుక సంచిక తరువాయి]

మన కాతడు జ్ఞానమును ప్రసాదించినందులకు ప్రయోజన మాతని స్వరూప రూపగుణ విభవాదుల నెఱుంగుటయే యనెడు జ్ఞాతృజ్ఞేయ సంబంధము.

ఆయన యజమాని - మనమాతని సొత్తు అనెడు స్వస్వామిసంబంధము.

ఆత డంతరాత్మగా నుండి ధరించుటచేతనే చరాచరాత్మక ప్రపంచము నిలిచియున్న దనెడు ఆధారాధేయ సంబంధము. ఆతడన్నిటికి నంతరాత్మగాన సమస్త ప్రపంచమాతనికి శరీరమువలె ఆధేయమై విధేయమై యథేష్ట వినియోగార్హమై యున్నదనెడు శరీరాత్మ భావ సంబంధము.

కావుననే యాతడుభోక్త చరాచర ప్రపంచమాతనికి భోగ్యమనెడు భోక్తృభోగ్య సంబంధము - అనునవి యాసంబంధములు, వీటిని, వీటితోపాటాయాకార్యముల నిర్వహించుట కావశ్యకమగు కల్యాణగుణములను నెఱింగినచో నీ దాస్యభావమలవడుట శంకరము.

భగవద్గీత 12 వ అధ్యాయమున నీదాస్యవృత్తి యలవడుటకు మరియొక ఉపాయము చెప్పబడెను.

శ్లో॥ అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ (12 అ. శ్లో॥.)

దీనికి వెనుకటి శ్లోకమున భక్తి యోగాంకురమగు భగవత్కైంకర్యము నుపదేశించి యీ శ్లోకమున నదియు చేయలేనిచో కర్మయోగాంకురమైన సర్వఫలత్యాగమును చేయమని ఉపదేశించుచున్నాడు. దానిచే నిష్కామ కర్మయోగమున్ను, దానిచే నాత్మధ్యానమున్ను దానిచే భగవచ్ఛేషభూతమగు నాత్మస్వరూప సాక్షాత్కారమున్ను దానివలన దాస్యవృత్తియుదాని వలన సకలకల్యాణ గుణసాగరుడగు పరమాత్మ విషయకమైన ధ్యానాభ్యాసమున్ను దానిచే నాతని యందు స్థిరమగు చిత్తసమాధానమున్ను లభించిదానివలన మోక్షమును లభించునని ఉపదేశించెను.

ఈ దాస్యము కేవల భగవంతునికేగాక భగవద్భక్తవర్యులకుగూడ భావించవలెను. కులశేఖరులు ముకుందమాలలో :-

శ్లో॥ మజ్జన్మనః ఫల మిదం మధుకైటభారే!
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ
త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!॥

మధుకైటభులను సంహరించిన ఓ జగన్నాథా! నన్ను నీభృత్యులకు కడసారి భృత్యునిగా తలంపుము. ఇదియే నాజన్మకు సార్థకము. నేను ప్రార్థించ తగిన నాయందలి యనుగ్రహము నిదియేయని ప్రార్థించిరి. ప్రపన్న జనకూటస్థులగు నమ్మాళ్వారును-

పా. కోలమలర్ప్పావైక్కన్బాగియ కోలప్పిరాన్ తమ్
తమర్ గళ్ తమర్ గళ్ తమర్ గళామ్
శదిరే వాయ్కక తమియేఱ్కే॥ (తిరు 8. ప 10 తి. 9 పా)

సుందరమగు పంచబాణములుగల మన్మథుని తండ్రియైన శ్రియః పతియొక్క పాప రహితులైన దాసులకు దాసులకు దాసులకు దాసుడగునట్టి పురుషార్థము ఒంటరిగానున్న నాకు ఫలించుగాక ! యని భగవంతుని ప్రార్థించిరి.

ఇట్టిదాస్యవృత్తికి ఫలమేమి? అయ్యో! మీరలంబరీషోపాఖ్యానమును వినలేదా? ఆ మహామహునకు-

ఉ॥ చిత్తంబుమధురిపు (శ్రీ) పాదములయంద
పలుకులు హరిగుణ పఠనమందు
కరములు విష్ణుమందిర మార్జనములంద
చెవులు మాధవ కథాశ్రవణమంద।
చూపులు గోవిందరూప వీక్షణమంద
శిరము కేశవ నమస్కృతులయంద
పదము లీశ్వరగేహ పరిసమర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద॥

తే. గీ. సంగమచ్యుత జనతను సంగమంద।
ప్రాణమసురారి భక్తాంఘ్రి కమలమంద
రసన తులసీదళములంద రతులపుణ్య
సంగతులయంద యారాజ చంద్రమునకు॥

ఇదియేగదా దాస్యవృత్తికి పూర్ణోదాహరణము. ఇట్టివానిని హింసించిన దుర్వాసుని గతి యేమయ్యె? భగవంతుని చక్రబారినుండి తప్పించుకొనుటకు తన తపశ్శక్తిగాదు గదా! చివరకు భగవచ్ఛక్తియు వ్యర్థమయ్యెను. భగవంతుడేమనెనో వినుడు.

ప॥ చలమున బుద్ధిశుంతులగు సాధులు నా హృదయంబు లీలతోం।
గిలిగొని పోవుచుందు రకిల్బిషభక్తిలతాచయంబునన్
నిలువగబట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్
వలలకుజిక్కి భక్తజనవత్సలతన్ జనుచుందు తాపసా॥

తాపసా! నేనేమి చేయుదును? గంగిరెద్దుగట్టబడినటుల భక్తులచే భక్తితో గట్టబడి వారెచ్చటి కెటులీడ్చుకొని పోయిన నటు పోవలసినవాడనే. ఇదిగోచూడుము,

ప॥ నా తేజము సాధులలో
నాతతమైయుండు, వారినలచు జనులకున్
హేతిక్రియ భీతినిచ్చున్
జేతో మోదంబుజెరచు సిద్ధముసుమ్మీ॥

కావున నిన్నును నన్నును గాపాడువాడా రాజచంద్రుడేగాన ఆతనినే ప్రార్థించి యీ యాపదనుండి తరింపుమని యుపదేశించెనుగదా దాస్యరసమును చవిచూచిన రసజ్ఞులితరఫలముల నపేక్షింతురా చూడుడు శూరేసులేమిసెలవిచ్చినారో.

శ్లో॥ భోగా ఇమే విధిశివాదిపదం చ కించ
స్వాత్మానుభూతి రితి యా కిల ముక్తి రుక్తా
సర్వం తదూషజలజోష మహం జుషేయ
హస్త్యద్రినాథ తవ దాస్యమహారసజ్ఞః॥ (వ. ర. స్త. ౭ శ్లో॥

హేవరదరాజప్రభో! నేను నీ యనుగ్రహముచే నీ దాస్యములోనున్న రసము నెఱింగినపిదప ఈ సాంసారిక భోగములను బ్రహ్మరుద్రేంద్రాద్యధికారములను ఆత్మానుభవరూపమగు కైవల్యముక్తినిన్ని చవిటినేలలోని ఉప్పునీటివలె అసహ్యముగా తలంచుచున్నానని వాటియందలి వైరాగ్యమును ప్రకటించిరి.

కేవలము భగవద్దాసులమని వాకొనినజాలదు. అందులకు తగిన సేవ చేయవలెను. కేవల సేవజేసినను చాలదు. ఆతని దాసులమని తెలుపుగుర్తుల ధరించవలెను. భార్యనాతు పతియేగతియని నమ్మి సేవలు గావించుచున్నను ఆమగని సంబంధమును సూచించు మట్టెలు మంగళసూత్రము పసుపు కుంకుమ మొదలగువాటిని విసర్జించిన లోకులేమందురు ఆగుర్తులున్నచో మరియొక రామెనాశించిరాదు. అట్లేమనము భగవంతుని చిహ్నలు ధరించిన దేవతాంతరముల పాలుగాము గవర్నరు, కలెక్టరు తహసిల్దారు మొదలగు ఉద్యోగుల నౌఖరులకాదుస్తులు ఆడవాల బిళ్ళలు మొదలైనవేల? కావున భగవత్సంబంధసూచకనుగు కొన్ని చిహ్నలు నిరంతరము శరీరమున ధరించవలెను. గెలిచినవాడు ఓడినవానికి తన చిహ్నములతో ముద్రించునాచారము గలదు. తన సంబంధమును సూచించు పేరుంచును. తనను పూజింప నియమించును. అట్లే మనమును ఆతని భృత్యులమని తెలియుటకు

శ్లో॥ తాపః పుణ్డ్రస్తథా నామ యాగో మన్త్రశ్చ పఞ్చమః।
అమీ చ పఞ్చసంస్కారాః పరమైకాంతిహేతవః॥

అను శాస్త్రానుసారముగ భగవంతుని యసాధారణ చిహ్నాలగు శంఖచక్రములతో లాంఛిత భుజస్కంధులము కావలెను. ఆయన శ్రీపాదముద్రికలను ఫాలమున ధరించవలెను. ఆయన దాసులమని పేరుంచుకొనవలెను. ఆయన నారాధించవలెను. ఆతనికసాధారణమైన మంత్రమును జపించవలెను. మీరెవరనిన వైష్ణవులము. విష్ణువునకు దగ్గరచుట్టములమని చెప్పికొనవలెను. అప్పుడుగదా విష్ణు సాయుజ్యము లభించును.

భాగవతమున అజామిళోపాఖ్యానములో యమవిష్ణుకింకరులకు జరిగిన సంవాదమునకు ఫలితముగా-

శ్లో॥ స్వపురుష మభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య
కర్ణమూలే పరిహార మధుసూదన ప్రపన్నాన్ ప్రభు రహ మన్య నృణాం న
వైష్ణవానామ్॥

యముడు తనదూతల చెవులతో నిట్లు చెప్పుచున్నాడు. ఓ భృత్యులారా! విష్ణుభక్తుల జోలికి పోకుడు. వారిపట్ల నా యధికారము చెల్లదు మనయధికార మితరులపట్లనేయని చెప్పగా వారు వారికి గుర్తేమియని యడిగినప్పుడు యముడు వారికి వారిగుర్తులు చెప్పుచు.

శ్లో॥ యే కణ్ఠలగ్న తులసీ నలినాక్షమాలాః
యే బాహుమూల పరిచిహ్నిత శఙ్ఖచక్రాః
యే వా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః
తే వైష్ణవాః భువన మాశు పవిత్రయన్తి॥

ఎవరి కంఠమున తులసిమాలయు, తామరపూసలమాలికయు నలరారుచుండునో, ఎవరి భుజములపై శంఖచక్రములు చిహ్నితమైయుండునో, ఎవరుఫాలమున శుభ్రోర్ధ్వ పుండ్రమును-ధరించియుందురో వారే వైష్ణవులు. వారే భూమిని పవిత్రవంతము గావించువారని చెప్పెను.

కావున శాస్త్రోక్తముగు భగవద్దాస్య సూచకములగు బాహ్య చిహ్నాలను దాల్చి ఆంతరమున నిశ్చల చిత్తముతో ఫలాంతరాశల వీడి భగవంతుని ధ్యానించుచు:-

శ్లో॥ విచిత్రా దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుం
పూర్వ మేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాది సంయుతా॥

అనినట్లు భగవంతుడు ప్రసాదించిన ఏకాదశేంద్రియములను ఇతరావయవములను.

# ★ వార్తామాల ★

[వెనుక సంచిక తరువాయి]

కాలు - చేయి లేకపోయినప్పటికిని 'నేనున్నాను' అను అనుభవము ద్వారా ఆత్మ యనునది వాటికి భిన్నమై ఉన్నదిగా తెలియవచ్చుచున్నందున హస్తపాదాద్యవయవములు ఆత్మకాజాలవు.

కండ్లు - చెవులు మున్నగునవి లేకపోయినను, ఆత్మ వాటికి భిన్నముగా తాను ఉన్నట్టుగా తెలియబడుచున్నందున ఇంద్రియము లేవియును కూడ ఆత్మ కాజాలవు. మనస్సు జడపదార్థముగాన అది ఆత్మకాజాలదు. ప్రాణమనగా అది వాయువిశేషమే గాని అదియు ఆత్మ కాజాలదు.

ఒక యింద్రియమునకేమైన కష్టము తటస్థించినచో దానితో పాటుగ తక్కిన యింద్రియములుకూడ కష్టపడుచుండుట అనుభవసిద్ధమైనదగుట వలన ఇంద్రియములలో ప్రత్యేక ప్రత్యేకముగ ఏ ఒక్కటియును కూడ ఆత్మ కాజాలదు

ఇంద్రియము లన్నిటియొక్క సముదాయము మొత్తముకలసి ఆత్మకాజాలవు. ఏల ననగా - ఇది నాకాలు. ఇది నాచేయి - ఇది నా శరీరము - ఇది నా కనుకూలముగా నున్నది- అది నాకు బాధగా నున్నది యని తాను అనుదానికి భిన్నముగా వీనిని అనుభవపూర్వకముగా పేర్కొనుచున్నాడు. మరియు తల్లిదండ్రులు తమ బిడ్డ చనిపోయినపుడు, అప్పటివరకు తాము ఎత్తుకొని గారాబముతో ముద్దిడుకొని లాలించి ఆదరించిన శరీరము, ఇప్పటికిని వెనుకటి వలెనే కంటికి కనుపించుచు ఎదుటనే యున్నప్పటికిని "అయ్యో పోయినావే - ఎచ్చటికి పోయినావు. మమ్ములను దుఃఖములో ముంచిపోయినావే" అనుచు వల వల ఏడ్చెదరు. ఆ శరీరమునకు శవ మని పేరు పెట్టెదరు, ఒక గంటసేపైనను ఆ శరీరమును తలవాకిటనైన యుండనీయరు. దానిని జూచుటకు బయపడెదరు. తాకినచో మైలపడితి మందురు. చూచిన దోషము పోవుటకై నెయ్యిని - నిప్పును గొనిపోయి స్నానముచేయుదురు. ఇంతవరకు పరిమళ చూర్ణములతోను చందనములతోను పట్టువస్త్రములతోను, బంగారు నగలతోను అలంకరించిన ఆ శరీరమునే మట్టిలో మరల పైకి తీయుటకు వీలులేకుండునటుల పూడ్చి పెట్టెదరు. అదె పెద్దలశరీరమైనచో బండెడు కట్టెలతో అరగంటకాలములో బూడిదచేసివేయుదురు. ఎంతటి యజ్ఞానులునుకూడ శవశరీరమును ఆత్మగా (తాను అనుపదార్థముగా) తలంచరు. అందుచే సముదాయాత్మకమైన శరీరము ఆత్మ కాజాలదు.

ఆత్మయున్నపుడు ప్రకాశించును. అది లేనపుడు ప్రకాశింపకుండగను యుండుటచే జ్ఞానము ఆత్మకాజాలదు. ఇదివరలో జేసియున్న పనిని గూర్చి యిపుడు స్మరించుకలుగుచుండుట చేతను, ఇకముందు చేయబోవుదానిని గురించి యిపుడాలోచించుట నిర్ణయించుట, ప్రయత్నించుట మున్నగువానిని జేయుచుండుట చేతను ఆత్మ క్షణికము కాదు. "నేను ఫలానా పనిని జేయుచున్నాను" "నేను తెలుసుకొనుచున్నాను." "నాకు తెలియుటలేదు" నాకు అజ్ఞానము లేదు" "నేను మరచిపోతిని"అని ఈ విధమైన ప్రతీతి యనుభవములున్నవిగాన జ్ఞానము ఆత్మ కాజాలదు.

ఆత్మ శరీరములో ప్రవేశించుటగాని, ఆత్మ శరీరమునుండి బయలుదేరి పోవునపుడు గాని ప్రక్కనుండు వారికెవరికిని కూడ తెలియరాదు గాన ఆత్మ విభువు కాదు.

గత జన్మమున పుణ్యము జేసితిమి గాన ఈ జన్మమున సుఖముగా నున్నాను. ఈ జన్మమున ఏమైన పుణ్యకర్మములను జేసితిమా రాబోవు జన్మమునకు సుఖముగా నుండగలము. అనుకొని అటుల జేయుచుండుట చేతను, ఈ శరీరమును వదలిన పిమ్మట స్వర్గాదుల ననుభవించుటకైగాను ఇపుడిచ్చట జ్యోతిష్టోమాది సాధనానుష్ఠానముల నవలంభించుటచేతను, ఆత్మ అనిత్యమైనది కాదు.

ఒకడు సుఖించుచుండగా మరివకడు అదే దేశమున, ఆ కాలముననే, అదేనిమిత్తముగ దుఃఖించుచుండును. ఒకడు కష్టపెట్టుటచే, మరి వకడు కష్ట మనుభవించుచుండును. గావున అందరిలోనుయుండు ఆత్మ వక్కటి ఎన్నటికిని కాజాలదు. ఆత్మలు పరస్పరము భిన్నమైనవై అనంతములైయున్నవి.

అప్పుడు పుట్టి చనిపోవు బిడ్డయొక్క యాత్మగాని, నూరు సంవత్సరములు బ్రతికి చనిపోవు ముసలివాని యాత్మగాని కనపడకపోవుటలోను, తెలియకపోవుటలోను సమానమే అయి యుండుటచే ఆత్మ పరిణామము కలదిగాదని తేలుచున్నది.

తనకు అనిష్టమైన దుఃఖమును పోగొట్టుకొనలేక పోవుటచేతను, ఇష్టమైన సుఖముల నన్నిటిని సమకూర్చుకొని యనుభవింప శక్తిగలది గాకపోవుటవలనను, తాను చేయదలచిన కార్యముల నన్నిటిని తన యిష్టానుసారముగా పూర్తిచేయ సమర్థమైనది గాకపోవుటచేతను ఆత్మ స్వతంత్రమైనది కాదు.

ఆత్మ కర్మకు పరతంత్రమైనది కాదు. ఏలననగా అకర్మము అచేతనము. ఆత్మ చేతనము. అందుచే కర్మయే ఆత్మకు పరతంత్రమగుచున్నది ఆత్మ సంపర్కములేనిచో ఏ క్రియయు జరుగదు.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
| --- | --- | --- | --- |
| 274 | శిపివిష్టః | శిపయో రశ్మయః ప్రోక్తాః<br>వ్యాప్య తేష్వపి వర్తనాత్<br>శిపివిష్ట స్సమాఖ్యాత<br>సూర్యేన్ద్వగ్న్యాది రూపవత్ | శిపులనగా కిరణములు. వాటియందంతటను వ్యాపించి సూర్యచంద్రాగ్న్యాదులవలె ప్రకాశించువాడు. |
| 275 | ప్రకాశనః | దివ్యరూపం దిదృక్షుభ్యః<br>పార్థాదిభ్యో విశేషతః<br>రూపం ప్రకాశయతియః<br>స ప్రకాశన ఈరితః | తన దివ్యరూపమును సేవించగోరునట్టి అర్జునాదులకు ముఖ్యముగానట్టి తన విశ్వరూపమును జూపువాడు. |
| 276 | ఓజ స్తేజోద్యుతిధరః<br>(ఓమ్ ఓజ స్తేజోద్యుతిధరాయ నమః) | అసాధారణ సామర్థ్యం<br>బలమోజః ప్రచక్షతే<br>పరాభిభవసామర్థ్యం<br>తేజశ్చ పరిపఠ్యతే<br>కీర్తిర్వాద్యుతి రాజ్ఞ్వాఖ్యం<br>తాని ధత్తే చయ స్సదా<br>ఓజ స్తేజోద్యుతి ధరో<br>హ్యేకనామ ప్రకీర్తితః॥ | 'ఓజస్సు' అనగా అసాధారణమైన బలము.<br>'తేజస్సు' అనగా శత్రువులను నిరశించుశక్తి.<br>'ద్యుతి' యనగా కీర్తి లేక కాంతి.<br>వీటిని సదా ధరించియుండువాడు.<br>ఇది ఓకేపేరుగా వాడబడవలెను. |
| 277 | ప్రకాశాత్మా<br>(ఓమ్ ప్రకాశాత్మనే నమః) | మూర్ఖై రపి సదా సమ్యక్<br>ప్రతిపన్న స్వభావవాన్<br>యస్సస్యాత్తు ప్రకాశాత్మా | మూర్ఖులుకూడ సర్వదా బాగుగనంగీకరించునట్లు ప్రకాశించు గొప్ప స్వభావము కలవాడు. |
| 278 | ప్రతాపనః | తీక్ష్ణభావః ప్రతాపనః | తన తేజస్సుచే లోకములనన్నిటిని తపింప జేయువాడు. |
| 279 | ఋద్ధః | పార్వణో జలధిర్యద్వత్<br>వృద్ధిమాన్ ఋద్ధ ఉచ్యతే | సర్వకాలములయందు పొంగెడు సముద్రమువలె నెల్లప్పుడును వృద్ధిగనుండువాడు. |
| 280 | స్పష్టాక్షరః | స్పష్టీకృతాశ్చ వేదార్థాః<br>యస్మాత్ స్పష్టాక్షరో మతః | వేదాక్షరములన్నియు సార్థకములగునటుల స్పష్టపరచినవాడు |
| 281 | మన్త్రః | తన్మంన్త్రం త్రాయత ఇతి | తనను పైవిధముగ ధ్యానించు వారలను రక్షించుచుండు |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 282 | చన్ద్రాంశుః | క్లిమహారి మహాహ్లాద<br>తేజస్కరతయాపిచ<br>మన్త్రాణా మేవచన్ద్రాంశుః<br>ఆహ్లాద ఫలదో మనుః | ఇట్లు నిరంతరము తనను మనస్సుచేయు భక్తుల శ్రమను బాపి మహానందమునొసంగు కాంతిపుంజము గలవాడు.<br>'ఓమ్ చన్ద్రాంశవేనమః' యని దీనిని మంత్రముగా నాదరించినచో మహానందము నొసంగును. |
| 283 | భాస్కరద్యుతిః | పరప్రభావాభిభవ<br>లక్షణ ద్యుతిమాంశ్చయః<br>సభాస్కరద్యుతిః ప్రోక్తో<br>నేత్రమాల్య దోషనుః | శత్రువుల ప్రభావము నరికట్టునట్టి సూర్యునికాంతివంటి కాంతి కలవాడు<br>'ఓమ్ భాస్కరద్యుతయేనమః' యని దీనిని మంత్రమువలె యాదరించినచో నేత్రములయందలి మాలిన్యమునుహరించును. |
| 284 | అమృతాంశూద్భవః | సర్వతాపహరస్యైవ<br>మృతసంజీవనస్యచ<br>అమృతాంశో హితజ్ఞత్వా<br>దమృతాంశూద్భవ స్స్మృతః | అందరి తాపములను హరించునట్టియు, చనిపోయిన ప్రాణులను బ్రతికించు శక్తి కలిగినట్టియు అమృత కిరణములు గల చంద్రుని కూడా తనమనస్సునుండియే పుట్టించువాడు. |
| 285 | భానుః | రవే సైజస్కరత్వాచ్చ<br>భాను రిత్యభిధీయతే | సూర్యునికూడ వెలుగొందించువాడు |
| 286 | శశబిన్దుః | శశః ప్లుతగతిః ప్రోక్తో<br>బిన్దు స్తస్య నివర్తకః<br>కౌటిల్య గతివిధ్వంసీ<br>శశబిన్దు పదాహ్వతః | శశమనగా అక్రమమైన నడవడిక. బిన్దువనగా దానిని మాపువాడు. కావున అన్యాయమార్గమున సంచరించువారి రూపును మాపువాడు. |
| 287 | సురేశ్వరః | ధర్మాబుజగతీనాం యః<br>స సురేశ్వర ఈరితః | దేవతలవలె సన్మార్గమున సంచరించు సత్పురుషులకు అండగ నుండువాడు. |
| 288 | ఔషధం | భవతీవ్రవిషం హర్తా<br>ఔషధం య స్సఉచ్యతే | సంసారమనెడు తీవ్రమైన విషమును హరించు మందు అగువాడు. |
| 289 | జగతస్సేతుః | నిరోధా జ్జగత స్సేతుః<br>సదసద్వర్గ సజ్జతేః | మంచిచెడ్డలు సంకరము గాకుండ తానొక గట్టువలె మధ్యనుండి యరికట్టుచుండువాడు. |

సాయంకాలము కొండక్రిందకు విచ్చేసి అనుష్ఠానము ముగించుకొని దేవస్థానమువారి కారులో బయలుదేరిరి. ఇంతలో శ్రీ కూర్మమునుండి శ్రీ స్వామివారిని వేంచేపు చేసుకొని వచ్చుటకై శ్రీమాన్. శ్రీభాష్యం రాఘవాచార్యులుగారు శ్రీమాన్. మంగురాఘవరావుగారు, ప్రత్యేకముగా కారుతీసుకొని సింహాచలమునకు వచ్చిరి. అయినను సింహాచలము దేవస్థానమువారు అత్యంతభక్తివిశ్వాసములతో పంపిన మోటారుమీదనే శ్రీ స్వామివారు శ్రీకాకుళము విచ్చేసిరి.

## శ్రీ కాకుళము

శ్రీకాకుళములో శ్రీమాన్ న్యాపతి బాలకృష్ణమూర్తి పంతులుగారు (అడ్వొకేటు) శ్రీ స్వామివారికి చక్కని స్వాగతమిచ్చి తమసౌధమున విడిదిచేయించిరి. ఆ మరునాడంతయు శ్రీకాకుళములోనేయుండి శ్రీ సీతారామస్వామివారి సన్నిధికేగి శ్రీ పెరుమాళ్ళకు మంగళాశాసనము చేసి మరునాడుదయమునకు శ్రీకూర్మము విచ్చేసిరి.

## శ్రీ కూర్మము

శ్రీ కూర్మములో ఆబాలగోపాలము శ్రీ స్వామివారి రాకకు పరమానంద భరితులై గ్రామకంఠమువరకు దారితోరణాల మొదలగు అలయ లాంఛనములతో గౌరవపూర్వకముగా స్వాగతమిచ్చిరి.

## శ్రీ భగవద్రామానుజ తిరునక్షత్రోత్సవము

శ్రీ కూర్మములో 27—4—60 వ తేది నుండి శ్రీ ఉడయవరుల తిరునక్షత్రమహోత్సవము ఆరంభమైనది. పరిసరగ్రామములనుండి పెక్కురు విద్వాంసులు, విదుషీమణులు విచ్చేసిరి. నాలాయిరము, శ్రీభాష్యము, భగవద్విషయము, శ్రీమద్రామాయణము, శ్రీవిష్ణుపురాణము, గీతాభాష్యము మొదలగు పారాయణములు అతివిలక్షణముగా జరుపబడెను. ఈ తిరునక్షత్రోత్సవమును శ్రీ కూర్మవాస్తవ్యులు అఖండలక్ష్మీసంపన్నులును, పరమవిలక్షణమైన కైంకర్యశ్రీగల శ్రీమాన్. శ్రీ భాష్యం రామానుజాచార్యులవారు, వీరి సోదరులు శ్రీమాన్. శ్రీభాష్యం కూర్మాచార్యస్వామివారు, వీరుభయులు అత్యంత శ్రద్ధా భక్తులతో వైదికముగా, పండిత సభలతో, పారాయణలతో తీర్థ ప్రసాద గోష్ఠులతో అఖండ తదీయారాధనలతో పండిత సత్కారములతో పూర్తిగావించిరి. పిమ్మట

## అంపలాం

శ్రీ జియ్యర్ స్వామివారు తమ పరివారముతో 28—4—60 వ తేది అంపలాం అను గ్రామమున క్రొత్తగా నిర్మింపబడిన శ్రీ ప్రసన్న సీతారామస్వామివారి దేవాలయ ప్రతిష్ఠా మహోత్సవమునకు కార్యకర్తలచే ప్రార్థింపబడి మోటారుపై నాటిరాత్రికి వేంచేసిరి. మరునాడు శ్రీ స్వామివారు ఆ కార్యకర్తల కుటుంబమునకు పంచసంస్కారములను ప్రసాదించి పరమవైదికముగా ప్రతిష్ఠాకార్యక్రమమును పూర్తిగావించి నాటి సాయంకాలమునకు తిరిగి శ్రీకూర్మమునకు విచ్చేసిరి.

## వైశాఖమాస పండిత సభలు

శ్రీ కూర్మములో శ్రీ కూర్మనాథస్వామివారి ఆలయమందు శ్రీ భగవద్రామానుజులవారి సన్నిధి ప్రాంగణమందు శ్రీ జియ్యరుస్వామివారి అధ్యక్షతక్రింద 30—4—60 వ తేది మొదలు 3 రోజులు పండిత సభలుమహా వైభవముగా జరిగినవి. ఆ మూడుదినములు శ్రీమాన్. ఉ. వే. న్యాయవేదాన్త విద్వాన్. తె. కం. గోపాలాచార్య

పిమ్మట, తీర్థప్రసాదగోష్ఠులు, అఖండదీపారాధనలు, ఋత్విగ్దక్షిణలు, పండితసత్కారములు, బీదలకు అన్న సంతర్పణలు సంతృప్తికరముగా జరిగినవి.

మరియు ఈ ప్రతిష్ఠామహోత్సవ సందర్భమున, శ్రీకూర్మ దేవస్థాన వంశపరంపరా ట్రస్టీలైన శ్రీ శ్రీ శ్రీ విజయ రామరాజగజపతి మహారాజా (విజయనగరం) వారి ప్రతినిధిగా ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు పాల్గొని కార్యక్రమమును పర్యవేక్షించిరి.

మరియు కొత్తూరు గ్రామ వాస్తవ్యురాలగు లోగిడ ఆండాళ్ ఉత్సవవిగ్రహమును ప్రతిష్ఠించిన శ్రీ కింతలి మహాలక్ష్మమ్మ అధ్యయనోత్సవ కార్యక్రమమునకు రు. 316/లు సమర్పించెను. శ్రియఃపతి వీరలందరకు సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక.

మరునాడు 4—5—60 వ తేది శ్రీస్వామివారు తమ పరివారముతో అంపలాం గ్రామమునకు వేంచేసి శ్రీ ప్రసన్నసీతారామ స్వామివారి సన్నిధిని దివ్యస్థలము గావించిరి ఈ సందర్భములో దేవస్థానం ధర్మకర్త శ్రీ నల్లా రాజారావు నాయుడుగారు శ్రీస్వామివారికి ఆచార్యకాట్నముగా రు. 116/లు సమర్పించిరి ఈ సన్నిధిని దివ్యస్థలముగావించుటకు ప్రధాన కృషిగావించినవారు కళింగపట్టణ వాస్తవ్యులగు శ్రీమాన్. మహేంద్రాడ వెంకట రామ నరసింహాచార్యస్వామివారు వీరి సత్సంకల్పముచేతను ధర్మకర్తలత్యాగముచేతను ఈ సన్నిధి ప్రసన్నస్థలమైనది. పిమ్మట, నాలాయరాధ్యాపక స్వాములకు పారాయణపరులకు శ్రీరాజారావు నాయుడుగారు తృప్తిగా సన్మానించిరి. ఈ సమయములో మనసంఘ కవిగారు ఈ శ్లోకములను రచించిరి.

శ్లో॥ విశిష్టాద్వైత సిద్ధాంత సంస్థాపన ధురంధరైః।
శ్రీమన్నారాయణాచార్య రామానుజయతీశ్వరైః॥

శ్లో॥ శ్రీమచ్ఛార్వరివైశాఖే। శుక్లపక్షేఽష్టమీతిథౌ।
దివ్యదేశీకృతస్సోఽయ మాలయో వర్ధతాంసదా॥

అచ్చటనుండి బయలుదేరి నరసన్నపేటమీదుగా శ్రీకాకుళమువిచ్చేసి రాత్రికి శ్రీకూర్మము విచ్చేసిరి.
శ్రీ కూర్మమునుండి శ్రీమాన్. తె. కం. గోపాలాచార్యస్వామివారు గీతాకాలక్షేపముల నిమిత్తమై బందరు వేంచేసిరి.

## శ్రీ కూర్మములో - తిరుమంత్రార్థ కాలక్షేపము

6—5—60 వ తేదీనుండి ఉదయం గం॥ 7-0 ల మొదలు శ్రీ జీయ్యర్‌స్వామివారు, శ్రీకూర్మనాథ సన్నిధిలో గం॥ 9-0 ల వరకు తిరుమంత్రార్థకాలక్షేపము ప్రారంభించి జరుపుచున్నారు.

శ్రీ యాదగిరిలో జరిగిన

గాయత్రీ క్రతు విరాళముల

# జమా ఖర్చు లస్టేటుమెంటు

## జమలు

### హైదరాబాదు వారి వలన

| | |
|---|---|
| సరుకుల రూపంగా | 2594-00 |
| నగదుగా వచ్చినది | 2669-00 |
| | 5263-00 |

### సికిందరాబాదు వారి వలన

| | |
|---|---|
| సరుకుల రూపముగా | 610-00 |
| నగదు రూపముగా | 2940-75 |
| | 3550-75 |

### భువనగిరి వారి వలన

| | |
|---|---|
| సరుకుల రూపముగా | 605-12 |
| నగదు రూపముగా | 2000-00 |
| | 2605-12 |

### యాదగిరి వారి వలన

| | |
|---|---|
| సరుకుల రూపముగా | 1145-62 |
| నగదు రూపముగా | 5076-00 |
| | 6221-62 |

### వరంగల్లు వారి వలన

| | |
|---|---|
| సరుకుల రూపముగా | 320-00 |
| నగదు రూపముగా | 519-00 |
| | 839-00 |

(ఇంతియేగాక వీరి సామగ్రిని సమర్పించిరి, ఆవస్తువుల జాబితా రావలసియున్నది).

### ఇతర గ్రామముల నుండి

| | |
|---|---|
| సరుకుల రూపముగా | 759-00 |
| నగదు రూపముగా | 2666-88 |
| | 3425-88 |

| | |
|---|---|
| క్రాటోవరు | 21905-37 |
| చిల్లరగా వచ్చినవి | 589-00 |
| హారతిలో జమ | 10-37 |
| దిబ్బీవసూలు | 105-52 |
| మిగిలిన సామానుల అమ్మకం | 650-00 |
| జీయర్ స్వామి భిక్షవలన | 1459-35 |
| మొత్తము జమ | 24719-61 |

## ఖర్చులు

| | |
|---|---|
| ప్రయాణాదులకు | 982-20 |
| దక్షిణలు సన్మానములకు | 9763-85 |
| పందిళ్ళు, అలంకారములు వగైరాలకు | 16 9-73 |
| అచ్చునకు - ప్రచురణకు | 882-00 |
| తపాలా ఖర్చులు | 348-08 |
| తదీయారాధనకు | 9005-52 |
| యాగ సంభారములకు | 2766-32 |
| మొత్తం ఖర్చు | 25351-85 |

వచ్చిన జమకంటెను అధికమైన ఖర్చు రు. 632 24 లు మాత్రము.

సూచన :- ఈ జమాఖర్చులన్నియును శ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిచే వోచర్లతో సరిచూడబడినది. శ్రీ జీయర్ స్వామివారి యనుజ్ఞతో ఇది ప్రచురింపబడినది,

ఇట్లు

కార్యదర్శులు

తె. కం. గోపాలాచార్యులు,

గుదిమెళ్ళ రామానుజాచార్యులు.

# బాల విభాగము

శ్రీమతే రామానుజాయ నమః

వైష్ణవులైనవారందరికిని కూడ ఆంతరంగిక సద్గుణములతోపాటుగ బాహ్యమైన (గుణములు) చిహ్నాలు కూడ కొన్ని అత్యంతావసరమై యున్నవి, ఆంతరంగిక ఆధ్యాత్మిక గుణములు అస్తిత్వమును గూర్చి ఎవరినుటుకు వారికే తెలియవలయును. ఒక్కొక్కప్పుడు తమతమ ఆంతరిక ఆధ్యాత్మిక గుణములను గురించి తమకే తెలియక తదితర లక్షణములను బట్టి తామె ఊహించి తెలుసుకొనవలసి యుండునుకూడ, అట్టిస్థితిలో యితరులకు గానిని తెలుసుకొనుట అత్యంతము దుర్లభముకదా. అందుచే వైష్ణవుని బాహ్యమైన లక్షణములను బట్టిమాత్రమె తెలుసుకొనుటకు, నిర్ణయించుటకును అవకాశమున్నది. మరియు బాహ్యలక్షణములే సామాన్యముగ అంతరంగిక గుణములను కూడ ప్రకాశింపజేయును. ఒకప్పుడు ఆంతరంగిక గుణము లేవియు లేకుండగ కేవలము నాటకములందు వేషముల వలే, కేవలము డాంబికము కొరకో దర్పము కొరకో కీర్తిప్రతిష్టలకొరకో, మోసము కొరకో, ఎదో ఒక ఉద్దేశముతో మాత్రమే బాహ్యవేషభాషలను ధరించినను అట్టివియును కూడ వ్యర్థములనుటకు వలను పడదు, ఆ బాహ్యవేషభాషలే క్రమముగా ఆంతరంగిక అధ్యాత్మ గుణములరవడుటకు బీజములవలె కారణభూతములు కాగలవు. అంతియే గాకుండగ దుష్ట నడవడులనుండి ఈ బాహ్యవేషభాషలు వీనిని నిషేధించును. మరియు రక్షించును. ఆంతరంగిక అధ్యాత్మిక సద్గుణములు గలవానికి కలుగు సత్ఫలితములను కొంతవరకు సమకూర్చునుకూడ.

ఎటులననగా :- ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరించి, సప్తపంజల బట్టకట్టి, మెడలో తులసీతావళములు పవిత్రములు ధరించిన వ్యక్తి ఆ వేషభాషలలో బహిరంగముగ కల్లుగడిలో దూరగలడా ? ఒకవేళ తాను దూరినను అచ్చటనున్న యితర త్రాగుబోతులు కాని, చివరకు మద్యమును విక్రయించు దుకాణదారుడు గాని ఆ వ్యక్తిని నిషేధించకుండగను, వీలైనంత త్వరలో బయటకు పంపివేయకుండగను ఉండగలడా ? ఊర్ధ్వపుండ్రధారియైన వ్యక్తి ఏ బండివానితోనో ఒక కాని లేక అర్థణాకై అబద్ధమాడినను, ఏ కూరగాయలవానివద్దనో ఒకటి రెండు కూరగాయలను కొసరుగ దొంగతనమున తీసుకున్నను వెంటనే ఆ బండివాడో, ఆ కూరగాయల వర్తకుడో 'ఏమయ్యా, మొగము నిండా యింతింత పట్టెవర్ధనాలు పెట్టావు. ఇలా అబద్ధములాడెదవేల ? ఇలా దొంగతనము చేసెదవేల ? అని అనును. అనగా మొగమున నూర్ధ్వపుండ్రములు ధరించినవాడు సాత్త్వికుడై, అబద్ధములాడని, దొంగతనము చేయని పెద్ద మనిషియై యుండునని లోకములో నిశ్చయమైన ప్రతీతి గలదన్నమాటగదా.

ఇందులకుదాహరణగ జరిగిన కొన్ని సంఘటనల తెలిపెద

ఒక పల్లెవాడు వక నది యొడ్డున బియ్యమును జల్లి వలవేసి పక్షులకై జూచుచుండెను. ఎంతసేపటికిని వీని వద్దకు ఒకపక్షికూడ రాదు. గాని ఆ సమీపమునందే యిసుకపర్రపై ఒకసాధువు ద్వాదశోర్ధ్వపుండ్రధారియై కండ్లు మూసుకొని జపము చేసుకొనుచుండును. వాని చుట్టును వందలకొలది పక్షులు నిర్భయముగ వ్రాలి తిరుగుచుండెను. ఆహారమిడినను తనవద్దకు పక్షులు చేరకుండుటకును, ఆహారమిడకపోయినను ఆ సాధువు వద్దకు పక్షులు నిర్భయముగా చేరి తిరుగుచుండుటకును కారణమేమని ఆ పల్లెవాడాలోచించెను. ఆ సాధువు ధరించిన ఊర్ధ్వపుండ్రములపై నీతని దృష్టిపడి ఇవియే ఆ పక్షుల నాకర్షించుటలో కారణములేమో చూతమని అతనికి తోచెను. వెంటనే ఆపల్లెవాడు కూడా ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించి వచ్చెను ఆ బాహ్యవేషముచే పక్షులు అతనిని కూడ సాధువుగ విశ్వసించి, అతని దరికి జేరెను. వెంటనే అవి పల్లెవానివలలో చిక్కుపడి వలవల ఏడ్చెను. ఈ సంఘటనను జూచుటతోడనే పల్లెవాని మనస్సు మారెను. కేవలము మోసగించి పక్షులను హింసించు నుద్దేశముతో వేసిన ఈ బాహ్యవేషము వలననే

పక్షులవంటి అజ్ఞానజంతువులే మనయందు యింత విశ్వాసమును కలవైనవియె. నిజముగా సదుద్దేశముతో మనము ఈ బాహ్యవేషమును ధరించినచో ఈ జన్మలోనే భగవత్కటాక్షపాత్రులము కాజాలమా భగవంతుడు కూడ మన మనస్సును వలలో (బాహ్యదర్శనమునకై కళ్ళలోనికి ఏగిరిరాడా ? అందు గట్టిగా చిక్కుకొనడా ? అని వానికి తోచి ఆవలను విప్పి పక్షులను వదలివేసి వలను నదిలో పారవేసి ఆ సాధువువద్దకు వెళ్ళి నమస్కరించి జరిగిన వృత్తాంతము నంతను నివేదించెను. ఆ సాధువు వాని మార్పునకు సంతసించి వానిని శిష్యునిగ స్వీకరించి దిద్దుబాటు జేసెను. పల్లెవాడు నిజమైన వైష్ణవదీక్షగలవాడై తరించెను.

ఇట్టిదియె మరియొక సంఘటన :-

ఒక మంచి గజదొంగ ఒక గ్రామములో ఒక జమిందారు నింటిలో దొంగతనమును జేయ సమకట్టెను. ఈ గజదొంగ మంచి యవ్వనములో నుండెను సుందరరూపుడు, చాల అందమైనవాడు. ఇతను ఆ జమీందారుని యింటి గుట్టును సమగ్రముగ తెలుసుకొనుటకై ఒక సాధువు వేషమును ధరించి ద్వాదశోర్ధ్వపుండ్రములు, మెడలో తులసిమాలికలు మున్నగువానిని ధరించి ఆ జమీందారుని తోటలో తిష్ఠవేసెను ఆ జమీందారునికి ఒక్క కుమార్తె మాత్రమే కలదు. అతనికి చాల ఆస్తిగలదు. జమీందారుడు గృహస్థుడు - లౌకికవ్యవహారియె అయినను మంచి జ్ఞాన - భక్తి - వైరాగ్యములు గలవాడు. అందుచే తన కుమార్తెకు కూడ ఎంతబీదవాడైనను సరియె మంచిజ్ఞాన భక్తివైరాగ్యములు గల వరునికిచ్చి వివాహముచేసి తన యాస్తినంతను వారికిచ్చివేయుదలచి వరునికై వెదకుచుండెను. కుమార్తె చాల పెద్దదైనదేగాని తగిన వరుడు మాత్రం ఇంతవరకు జమీందారునికి లభించలేదు.

ఇంటి గుట్టునంతను బాగుగ తెలుసుకున్న తరువాత ఆ గజదొంగ ఒకనాటిరాత్రి ఆ జమీందారుని యింటిలో దొంగతనమునకై ప్రవేశించి వారి పడకగదికి ప్రక్కగదిలోనికి ప్రవేశించెను. ఈ అలికిడికి జమీందారునికి ఆయన భార్యకు మెలుకువ గలిగినది. దొంగసంగతి వారికి తెలియదు. ఏదో పిల్లియో ఎలుకయో అలికిడి చేసెనను కొనిరి. తిరిగి నిద్రవచ్చువరకు వారిద్దరును ఏవో మాట్లాడుకొనుచు చివరకు కుమార్తె వివాహవిషయమును మాట్లాడు కొన జొచ్చిరి. జమీందారుని భార్య కుమార్తెవివాహవిషయమై జమీందారుని హెచ్చరించుచు తొందరపెట్టెను. అందులకు జమీందారుడు మన తోటలో నివసిస్తున్న బొట్టుపెట్టుకొనియున్న సాధువును ప్రతిమాలి అతనికి మన కుమార్తె నిచ్చి వివాహము చేయుదమని భార్యను వప్పించెను. ఈ సంభాషణను అవతలగదినుండి వినుచున్న గజ దొంగకు చాల ఆశ్చర్యము కలిగెను. కేవలము దొంగతనమునకై యింటిగుట్టును కనిపెట్టుటకై వేసుకున్న ఈ పట్టి వర్ధనముల వేషమునకు యింత మహాత్మ్యమున్నదా ? ఈ మోసమైన వేషమునకే జమీందారు దంపతులు నిజముగా నన్ను సత్పురుషునిగ నమ్మినారా ? ఈ వేషమును వేసుకున్నంత మాత్రముననే తమ ముద్దుకూతురును, మూడు లక్షల రూపాయల మూటతో కూడ నాకు సమర్పింతురా ? నన్ను విష్ణుస్వరూపునిగ తలంచి నా కాళ్ళుకడిగి తమ తలపై జల్లుకొందురా ? అని ఆశ్చర్యపడుచు, మరియు జమీందారు దంపతులు మేలుకొని యుండుటచే ముందుకు వెళ్ళజాలక తిన్నగ తోటలోనికి వెళ్ళి ఎప్పటివలెనే సాధువేషము వేసుకొని కూర్చుండెను

ఆ మర్నాడు జమీందారు దంపతులు నిజముగనే సాధువువద్దకు వచ్చి తమ కుమార్తెను వివాహమాడమని ప్రతిమాలిరి. సాధువు మొదట బెట్టుసరిచేసి చివరికి అంగీకరించెను వివాహము జరుగుటకు ప్రారంభమాయెను. వధూ వరులు పెండ్లిపీటలమీద కూర్చొనిరి. పిదప ఈ గజదొంగకు జరుగుచున్న అద్భుతసంఘటనలచే కలిగిన ఆశ్చర్యముచే ఉండబట్టజాలకపోయెను తాను గజదొంగననియు, దొంగతనమునకై ఈ సాధువువేషమును వేసితినేగాని నిజమైన సాధువునుగాననియు, అయినను ఈ అద్భుత సంఘటనచే తన మనస్సు మారినదనియు, ఇకమీద తాను దొంగతన మును చేయననియు, దొంగతనమునకై మోసబుద్ధితో వేసిన దొంగసాధువేషమె తనను నిజమైన సాధువుగ మార్చి వేసినదనియు, తనకీ వివాహము వలదనియు జెప్పివేసెను. జమీందారు దంపతులు అతనియొక్క నిజమైన మార్పు నకు, సత్యశీలతకు సంతసించి అతనిని ప్రతిమాలుకొని ఎట్టకేలకు వప్పించి అతనికి తమ కుమార్తెను, ఆస్తినంతను సమర్పించివైచిరి.

చూచితిరా, బాహ్యవేషములవలనకూడ ఎట్టిప్రయోజనములు సమకూరగలవో తెలుసుకొంటిరా. కేవలము బాహ్యవేషములు అనవసరములు నిష్ప్రయోజనములు అనరాదు. అవియును కూడ క్రమముగా అంతరంగిక ఆధ్యాత్మ గుణములను కలిగించగలవు. నాటకములో కేవలము వేషములు వేసినవారలకు కూడ ఆ వేషానుగుణమైన అంతరంగిక ఆధ్యాత్మికగుణములు లేకపోయినప్పటికిని తాత్కాలికముగ ద్రవ్యలాభము - కీర్తిప్రతిష్ఠలు కలుగుటలేదా ? అంత మాత్రమె కాదు. ఆ వేషములు - ఆ నటనలు - ఆ సంభాషణలు - ఆ సంఘటనలు సంస్కారరూపమొంది వాసనా రూపముగ నుండి కాలాంతరమున మనస్సును పరిపక్వస్థితికి తెచ్చి తప్పక ఫలించితీరును. వేషములో నున్నంతసేపును, నటించుచున్నంతసేపును వాని భావమున కలిగిన మార్పు సంస్కారరూప బీజములగును. అవియే కొంతకాలమునకు ఉద్బుద్ధములై బలీయములై ఫలించగలవు. ఇది కేవలము వేషధారుల సంగతిమాత్రమె.

అయినను అందరియొక్క బాహ్యచిహ్నములను కేవల వేషమని ఎంచరాదు - ఎవరికైతే మనస్సు పరిపక్వ స్థితిని చెందినదో, ఎవరికైతే అంతరంగిక ఆధ్యాత్మికగుణములు స్వభావతః గలవో, అట్టివారికి స్వతఃగానే బాహ్య చిహ్నములు ధరించుటకూడ సంభవించును. మనస్సు పరిపక్వమైన పిమ్మట, నిజముగ అంతరంగిక ఆధ్యాత్మగుణము లున్న తరువాత బాహ్యచిహ్నాలు లేకుండగ యుండుట ఎన్నడును తటస్థించదు. కొందరు బాహ్యచిహ్నాలు లేని వారు తమకు మనస్సు పరిపక్వమైనదనియు, అంతరంగిక ఆధ్యాత్మ గుణములు గలవనియు అందురు అనుకొందురు. అది చాల పొరపాటు అట్టివారు తాము మోసపోవుటయు, మరియు లోకమును మోసపుచ్చుటయు చేయుచున్నా రనుట నిస్సందేహము.

అరటికాయ పరిపక్వస్థితిని చెందినచో దానికి రంగు, రుచి, వాసన బయటకు స్ఫురింపక మానదు. తొక్క కును లోపలి గుజ్జునకు గల పట్టువిడివడుట తప్పదు- పరిపక్వమును గాని అరటికాయను కూడ మాగవేసియో, ఊదర గొట్టియో, బ్రాగపెట్టియో ఎండలోపెట్టియో పైకి రంగుగలదానిగ జూపవచ్చును, దానివల్ల ప్రయోజన మేమని ప్రశ్నించవచ్చును.

నిజమాలోచించినచో అట్టిదానివలన కూడ ప్రయోజనమున్నది. విలువ హెచ్చును. పండువలన నిర్వర్తించ వలసిన పనులు కొన్ని నెరవేరును. కేవలము పచ్చికాయ కాయలోనున్నదోషములు కొన్ని పోవును. కొన్ని సుగుణ ములు తప్పక కలిగి తీరును. ఇంతకును కొద్దిరోజులలో స్వతః రంగు రుచి రాగల యోగ్యత గల కాయలు మాత్రమే ఎండలో పెట్టుట, ఊదరగొట్టుట వగైరాదోహదక్రియలు వలన స్వతః రావలసిన కాలము కంటె ముందుగ రంగు రుచి వగైరాలను పొందగలవు. గాని అసలు అట్టి రంగు రుచి వచ్చుటకు యోగ్యతలేని కాయలకు ఎన్నిదోహద ములు చేసినను ఏమాత్రము ప్రయోజన ముండదు కదా. అటులనే ఇంకా కొంతకాలమునకు మనస్సు పరిపక్వమై నిజమైన అంతరంగిక గుణములు కూడ అలవడుటకు అవకాశమున్న వ్యక్తికి మాత్రమే ఏకారణముచేతనైతేనేమి ఏప్రయోజనము కొరకునైతేనేమి, ఈ బాహ్యచిహ్నముల ధారణయందు ఉద్దేశము. రుచి, కలుగునేగాని కేవలము ఇట్టి ఆధ్యాత్మిక అంతరంగిక గుణముల యందు విముఖత్వముగాని వ్యతిరేకతను, గల వ్యక్తికి ఎన్నటికిని కూడ ఏ విధ ముగనైనను కూడ బాహ్యచిహ్నముల ధరించుటలో ఆసక్తిగాని అనుష్టానముగాని కలుగజాలదు.

ఇటుల చెప్పినంత మాత్రమున కేవలము బాహ్యచిహ్నములే చాలుననియు, అంతరంగిక ఆధ్యాత్మిక గుణము లుండవలెనను విషయమై మాకు ఆసక్తి లేదనియు ఎవరును తలంచరాదు.

కేవలము అంతరంగిక, ఆధ్యాత్మిక గుణములు మాత్రమె చాలును బాహ్యచిహ్నము లెంతమాత్రము అవస రము లేదని గాని, బాహ్యచిహ్నములు కేవలము బూటకములు, పరిహాస్యాస్పదములు - నిరర్థకములు అని గాని అనకూడదని తెలుపుట మాత్రమే మా ఉద్దేశము.

ఏతావతా తేలిన సారాంశ మేమనగా - శ్రీవైష్ణవులకు బాహ్యచిహ్నములు తప్పక అవసరమైనవి. వాటిని అందరును తప్పక ధరించవలెను. శ్రీ వైష్ణవ బాహ్యచిహ్నములలో ప్రధానమైనవి. "కట్టు - బొట్టు-జుట్టు." అనునవి - ఇవి ఆయా వర్ణాశ్రమముల ననుసరించి నిర్ణీతమైయున్నవి. ఇందులో బ్రాహ్మణ గృహస్థులు ధరించవలసిన వాటిని గురించి విచారింతము -

బట్టకట్టు :- బ్రాహ్మణ గృహస్థులైన శ్రీవైష్ణవులు - సప్తపించర్లతో పంచను (అంగవస్త్రమును) కట్టుకొనవలెను. గాని ఈ కాలములో చాలమంది లాగూలనో, లేక గూడకట్టులనో లేక వారగోచిలనో ధరింతురు, ఏ బాల్యమునందో లేక ఏ తప్పనిసరియగు బానిసవృత్తిలో నున్నపుడు లాగూలను, సరిగా పంచకట్టుకొని తిరుగుటకు వీలుపడని అనారోగ్యస్థితిలో నున్నపుడు గూడకట్టులనో, బోదకాలో, ఇతరులేవగించుకొను ఏ మచ్చలో - వ్రణములో కలిగియున్నపుడు వారగోచిలనో ధరించుటలో ఏమైన సబబు ఉండవచ్చునేమోగాని హిందువులై పెద్దవారై, గృహస్థులై స్వతంత్రవృత్తిలోనో, నిర్బంధరహితవృత్తిలోనో, లేక వైదిక ప్రవృత్తిలోనో యున్నవారు కూడ ఈ కిరస్తాని పద్ధతిగ ఈ తురకరీతిగ - లాగూలను ధరించుటేలనో, ఇదేమి నాగరికతయో, ఇదేమి సౌకర్యమో, ఇదేమి సౌందర్యమో బోధపడుటలేదు.

స్త్రీలు గోచిపెట్టుకొనియో లేక కచ్చా వేసుకొనియో బట్టకట్టుకొనుట నాగరికతయు, సౌందర్యమున్ను, గౌరవమున్ను, సౌఖర్యమున్ను అయి యున్నదే గాని కేవలము గూడకట్టు కట్టుకొనుట అనాగరికతను, అసభ్యతను, ఏబ్రాసితనము, బద్ధకమును వెల్లడించుకొనుటకు చిహ్నమైయున్నది.

మొగమున బొట్టు :- ఇదేమి పాపమో, ఇపుడు ముఖమున తిరుమణి శ్రీ చూర్ణరేఖలను ధరించుట స్త్రీపురుషాదులలో పూర్తిగ నశించుచున్నది బొట్టులేని ముఖము స్మశానసమానమై, అమంగళకరమైనది. హిందువులమై యుండి, ఆస్తికులమై యుండి, కర్మభూమియగు భారతదేశ సంజనితులమై యుండి, మహాత్ములైన ఋషిసంతతులమై యుండి, పరాపరతత్త్వజ్ఞులైన ఆళ్వారుల ఆచార్యుల అనుయాయులమై యుండి ఇటుల పురుషులు శూన్యలలాటములతోనో, లేక కేవల శ్రీచూర్ణరేఖతోనో యుండుటయున్ను:

స్త్రీలు శక్తిపూజాధురంధరులవలె రంగు రంగు కుంకుమ పేరుతో బాసించు చూర్ణములనో లేక అశౌచ సూచకమగు నల్లబొట్టునో ధరించుట మాత్రమున్ను వారి వారి దౌర్భాగ్యస్థితిని మాత్రమె ప్రకాశింపజేయుచున్నది.

పురుషులు చక్కగా ఊర్ధ్వపుండ్రముగ తిరుమణి - శ్రీ చూర్ణములను; స్త్రీలు చక్కగా తిరుమణిని అర్ధచంద్రరేఖాకృతిగను, శ్రీచూర్ణమును గుమ్మడిగింజవలెనో లేక నిడివిగనో ధరించుట న్యాయము. సశాస్త్రీయమున్ను అయియున్నది. లోకమర్యాదరీత్యా కూడ యిటుల బొట్టుధరించుటచే సాంఘికగౌరవము, ముఖవర్చస్సు, యశస్సు - ప్రతిష్ఠలు - ముఖమందుగల యిడ - పింగళ - సుషుమ్న అను నాడులకు వికాసపుష్టి - బలము - తద్వారా జ్ఞానాభివృద్ధియు - ఇటువంటి ప్రయోజనము లెన్నియో సమకూరును.

కొంతమంది దుష్టులగు లోకులు ఆక్షేపింతురు-పరిహసింతురు-అందురా? ఆ మాటకూడ నిజమె గాని అట్టిదెపుడు తటస్థించుననగా ఏ వకరిద్దరు మాత్రమె ధరించినపుడున్ను, ఆక్షేపించు దుష్టులతో అధిక సహవాసమో విరోధమో కలిగియుండునపుడును, వేషమునకు వ్యతిరేకమగు భాషగాని చేష్టగాని కలిగియుండునపుడును, కేవలము దుష్టప్రవృత్తి మోసము కలిగియున్నపుడు మాత్రమె ఆక్షేపణలు, పరిహాసములు తటస్థించును పదిమందియు బొట్టును ధరించినపుడు గాని లేక సద్బుద్ధితో ధరించినపుడు గాని సత్ప్రవర్తన కలిగియున్నపుడు గాని స్వధర్మాచరణదీక్షయు - స్వసాంప్రదాయాసక్తియు - శిష్టాచారపట్టుదలయు కలిగియున్నపుడు గాని ఎంత దుష్టుడైనను ఆక్షేపించడు, పరిహసించడు. సరిగదా ప్రత్యుత గౌరవించును కూడ

నాటకములలో వేషములను వేయునపుడు కూడ సాత్త్వికవేషమునో లేక భక్తుని వేషమునో, వేయవలసి వచ్చినపుడు మొగమున తిరుమణి శ్రీచూర్ణములతో బొట్టును పెట్టెదరు గదా. దీని తాత్పర్యమేమి. ఈ ఊర్ధ్వపుండ్రము. సాత్త్వికతకు, జ్ఞాన భక్తులకు సూచకమని గదా,

మనము లోకములో సాత్త్వికులము. - జ్ఞానులము - భక్తులము అని గుర్తింపబడుటకు ఉత్సాహపడవలెనా లేక శూన్యలలాటులమై రాజసులము - తామసులము అగు రాక్షసులము అసురులము అని ఊహింపబడుటకు ఉబలాటపడవలెనా ?

మనము సన్మార్గులము - సత్పురుషులము అని కీర్తించబడుటకు సంతసించవలెనా లేక శూన్యవాదులము శుష్కహృదయులము అని గుర్తించబడుటకు వంతజెందవలెనా ?

చాలమంది ఆస్తికులగు హిందువులు మరణకాలములో తిరుమణి శ్రీచూర్ణములతో ఊర్ధ్వపుండ్రము నుంచెదరు. దాని ఉద్దేశమేమనగా, వరాహోపనిషత్తు హారీతస్మృతి, శ్రీవిష్ణుపురాణము - పద్మపురాణము ఇత్యాది ప్రమాణముల ననుసరించి ఊర్ధ్వపుండ్రధారివద్దకు యమభటులు రారనియు, అట్టివానికి నరకప్రాప్తిలేదనియును, అనగా తిరుమణి శ్రీచూర్ణములు ధరించిన వ్యక్తి. తదనుగుణమైన సత్ప్రవర్తన కలిగియున్నచో ఈ జన్మలోనే సద్గతిని పొందగలడు. లేక కేవలము ఊర్ధ్వపుండ్రము మాత్రము ధరించును - గాని సత్ప్రవర్తనయుండదు. పైగా దుష్టుడై యుండును అనకొనుడు - అయినను వాడు నరకమునుమాత్రము చెందడు. రాజకుమారునికి శిక్షవలె శ్రీమహావిష్ణువే వీనికి కొలదిగ నామమాత్రముగ శిక్షించుచు, ఆ దోషబుద్ధిని పోగొట్టి క్రమక్రమముగా కొన్ని జన్మములకైనను సద్బుద్ధి - సత్ప్రవర్తనకలవానినిగ జేసి తరింపజేయును - తిరుమణి శ్రీచూర్ణములతో బొట్టుపెట్టుకొనుటకు సంతసించుచు సాహసించవలెనా లేక సిగ్గుపడుచు శూన్యలలాటులు కావలెనా నాయనలారా మీరే ఆలోచించుకొనుడు.

తిరుమణి శ్రీచూర్ణముల రెండింటిని పూర్వసువాసినీలు మాత్రమె ధరించవలెను గాని పుణ్యస్త్రీలు తిరుమణి ధరించ కూడదేమోనని కొందరున్ను, పూర్వసువాసినలు కేవలము తిరుమణినిమాత్రమె ధరించవలెను గాని పసుపుతో కలిసినది గాన శ్రీచూర్ణమును ధరించవలెనని కొందరును అను కొనుట గలదు. అది చాల పొరపాటు. పూర్వసువాసినలే గాని పుణ్యస్త్రీలేగాని అందరునుకూడ తిరుమణి శ్రీచూర్ణముల రెండింటిని ధరించవచ్చును. తప్పక ధరించియే తీరవలెను.

జుట్టు :- ఉపనీతుడై బ్రాహ్మణుడైన ప్రతివాడును శిఖారూపముగ జుట్టును కలిగి యుండవలయును. ఇది శాస్త్రీయమైనది. లౌకికరీత్యా అందమైనది. ఆరోగ్యరీత్యా అత్యంతావసరమైనదిన్ని. సాంఘికరీత్యా గౌరవప్రద మైనదిన్ని అయి యున్నది. శిక్కులు - నేపాలురు సైనికశాఖలోనున్నను, మరణసమయముననైనను తమ శిఖను మార్చుకొనరే - హిందూమహమ్మదీయ కొట్లాటలలో పిలకజుట్టుగదా హిందువులను మహమ్మదీయుల బారినుండి కాపాడినది.

అశాస్త్రీయమై, అందవిహీనమైన క్రాపింగునకై బాలురేకాదు, వృద్ధులున్ను, లౌకికులేకాదు వైదికులున్ను, బానిసవృత్తిలో నున్నవారేగాదు స్వతంత్రవృత్తిలోనున్నవారున్ను, కాఫీహోటళ్ళు - మంగలిషాపులు - చాకలి దుకాణములలో నున్నవారలేకాదు, దేవాలయములు - ధర్మసంస్థలు - విద్యాలయములలో నున్నవారలున్ను వీరు వారను భేదములేకుండ అందరునుకూడ ఏల ఎగబ్రాకుచున్నారో తెలియదు - పదిమందియు పట్టుదలతో సశాస్త్రీయ మైన - లౌకికవైదిక న్యాయమైన శిఖనుధరించుటకు ప్రారంభించినచో ఇదియే ఫేషనుకాగలదు. ఈ బానిస మనః ప్రవృత్తులు నశించగలవు.



శ్రీకూర్మములో 16-5-60 వ తేది శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజజీయరు స్వామివారి అధ్వర్యమున జరిగిన

# ఉపనయనముల జమాఖర్చులు

## జమ

| | |
|---|---|
| శ్రీమాన్ గోపీనంబాళ్ దాస కూర్మాచార్యులుగారు, శ్రీకూర్మం | 58-00 |
| శ్రీమాన్ భద్రం నారాయణాచార్యులు గారు శ్రీకూర్మం | 50-00 |
| శ్రీమాన్ రావోలు వెంకటచలపతి రావుగారు | 30-00 |
| డిటో బియ్యంరూపముగా | 10-00 |
| శ్రీమాన్ చామర్తి సీతారామాచార్యులుగారు | 20-00 |
| శ్రీ డోలా నారాయణమ్మ వగైరా డోల | 2-00 |
| డిటో బియ్యంరూపముగా | 46-00 |
| శ్రీ మహేంద్రాడ వెంకటరామ నరసింహాచార్యులుగారు (కళింగపట్నం) | 10-00 |
| శ్రీమాన్ న్యాపతి బాలకృష్ణమూర్తి గారు, అడ్వకేటు | 5-00 |
| శ్రీ విజయనగరం మహిళామండలి | 5-00 |
| శ్రీ అంపలాంవారు | 5-00 |
| శ్రీకూర్మం యతిరాజసేవా మహిళా మండలివారు | 65-00 |
| డిటో బియ్యంరూపముగా | 32-00 |
| డిటో బియ్యం వస్త్రరూపముగా | 76-00 |
| శ్రీ రంగరాజు అనంతమ్మగారు | 30-00 |
| డిటో బియ్యం | 10-00 |
| బ్రాటోవరు ... ... | 454-00 |
| శ్రీ చెలకాని పెదసీతాయమ్మగారు బొబ్బిలి | 30-00 |
| ప్రత్యేకంగా వచ్చినది | 24-83 |
| మొత్తంజమ | 508-83 |

## ఖర్చు

| | |
|---|---|
| ఉపనయనసంభారములు వస్త్రములు | 127-81 |
| ప్రత్యేకసంభారములు | 12-00 |
| భజంత్రీలకు, మంగళ్ళకు, నౌకర్లకు | 23-75 |
| యాజ్ఞిక దక్షిణ, సంభావనలు, వగైరాలు | 226-34 |
| తదీయారాధన స్మార్త, మధ్వ. శ్రీశైవులకు కలపి | 348-43 |
| ప్రచురణ, ఆహ్వానఖర్చులు, పోస్టేజి. | 48-15 |
| చిల్లరఖర్చులు | 25-02 |
| మొత్తంఖర్చు | 811-50 |

| | |
|---|---|
| మొత్తం ఖర్చు | 811-50 |
| మొత్తం జమ. | 508-83 |
| శ్రీ జియ్యర్‌స్వామివారు అధికముగ ఖర్చుపెట్టినది | 302-67 |

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ కూర్మము లో

## ఉచిత - ఉపనయన - మహోత్సవములు

శ్రీకాకుళము జిల్లా శ్రీకూర్మములో శ్రీకూర్మనాథస్వామివారి సన్నిధియందు శ్రౌత్రగా ప్రతిష్ఠింపబడిన ధ్వజస్థంభముయొక్క ముందు 16–5–60 వ తేది ఉదయము పగలు గం॥ 10–10 నిమిషములకు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజస్వామివారి అధ్వర్యమున అరహత గల వటువులకు 15 మందికి యధావిధిగా శాస్త్రీయముగా ఉపనయనములు గావింపబడినవి గ్రామస్థులగు ద్వైతాద్వైత విశిష్టాద్వైతులందరకును అఖండ తదీయారాధన పరమవిలక్షణముగా జరిగినది.

## ఉపనీతులైన వటువులు

1. చి॥ కరి నరసింహాచార్యులు శ్రీరామతీర్థం
2. చి॥ కరి తిరువెంగళాచార్యులు ,,
3. చి॥ చామర్తి కేశవాచార్యులు శ్రీకూర్మం
4. చి॥ గోపీనంబాళ్ అప్పల నరసింహాచార్యులు ,,
5. చి॥ గోపీనంబాళ రంగాచార్యులు ,,
6. చి॥ శేషేటి సూర్యనారాయణాచార్యులు ,,
7. చి॥ భద్రం బుచ్చికూర్మాచార్యులు ,,
8. చి॥ భద్రం శ్రీనివాసాచార్యులు ,,
9. చి॥ కందాళ శ్రీవెంకటేశ్వర్లు ,,
10. చి॥ సముద్రాల పార్థసారథి ఆచార్యులు – బొబ్బిలి
11. చి॥ రంగరాజు నరసన్న పంతులు
12. చి॥ రాచూరి గోపాలరావు (మధ్వులు)
13. చి॥ రాజోలు బాలకృష్ణ
14. చి॥ సింహాద్రి దాశరథి
15. చి॥ అంథవరపు గోవిందరాజు

## వుపనయనములను అనుగ్రహించిన బ్రహ్మలు

1. శ్రీమాన్. ఉ. వే. పల్లెర్లమూడి రామానుజస్వామిగారు
2. ,, ,, గోడవర్తి రంగాచార్యస్వామివారు
3. ,, ,, తి. ప నరసింహాచార్యస్వామివారు
4. ,, ,, ,, జగన్నాథాచార్య స్వామివారు
5. ,, ,, ,, తి. పె. పద్మనాభస్వామివారు
6. ,, ,, కందాళపద్మనాభస్వామివారు

## వుపనయన కార్యనిర్వాహక వర్గమువారు

1. శ్రీమాన్. ఉ. వే. తి. పె. కృష్ణమాచార్యులుగారు
2. శ్రీమాన్. ఉ. వే. శ్రీభాష్యం కూర్మాచార్యస్వామివారు
3. శ్రీమాన్. ఉ. వే. గోపీనంబాళ్ కూర్మాచార్యస్వామివారు
4. శ్రీమాన్. ఉ, వే. శ్రీభాష్యం వెంకటాచార్యస్వామివారు
5. శ్రీమాన్ ఉ. వే, తి. పె. రంగనాధాచార్యస్వామివారు
6. శ్రీమాన్. ఉ వే శ్రీభాష్యం రాఘవాచార్యస్వామివారు
7. శ్రీమాన్. ఉ, వే. కందాళ మన్నాథాచార్యస్వామివారు
8. శ్రీమాన్. ఉ. వే. కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్య స్వామివారు (కార్యదర్శి)
9. శ్రీకూర్మం యతిరాజసేవా మహిళామండలివారు

ఉపనయనముల అనంతరము శ్రీజియ్యర్ స్వామివారు, ఉపనయనములకు యాజ్ఞికము నిర్వహించిన శ్రీస్వాముల కందఱకు, ఘనముగా సత్కారములు గావించిరి. రెండవనాడు కోరినవటువులకు పంచ సంస్కారములను కృపచేసిరి.

శ్రీమతే రామానుజాయనమః

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ జ్యేష్ఠమాస పండితసభలు

శ్రీకాకుళముజిల్లా, శ్రీకాకుళపట్టణములో శ్రీకోదండరామస్వామివారి దేవాలయమందు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి అధ్యక్షతలో శ్రీవిశిష్టాద్వైతప్రచారక జ్యేష్ఠమాస పండిత సభలు 29—5—60 మొదలు వరుసగా 3 దినములు 31—5—60 వరకు జరిగినవి. అందరువచ్చి యీకార్యక్రమములో అన్వయించిరి.

## ఇందుపాల్గొన్న

## ప్రత్యేక ఆహ్వానసంఘము శ్రీకాకుళం

శ్రీ మండు రాఘవరావుగారు (శ్రీకోదండరామస్వామివారి దేవస్థానమేనేజింగ్ ట్రస్టీ)

శ్రీ న్యాపతి బాలకృష్ణపంతులుగారు అడ్వకేట్

శ్రీ మండు వెంకటేశ్వర్లుగారు అడ్వకేట్

శ్రీ పుల్లెల సీతారామశాస్త్రిగారు అడ్వకేట్

శ్రీ రమణయ్య శెట్టిగారు

శ్రీ బి. లక్ష్మీకాంతశాస్త్రిగార్లు మరియు

శ్రీకాకుళం శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు

## సంభావనలు

శ్రీ వైశ్యరాజు అప్పలరాజుగారు పరమపదించి నప్పుడు వీరికుమారులు శ్రీ బలరామరాజుగారు పంపిన సంభావన. రు 1/-

ఆరవిల్లి అప్పారావుగారి పరమపద సందర్భములో ఆయన తమ్ముడు రామన్నగారు సమర్పించిన సంభావన 5/-

## సత్సంగ సదన విరాళములు

శ్రీ ఊరా శమంతకమణమ్మగారిద్వారా శ్రీ. B. ధనమ్మగారు పంపిన విరాళం. రు. 200/-

శ్రీ పరాంకుశం పార్థసారధిగారు, ఆడిటర్ బరంపురం వీరు సమర్పించిన ఈనాటి విరాళము, రు 1100/-

శ్రీ పులవర్తి రత్నమాల భీమవరం. రు. 16/-

## కట్నములు

శ్రీరామతీర్థం అయ్యవార్లంగారు తమ పౌత్రుని నామకరణోత్సవ సందర్భములో సంఘకట్నముగా ఇచ్చినది .. రు. 5-00

### శాశ్వత పూజ కాతా

శ్రీ అనపరెడ్డి రామతులశమ్మగారు కారుమూరివారిపాలెం రు. 29-00

శ్రీమతే రామానుజాయనమః

## శ్రీకూర్మములో శ్రీయతిరాజ శిక్షాశిబిరము

శ్రీకాకుళంజిల్లా శ్రీకూర్మక్షేత్రమున శ్రీ. రా. జీయర్ స్వామివారి యాదేశానుసారముగ వైదిక ఆధ్యాత్మిక విద్యానిధిసంఘమువారు ఈ వేసవికాలములో 30 దినములు శ్రీయతిరాజ శిక్షాశిబిరమును నడుపుటకు ఏర్పాటుచేసిరి. శ్రీ. రా. జీయర్‌స్వామివారు ఈ శిక్షాశిబిరమును 16—5—60 తేదీని ప్రారంభము చేసిరి సుమారు 25 మంది బాలబాలికలిందు శిక్షణపొందుచున్నారు. ఇందు

సంధ్యావందనమును
నిత్యోపసనమును
గురుపరంపరాది } శ్రీమాన్ పద్మనాభాచార్యులు వారును.

తిరువారాధనక్రమము :— శ్రీమాన్ మన్నాథాచార్యులుగారును

తిరుప్పల్లాండు, తిరుపళ్ళియెళిచ్చి
తిరుప్పావై, శాత్తుమొరతనియనులు } శ్రీమాన్ శ్రీభాష్యం వెంకటాచార్యులుగారును.

శ్రీకృష్ణాష్టకం, పంచాయుధస్తోత్రం,
లక్ష్మీ అష్టోత్తరనామస్తోత్రం.
ధాయీపంచకం — మాక్తికములు } శ్రీమాన్ శ్రీభాష్యం కూర్మాచార్యులుగారున్ను

శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రం :— శ్రీమాన్ కందాళై శ్రీనివాసాచార్యులు గారున్ను నేర్పుచున్నారు — శిక్షణానంతరము పరీక్షించి అందు తీర్ణులైనవారికి బహుమతు లిచ్చుటకు ఏర్పాటుచేయడమైనది.

## ప్రచారవార్తలు

మన శ్రీ జియ్యర్‌స్వామివారు తమ సహాయకార్యదర్శియగు శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్య స్వామివారితో పాటుగా శ్రీకూర్మమునందు 28—5—60 తేది వరకు వేంచేసియుండి 29—5—60 వ తేదీకి శ్రీకాకుళము వేంచేయుదురు

అచ్చట 29—5—60 మొదలు 31—5—60 వరకు సభలు జరిపించి 1-6-60 వ తేదీకి బరంపురం వేంచేసి అక్కడనుండి శ్రీజగన్నాథం వేంచేయుదురు.

శ్రీమాన్ ఉ. వే. మన గోపాలాచార్యస్వామివారు. బందరు శ్రీయతిరాజ భవనములో గీతోపన్యాసములు ఈ నెల ఆఖరువరకు జరిపి జూన్ నెల మొదటివారములో బదరికి వేంచేయుదురు.

### శ్రీకూర్మం శ్రీయతిరాజసేవా మహిళామండలి
### వార్షికోత్సవము

ఈ వార్షికోత్సవము ది 19—5—60 తేదీని అతివైభవముగ కోయిలలో తాయారు సన్నిధియందు జరుపబడినది. బాలికలకు బాలురకు స్తోత్రపాఠములలో పరీక్షజరిగి శ్రీమన్నారాయణ, రామానుజ జీయరుస్వామివారిచే బహుమతులు పంచిపెట్టబడినవి. ఆ నాడు శ్రీతాయారుకు విశేషోత్సవములు జరుపబడినవి.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ విరాట్ సమావేశము

శ్రీకాకుళముజిల్లా, శ్రీకూర్మములో 16—5—60 తేది పగలు శ్రీకూర్మనాథ స్వామివారి సన్నిధియందు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారి అధ్వర్యమున జరిగిన శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘసభ్యుల విరాట్ సమావేశము జరిగినది.

## ౧వ తీర్మానము

నల్లగొండజిల్లా, యాదగిరిక్షేత్రమందలి శ్రీ నృసింహస్వామివారి సన్నిధిలో 1–3–60 మొదలు 12—3—60 వరకు జరిగిన గాయత్రీక్రతువుయొక్క జమాఖర్చులు సరిచూచి ఆమోదించటమైనది

## ౨వ తీర్మానము

రాబోవు మే మాసములో విశాఖపట్నంజిల్లా శ్రీ సింహాచలక్షేత్రమందు గాయత్రీ క్రతువు చేయుటకు సంకల్పించటమైనది. అందుకు వలయు ఏర్పాట్లను చేయవలసినదిగా అధ్యక్షులను కోరటమైనది

## 3 వ తీర్మానము

బ్రాహ్మణ శ్రీ వైష్ణవులలో వైదిక, ఆధ్యాత్మిక, విద్యాభివృద్ధికై ప్రత్యేకముగా నొక స్వతంత్రసంఘము ఏర్పాటు చేయటమైనది.

## ౪ వ తీర్మానము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమునకు ఈ క్రిందివారిని నూతన కార్య నిర్వాహక వర్గముగా ఏర్పాటు చేసుకొనటమైనది.

### శాశ్వత - అధ్యక్షులు

1. శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు

### శాశ్వత - ప్రధానకార్యదర్శి

2. శ్రీమాన్. ఉ. వే. విద్వాన్. తె. కం. గోపాలాచార్యస్వామివారు

## కోశాధికారి సహాయకార్యదర్శి

3. శ్రీమాన్. ఉ. వే. కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్య స్వామివారు
శ్రీవాసుదాసాశ్రమము నడిగడ్డపాలెము (పోష్టు) గుంటూరుజిల్లా

## ఉపాధ్యక్షులు

5. శ్రీమాన్. ఉ. వే తి. పె. సంపత్కుమార కుమార వెంకటాచార్యులు అయ్యవార్లంగారు
శ్రీరామతీర్థం, విశాఖజిల్లా

6. శ్రీమాన్. ఉ వే ప్రాకార సుదర్శనభట్టర్ అయ్యవార్లంగారు
కోరుకొండ దేవస్థానం ధర్మకర్తలు కోరుకొండ – తూర్పుగోదావరిజిల్లా

## కార్య నిర్వాహకవర్గసభ్యులు

7. శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహంగారు
గవర్నరుపేట – విజయవాడ.

8. శ్రీమాన్ మట్టపల్లి రంగనాథయ్యగారు
33 రెడ్డిరామన్న వీధి – మద్రాసు

9 శ్రీమాన్ కూనంనేని వెంకటప్పయ్యదాసుగారు
శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం గుంటూరుజిల్లా.

10. శ్రీమతి అమరవాది లక్ష్మీనరసమ్మగారు
నరసాపురం – పశ్చిమగోదావరిజిల్లా.

## సత్సంగ విరాళములు

బదరికాశ్రమములో మన సంఘమువారిచే నిర్మింపబడు చున్న సత్సంగసదనమునకు రు 1600/ లు వాగ్దానము గావించిన రాజమండ్రి కాపురస్థులగు శ్రీ ముడుంబై వరాహనరసింహాచార్య సత్యవతమ్మ దంపతులు తమవాగ్దానమునుండి రు. 600/ లు సమర్పించిరి శ్రియఃపతి వీరికి సమస్తసన్మంగళములు ప్రసాదించుగాక.

# శ్రీ గుణరత్నకోశము

## 11 వ శ్లోకము

శ్లో॥ ఆహు శ్చ్యేదానమానం
కతిచన కతి చరాజకం విశ్వ మేతత్
రాజన్వ త్త్వేచి దీశం
గుణిన మపి గుణై స్తం దరిద్రాణ మన్యే
భిక్షావన్యే సురాజం
భవ మితిచ జడాః తే తలాతల్యకార్షు
ర్యే తే శ్రీరంగహర్మ్యాం
గణకనకలతే నక్షణం లక్ష్యమాసన్ ॥

## —: అర్థము :—

హే శ్రీరంగహర్మ్యాంగణ కనకలతే,
శ్రీరంగ = శ్రీరంగమందలి,
హర్మ్య = సౌధముయొక్క,
అంగణ = ముంగిలియందు,
కనకలతే = బంగారుతీగవలెనున్న ఓ లక్ష్మీదేవీ,
యే = ఎవరు,
క్షణం + చ = క్షణకాలమైనను,
తే = నీయొక్క
లక్ష్యం = కటాక్షపాత్రులు,
న + ఆసన్ = కారో,
తే = అట్టివారలు,
జడాః = మూఢులు,
కతిచన = అట్టిమూఢులలో కొందరు,
వేదాన్ = వేదములను,
అమానం = ప్రమాణముల కానివానినిగ,
ఆహుః = చెప్పుదురు,
కతిచ = మరికొందరు,
ఏతత్ = ఈ
విశ్వం = ప్రపంచమును,
అరాజకం = ఈశ్వరుడు లేని దానినిగ,
ఆహుః = చెప్పుదురు,
కేచిత్ = మరికొందరు,
ఏతత్ = ఈ,
విశ్వం = జగత్తును,
రాజన్వత్ = నిమిత్తమాత్రుడైన ఈశ్వరునిగలదిగ,
ఆహుః = చెప్పుదురు,
అన్యే = మరికొందరు,
గుణినం + అపి = కళ్యాణగుణవిశిష్టుడేఅయినను,
ఈశం = సర్వేశ్వరుని,
గుణైః = కల్యాణగుణములచే,
దరిద్రాణం = శూన్యునిగ,
ఆహుః = చెప్పుదురు,
అన్యే = మరికొందరు
భిక్షో = భిక్షువగు శివునియందు,
సురాజంభవం = సర్వేశ్వరుడగుటను,
ఆహుః = చెప్పుదురు,
ఇతి = ఈ విధముగ,
తలాతలి = వాగ్వివాదములను,
అకార్షుః = చేయుచుందురు,

## * :- తాత్పర్యము -: *

ఓ లక్ష్మీదేవి. నీవు శ్రీరంగమందు శ్రీరంగనాయకుని దివ్య విమాన సౌధప్రాంగణమునందే బంగారు తీగవలె ప్రకాశించుచు పరతత్త్వ వస్తునిర్ణయమును ప్రకాశింపజేయుచున్నావు. ఎదురుగ ఇంత స్పష్టముగ కనుపించు తత్త్వమును చూడలేని బౌద్ధ - చార్వాకాదులను కొందరు వేదములనే ప్రమాణము కాదందురు. కాపిలులను కొందరు ప్రకృతియే సృష్టికారణి గాని వేరుగ సృష్టికర్తయగు ఈశ్వరుడు లేడందురు. తార్కికులగు మరికొందరు ఈశ్వరుడున్నాడు గాని ఆయన అనుమాన ప్రమాణసిద్ధుడై, సృష్ట్యాదులలో కేవలము నిమిత్తమాత్రుడు మాత్రమె యందురు. మాయావాదులగు మరికొందరు ఈశ్వరుడున్నాడు గాని ఆయన నిర్గుణుడందురు. శైవులగు మరికొందరు భిక్షుకగు శివునే సర్వేశ్వరు డందురు. ఇట్టి వీరందరును ఈ విధముగ వాదులాడుకొనుచు అజ్ఞాన - అన్యథాజ్ఞాన - విపరీత జ్ఞానులై చెడుటకు కారణము వీరలపై నీకటాక్షప్రసరణము లేకుండుటయే కారణము గదా తల్లీ - ఎవరైతే నీ కటాక్ష పాత్రులు గాగలరో అట్టివారందరును జ్ఞానులై శ్రీరంగనాయకుడే పరతత్త్వమని తెలుసుకొని నీ పురుషకారము ద్వారా వారి సాధించి తరించగలరు గదా.

# గోపికాగీతలు

## 12వ శ్లోకము

శ్లో॥ దినపరిక్షయే నీలకుంతలైః
వనరుహాననం విభ్రమావృతమ్,
ఘనరజస్వలం దర్శయన్ ముహుః
మనసి న స్స్మరం వీర యచ్ఛసి॥.

—: అర్థము :—

దినపరిక్షయే = సాయంకాలమున,
నీలకుంతలైః = నల్లనిముంగురులతో,
ఆవృతమ్ = కూడుకొన్నట్టియును,
ఘనరజస్వలం = అడవియందలి దుమ్ముచే నిండినదియును,
విభ్రమావృతమ్ = విలాసముతో నిండినదియునగు,
వనరుహాననమ్ = కమలమువంటి ముఖమును,
ముహుః = మాటిమాటికిని,
దర్శయన్ = చూపుచున్నవాడవై,
హేవీర = ఓవీరుడా,
నః = మాయొక్క
మనసి = మనస్సునందు,
స్మరం = మన్మథుని,
యచ్ఛసి = రెచ్చగొట్టుచున్నావు.

## *:— తాత్పర్యము :— *

ఓకృష్ణా! నీవు మాకు అసలే కనుపించియుండకపోయినను బాగుండెడిది. లేక మేము నిన్ను దర్శించకపోయి యుండినను బాగుండెడిది. గాని నీవు ప్రతిదినము సాయంకాలమున మెరుపువలె యిట్లు కనుపించి అట్లే మాయమగు చున్నావు. అపుడు నీ ముఖమున గోవు డెక్కలచే రేగిన దుమ్ముపడియుండును ఆ దుమ్ము వల్లని నీ ముంగురులపై బడి పుప్పొడితో నిండిన తుమ్మెదలచే విరాజిల్లు పద్మవలె నీముఖారవిందముండును. అట్టిదానిని జూడగనే మామనస్సులో మణిగియున్న మదను విజృంభించును. వీరుడవైన నిన్నేమియు చేయజాలక అబలలమగు మమ్ముల బాధించుచున్నాడు. నిన్నాశ్రయించియున్న మేమిటుల బాధపడవలసినదేనా నీవు మన్మథ మన్మథుడవు గాదా ఆ మన్మథుని పోకొంపజేసి మమ్ముల రక్షించి నీ వీరత్వము సార్థకపరచుకొనరాదా, నీ యెదుటపడినంత అబలలమైన మేనా నీ వీరత్వము. కనబడెను, ఆ బాలునిపై నీ పరాక్రమము జూపరాదా - ఏమి నీ దివ్యమంగళవిగ్రహ సందర్శన స్పర్శన ముకపరియున్ను. నీ వీరత్వమెట్టిదో - చూచెదముగాక.

మమ్ముల బాధించుటకు నీ వీరత్వము చాలదా. మనస్సున మన్మథుని ప్రవేశపెట్టి, అతనిని రెచ్చగొట్టి చాటుగ బాధింపనేల? కొడుకుచే భార్యను బాధించుట నీ తండ్రి జమదగ్నినుండి నేర్చుకొంటివా? అవతారము మారినను అవకతవకలు వదలలేదా? మనసిజునిచే మనస్సును రెచ్చగొట్టితివా నీ పూజాప్రసన్నాదులు లోకములో పూజ్యము లేమగునుసుమా. - జాగ్రత్త.

నిద్రా = ఇంద్రియ వ్యాపారములన్నియు విరమించియుండుదశ. భయం = అనిష్టసాధనము, దురభిమానముతో తెచ్చిపెట్టుకొనినట్టి బలవంతులతోడి విరోధము మొ. వాటిచే బుట్టును. ఒడలెఱుంగని శోకము-కోపముచే గావించు బంధువధ మొదలగువాటివలన బుట్టును. విషాదము = వ్యర్థమైన ధనవ్యయము మొదలగువాటివలన బుట్టును. మదము = భోగములను ననుభవించుటచే బుట్టును.

అవ. సత్త్వాది గుణ భేదముచే కలుగు సుఖముయొక్క త్రైవిధ్యమును చెప్పెదనని ప్రతిన గావించుచున్నాడు.

36. శ్లో. సుఖం త్విదానీం త్రివిధం । శృణు మే భరతర్షభ ।
అభ్యాసా ద్రమతే యత్ర । దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥

అర్థము :- యత్ర = ఏ సుఖమునందు, అభ్యాసాత్ = చిరకాలాభ్యాసమువలన, రమతే = (క్రమముగ) నిరతిశయప్రీతిని బడయుచున్నాడో, దుఃఖాన్తం చ = సమస్త సాంసారిక దుఃఖనాశమును, నిగచ్ఛతి = పొందుచున్నాడో, (తత్ = అట్టి) సుఖం తు = సుఖమైతే, త్రివిధం = మూడువిధములగు టను గూర్చి, మే = నానుండి, శృణు = వినుము.

తా॥ సుఖము సత్త్వరజస్తమో గుణములచే మూడు విధములుగా నుండును. అందు సాత్త్వికసుఖమువలన నిరంతరాభ్యాసముచే క్రమముగా నిరతిశయానందమున్ను సమస్తసాంసారిక దుఃఖ వినాశమున్న కలుగుచున్నది. అట్టి సుఖమునుగూర్చి చెప్పెదనువినుము.

అవ. సాత్త్వికసుఖముయొక్క స్వరూపము నెఱింగించుచున్నాడు.

37. శ్లో. యత్త దగ్రే విషమివ । పరిణామేఽ మృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త । మాత్మబుద్ధి ప్రసాదజమ్॥

అర్థము :- యత్ = ఏసుఖము. అగ్రే = ముందు, విషం ఇవ = దుఃఖమువలెను, పరిణామే = విపాకదశయందు, అమృతతోపమం = అమృతముతో సమానముగను. ఆత్మబుద్ధిప్రసాదజం = ఇతరవిషయసంపర్క లేశమైనను లేని శుద్ధాత్మానుభవమువలన పుట్టినదియు (అగుచున్నదో) తత్ సుఖం = ఆ సుఖము, సాత్త్వికం = సత్వగుణ ప్రధానమైనదిగా, ప్రోక్తం = చెప్పబడినది.

తా॥ యోగప్రారంభదశలో శుద్ధాత్మ స్వరూప మపరిచిత మగుటచే దాని దర్శనము మిక్కిలి ప్రయాసపడి సాధించదగినది గాన దుఃఖమే యగుచున్నది. కాని కష్టములనోర్చి సాధించినచో చివరకది అమృతమువలె ఆనందప్రదమగుచున్నది. ఆత్మకంటె వేరైన సమస్త విషయములను గోచరించని నిర్మలబుద్ధివలన జనించునట్టి శుద్ధాత్మానుభవముచే కలుగు సుఖము అమృతము వంటిదే గాన నది సాత్త్విక సుఖమనబడును.

అవ. రాజససుఖస్వరూపము నెఱింగించుచున్నాడు.

38. శ్లో. విషయేన్ద్రియ సంయోగా । ద్యత్త దగ్రేఽ మృతోపమమ్
పరిణామే విషమివ । తత్సుఖం రాజసం స్మృతమ్॥

అర్థము :- అగ్రే = మునుముందు, విషయేన్ద్రియ సంయోగాత్ = ఇంద్రియములకు విషయములతోగల సంబంధమువలన, యత్ యత్ = ఏ సుఖము, అమృతోపమం = అమృతముతో సమానమైన ఆనందప్రదమును, పరిణామే = చివరకు, విషం ఇవ = విషమువలెను (భవతి = అగుచున్నదో) తత్ సుఖం = ఆ సుఖము, రాజసం = రాజససుఖముగా, స్మృతం = తలంచబడుచున్నది.

తా॥ ఆకలి.దప్పిక మొదలగు వికారములచే నత్యాదరముతో పరిగ్రహింపబడిన లౌకిక క్షుద్రవిషయములయొక్క అనుభవమువలన కలిగెడు సుఖము ఆ దప్పికలి మొదలగునవి తీరినతోడనే యది నరక, నిహీన జన్మాదులకు కారణమగుటచే విషము త్రాగిన చందమున ననర్థదాయకమే యగుచున్నదిగాన నది రాజస సుఖమనబడును.

అవ. తామస సుఖస్వరూపమును దెలుపుచున్నాడు.

39. శ్లో. య దగ్రే చానుబన్ధే చ । సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం । తత్తామస ముదాహృతమ్॥

అర్థము:— యత్ సుఖం = ఏ సుఖము, అగ్రే = అనుభవసమయమందును, అనుబన్ధేచ = పరిణామముననను, ఆత్మనః = తనకు, మోహనం = వాస్తవస్వరూప మెఱుంగనీయని జ్ఞానమాంద్యమును బుట్టించు. నిద్రాలస్య ప్రమాదోత్థం = నిద్రబద్ధకము ప్రమాదములవలన జనించునో, తత్ = ఆ సుఖము, తామసం = తామససుఖముగా, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ అనుభవించునప్పుడును, విపాకావస్థలోనున్ను, తనకు వస్తువుల నిజరూపమును నెఱుంగుట కాటంకమగు జ్ఞానమాంద్యమును బుట్టించు నిద్రబద్ధకము, కర్తవ్యము నెఱుంగమి మొదలగువాటి వలన బుట్టునట్టి సుఖము తామసమనబడును.

నిద్ర = ఇంద్రియముల వ్యాపారములుడుగుట — వీనిచే జ్ఞానము మందగించి వస్తుస్వరూప మెఱుంగకుండుట ప్రసిద్ధమే.

ఆలస్యం = ఇంద్రియముల మంద్రప్రవృత్తి — కరణములగు ఇంద్రియ వ్యాపార తారతమ్యమును బట్టియే తత్కార్యమగు జ్ఞాన తారతమ్య ముండును గాన నిదియు నజ్ఞానవర్ధనమే.

ప్రమాదమనగా తన కర్తవ్యమును నిర్ణయింపజాలమి — దీనిచే జ్ఞానము మందగించును.

జ్ఞానమాంద్యము చివర కత్యంతాజ్ఞానములో పర్యవసించును.

అవ. సంసారి చేతనులకు మోక్షమును బడయువరకును గుణములబారినుండి నితరాం బయటపడుట దుశ్శకమనిచెప్పి సత్త్వాది గుణకార్య ప్రకరణమును ముగించుచున్నాడు.

40. శ్లో. న తదస్తి పృథివ్యాం వా । దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం । యదేభి స్స్యా త్త్రిభి ర్గుణైః॥

అర్థము :- పృథివ్యాంవా = భూమియందున్న మనుష్యాదులలోగాని, దివి = ఊర్ధ్వ లోకమందున్న, దేవేషువా పునః = దేవతలలోగాని, ప్రకృతిజైః = ప్రకృతినుండి పుట్టిన, ఏభిః = ఈ, త్రిభిః = మూడైన, గుణైః = సత్త్వాదిగుణములచే, యత్ సత్త్వం = ఏ ప్రాణి, ముక్తం = విడువడినదో, తత్ = అట్టిసత్త్వము, నాస్తి = లేదు.

తా॥ ఊర్ధ్వలోకములలోగాని అధోలోకములలోగాని ఉండునట్టి బ్రహ్మాది పిపీలికాపర్యంతబద్ధ ప్రాణులలో నీ ప్రాకృత సత్త్వరజస్తమోగుణముల బారిని పడని ప్రాణి యొక్కటియు లేదు.

అవ. ఇక ముందుగ్రంథముచే - మోక్షసాధనబుద్ధితో చేయబడు కర్మ పరమపురుషుని ఆరాధనరూపమైనదనియు, అది క్రమముగ పరమపురుష సాయుజ్య రూపమగు మోక్షము నొసంగుననియు, చెప్పదలంచి ముందుగా బ్రాహ్మణాది నాలుగు వర్ణములవారికిని సత్త్వాది గుణములచే సహజములుగా వేఱువేఱ నేర్పరచబడిన కర్తవ్య కర్మలను జీవికా విశేషములలో జెప్పుచున్నాడు.

41. శ్లో. బ్రాహ్మణ క్షత్రియ విశాం । శూద్రాణాం చ పరన్తప ।
కర్మాణి ప్రవిభక్తాని । స్వభావ ప్రభవై ర్గుణైః॥

అర్థము :- పరన్తప ! = అర్జునా ! బ్రాహ్మణ క్షత్రియ విశాం = బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును, శూద్రాణాంచ = శూద్రులకును, కర్మాణి = కర్తవ్య కర్మ విశేషములు, స్వభావ ప్రభవైః = ప్రాచీనకర్మచే జనించినట్టి, గుణైః = సత్త్వ తరజస్తమో గుణములచేత, ప్రవిభక్తాని = శాస్త్రములచే వేఱు వేఱుగా చెప్పబడినవి. (భవన్తి = అగుచున్నవి)

తా॥ బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకును ఆ యా జన్మలకు కారణములైన ప్రాచీన కర్మలచే నభివృద్ధి జెంది యున్న సత్త్వరజస్తమోగుణములచే వీరి గుణములివి వీరి కర్మ లివి వీరి జీవనోపాయము లివియని వేఱువేఱుగా శాస్త్రములు విభజించి చెప్పుచున్నవి.

పూర్వజన్మమున మరణసమయమునకు సత్త్వగుణ మభివృద్ధిగా నున్నచో - బ్రాహ్మణజన్మయు, రజోగుణ మభివృద్ధిగానున్నచో - క్షత్రియ జన్మయు, మిక్కిలి యధికముగా నుద్రేకించియున్న తమోగుణముచే - శూద్రజన్మయు లభించునని శాస్త్రములు జెప్పుచున్నవి.

అవ. బ్రాహ్మణుల సహజకర్మల నెఱింగించుచున్నాడు.

42. శ్లో. శమో దమ స్తప శ్శౌచం । క్షాన్తి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం । బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥

అర్థము :- శమః = బాహ్యేంద్రియ నిగ్రహము, దమః = మనోనిగ్రహము. తపః = శాస్త్రోక్తమైన కాయక్లేశము, శౌచం = శాస్త్రోక్తమైన కర్మలకు అర్హత, క్షాన్తిః = పరులు తనను పీడించినను చిత్తవికారములేకుండుట. ఆర్జవం = తాను తలంచినట్లే చెప్పి తానాచరించుట, జ్ఞానం = పరతత్వమును అవర తత్వమును నెఱుంగుట. విజ్ఞానం = పరతత్వమగు శ్రీమన్నారాయణుని యసాధారణధర్మముల నెఱుంగుట, ఆస్తిక్యం = వేదోక్తమగు అర్థము లన్నియు నిజమను నిశ్చలనమ్మకము, ఇవియన్నియు బ్రాహ్మణునకు స్వభావసిద్ధమైన ధర్మములు.

తా॥ సుగమము, ఇవియే బ్రాహ్మణునకు జీవనోపాధియును, పరతత్వ జ్ఞానమనగా శ్రీమన్నారాయణుని మించిన దైవము లేదను విశ్వాసము. అవరతత్వజ్ఞానమనగా, తక్కిన దేవతలందరు ఆతని కంటె తక్కువవారే యనెడు నిశ్చయము.

ఆస్తిక్యమనగా - శ్రీమన్నారాయణుడే సర్వోత్తమదైవము. ఆతడు దోషమొక్కటియును లేక సమస్తకల్యాణ గుణాకరుడై విలసిల్లును. సకల వేదైకవేద్యుడు. నిఖిల జగదేకకారణుడు. నిఖిల జగదాధారుడు. నిఖిల ప్రవర్తకుడు. కర్మలన్నియు నాతని యారాధనలే. వటిచే నారాధింపబడి ధర్మార్థ కామమోక్షముల నొసంగును. అను నీ యర్థములన్నియు నిజమనెడు నమ్మకము.

అవ. క్షత్రియుల సహజకర్మల నెఱింగించుచున్నాడు.

43. శ్లో. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం । యుద్ధే చాప్యపలాయనమ్
దాన మీశ్వరభావ శ్చ । క్షాత్రం కర్మ స్వభావజమ్॥

అర్థము :- శౌర్యం = నిర్భయముగా యుద్ధరంగమున ప్రవేశించు సామర్థ్యము, తేజః = శత్రువులచే నెదుర్కొనబడతగని శక్తి. ధృతిః = ప్రారంభింపబడినపనిని ఎన్ని విఘ్నములనైనను సహించి కొనసాగించుట. దాక్ష్యం = అన్నిపనులను నేర్పుగ చేయుశక్తి. యుద్ధే చ అపి = యుద్ధమునందును, అపలాయనం = తాను చనిపోవు స్థితియందైనను పారిపోకుండుట. దానం = తన ధనమును పరుడు తనదేయని నమ్మునట్లర్పించుట, ఈశ్వరభావః చ = జనులనందఱను నియమించుశక్తి (అనునివి) క్షాత్రం = క్షత్రియులసంబంధమైన, స్వభావజం = సహజమగు, కర్మ = కర్మ. భవతి = అగుచున్నది.

తా॥ నిర్భయముగా యుద్ధరంగమున ప్రవేశించు సామర్థ్యము, శత్రువులు కన్నెత్తియైనను చూడశక్యముగాకుండ నుండుట, ప్రారంభించిన పనిని యెన్ని విఘ్నములు వచ్చినను విడువక చేసి ముగించుట, అన్ని పనులను నేర్పుగ నిర్వహించుశక్తి, యుద్ధమున తనకు చావు తప్పదని నిశ్చయముగ నెఱింగినను వెనుకంజ వేయకుండుట, తన ధనమును తగిన పాత్రులకు వారు యథేష్టముగా నుపయోగించునట్లర్పించివేయుట, జనులనందరను నియమించు శక్తి యను నివి క్షత్రియునకు సహజమగుకర్మలు. ఇవియే యాతనికి జీవనోపాధియును.

అవ. వైశ్యులయొక్కయు, శూద్రులయొక్కయు సహజకర్మల నెఱింగించుచున్నాడు.

44. శ్లో. కృషిగోరక్ష్యవాణిజ్యం । వైశ్యంకర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ । శూద్రస్యాపి స్వభావజమ్॥

అర్థము :- కృషి = వ్యవసాయము, గోరక్ష్య = పశుపాలనము, వాణిజ్యం = వర్తకమున్ను, వైశ్యం = వైశ్యునకు సంబంధించిన, స్వభావజం = సహజమైన, కర్మ = కర్మ (భవతి = అగుచున్నది) పరిచర్యాత్మకం కర్మ = బ్రాహ్మణాది మూడువర్ణములకును పరిచర్యనుగావించు పనియే. శూద్రస్య అపి = శూద్రునకున్ను, స్వభావజం = సహజమైన, కర్మ = కర్మ (భవతి = అగుచున్నది).

తా॥ వ్యవసాయము, పశుసంరక్షణము, వర్తకమున్ను వైశ్యునకు సహజకర్మయు జీవనోపాధియు నగుచున్నవి. బ్రాహ్మణాదులకు పరిచర్యను గావించుటయే శూద్రునకు సహజమగు కర్మ యగుచున్నది. ఇదియే యాతనికి జీవికయు నగును.

అవ. ఈ మోక్షశాస్త్రమున నీ వర్ణధర్మ విభాగమునకు ప్రయోజనమును జెప్పుచున్నాడు.

45. శ్లో. స్వే స్వే కర్మణ్యభిరతి । స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం । యథావిన్దతి తచ్ఛృణు॥

అర్థము :- స్వే స్వే = తమతమ, కర్మణి = పూర్వోక్త కర్మయందు, అభిరతః = ఆసక్తి కలిగియున్న, నరః = మనుష్యుడు, సంసిద్ధిం = పరమపదప్రాప్తిని లభతే = పొందుచున్నాడు. స్వకర్మ నిరతః = తన ధర్మమునం దాసక్తితో విడువక నాచరించువాడు. యథా = ఏ ప్రకారముగా, సిద్ధిం = పరమపదపదమును, విన్దతి = పొందుచున్నాడో, తత్ = దానిని, శృణు = వినుము.

తా॥ ఇట్లు చెప్పబడిన తమతమ వర్ణధర్మములను విడువక ఆదరముతో నాచరించువాడు నిస్సంశయముగ పరమపదము నధిరోహించును. అది యాతనికేవిధముగ సిద్ధించునో చెప్పెదను వినుము.

అవ. పరమాత్మ సర్వకారణభూతుడును సర్వాన్తర్యామియు నగుటచే నన్నిటిని తనకు శరీరముగా కలవాడుగాన నింద్రాదులను తెలిపెడు శబ్దములచే తానే జెప్పబడుచున్నాడు. వర్ణాశ్రమధర్మములన్నియు నట్టి పరమ పురుషుని సమారాధన రూపములేగాన నవి పరమపదప్రాప్తికి నిదానము లగుట నిర్వివాద మనుచున్నాడు—

46. శ్లో. యతః ప్రవృత్తి ర్భూతానాం । యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య । సిద్ధిం విన్దతి మానవః॥

అర్థము :- భూతానాం = ప్రాణులయొక్క, ప్రవృత్తిః = పుట్టుక మొదలగు వ్యాపారము, యతః = ఏ పరమాత్మనుండియో, యేన = ఏ పరమాత్మచే ఇదం సర్వం = కాన్పించునట్టి యీ చేతనాచేతనాత్మకమగు జగత్తంతయు, తతం = వ్యాపించబడియున్నదో, తం = ఆ పరమాత్మను, మానవః = శాస్త్రాధికారియగు మనుష్యుడు, స్వకర్మణా = తనకు విధింపబడిన కర్మతో, అభ్యర్చ్య = ఆరాధించి, సిద్ధిం = పరమపదప్రాప్తిని, విన్దతి = లభించుచున్నాడు.

తా॥ సమస్త భూతములు పరమాత్మనుండియే పుట్టుచుండుటచేతను, ఆతనిచే పోషింపబడుటచేతను, లయింప చేయబడుటచేతను, వ్యాపింపబడుటచేతను ఆతడే యంతరాత్మగా కలవగుటవలన నెవరి నారాధించినను ఆతడే యారాధింపబడుచున్నాడని యెఱింగి యారాధించినచో, నాతడనుగ్రహించి స్వప్రాప్తిరూపమగు పరమపదము నందజేయుచున్నాడు.

అవ. కర్మయోగాంతర్భూతములగు నీ ధర్మములు జ్ఞానయోగాధికారులకు గూడ మిక్కిలి యాదరణీయములేయని వెనుక చెప్పినదానినే తిరిగి జ్ఞాపకము చేయుచున్నాడు.

47. శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః । పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ । కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥

అర్థము :— స్వనుష్ఠితాత్ = ఒకానొకప్పుడు లెస్సగా జేయబడిన. పరధర్మాత్ = జ్ఞాన యోగముకంటె. స్వధర్మః = కర్మయోగము. విగుణః (అపి) = విగుణ మైనను. శ్రేయాన్ = ఉత్తమమైనది. స్వభావనియతం = తన ప్రకృతికి తగియున్న. కర్మ = కర్మయోగమును. కుర్వన్ = ఆచరించుచున్నవాడై. కిల్బిషం = సంసారమును. న ఆప్నోతి = పొందడు.

తా॥ కర్మలుచేయుటకే ఏర్పరచబడిన కర్మేంద్రియములతో గూడిన శరీరముతో నిత్యసంబంధము కలిగియున్నవాడగుటచే మానవు నకు కర్మయోగమే స్వధర్మము, జ్ఞానయోగ మన్యధర్మమును నగుచున్నది. అట్టి జ్ఞానయోగము నెంత నేర్పుగజేసినను సప్రమాదమగుటచే దానికంటె నింద్రియ వ్యాపారరూపమగు కర్మయోగము కొంచెమాలస్యముగ ఫలమునొసంగినను నిష్ప్ర మాదమగుటచే నుత్తమమైనది. కర్మ ప్రకృతి సంబంధముకల జీవునకు పనులు చేయుటయే సహజమగుటచే కర్మయోగము జన్మసిద్ధధర్మమగుచున్నదిగాన దాని నాచరించుటచే సంసార మును సుకరముగ తరించగలుగుచున్నాడు.

48. శ్లో. సహజం కర్మ కౌన్తేయ । సదోష మపి న త్యజేత్
సర్వారమ్భా హి దోషేణ । ధూమేనాగ్ని రివావృతాః॥

అర్థము :— కౌన్తేయ ! = అర్జునా ! సహజం = స్వభావసిద్ధమైన. కర్మ = కర్మ. సదోషం అపి = కాయక్లేశాదిదుఃఖములతో కూడినదైనను. న త్యజేత్ = విడువరాదు. హి = ఏ కారణమువలన. సర్వారమ్భాః = కర్మారంభములు గాని, జ్ఞానారంభములుగాని. దోషేణ = దుఃఖముతో, ధూమేన = పొగ చేత, అగ్నిః ఇవ = నిప్పువలెనే, ఆవృతాః = కప్పబడియున్నవి.

తా॥ అర్జునా ! స్వభావసిద్ధమగు కర్మ నాచరించుటలో కొలది కాయ క్లేశాది దుఃఖము లనివార్యములైనను దానిని విడువరాదు. ఏలననగా— కర్మయోగమేమి జ్ఞానయోగమేమి ఏది చేయవలె నన్నను కాయక్లేశాది దుఃఖములు తప్పవు. నిప్పు పొగచే నావరింపబడకయుండునా ? అయినను కర్మయోగము సుకరమును, అప్రమాదమును నగుచున్నది. జ్ఞానయోగ మట్లుగాక దుష్కరమును సప్రమాదమును నగుచున్నది.

49. శ్లో. అసక్తబుద్ధి స్సర్వత్ర । జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం । సన్న్యాసేనా ధిగచ్ఛతి॥

అర్థము :- సర్వత్ర = సకలఫలాదులయందును, అసక్తబుద్ధిః = లగ్నముకాని బుద్ధి కలవాడును, జితాత్మా = స్వాధీనమందున్న మనస్సుకలవాడును, విగతస్పృహః = కలలోనైనను తనను కర్తగాతలంచనివాడును, సన్న్యాసేన = త్యాగముతో (యుక్తః = కూడినవాడై, కర్మకుర్వన్ = కర్మచేయుచు) పరమాం = మిక్కిలి గొప్పదైన, నైష్కర్మ్యసిద్ధిం = జ్ఞానయోగమునకు కూడా ఫలమగుధ్యాననిష్ఠను, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ ఫలాదులయందు ఆశలేనివాడును, స్వాధీనమందున్న మనస్సు కలవాడును, కలలోనైనను తనను కర్తగా తలంచనివాడును, ఫలసంగ కర్తృత్వత్యాగముతో కూడినవాడై కర్మలనుచేయుచు జ్ఞాననిష్ఠకుకూడా ఫలమైన సర్వోత్కృష్టమగు ధ్యాననిష్ఠను లభించుచున్నాడు.

50. శ్లో. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ । తథాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌన్తేయ । నిష్ఠా జ్ఞానస్య యా పరా॥

అర్థము :- కౌన్తేయ = అర్జునా, సిద్ధిం = ధ్యానసిద్ధిని, ప్రాప్తః = పొందినవాడై, యథా = ఏప్రకారముగా నున్నవాడగుచు, బ్రహ్మ = బ్రహ్మను, ఆప్నోతి = పొందుచున్నాడో, తథా = అవిధానమును, మే = నావలన, సమాసేన = సంగ్రహముగా, నిబోధ = తెలుసుకొనుము, యా = ఏది జ్ఞానస్య = ధ్యానమునకు, పరానిష్ఠా = పరమప్రాప్యము, (భవతి = అగు చున్నదో)

తా॥ అర్జునా! నిష్కామకర్మయోగముచే జనించునట్టి ధ్యానమనెడు సిద్ధిని పొందినపిమ్మట యెట్లు సంచరించిన బ్రహ్మను బడయు చున్నాడో, ఆరీతిని సంగ్రహముగ జెప్పెదను సావధానముగ వినుము. ఆ బ్రహ్మమేసుమా ఆ ధ్యానమునకు పరమప్రాప్యము.

అవ. ధ్యానయోగానంతరము బ్రహ్మను బడయుట కవలంబించవలసిన యనుష్ఠాన విశేషమును వివరించుచున్నాడు.

51. శ్లో. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో । ధృత్యాఽఽత్మానం నియమ్యచ
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా । రాగద్వేషౌ వ్యుదస్యచ॥

అర్థము :- విశుద్ధయా బుద్ధ్యా = శుద్ధాత్మతత్వమును గూర్చిన బుద్ధితో, (యుక్తః = కూడినవాడై), ధృత్యా = సాత్త్వికపట్టుదలతో, ఆత్మానం = మనస్సును, నియమ్యచ = విషయములనుండి మరలించి (యోగమునకు తగినస్థితిలో నుంచి) శబ్దాదీన్ = శబ్దము, స్పర్శ, రసము, గంధము మొదలగు, విషయాన్ = సాంసారికభోగజాతమును, త్యక్త్వా = విడిచి, రాగద్వేషౌ = వాటినిగూర్చిన అనురాగమునుగాని విద్వేషమునుగాని, వ్యుదస్యచ = దూరముచేసి, (ముందుశ్లోకముతో నన్వయము)

తా॥ శుద్ధాత్మ తత్వమును చక్కగ నెఱింగి సాత్త్వికధృతితో మనస్సును విషయమునుంచి మరల్చి యోగమునకు తగిన స్థితిలో నుంచి శబ్దాదివిషయములను విడిచి, వాటియందు దీసత్తైనను రాగ ద్వేషముల నుదయింపనీయక—

52. శ్లో. వివిక్తసేవీ లఘ్వాశీ । యతవాక్కాయ మానసః
ధ్యానయోగ పరో నిత్యం । వైరాగ్యం సముపాశ్రితః॥

అర్థము :— వివిక్తసేవీ = రహస్యప్రదేశమునందున్నవాడై, లఘ్వాశీ = మితముగ భుజించువాడగుచు, యతవాక్కాయమానసః = కరణత్రయమును ధ్యానమున కభిముఖముగా జేసినవాడై, నిత్యం = సదా, ధ్యానయోగపరః = మరణించువరకు నిట్లు ధ్యానమునందాసక్తి కలవాడగుచు, వైరాగ్యం = సాంసారిక భోగములయందనురాగము బొత్తుగ లేకుండుటను, సముపాశ్రితః = అలవరచుకొనినవాడై.

(దీనికిని ముందుశ్లోకముతో సంబంధము కలదు)

తా॥ ధ్యానవిరోధివర్గ మొకింతయు లేని ప్రదేశము నాశ్రయించి శరీర ధారణ కవసరమగు నాహారమునుమాత్రమే తీసుకొనుచు, శరీర వాఙ్మనస్సులను ధ్యానమున కభిముఖముగా జేసి, మరణపర్యంతము నిరంతరము ధ్యానమునందే నిమగ్నుడగుచు, ఆత్మేతరము లన్నిటియందుండు దోషములనే విమర్శించుచు వాటియందసహ్యమును బుట్టించుకొని.

53. శ్లో. అహఙ్కారం బలం దర్పం । కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాన్తో । బ్రహ్మభూయాయ కల్పతే॥

అర్థము :— అహఙ్కారం = దేహాత్మభ్రాంతిని, బలం = దానిని పెంపొందించు వాసనా బలమును, దర్పం = వాటివలనబుట్టునట్టి గర్వమును, కామం = విషయాభిలాషను, క్రోధం = దాని కవరోధముకలిగినచో జనించు ద్వేషమును, పరిగ్రహం = ఇతరులొసంగు ద్రవ్యాదుల నంగీకరించుటను, విముచ్య = విడిచిపెట్టి, నిర్మమః = దేనియందును తనదను బుద్ధిలేనివాడై, శాన్తః = ఆత్మానుభవమొక్కటియే సుఖమని తలంచువాడగుచు, (ఏవం ధ్యానయోగం కుర్వన్ = ఇట్లుండి ధ్యానయోగమును గావించుచు) బ్రహ్మభూయాయ = యథావస్థిత ఆత్మానుభవమునకు, కల్పతే = సమర్థుడగుచున్నాడు.

తా॥ దేహాత్మభ్రాంతిని దానికి మూలమగు వాసనాబలమును, ఈ రెండింటివలన బుట్టునట్టి గర్వమును, ఉత్కటవిషయానుభవాభిలాషను, దాని కాటంకము కలిగినచో సన్నిహితులపై ద్వేషమును, ఇతరులొసంగు ధనాదుల నామోదించుటను, సంపూర్ణముగా విడిచి దేనియందును నాదియను బుద్ధి లేక ఆత్మానుభవ మొక్కటియే సుఖమని తలంచుచున్నవాడై ధ్యానయోగము నాచరించుచు క్రమముగ సకల బంధనములనుండియు బయటపడి శుద్ధాత్మానుభవ సుఖమును బడయగలుగును.

అవ. నిష్కామ కర్మయోగాదులచే సాధింపబడునట్టి శుద్ధాత్మానుభవము భక్తికి అధికారినిగా చేయుచున్నదని చెప్పుచున్నాడు.

54. శ్లో. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా । న శోచతి న కాఙ్క్షతి
సమ స్సర్వేషు భూతేషు । మద్భక్తిం లభతే పరామ్॥

అర్థము :- బ్రహ్మభూతః = శుద్ధాత్మస్వరూపావిర్భావము కలవాడును, ప్రసన్నాత్మా = నిర్మలస్వరూపుడును అయి, నశోచతి = దేనినిగూర్చియు దుఃఖించడు, నకాఙ్క్షతి = నాకంటెవేరుగ దేనినికోరడు, సర్వేషుభూతేషు = సకలభూతములయడలను, సమః = అనాదరములో సమదృష్టికలవాడై, పరాం = గొప్పదైన, మద్భక్తిం = నాయందత్యంత ప్రియానుభవరూపమైనభక్తిని, లభతే = పొందుచున్నాడు.

తా॥ అపరిచ్ఛిన్న జ్ఞానాకారము కలిగి, భగవంతునకే శేషభూతుడై యుండు స్వభావముగల శుద్ధాత్మ స్వరూపమావిర్భవించగనే నిర్మల స్వరూపుడై భగవంతునికంటె వేఱగు నే ప్రాణిని గురించియు దుఃఖించడు; దేనిని కోరడు; భగవంతునికంటె వేరైన భూతములను వేటినిగాని యాదరింపక అన్నిటియందును సమాన అనాదరణయే కలిగియుండును. అంతట పరమపురుషునియందత్యంత ప్రియానుభవరూపమగు గొప్ప భక్తి జనించును.

అవ. అట్టిభక్తి కలిగిన వెంటనే లభించునట్టియు, కాలక్రమమున కలుగునట్టియు ఫలభేదములను జెప్పుచున్నాడు.

55. శ్లో. భక్త్యామా మభిజానాతి । యావా న్యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా । విశతే తదనన్తరమ్॥

అర్థము :– భక్త్యా = ఇట్టిభక్తిచే, మాం = నన్ను, యావాన్ = ఎట్టిగుణములను విభూతులనుకలవాడనన్ను, యఃచఅస్మి = ఎట్టిస్వరూపస్వభావములు కలవాడనన్ను అగుచున్నానో, తత్త్వతః = యథార్థముగా, అభిజానాతి = తెలుసుకొనుచున్నాడు. మాం = నన్ను, తత్త్వతః = యథార్థముగా, జ్ఞాత్వా = తెలుసుకొని. తదనన్తరం = అయిపిమ్మట, తతః = ఆభక్తివలన, (మాం = నన్ను) విశతే = ప్రవేశించుచున్నాడు.

తా॥ ఇట్టి భక్తిచే నా స్వరూప స్వభావములను, నా గుణవిభూతులను వాస్తవముగ నెఱింగి వెనువెంటనే నిరుపమభక్తియుక్తుడై ఆ భక్తిచే నన్ను పొందుచున్నాడు.

అవ. ఇట్లు వర్ణాశ్రమోచితములగు నిత్యనైమిత్తికకర్మలను ఫలాశలేక భగవదారాధన బుద్ధితో నాచరించుటవలన కలుగుఫలమునుజెప్పి యిప్పుడు కామ్యకర్మనుకూడ నీవిధముగనే యనుష్ఠించినచో ఆ ఫలమునందే పర్యవసించునని జెప్పుచున్నాడు.

56. శ్లో. సర్వకర్మాణ్యపి సదా । కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి । శాశ్వతం పద మవ్యయమ్॥

అర్థము :– సర్వకర్మాణి అపి = కామ్యకర్మలనుకూడ, సదా = ఎల్లప్పుడును, మద్వ్యపాశ్రయః = కర్తృత్వాదులనుభగవంతునియందుంచినవాడై, కుర్వాణః = చేయుచున్నవాడై. మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలన, శాశ్వతం = స్థిరమైనఫలమగు, పదం = పొందదగిననన్ను, అవ్యయం = సాకల్యముగా, అవాప్నోతి = పొందుచున్నాడు.

తా॥ ఇట్లే కామ్యకర్మలను కూడా కర్తృత్వాదుల లన్నింటిని భగవంతుని యందుంచి నిరంతర మాచరించినచో భగవదనుగ్రహము వలన స్థిరమైన ఫలస్వరూపుడగు పరమ పురుషునే సాకల్యముగా లభించుచున్నాడు.

అవ. కావున నిక నర్జునునకు కర్తవ్యమును విధించుచున్నాడు.

57. శ్లో. చేతసా సర్వకర్మాణి । మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య । మచ్చిత్త స్సతతం భవ॥

అర్థము :– చేతసా = నీవు నావాడవును, నాచేనియమింపబడువాడవనుబుద్ధితో, సర్వకర్మాణి = నీవాచరించు వర్ణాశ్రమనిత్యనైమిత్తికాది కర్మలనన్నిటిని, మయి = నాయందు, సన్న్యస్య = విడిచిపెట్టి, మత్పరః = నన్నేవాటికి ఫలముగపొందదగినవానినిగా నమ్మినవాడవై, బుద్ధియోగం = వెనుకచెప్పబడిన పరమాత్మయందు కర్తృత్వానుసంధానాదిబుద్ధిని, ఉపాశ్రిత్య = అవలంబించి; సతతం = ఎల్లప్పుడును, మచ్చిత్తః = నాయందే మనస్సుంచినవాడవు, భవ = అగుము.

తా॥ ఆత్మలన్నియు పరమాత్మకు పరతంత్రములును ఆతనిచే నియమింపదగినవియు ననియెరింగి నీవును అట్టివాడవేగాన వర్ణాశ్రమాది ధర్మములను నిత్యనైమిత్తికాదికర్మల నన్నింటిని కర్తృత్వాదులతోసహా నాయందర్పించి ఇట్లాచరింపబడిన కర్మలకు ఫలము భగవత్ప్రాప్తియేయని విశ్వసించి వెనుక చెప్పబడిన ఆ బుద్ధినే యవలంబించి నిరంతరము నన్నే ధ్యానించుచుండుము.

58. శ్లో. మచ్చిత్త సర్వదుర్గాణి । మత్ప్రసాదాత్తరిష్యసి
అథచేత్త్వ మహఙ్కారా । న్నశ్రోష్యసి వినఙ్క్ష్యసి॥

అర్థము :– మచ్చిత్తః = నాయందు మనస్సునుంచినవాడవై, సర్వదుర్గాణి = సకల సాంసారికప్రతిబంధకములను, మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలననే తరిష్యసి = దాటగలవు. అథ = అట్లుగాక. త్వం = నీవు, అహఙ్కారాత్ = గర్వమువలన, నశ్రోష్యసిచేత్ = వినకుందువేని, వినఙ్క్ష్యసి = చెడిపోయెదవు.

తా॥ ఇట్లు నాయందు మనస్సునుంచి నీవర్ణాశ్రమాది ధర్మములనెల్ల నాచరించుచున్నచో సకల సాంసారిక ప్రతిబంధకములనున్న నా యనుగ్రహముచేతనే యతిక్రమించగలవు. ఇట్లుగాక నా కృత్యాకృత్యములను నేనే యెఱుంగుదునని గర్వించి నా యుపదేశములను పెడచెవిని బెట్టితివా చెడిపోయెదవు.

అవ. తన మాటలు వినక యుద్ధము మానినచో ననర్థముల పాలగుదువని చెప్పి యిక యుద్ధమును చేయకుండుటయే నీతరముకాదనియు, 'కర్మయోగమే యనివార్యమగుచో నీయుద్ధమే చేయనేల? వేఱొక కర్మనాచరించి వినాశమునుండి నన్నేల కాపాడుకొనరాదు? అను శంకకు సమాధానమును, ముందుశ్లోకములచే జెప్పుచున్నాడు.

59. శ్లో. యద్యహఙ్కార మాశ్రిత్య । న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే । ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥

అర్థము :— అహఙ్కారం = నాయొప్పును నేనేయెఱుంగుదుననెడు గర్వమును, ఆశ్రిత్య = అవలంబించి, న యోత్స్యే = నేనుయుద్ధమునుచేయను, ఇతి = అని, మన్యసేయది = తలంతువేని, ఏషః = ఈ, తే = నీయొక్క, వ్యవసాయః = అధ్యవసాయము, మిథ్యా = వ్యర్థమైనది, (భవతి = అగుచున్నది) ప్రకృతిః = (నీరాజస) స్వభావము, త్వాం = నిన్ను, నియోక్ష్యతి = ప్రవర్తింపజేయగలదు.

తా॥ నా మంచిచెడ్డల నేనే యెఱుంగుదుననెడు దురభిమానముతో నా యాజ్ఞనుల్లంఘించి యుద్ధమును చేయవేని నీ యీ స్వాతంత్ర్యాధ్యవసాయ మసత్యమే యగును. నీ రాజసక్షత్రియ స్వభావము నీచే తప్పక యుద్ధమును చేయించియే తీరును (నేను చెప్పినట్లుచేసిన నీభారమునంతను నేనేవహింతును. నీకు తోచినట్లు చేసిన నేనూరకుందును గాన నీవు ప్రకృతికి వశంవదుడవగుదువు. అది నిన్ను కూడని పనులకే కూర్చి చెరచును.)

60. శ్లో. స్వభావజేన కౌన్తేయ! । నిబద్ధస్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహా । త్కరిష్య స్యవశోఽపితత్॥

అర్థము :— కౌన్తేయ! = అర్జునా! యత్ = ఏయుద్ధమును, మోహాత్ = అజ్ఞానము వలన, కర్తుం = చేయుటకు, న ఇచ్ఛసి = కోరవో, తత్ = ఆయుద్ధమును, స్వభావజేన = (క్షత్రియునకు) సహజమగు, స్వేన = స్వకీయమైన, కర్మణా = శౌర్యమనెడుకర్మచే, నిబద్ధః = కట్టబడినవాడవై, అవశః అపి = పరవశుడవయ్యును, కరిష్యసి = చేయగలవు.

తా॥ ఇప్పుడజ్ఞానముచే చేయనొల్లని యీ యుద్ధమునే శత్రువుల తిర స్కారమును సహింపలేక నీక్షత్రియజాతికి సహజమగు శౌర్య ముచే ప్రేరేపింపబడి నీవు చేయదలంచకున్నను చేసియే తీరుదువు.

అవ. భగవంతుడు దాసీనుడైయున్నచో జీవుడేపనికైనను ఎట్లు ప్రవర్తించును? అట్లు స్వతంత్రముగా ప్రవర్తించినచో సర్వేశ్వరునకెట్లు సర్వకారణ త్వము ఘటించును? అను ప్రశ్నకుత్తరువుగా సకలప్రాణి జాతమున్ను సర్వేశ్వరునిచే తమ పూర్వకర్మానుసారముగ ప్రకృతి ననుసరించవలసి నదిగా నియమింపబడినదని చెప్పుచున్నాడు.

61. శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం । హృద్దేశేఽర్జున ! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని । యన్త్రారూఢాని మాయయా॥

అర్థము :— ఈశ్వరః = సర్వనియామకుడగు సర్వేశ్వరుడు, సర్వభూతానాం = సకల ప్రాణులయొక్క, హృద్దేశే = హృదయస్థానమునందు, యన్త్రారూఢాని = దేహమనెడుయంత్రము నధిష్టించియున్న, సర్వభూతాని = ప్రాణులనన్ని టిని, మాయయా = (తన) ప్రకృతిచేత, భ్రామయన్ = (గుణానుగుణ ముగ) నడిపించుచు, తిష్ఠతి = ఉన్నాడు.

తా॥ సర్వనియామకుడగు సర్వేశ్వరుడు తన సంకల్పముచే దేహేంద్రి యములుగా పరిణమించిన ప్రకృతి యనెడు యంత్రము నధి ష్ఠించియున్న ప్రాణుల నన్నిటిని తన యధీనమందున్న ప్రకృతి చేత వారివారి గుణముల ననుసరించి నడిపించుచు జ్ఞానము దయించు హృదయ ప్రదేశమునందున్నాడు.

అవ. స్వతంత్రుడైన సర్వేశ్వరుడిట్లు తనయధీనమందున్న ప్రకృతిద్వారా ప్రేరే పించుచుండ పరతంత్రులగు జీవులెట్లు దాని బారినుండి బయట పడగల రను శంకకుత్తర మొసంగుచున్నాడు.

62. శ్లో. తమేవ శరణం గచ్ఛ । సర్వభావేన భారత !
తత్ప్రసాదాత్పరాం శాన్తిం । స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

అర్థము :- భారత! = ఓ అర్జునా!, తంఏవ = ఆసర్వేశ్వరునే, సర్వభావేన = అన్ని విధములచేతను, శరణంగచ్ఛ = అనువర్తింపుము, తత్ప్రసాదాత్ = ఆ సర్వేశ్వరుని యనుగ్రహమువలన, పరాం = ఉత్తమమైన, శాన్తిం = సర్వకర్మనివృత్తిని, శాశ్వతం = పునరావృత్తిలేని, స్థానం = పరమపదము నున్ను, ప్రాప్స్యసి = పొందగలవు.

తా॥ అట్టి సర్వేశ్వరుని ఆజ్ఞను శిరసావహించి నడచుకొనుము. ఇదియే యిచ్చట శరణాగతి. అట్లు చేసినచో నీయందాతనికి అనుగ్రహము జనించును. దానిచే నీకు బంధకములగు కర్మలన్నియు నశించును. దానిచే శాశ్వతమైన పరమ పదమును పొందగలవు.

అవ. ఇట్లర్జునుని యుద్ధమునకు ప్రోత్సహించు నెపమున చెప్పవలసిన వేదాంతార్థముల నన్నిటిని చెప్పి కర్మయోగాది యేనిష్ఠ నవలంబించినను నిత్యకర్మానుష్ఠాన మనివార్యమని తెలుపుటకై చివరకు తిరిగి యుద్ధమునకై ప్రోత్సహించెను. ఇప్పుడిక విననలసినదేదియు లేదని తెలుపుటకై, కర్మజ్ఞాన భక్తియోగములనుగూర్చి చెప్పవలసినదంతయు విస్తారముగా చెప్పితినిగాన ఎవరియోగ్యతకు తగినట్లు వారాచరించవలెననిచెప్పి ముగించుచున్నాడు.

63. శ్లో. ఇతి తే జ్ఞాన మాఖ్యాతం । గుహ్యా ద్గుహ్యాతరం మయా
విమృశ్యైత దశేషేణ । యథేచ్ఛసి తథా కురు॥

అర్థము :- ఇతి = ఇట్లు, తే = నీకు, మయా = నాచేతను, గుహ్యాత్ = రహస్యముకంటె, గుహ్యతరం = మిక్కిలి రహస్యమైన, జ్ఞానం = కర్మజ్ఞాన భక్తియోగములనుగూర్చినజ్ఞానము, ఆఖ్యాతం = చెప్పబడినది, ఏతత్ = దీనిని, అశేషణ = పూర్తిగా, విమృశ్య = విమర్శించి, యథా = ఏవిధముగా, ఇచ్ఛసి = కోరుచున్నావో, తథా = అవిధముగా, కురు = చేయుము.

తా॥ ఇట్లు నీకు నేను ముముక్షువు తెలియంగదగిన రహస్యమైన కర్మ జ్ఞానభక్తి యోగములను గూర్చి చెప్పవలసినదంతయు జెప్పితిని. దీనినంతను తెస్సగ సాకల్యముగ విమర్శించి నీ యోగ్యతకు తగి నట్లు నీకు తోచిన రీతిగా కర్మయోగమునో జ్ఞానయోగమునో భక్తియోగమునో అనుష్ఠింపుము.

అవ. అన్నిటికి మిన్నయగు గీతాశాస్త్రసారభూతమగు రహస్య తమార్థము నుపదేశింతునని శ్రీకృష్ణుడర్జునునకు ప్రతిన గావించుచున్నాడు.

64. శ్లో. సర్వగుహ్యతమం భూయః । శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి । తతో వక్ష్యామి తే హితమ్॥

అర్థము :— సర్వగుహ్యతమం = రహస్యములన్నిటిలోను మిక్కిలి గొప్పరహస్య మైనట్టియు, పరమం = గొప్పదియునగు, మే = నాయొక్క, వచః = మాటను, భూయః = తిరిగి, శృణు = వినుము, (త్వం = నీవు) మే = నాకు, దృఢం = మిక్కిలి, ఇష్టః = ప్రియుడవు, అసి = అగుచున్నావు, ఇతి తతః = అనుదానివలన, తే = నీకు, హితం = హితమును, వక్ష్యామి = చెప్పగలను.

తా॥ రహస్యము లన్నిటిలోను భక్తియోగమే శ్రేష్ఠమగుటచే గుహ్య తమమని యిదివరకే చెప్పబడెను. తిరిగి దానిని గూర్చియే చెప్పు చున్నాను. ఈమాట చాలా గొప్పది. శ్రద్ధగా వినుము. నీవు నాకు మిక్కిలి ఇష్టుడవుగాన నీకీహితము నుపదేశించుచున్నాను.

అవ. ఫలము అనిష్టనివృత్తి ఇష్టప్రాప్తియని రెండు విధములుగా నుండును. అందు కర్తవ్యపురస్సరముగ ఇష్టప్రాప్తి యీశ్లోకమున చెప్పబడు చున్నది. అనిష్టనివృత్తి ముందుశ్లోకమున జెప్పబడును.

65. శ్లో. మన్మనా భవ మద్భక్తో । మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే । ప్రతిజానే ప్రియోఽసి మే॥

అర్థము :— మద్భక్తః = నాయందత్యంత పీతికలవాడవై మన్మనాః = నాయందు మన స్సుకలవాడవున్ను, మద్యాజీ = నన్నారాధించువాడవున్ను, భవ = అగుము, మాం = నన్ను గూర్చి, నమస్కురు = అత్యంత ప్రీతితో దండ వత్సాష్టాంగముగా నమస్కరింపుము, మాం ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు, మే = నాకు, ప్రియః = ఇష్టుడవు, అసి = అగుచున్నావు, సత్యం = సత్యము, తే = నీకు, ప్రతిజానే = ప్రతిజ్ఞచేయుచున్నాను.

తా॥ నాయందత్యంత ప్రేమకలవాడవై నన్నుగూర్చి మిక్కిలి ప్రీతి రూపమైన ధ్యాన పరంపరను సాగింపుము. అత్యంత ప్రీతితో నా యారాధనను గావింపుము. నాయందలి ప్రీతి పారవశ్యమున వినయమును జూపుచు భక్తిభారముచే నేలకంటిన అష్టాంగములు కలవాడవగుము. ఇట్లు గావించినచో నన్నే బడయగలుగుదువు. నీవు నాకు మిక్కిలి యిష్టుడవగుటచే ఇది నిజమని నీకు శపథము చేసి జెప్పుచున్నాను. (నాయందింత ప్రీతికలవానిని విడిచి నేనుండ జాలను గాన వానిని నా చెంతకు తీసుకొందును.)

అవ. ఈశ్లోకమున కర్తవ్యమానసిక విధిపురస్సరముగనే అనిష్ట నివృత్తిని జెప్పుచున్నాడు.

66. శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య । మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో । మోక్షయిష్యామి మా శుచః॥

అర్థము :— సర్వధర్మాన్ = సకలమోక్షసాధనములను, పరిత్యజ్య = ఫల సంగ కర్తృత్వములను మాత్రమువిడిచి, మాంఏకం = నన్నే, శరణం = ఉపాయ ముగా, వ్రజ = అనుసంధించుము, అహం = నేను, త్వా = నిన్ను, సర్వపాపేభ్యః = నన్ను పొందుట కాటంకములుగానున్న పాపములన్నిటి నుండియు, మోక్షయిష్యామి = విడిపింతును, మాశుచః = దుఃఖింపకుము.

తా॥ మోక్షసాధనములుగా జెప్పబడిన కర్మజ్ఞాన భక్తియోగములను నేను కర్తను ఫలభోక్తను యీ కర్మ నాదియనెడు కర్తృత్వ భోక్తృత్వ మమకారములను విడిచి పరమపురుషుని నియమనముచే నను ఆయన ప్రీతికొఱకే చేయుచున్నాననను విశ్వాసముతో జేయుచు నన్నే ఉపాయముగా నమ్మియుండుము. నేను, నిన్ను నన్ను పొందకుండ నాటంకపరచుచున్నట్టి సకల పాపరాశి నుండియు నుద్ధరింతును. ఇక దుఃఖింపకుము. (ఈ శ్లోకము ప్రపత్తి పరమని సంప్రదాయము. శ్రీవైష్ణవులందరు నీ శ్లోకమును మంత్రముగా నాదరించి గురుముఖతః పంచ సంస్కారపురస్సరముగ దీని నుపదేశ పూర్వకముగ బడయుదురు,)

అవ. ఇట్లు తన ఉపదేశముచే తత్వహితజ్ఞానము నెలకొనియున్న యర్జునునకు కర్తవ్యము నుపదేశించు నెపమున (సంప్రదాయవిధిసిద్ధించుటకై) యీశాస్త్రమున కనధికారుల నెఱింగించుచున్నాడు.

67. శ్లో. ఇదం తే నాఽతపస్కాయ । నాఽభక్తాయ కదాచన
నచాఽశుశ్రూషవే వాచ్యం । న చ మాం యోఽభ్యసూయతి॥

అర్థము :- ఇదం = ఈగీతాశాస్త్రము, తే = నీకు, అతపస్కాయ = తపస్సుచేయనివానికొఱకు, న వాచ్యం = చెప్పతగదు. అభక్తాయ = భక్తిలేనివానికొఱకు కదాచన = ఒకప్పుడుకూడా, న (వాచ్యం) = చెప్పతగదు. అశుశ్రూషవేచ = శుశ్రూషచేయనివానికొఱకును, న (వాచ్యం) = చెప్పతగదు. మాం = నన్నుగూర్చి, యః = ఎవడు, అభ్యసూయతి = అసూయపడుచున్నాడో, (తస్మైచ = వానికిన్నీ), న చ వాచ్యం = చెప్పతగదు.

తా॥ ఈ గీతాశాస్త్రరహస్యమును నీవు శాస్త్రోక్తములగు భోగసంకోచము చేయనివానికిగాని, అది చేసినను ఉపదేశించు నీయందును నాయందును భక్తి లేనివానికిగాని భక్తులైనను శుశ్రూష చేయనివారికిగాని, నా స్వరూపమును ఐశ్వర్యమును గుణములను విని దోషములనే యాపాదించువానికిగాని చెప్పకుము.

అవ. ఈ గీతాశాస్త్రమును తగిన యధికారులకు తప్పక చెప్పవలెననియు దానికి ఫలము మోక్షమేయనియు చెప్పుచున్నాడు.

68. శ్లో. య ఇదం పరమం గుహ్యం । మద్భక్తే ష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా । మామే వైష్య త్యసంశయః॥

అర్థము :- యః = ఎవడు. ఇదం = ఈ. పరమం గుహ్యం = గొప్ప రహస్యమును. మద్భక్తేషు = నా భక్తులలో. అభిధాస్యతి = వ్యాఖ్యానముచేయునో. (సః = వాడు). మయి = నాయడల. పరాం = గొప్పదైన. భక్తిం = భక్తిని. కృత్వా = చేసి. మాం ఏవ = నన్నే. ఏష్యతి = పొందగలడు. అసంశయః = సందేహములేదు.

తా॥ ఈ రహస్యశాస్త్రమును వినుట కధికారముగల నా భక్తుల గోష్ఠిలో నెవడు అర్థవిశేషములతో నుపన్యసించునో వాడు నాకు పరమ భక్తుడగుచున్నాడు. గాన నన్నే తప్పక పొందగలడు.

అవ. ఇంకను ప్రచారమునకే ఫలమును జెప్పుచున్నాడు.

69. శ్లో. న చ తస్మా న్మనుష్యేషు । కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మా । దన్యః ప్రియతరో భువి॥

అర్థము :- మనుష్యేషు = మనుష్యులయందు. తస్మాత్ = ఆ విధముగా గీతారహస్యార్థములను భక్తులకు పదేశించు భక్తునికంటె. మే = నాకు. ప్రియకృత్తమః = ఇంతకుమించిన మిక్కిలి ప్రియమును చేయువాడు. కశ్చిత్ = ఒకానొకడున్ను. నచ = లేనేలేడు. తస్మాత్ = వానికంటె. అన్యః = వేరైన. ప్రియతరః = మిక్కిలి ఇష్టుడు. భువి = భూమియందు. మే = నాకు. న చ భవితా = ఇకముందును ఉండబోడు.

తా॥ ఆ విధముగ నీ గీతారహస్యార్థములను నా భక్తగోష్ఠిలో ప్రచారము చేయువానికంటె ప్రియుడు మనుష్యులలో వేఱొకడులేడు. ఇక ముందుండబోడు.

అవ. గీతాశాస్త్రోపదేశకునకు ఫలమును జెప్పి ఇక దీనిని గురుముఖతః, అర్థ యుక్తముగాగాని శబ్దమాత్రముగాని ఉపదేశమును బడయునట్టి భక్తునకు ఫలమును జెప్పుచున్నాడు.

70. శ్లో. అధ్యేష్యతే చ య ఇమం । ధర్మ్యం సంవాద మావయోః॥
జ్ఞానయజ్ఞేన తేనా హ । మిష్ట స్స్యామితి మే మతిః॥

అర్థము :- యః = ఎవడు, ఇమం = ఈ, ధర్మ్యం = ధర్మయుక్తమైన, ఆవయోః = మన యిద్దరియొక్క, సంవాదం = సంభాషణ రూపమైన గీతాశాస్త్రమును, అధ్యేష్యతేచ = గురుముఖతః అర్థముతోగాని శబ్దమాత్రమునుగాని విను చున్నాడో, తేన = వానిచేత, జ్ఞానయజ్ఞేన = జ్ఞానమనెడు యజ్ఞముచేత, ఇష్టః = ఆరాధింపబడినవాడను, స్యామ్ ఇతి = అగుదునని, మే = నాయొక్క, మతిః = నిశ్చయము.

తా॥ ధర్మయుక్తమైన యీ మన యిద్దరి సంవాద రూపమగు గీతా శాస్త్రమును గురువుద్వారా అర్థయుక్తముగనో శబ్దమాత్ర మునో వినువాడు జ్ఞానయజ్ఞముతో నన్నారాధించినట్లు నేనా నందింతును. ఇది నా నిశ్చితాభిప్రాయము.

అవ. తాను చదువజాలకున్నను గురుముఖతః వినుటకును, వినజాలకున్నను చదువువారిని వినువారిని జూచి అసూయ పడకుండుటకును ఫలమును జెప్పున్నాడు.

71. శ్లో. శ్రద్ధావా ననసూయ శ్చ । శృణుయా దపి యో నరః
సోఽపిముక్త శ్శుభాల్లోకాన్ । ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥

అర్థము :- యః = ఏ, నరః = మనుష్యుడు, శ్రద్ధావాన్ = విశ్వాసము కలవాడును, అనసూయఃచ = అసూయలేనివాడును అయి, శృణుయాత్ అపి = విని నప్పటికిని, సః అపి = వాడున్ను, ముక్తః = పాపములవలన విడువడిన వాడై, పుణ్యకర్మణాం = పుణ్యకర్ములగు నా భక్తులయొక్క, శుభాన్ = శుభములైన, లోకాన్ = సమూహములను, ప్రాప్నుయాత్ = పొందును.

# వైదిక ఆధ్యాత్మిక విద్యానిధి సంఘము

శ్రీమన్నారాయణ రామానుజ జీయరు అనేక మంగళాశాసనపూర్వకముగా తెలియజేయునది.

ప్రియ భాగవతోత్తములారా!

శ్రీమతే నారాయణాయనమః

వైదికమైన ఆధ్యాత్మిక విద్యలే శుభాకర సాధనములైనవి అందును శ్రీవైష్ణవులకు [illegible]త్వమునకుగాని మోక్షప్రాప్తికిగాని స్వరూపానుగుణమైన జీవితమునకుగాని సాంఘిక గౌరవ - సౌభాగ్యములకుగాని ఇవి అత్యంతప్రధానములై యున్నవి

గాని కాలప్రభావమున, అటు ప్రభుత్వ సమాదరణముగాని యిటు ప్రజల సమాదరణముగాని లేని కారణముచేతను, ఆర్థికచిక్కులచేతను, ఈనాడు ఈ విద్యలు క్రమక్రమముగ తగ్గిపోయి నామమాత్రావశేషములై యున్నవి.

ఈ కారణముగ స్వస్వరూపప్రాప్తిలో లోపమేగాకుండగ, సాంప్రదాయ విస్మరణమున్ను, మరియు సాంఘిక గౌరవమర్యాదలలోపమున్ను తటస్థించుచున్నవి.

ఆచార్య పురుషత్వమును వహించి ఆసేతుశీతాచలపర్యంతము రాజులు జమీందారులు, సంపన్నులు మున్నగువారిచే సమస్తమర్యాదలను మన్ననలను పొందుచు, అగ్రహారములతోను, అఖండ వైభవములతోను ప్రకాశించుచుండిన శ్రీవైష్ణవులు, వీటన్నిటికి కారణమైన విద్యలు లేకపోవుటచే నానాటికి చమురులేని దీపమువలె, అగ్నిలేని ఇంధనమువలె నిస్తేజస్కులై, చివరకు [illegible] క్రిందను, వెనుకబడిన జాతుల క్రిందను చెప్పుకొని జీవించవలసినంత హీనస్థితికి దిగజారిపోవుచున్నారు.

విద్యాభ్యాసమునకున్న, విద్యాభివృద్ధికిని కారణము, దోహదము అయిన శ్రీవైష్ణవ సాంప్రదాయవాఙ్మయము కూడ ఈనాడు కరువైపోయినది - నాలాయిర ప్రబంధములు లేవు. వాని వ్యాఖ్యానములు అసలే లేవు. భగవద్విషయకోశములు దుర్లభ్యములైపోయినవి శ్రీభాష్యగ్రంథములు దొరకుటయే లేదు ఇంతెయేమి. వీరరాఘవ వ్యాఖ్యాన సహిత శ్రీమద్భాగవతము గాని, గోవిందరాజీయ వ్యాఖ్యానసహిత శ్రీమద్రామాయణముగాని లభించుట కవకాశములేదు. ఇవి సూచనామాత్రముతో మొత్తముమీద వైష్ణవవాఙ్మయములు [illegible]మగుచున్నది.

శ్రీవైష్ణవసాంప్రదాయమున వాఙ్మయమున కెట్టిలోపమున్ను లేదు. ఇదివరలో కొద్ది కాలము క్రిందటను ఆవశ్యకములగు చాల గ్రంథములను మహానుభావు లనేకమంది అచ్చువేసిరి. అవి పురాతనమైపోయినవి ఉపయోగపడు స్థితినితప్పినవి క్రొత్తగతిర్గి అచ్చుపడుటలేదు.

ఈ కారణమున శ్రీవైష్ణవసాంప్రదాయమున వాఙ్మయమే లేదను లిపీవాదమునకు గురి కావలసిన స్థితి కలిగినది.

మూలకారణమైన విద్యావాఙ్మయములు తగ్గుటతోడనే దానివలన కలుగు వినయము-ధనము-ధర్మము - సౌఖ్యము ఇత్యాదులు తగ్గినవి - వాని స్థానమున అహంభావము - దారిద్ర్యము - అవినీతి - అశాంతులు అధిష్ఠించినవి దాసోహస్థితి సోహం క్రింద మారుచున్నది. విశ్వసౌభ్రాతృత్వము అవిశ్వాస వంచనలుగ పరిణమించుచున్నది

ఇంకను ఇట్టి అనేక అనర్థములు వైదిక - ఆధ్యాత్మిక విద్యాలోపము వలన తటస్థించుచున్నవి.

అందువలన వైదిక అధ్యాత్మికవిద్యలను చదువుకొనువారికి తగు సహాయములఁ జేసి ప్రోత్సహించుట కొరకును.

చదువుకొనుచున్నవారికి తగు ఉత్సాహ - గౌరవమర్యాదలు, సిరిసంపదలు కలుగఁజేయుట కొరకును, [illegible] సంప్రదాయ గ్రంథ ముద్రణ ప్రచార ప్రసంగాదికములకొరకును,

పత్రికా ప్రచురణ, గ్రంథప్రకటనాదులకొరకును, సాంఘిక సాంప్రదాయస్థులు తరుచు సమావేశములను ఏర్పాటు చేసుకొనుచు పొందుచుండుట కొరకును శ్రీకూర్మమునందు నూతన పశ్చిమ ధ్వజ స్తంభ ప్రతిష్ఠన యందున గలిగిన భగవత్ప్రేరణ వలన ది. 16—5—1960 తేదీని "వైదిక ఆధ్యాత్మిక విద్యానిధి సంఘము" అను పేరుతో ఒక నూతన సంస్థాకార్యక్రమమును ఏర్పాటు చేయడమైనది.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము తరఫుననే ఇదివరలో లౌకిక-ఆధ్యాత్మిక విద్యాభివృద్ధికై "[illegible]" అను పేరుతో ఒక కార్యక్రమము ప్రారంభించబడినది గాని అనేక కారణములచే ఆ కార్యక్రమము కొనసాగుటలేదు. అందుచే యిప్పుడు ఆ కార్యక్రమముచే కేవల వైదిక అధ్యాత్మిక విద్యలవరకే పరిమితపరచి, ప్రత్యేక స్వతంత్రసంస్థ నేర్పాటును జేసి దానికీ బాధ్యతను అప్పగించడమైనది. ఈ సంస్థకు ప్రత్యేకబుద్ధితో కార్యాలయమును నడప చేయుటకై శ్రీకూర్మములోని శ్రీమద్విద్యాది శ్రీమాన్ కందాళై శ్రీనివాసాచార్యులుగారును, శ్రీభాష్యంకూర్మాచార్యులు గారును అంగీకరించి యున్నందునను, మరియు వీరికి సహాయులుగనుండి పనిచేయుటకు శ్రీమత్తిరుమల పెద్దింటి అప్పలాచార్యులుగారును, శ్రీభాష్యం వెంకటాచార్యులుగారును అంగీకరించియున్నందున తాత్కాలికముగ కేంద్రకార్యాలయమును శ్రీకూర్మమునచే ఉంచడమైనది - ఉత్సాహవంతులైన పెద్దలతో కేంద్రసంఘ కార్య కారిణి సమితి ఏర్పాటుచేయడమైనది. మరియు శ్రీమద్విద్యాతి శ్రీమాన్ తిరుమల పెద్దింటి కూర్మాచార్యులుగారిని కేంద్రకార్యాలయకార్యదర్శిగ ఏర్పాటుచేయడమైనది గాన ఈ పర్యాయమీ సదుద్యమము చక్కగా పనిచేయగలదని విశ్వసించుచున్నాము.

కాన ఈ ఉద్యమమున ఆసక్తి - సానుభూతి గలవారందరును తమతమ గ్రామములలోను, ప్రాంతములలోను ఈ "వైదిక-ఆధ్యాత్మిక విద్యానిధి సంఘశాఖలను స్థాపించి పని చేయఁగోరుచున్నాము.

ఈ సంఘస్థాపనవలన నూతన బాధ్యతలు గాని ఆర్థికచిక్కులుగాని ఏమియు తటస్థించవు-ప్రతివారును తమ తమ గృహములలో జరుగు శుభాశుభముల కెటులను ఏదో కొంత ద్రవ్యమును ఖర్చుచేయక మానరుగదా. అట్టి సమయములలో ఆఖర్చులతోపాటుగనే కనీస [illegible]-రూపాయలు చొప్పున ఈనిధికై సమర్పించుటలో ఎవరికిని ఎట్టి యిబ్బందియును అభ్యంతరమును యుండజాలదు. ఇక ఆదాయమునుబట్టి ఈనిధికి ఏమైన యివ్వదలచినవారికి కూడ ఎట్టి అభ్యంతరము యుండకూడదు. ఆదాయమున్నప్పుడుమాత్రమే కదా అందులోని కొంచము నూరోవంతును మాత్రము భగవద్భాగవతారాధన కైంకర్యరూపముగ ఈ నిధికి సమర్పించుట దీనివలన అట్టివారికి మరింత అధిక ఆదాయము, కీర్తిప్రతిష్ఠలు - ముఖ్యముగ బ్రహ్మయజ్ఞ సత్ఫలితము కలుగుచున్నపుడు ఈ స్వల్పకైంకర్యమునకు కూడ ఎట్టి అభ్యంతరము ఎవరికిని యుండజాలదు. ఈ కార్యక్రమమునకు సంబంధించిన సంగ్రహ నియమావళి, సంఘప్రారంభమునకు వలయు దరఖాస్తు విధానము ఈ పత్రికలోనే తెలుపడమైనది.

కావున మహాశయులందరును తప్పక ఈ సంఘశాఖలను విరివిగ స్థాపించి ఈ ఉద్యమవ్యాప్తి ద్వారా అభ్యుదయమును అభ్యున్నతిని పొందగోరుచున్నాము శ్రియఃపతి మీకందరకును యిట్టి ఉత్సాహమును, అవకాశమును కృపజేయుగాక.

ఈ సంఘనియమావళులు, దరఖాస్తుఫారములు, రశీదుపుస్తకములు, కేంద్రకార్యాలయమునకు వ్రాసినచో పంపబడగలవు.



శ్రీమతే రామానుజాయనమః

# వైదిక ఆధ్యాత్మిక విద్యానిధి సంఘ

# సభ్యత్వ దరఖాస్తు

## శ్రీ వైదిక ఆధ్యాత్మిక విద్యానిది సంఘాధ్యక్షులకు

అయ్యా !

నేను ఈ సంఘనియమావళిని పూర్తిగ పఠించితిని. వానినన్నిటిని నేనంగీకరించుచు ఈ సంఘమున సభ్యునిగ నుండగోరుచున్నాను.

సంతకము

తేది.

పూర్తిపేరు :-

తండ్రిపేరు :-

గోత్రము :-

శాఖ :-

వయస్సు :-

విద్యావివరములు :-

వృత్తి :-

కుటుంబవివరములు :-

నిఖరాదాయము :-

సభ్యత్వ వివరము :-

ఇతరవివరములు :-

అంగీకరించబడిన తేది :- అధ్యక్షులసంతకం.

సభ్యత్వసంఖ్య :- కార్యదర్శిసంతకం.

కేంద్రకార్యాలయము.
S. T. P. V. కూర్మాచార్యులు
కార్యాలయ కార్యదర్శి
శ్రీకూర్మం, శ్రీకాకుళంజిల్లా.



శ్రీమతే రామానుజాయ నమః

# వైదిక ఆధ్యాత్మిక విద్యానిధిసంఘము (తీర్మానములు)

1. ఉద్దేశ్యము:- శ్రీభగవద్రామానుజ సిద్ధాన్తానుయాయులైన తప్తచక్రాంకిత పరులైయుండు గొల్లకొండవ్యాపారులు, నియోగులు, వైదికులు, పాంచరాత్రులు, వైఖానసులు అను సర్వశాఖీయ బ్రాహ్మణ శ్రీవైష్ణవులలోను స్త్రీపురుష భేదము లేకుండ ఆశ్రమభేదముగాని వయోనియమముగాని లేకుండగ అందరకున్ను వైదిక ఆధ్యాత్మిక విద్యాప్రాప్తి ప్రచారము లకై ఒకనిధి ఆవసరమైయున్నది.

వైదిక ఆధ్యాత్మిక విద్యయనగా ఆధ్యాత్మికవిషయమును దెలుపునట్టి పూర్వోత్తరభాగ విశిష్టమైన వేదములు వేదాంగములగు శిక్ష, వ్యాకరణము, ఛన్దస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము. తర్కము, పూర్వోత్తర మీమాంసా శాస్త్రములు, వేదోపబృంహణములగు స్మృతి, సూత్ర ఇతిహాస, పురాణ, ఆగమములు, గృహ్యసూత్రములు, నాలాయిర దివ్యప్రబంధములు, వాని వ్యాఖ్యానములు, అష్టాదశరహస్యాది గ్రంథములు, వీనిని ఉపయోగించు సంస్కృతభాష ఇత్యాదులు, వీనికిసంబంధించిన గ్రంథములను, పత్రికలను, కరపత్రాదులను ప్రచురించుట మరియు వీని అధ్యయన అధ్యాపనలకై పాఠశాలలను, కాలక్షేపకూటములను సమావేశములను ముమ్మరముగానిని ఏర్పాటుచేయుట, ఉచిత వేతనములను సన్మానములను సంభావనలను ఉపకారవేతనములను ముమ్మరముగానిని యిచ్చుచుండుట, ముమ్మరమునకై యీనిధి ఉపయోగింపబడవలయును. ఈకార్యనిర్వాహణమునకై యొక సంఘము ఏర్పాటు చేయబడుచున్నది-

పేరు- వైదిక ఆధ్యాత్మిక విద్యానిధి సంఘమని పేరు

సభ్యత్వము:- ఈ సంఘమునందు సభ్యత్వము మూడుతరగతులుగ విభజింప బడుచున్నది. దరఖాస్తునిచ్చి అది యంగీకరింపబడిన పిమ్మట ఒక సంవత్సరము గడచినతరువాత నుండి మాత్రమే ఈసంఘమున సభ్యత్వము ప్రారంభమగును. గాని దరఖాస్తునిచ్చినప్పటినుండియునుకూడ సభ్యత్వచందాధనమును చెల్లించు చుండవలయును. తమతమ గృహములలో జరుగు ప్రతి శుభాశుభ కార్యములయందు కనీసము 1 రూపాయికి తక్కువకాకుండగ సంభావనను ఈ నిధికై సమర్పించు చుండవలయును. మరియు తమగృహములలో జరుగు తిరుప్పావై యనుసంధానముల యందునుగూడ భోక్తలకు సమర్పించు సంభావనలతోపాటుగ మరియొక అధిక సంభావనను ఈనిధికై సమర్పించు చుండవలయును. ఈ విధముగ సమర్పించు చుండువారు ఈ సంఘ సామాన్య సభ్యులు-

2 సామాన్య సభ్యత్వముతోపాటుగ మరియు తమకువచ్చు నెలవారీ లేక సంవత్సరవారీ నిఖరాదాయములో ఒక రూపాయికి ఒక నయాపైసకు తక్కువకాకుండగ ఈ నిధికి సమర్పించుచుండవలెను ఏకాపక్షమైతే నేమి సాలు 1కి కనీసము రు 12/- లకు తక్కువ కాకుండగ సమర్పించు నట్టివారుకూడ ఈ సంఘ సహాయక సభ్యులు

## పోషక సభ్యులు

3 ఈ సంఘ సామాన్య సభ్యత్వముతోపాటుగ మరియున్ను ఒకే పర్యాయము కనీసము రు 100/-లకు తక్కువ కాకుండగ శాశ్వతనిధికై సమర్పించవలయును. ఇట్టివారు పోషక సభ్యులు.

ఒకగాక ఉదారులగువారు తమకు తోచిన విధముగ అధిక మొత్తములను చందాస్థిరాస్తులను శాశ్వతేతర నిధులుగ గాని శాశ్వతనిధులుగగాని సమర్పించవచ్చును

శాశ్వత నిధులుతప్ప మిగత నిధులను పూర్తిగ అవసా యీ సంవత్సరమునందే ఖర్చు చేయవచ్చును. శాశ్వత నిధులను గవర్నమెంటుచే గుర్తింపబడిన బ్యాంకులలోగాని ఈ సంఘమువారు నిర్ణయించు స్థిరాస్థిరూపములోగాని ఉంచి వాటిపై వచ్చు సాలీనా నికరాదాయములను మాత్రమే సాలీనా ఖర్చుచేయుచుండవలెను.

శాశ్వతనిధిలోని అసలు ద్రవ్యము వ్యయపరచరాదు. నిర్ణీతమగు మొత్తములకన్న అధికధనము వ్యక్తులవద్ద నుంచరాదు. సంఘముయొక్క యిద్దరు సభ్యుల సంతకతో బ్యాంకులో యీసొమ్ము భద్రపరచుచుండవలెను. జమా, ఖర్చు లెక్కలన్నిటిని పూర్తిగ వ్రాతమూలముగ ఆడిటరునకు తగినట్లుంచవలెను.

## 3 కార్యవిధానము

1) ప్రతి గ్రామమునకు ప్రత్యేక ప్రత్యేకముగ గ్రామసంఘము లుండవచ్చును లేదా కొన్నింటిని కలుపుకొనవచ్చును.

2) అన్ని గ్రామసంఘములకు కలసి ఒక కేంద్రసంఘముండును.

3) ప్రతి సంఘమునకు అధ్యక్షు, ఉపాధ్యక్షు, కార్యదర్శి, కోశాధికారి, అను అయిదుగురు సభ్యులుగల కార్యకారిణీ సమితి యుండవలెను

4) ప్రతి సంఘముయొక్క కార్యకారిణీ సమితియు ఆరు మాసములకు మించకుండగ అవసరమైనప్పుడెల్ల సమావేశమగుచుండవలెను.

5) ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసములోను సర్వసభ్య సమావేశము జరుగవలెను. అందు నూతన కార్యకారిణీ సమితిఎన్నుకొనబడవలెను. జమాఖర్చులు విన్నవింపబడవలెను.

6) అన్ని సమావేశములలోను నిర్ణీత సంఖ్యలో మూడవ వంతు కోరముగనుండును.

7) అన్ని సమావేశములలోను అధిక సంఖ్యాకుల అభిప్రాయానుసారముగ మాత్రమే కార్యక్రమము నిర్ణీతమై తదనుగుణముగనే అమలు జరుగుచుండవలెను.

8) ఈ సభోద్దేశనిబంధనలకు విరుద్ధముగ వర్తించుట ఈ సంఘమునకు కష్టనష్టములుగాని అపకీర్తిగాని కలిగించుట, లేదా కార్యనిర్వహణకు వీలుగాకుండునట్టి అనారోగ్యముగాని, అవయవలోపముగాని, అపకీర్తినిగాని కలిగియుండుట సంఘముయొక్క విశ్వాసమును గోల్పోవుట మున్నగునవి. సభ్యత్వ అనర్హతగ పాటింపబడును.

9) ఏ కారణముచేతనైనను గ్రామ సంఘములు రద్దైనచో దానియొక్క నిధులు బాధ్యతలు అన్నియును అప్పటి కున్న కేంద్రసంఘమునకున్ను కేంద్రసంఘములు రద్దైనచో అప్పటికి కనీసము 3 సంవత్సరములనుండి పని చేయుచున్న గ్రామ సంఘములకున్నూ సంక్రమించును.

10 ప్రతిగ్రామ సంఘమున్ను తమకు వసూలైన సాంవత్సరిక నికరాదాయములో సగము సొమ్మును. తమగ్రామములోనే గాని తమకిష్టమైన ప్రాంతమందుగాని ఖర్చు చేసికొనుచుండ వలయును. మిగత సగము సొమ్మునుప్రతి సం॥రపు



శ్రీమతే రామానుజాయనమః

## —: శ్రీభాష్య కాలక్షేప ప్రవేశప్రార్థనా పత్రము :—

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శులకు,
శ్రీ వాసుదాసాశ్రమము, వడిగడ్డపాలెము.

అయ్యా!

మీరు ఏర్పరచుచున్నట్టి "ఉభయ వేదాన్త విద్యాలయములో" శ్రీభాష్యమును, మీరేర్పరచిన నియమముల ననుసరించుచు తప్పకుండగ వరుసగ నాలుగు సంవత్సరములు అధ్యయనమును చేయుటకు ప్రతిన నొనర్చుచు, దాసుని ఈ విద్యాలయమున ఒక విద్యార్థిగ చేర్చుకొన ప్రార్థన.

దాసః,

సంతకము.

పూర్తినామధేయము :-

చిరునామా :-

గోత్రము, శాఖ :-

వయస్సు :-

వృత్తి :-

విద్యాయోగ్యతలు :-

ఏఏ విద్యలను
ఎప్పుడెపుడు
ఎవరెవరివద్ద
నభ్యసించినది
వివరములు

ఇతర వివరములు :-

# శ్రీభాష్యపాఠ్యప్రణాళిక - మొత్తము నాలుగు సంవత్సరములు

ఒక్కొక్కపర్యాయము పదేసి రోజులు చొప్పున సంవత్సరమునకు మూడుపర్యాయములు చొప్పున మొత్తం 12 పర్యాయములు.

మొదటి సంవత్సరములో.
1. పర్యాయం - తర్కసంగ్రహము. శ్రీభాష్యమున ౧ సూత్రములో స్మృతిపురాణ ఘట్టమువరకు.
2. పర్యాయం-మీమాంసా పరిభాష-శ్రీభాష్యమున ౧ సూత్రాంతము. (పేజీ. 31—61.)
3. పర్యాయం-యతీంద్రమతదీపిక-శ్రీభాష్యమున ౩౧ సూత్రాంతము (పేజీ. 61-101.)

రెండవ సంవత్సరములో.
1 పర్యాయం - తత్త్వత్రయము-శ్రీభాష్యమున ౬౩ సూత్రాంతము. (పేజీ. 102-128)
2. పర్యాయం - అర్థపంచకము -శ్రీభాష్యమున ౧౦౬ సూత్రాంతము (పేజీ. 128-173)
3 పర్యాయం - వేదార్థసంగ్రహము-శ్రీభాష్యమున ౧౩౪ సూత్రాంతము (పేజీ. 174-203)

మూడవ సంవత్సరములో.
1 పర్యాయం-విషయవాక్యదీపిక-శ్రీభాష్యమున ౨౧౫ సూత్రాంతము (పేజీ. 204-226)
2 పర్యాయం-విషయవాక్యదీపిక-శ్రీభాష్యమున ౨౬౮ సూత్రాంతము (పేజీ. 227-249)
3. పర్యాయం-విషయవాక్యదీపిక-శ్రీభాష్యమున ౩౫౮ సూత్రాంతము (పేజీ. 249-272)

నాలుగవ సంవత్సరములో.
1. పర్యాయం - గీతాభాష్యము-శ్రీభాష్యమున ౪౨౪ సూత్రాంతము (పేజీ 273-302)
2. పర్యాయం - గీతాభాష్యము-శ్రీభాష్యమున ౪౭౬ సూత్రాంతము (పేజీ. 302-326)
3 పర్యాయం - గీతాభాష్యము-శ్రీభాష్యమున ౫౪౫ సూత్రాంతము (పేజీ 327-349)

# సామాన్యనియమములు

1. శ్రీభాష్యమును సేవించుటకు తగు విద్యార్హతలును, శాస్త్రమర్యాదలు కలిగియుండవలెను.

2. కట్టు - బొట్టు - జుట్టు వగైరా ఆచారవ్యవహారములు, అనుష్ఠాన విశేషములు, వైదికముగను-శిష్ట సాంప్రదాయానుసారముగను - సనాతన ధర్మానుగుణముగను యుండవలయును.

3. సామాన్యముగ ప్రతిసంవత్సరమునను వేసవి శలవులలోను, దసరా శలవులలోను, సంక్రాంతిశలవుల లోను, ప్రతిపర్యాయము పదేసిరోజులకు తక్కువగాకుండగ యీ విద్యాలయము నడుపబడుచుండును. వే. వి శెల వులలో మాత్రము అవకాశమున్నచో పదిహేనురోజులవరకు ఈ విద్యాలయము నడుపబడవచ్చును.

4. విద్యాలయము సామాన్యముగ శ్రీ. రా. జీయరు స్వామివారు ఉండునట్టి వివిధస్థలములలో సౌకర్యానుసారముగ ఏర్పాటు చేయబడుచుండును.

5. విద్యార్థులకు సాపాటు - బససౌకర్యము ఉచితముగ ఏర్పాటు చేయబడును.

6. తగుయోగ్యతలుగల విద్యార్థులకు వారివారి క్షేత్రాంతరప్రయాణముల ననుసరించి ప్రతిపర్యాయము వారివారి స్వస్థలములనుండి విద్యాలయ మేర్పాటుచేయబడు స్థలమువరకు రాకపోకలకు మూడవతరగతి రైలుచార్జియు, లేక బస్సుచార్జియు సామాన్యముగ యిచ్చుచుండుటకు ప్రయత్నింపబడుచుండును. ఎప్పుడైనను, ఏపరిస్థితులలోనైనను, అటుల రాకపోకఖర్చులను ఇచ్చుటకు వీలుకలుగని సమయములలో విద్యార్థులే ఆఖర్చులను భరించుకొనుటకు సిద్ధపడి యుండ వలయును

7. దైవికములగు విఘ్నములు కలిగినప్పుడు తప్ప విద్యార్థు లందరును ప్రారంభమునుండి చివరివరకు నాలుగు సంవత్సరములుకూడ విద్యాలయము జరుగు ప్రతిపర్యాయమును (సంవత్సరమునకు మూడేసి పర్యాయములు చొ॥) తప్పక విద్యాలయమున, ఆయా నిర్దిష్టదివసములు ఆఖరువరకు నిర్విఘ్నముగ పాల్గొన వలెయును.

8. శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులువారున్ను, శ్రీ. రా. జీయరుస్వామివారున్ను, అధ్యాపకులుగ నుందురు. మొత్తము 120 రోజులు, కాలక్షేపమురూపముగను, ఉపన్యాసముల రూపముగను, అధ్యాపనము జరుగును.

9. సామాన్యముగ ప్రతిపర్యాయమును కూడ, గతవిద్యాలయసమయమున జరిగిన కాలక్షేపవిషయ ములపై విద్యార్థులచే ఉపన్యాసము లేర్పాటు చేయబడుచుండును. విద్యార్థులు అటుల ఉపన్యసించుటకు తయారగుచుండ వలయును.

10. విద్యార్థుల ప్రవేశనిర్ణయాధికములు - విద్యాలయ నిర్వహణాదికములు - పాఠ్యక్రమ నిర్వచనాది కము లు కేవలము కార్యదర్శి యధీనములై యుండును వాటినిగురించి ఎవరును ప్రశ్నించుటకుగాని మార్చుటకుగాని, అవకాశము లేదు.

ఇట్లు,

కవిరత్న, గు. రామానుజాచార్యులు, శ్రీ వి. ప్ర. స్థా[illegible] కార్యదర్శి.



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

## ప్రచార కార్యక్రమము

సూచన:- ప్రతిమకామునందును శ్రీ జీయర్ స్వామివారు ఉదయమున 7 గంటలు మొదలు 8 గంటలవరకు. శ్రీ విష్ణు సహస్ర నామ పారాయణతో, బదరీ శ్రీనివాసరామానుజ స్వామివారల కైంకర్యార్థమై తిరువీధి గోష్ఠిగా భిక్షా కార్యక్రమము గావింతురు. సాయంత్రము 7 గంటలు మొదలు 8 గంటలవరకు ఉపన్యాసగోష్ఠి గావింతురు. కాన స్త్రీలు పురుషులు ఈ రెండు కార్యక్రమములయందు, అన్వయింప గోరుచున్నాము.

12-6-60 ఉదయము గం|| 6-30 లకు గోపాలపురమునుండి బరంపురముచేరుట. 7 గం. లకు. తిరువీధి భిక్ష – సాయంకాలము సభ.

13-6-60 బరంపురములో మకాం ఉదయము భిక్ష. సాయంత్రము సభ.

14-6-60 ఉదయము భిక్ష బరంపురములో పగలు 10 గం లకు బయలుదేరి సాయంత్రము 5 గం లకు "రాజాం" చేరుట రాత్రి సభ.

15-6-60 "రాజాం"లో ఉదయము భిక్ష. మధ్యాహ్నము 3 గం లకు. బయలుదేరి సీతారాంపురం చేరుట రాత్రి సభ.

16-6-60 సీతారాంపురంలో ఉదయము భిక్ష. సాయంత్రము 3 గం. లకు. బయలుదేరి సా|| గం. 4 లకు బొబ్బిలి చేరుట. రాత్రి సభ

17-6-60 బొబ్బిలిలో ఉదయము భిక్ష. మధ్యాహ్నము 3 గం. లకు. బయలుదేరి సాయంత్రము 5 గం. లకు. విజయనగరం చేరుట రాత్రి సభ.

18-6-60 విజయనగరంలో మకాం ఉదయము భిక్ష. రాత్రి సభ.

19-6-60 ఉదయము 5 గం. లకు. విజయనగరంనుండి బయలుదేరి శ్రీరామతీర్థంచేరుట. 7 గం. లకు భిక్ష. 9 గం లకు. పెరుమాళ్ళ సేవ. 10 గం. లకు పెద్దలతో వేదాంత గోష్ఠి. 11 గం. లకు. తిరిగి విజయనగరం చేరుట రాత్రి సభ.

# ప్రచార విభాగము

## శ్రీ కూర్మము

ది. 16—5—60 తేదీని శ్రీ కూర్మనాథ స్వామివారి సన్నిధిలో శ్రీశ్రీశ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షతక్రింద జరిగిన సమావేశమునందు "శ్రీకూర్మ వైదిక ఆధ్యాత్మిక విద్యానిధిసంఘము" ఈ క్రింద పేర్కొనబడిన కార్యకారిణి సమితి సభ్యులతో ఏర్పాటు చేయబడినది.

అధ్యక్షులు

శ్రీమాన్. ఉ. వే. తి. వె. అప్పలాచార్యులుగారు.

ఉపాధ్యక్షులు

,, ,, శ్రీభాష్యం వెంకటాచార్యులుగారు

,, ,, గోపీనంబాళ్ దాసు కూర్మాచార్యులుగారు

,, ,, రాపోలు వెంకటచలపతిరావు గారు

ప్రధాన కార్యదర్శి కోశాధికారి

,, ,, శ్రీభాష్యం కూర్మాచార్యులు గారు

సహాయ కార్యదర్శి

,, ,, కంబాళ శ్రీనివాసాచార్యులు గారు

కార్యకారిణి సమితి సభ్యులు

,, ,, శ్రీ భద్రం వెంకటరమణాచార్యులుగారు

,, ,, చామర్ల నరసింహాచార్యులుగారు

,, ,, తి. వె. రంగనాథాచార్యులుగారు.

## శ్రీ కాకుళములో

1—6—60 వ తేది శ్రీకాకుళములో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి అధ్యక్షతక్రింద ఏర్పాటు చేయబడిన వైదిక, ఆధ్యాత్మిక, విద్యానిధి సంఘమునకు ఈ క్రిందివారు కార్య నిర్వాహక వర్గముగా ఎన్నుకోబడిరి

1. శ్రీమాన్. రంగరాజు వెంకటచలపతి రావుగారు (అధ్యక్షులు)
2. ,, మంగు రాఘవరావుగారు (ఉపాధ్యక్షులు)
3. ,, మంగు వెంకటరెడ్డి పంతులుగారు (కార్యదర్శి)
4. ,, ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు గారు (సహాయకార్యదర్శి)
5. ,, మంగు శ్రీ వేంకటేశ్వర్లుగారు (కోశాధికారి)

సభ్యులు

6. ,, పరాంకుశం వెంకటరంగనాథంగారు
7. ,, న్యాపతి వెంకటరెడ్డి పంతులుగారు
8. ,, మేడేపల్లి రామారావుగారు
9. ,, న్యాపతి వెంకటరంగనాథంగారు
10. ,, మహేంద్రాడ వెంకట జగన్నాథాచార్యులుగారు

# శ్రీరామానుజ దేవాలయ విరాళములు

బదరిలో మనసంఘముద్వారా నిర్మింపబడుచున్న శ్రీరామానుజ దేవాలయమునకు ఒకవాటా రు. 1000/- వెయ్యిరూపాయలను కృష్ణాజిల్లా ఉనికిలి గ్రామ కాపురస్థులగు శ్రీమతి గుత్తా వెంకట బాయమ్మ గారు, శ్రీమతి చింతల దమయంతమ్మగారు, సమర్పించుటకు వాగ్దానము గావించిరి.

# శాశ్వత తదీయారాధన విరాళములు

బదరిలో మనసంఘముద్వారా నిర్మింపబడిన సత్సంగసదనములో ఏర్పాటు చేయబూనుకొన్న శాశ్వత తదీయారాధనకు విరాళముగా శ్రీకాకుళం వాస్తవ్యులగు శ్రీ ముంగు తాయారమ్మ శ్రీ వెంకటేశ్వర్లు సతీపతులు రు. 508/- లు సమర్పించుటకు వాగ్దానము గావించి అందుకు అడ్వాన్సుగా రు. 116/- లు సమర్పించిరి.

# కట్నములు

శ్రీ నరసన్నపేట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు సంఘమునకు సమర్పించిన శుక్రవారలక్ష్మీ పూజాకట్నం రెండురూపాయలు.

# సత్సంగసదన విరాళములు

శ్రీకాకుళం వాస్తవ్యులగు శ్రీమాన్ స్వాపతి బాలకృష్ణమూర్తి పంతులుగారు, B. A. B. L., అడ్వకేట్. వీరు మరల సమర్పించిన విరాళము రు. 150/- లు.

శ్రీ రంగరాజు అనంతమ్మగారు (శ్రీకూర్మం) ఇత్తడి శంఖచక్రములకై యిచ్చినది రు 20/- లు.



శ్రీకూర్మం శ్రీ యతిరాజసేవా మహిళామండలియొక్క వార్షికసభ. శ్రీకూర్మం 12-5-1960.

ఉపాహిస్నా దీక్షతో గోపాలపురం ఆలయం దివ్యస్థలమైనది. ప్రబంధాధ్యయనము, శ్రీమద్రామాయణ పారాయణలు శ్రీ విష్ణుపురాణము, శ్రీభాష్యము శ్రీభాగవతము, భగవద్గీత, స్తోత్రపాఠములు, ఇత్యాది పారాయణలు జరిగినవి. విధిగా ప్రసాదములు, తదీయారాధనలు జరిగినవి. 9—6—60 వ తేది మధ్యాహ్నము గం. 11-0 లకు శ్రీ జియ్యర్ స్వామివారిచే తీర్థపరిగ్రహము గావింపబడెను. పారాయణపరులకు సత్కారములు జరిగినవి. శ్రీస్వామివారికి రు 116/- లు శ్రీ ధర్మకర్త సమర్పించెను. ఈ సమయములో శ్రీ కవిగారు, ప్రపన్నస్థలవిషయముగా ఈ క్రింది శ్లోకములు సమర్పించిరి.

శ్లో॥ స్వస్తి శ్రీ చాంద్రమానేన షష్టిసంవత్సరాంతరే
శార్వర్యాం జ్యేష్ఠమాసేఽస్మిన్. పూర్ణిమాయాం గురోర్దినే

శ్లో॥ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారైక పరాయణైః
శ్రీమన్నారాయణాచార్య రామానుజ యతీశ్వరైః

శ్లో॥ గోపాలపుర్యా మస్యాం, శ్రీవేణుగోపాలసన్నిధేః
ప్రపన్నస్థలతాంనీతః. వర్ధతా మభివర్ధతాం.

ఈ 5 దినములు శ్రీ జియ్యర్ స్వామివారియొక్కయు శ్రీ కవిగారియొక్కయు ఉపన్యాసములు జరిగినవి. గోపాలపురమునుండి 12—6—60 వ తేది బయలుదేరి ఈ విధముగా పర్యటించి తమ ఆశ్రమమునకు చేరిరి.



శ్రీ మఠములో జరిగిన ఉచితోపనయన వటువులు. 16—5—1960.

నమో బ్రహ్మణే

శ్రీమతే రామానుజాయ నమః

# ఆధ్యాత్మిక వైదిక విద్యానిధి సంఘములు

## బరంపురం

శ్రీమాన్ గుండాల రాఘవరావుగారు [అధ్యక్షులు]
,, పరాంకుశం పార్థసారథిగారు (కార్యదర్శి)
,, గుండుమళ్ళ వెంకటరంగనాథస్వామిగారు (సభ్యులు)
,, బచ్చు నరసింహస్వామిగారు ,,
,, మంగు శ్రీనివాసరావుగారు ,,

## గోపాలపురం

శ్రీమాన్ సోమాని శేషాచార్యులుగారు (అధ్యక్షులు)
[illegible] ఆచార్యులుగారు (కార్యదర్శి)

## టెక్కలి

శ్రీమాన్ కందాళై వెంకటాచార్యులుగారు హైస్కూల్ పండిట్ (అధ్యక్షులు)
,, చాటులూరి వెంకట నృసింహాచార్యులుగారు
,, రేజేటి పురుషోత్తమాచార్యులుగారు

## సోంపేట

శ్రీమాన్ కల్యాపూడి శరణ్యాచార్యులుగారు (అధ్యక్షులు)
శ్రీమాన్ పెద్దింటి కృష్ణమాచార్యులుగారు
,, కరి సీతారామాచార్యులుగారు
,, గాదె నరసింగరావు పంతులుగారు

## సీతారాంపురం

(శ్రీ)మాన్ కాండూరి తిరువెంగళాచార్యులుగారు (అధ్యక్షులు)
,, పీసపాటి వెంకటరంగాచార్యులుగారు (ఉపాధ్యక్షులు)
,, ఫణిహారం తాతాచార్యులుగారు (కార్యదర్శి)
,, సత్తి వెంకటాచార్యులుగారు (కోశాధికారి)

## వావిలివలస

(శ్రీ)మాన్ అనుమంచిపల్లి బదరీనారాయణాచార్యులుగారు (అధ్యక్షులు)
,, పీసపాటి పుండరీకాక్షాచార్యులుగారు (కార్యదర్శి)
,, కాండూరు జగన్నాథాచార్యులుగారు (కోశాధికారి)

## రాజాం

(శ్రీ)మాన్ తుమ్మలగుంట్ల పార్థసారథి ఆచార్యులుగారు
(అడ్వకేట్) [అధ్యక్షులు]

## శ్రీరామతీర్థం

(శ్రీ)మాన్ తి. వ. రామానుజాచార్యస్వామివారు (అధ్యక్షులు
,, కరినారాయణాచార్యస్వామివారు (ఉపాధ్యక్షులు)
,, తి. వె. పద్మనాభాచార్యస్వామివారు (కోశాధికారి)
,, కందాడై (శ్రీ) వెంకటేశ్వర్లస్వామివారు (కార్యదర్శి)
,, కరి కృష్ణమాచార్యులుగారు (సభ్యులు)
,, ఖండవిల్లి కోవలఅప్పలాచార్యస్వామివారు ,,

## విజయనగరం

(శ్రీ)మాన్ గాదె రామయ్యంగారు (అధ్యక్షులు)
,, గుండాల బదరీ నారాయణమూర్తిగారు (ఉపాధ్యక్షులు)
,, కందాడ శఠకోపాచార్యస్వామివారు (కార్యదర్శి)

## పద్మనాభం

(శ్రీ)మాన్ పెద్దింటి నరసింహాచార్యులుగారు (అధ్యక్షులు)
,, తోగుమ్మి పార్థసారథిఆచార్యులుగారు (కార్యదర్శి)
,, కంచి రాఘవాచార్యులుగారు (ఉపాధ్యక్షులు)

## విశాఖపట్నం

శ్రీమాన్ ప్రతివాదిభయంకర శ్రీనివాసాచార్యులుగారు (అధ్యక్షులు)
శ్రీమాన్ పరవస్తు శ్రీనివాస [illegible]నాథాచార్యస్వామి అయ్యవార్లంగారు
,, చిక్కాల కృష్ణమాచార్యులుగారు
,, సంపర జగన్నాథాచార్యులుగారు

## సింహాచలం

శ్రీమాన్ నిడమర్తి కందాడై గోవిందరాజ భాష్యకారాచార్యస్వామిగారు (అధ్యక్షులు)
,, నండూరి వెంకట అప్పలాచార్యులుగారు (ఉపాధ్యక్షులు)
,, తిరుమలపెద్దింటి సంపత్కుమార పద్మనాభాచార్యులుగారు (కార్యదర్శి)
,, కందాడై వీరరాఘవాచార్యులుగారు
,, కలి అనంతాచార్యులుగారు
,, కోమాండూరి అప్పలాచార్యులుగారు

## అనకాపల్లి

శ్రీమాన్ వర్ఘుల నరసింహాచార్యులుగారు (అధ్యక్షులు)
,, ఇరగవరపు వెంకటప్పకొండమాచార్యులుగారు కార్యదర్శి

## కట్నములు

కొత్తలపట్రు గ్రామకాపరస్తులగు శ్రీమాన్ వి. వెంకటలక్ష్మీ నరసింహాచార్యులుగారు కుమారుని నామకరణ మహోత్సవ సందర్భమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిన కట్నము రు. 2-0-0

యజ్ఞబోయినపల్లి కాపురస్థులు కొరమసింహం రాఘవాచార్యులుగారి కుమారుని నామకరణ మహోత్సవములో తండ్రిగారిచేత సమర్పించబడిన సంఘ సంభావన రు 2-0-0

కొల్లాం శ్రీ వేంకట లక్ష్మీ నారాయణాచార్యులుగారు శ్వ శ్రీ పరమ పదోత్సవ సమయములో శ్రీ శ్రీ శ్రీ స్వామివారికి కట్నముగా సమర్పించిన విరాళం రు 5-0-0

కోటకొండ వాస్తవ్యులగు శ్రీ బొండాని సత్యనారాయణదాసుగారు బదరీ తాత్కాలిక పూజకుగాను. సమర్పించినది రు 12-0-0

శ్రీరామ తీర్థయతిరాజసేవాసహితామండలివారు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిన కట్నము రు 3-0-0



శ్రీ కూర్మములో ఉచిత ఉపనయన కార్యక్రమము ది 16-1-1960

# విజ్ఞప్తి

చందాలుయింతవరకు పంపించనివారు దయతో చందాలను వెంటనే పంపించ గోరుచున్నాము

ఇట్లు

మేనేజరు భక్తనివేదన

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

[అశ్వమేధ ప్రక్రియానుసారముగ]

# శ్రీ రామ మహా క్రతువు

శ్లో॥ శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాతః సమస్తకల్యాణగుణాభిరామః।
సీతాముఖాంభోరుహ చంచరీకో నిరంతరం మంగళమాతనోతు॥

శ్రీమద్రామాయణము శ్రవణ - మనన - నిధిధ్యాసనములద్వారా మానవులు తరించ తగిన మార్గమును ఉపదేశించుచున్నది. వేదవేద్యుండైన పరమ పురుషుండు శ్రీరాముడై యవతరించి ముముక్షువులనుష్ఠించతగిన సామాన్యవిశేషధర్మముల నన్నింటిని స్వానుష్ఠాన పూర్వకముగ ప్రదర్శించగా, వేదస్వరూపమైనవాని నన్నింటిని శ్రీవాల్మీకిమహర్షి భగవత్సంకల్ప కటాక్షముచే చతుర్ముఖ బ్రహ్మద్వారా యుపదేశమును పొంది యనుభవించి శ్రీరామాయణముగ లిఖించి కటాక్షించెను.

నారదశిష్యుడైన వాల్మీకిమహర్షి భూతభవిష్యద్వర్తమానాత్మకమైన శ్రీరామ చరితమునంతను సీతాసమక్షమున వ్రాసెను. శ్రీరామచంద్ర తనూజులగు కుశలవులు దానిని పాడిరి. లక్ష్మణ, భరత, శత్రుఘ్నహనుమత్సమేతుడై శ్రీరాముడు మహర్షి గణమధ్యమునందుండి దాని నంతను స్వయముగ విని యానందించెను. కాన శ్రీవాల్మీకిరామాయణము పరమపవిత్రమై పరమప్రమాణమై ప్రకాశించుచున్నది.

ఇట్టి శ్రీమద్రామాయణ సకృత్పారాయణమే సంసారసాగరసముద్ధరణ హేతువగు చుండగా దీని సంతత పారాయణమందలి విశేషమునుగురించి ఏమిచెప్పవలెను

శ్రీరాముడు నైమిశారణ్యమున మిత్రి యనుదధీచి యాశ్రమమున అశ్వమేధయాగము ఆచరించుచు ండగా శ్రీవాల్మీకి భగవానునిచే ప్రేరితులై లవకుశులు 27 దినములు శ్రీమద్రా మాయణమును పాడి శ్రీరామునకు వినిపించినటుల గాథ కలదు.

ఏఏదినమున లవకుశులు ఎటులపాడి వినిపించిరో ఆవివరములు ఈ క్రిందివిధముగ వివరింపబడినవి.

## మొదటి విధానము

| | కాండ | దినములు | పారాయణచేయుసర్గలు | మొత్తంసర్గలు |
|---|---|---|---|---|
| 1. | బాలకాండ | 3 | 22 + 28 + 27 | 77 |
| 2. | అయోధ్యాకాండ | 6 | 15 + 19 + 19 + 21 + 23 + 22 | 119 |
| 3. | అరణ్యకాండ | 3 | 24 + 25 + 26 | 75 |
| 4 | కిష్కింధాకాండ | 3 | 19 + 20 + 28 | 67 |
| 5. | సుందరాకాండ | 4 | 13 + 21 + 8 + 16 | 68 |
| 6. | యుద్ధకాండ | 8 | 12 + 17 + 27 + 11 + 12 + 17 + 13 + 17 | 131 |
| | | | | 537 |

## రెండవ విధానము

ప్రతి పుష్యమినక్షత్రమునాడు ప్రారంభించి దినమునకు సరిగా 20 సర్గలు చొప్పున పారాయణ మొనర్చుచు, అటుల 26 దినములకు 520 సర్గలుకాగా 27 వ దినమున పునర్వసు నక్షత్రమునాడు 17 సర్గలుమాత్రము పారాయణ మొనర్చి పట్టాభిషేకము చేయుటయున్ను తిరిగి మరునాడు పుష్యమి నక్షత్రమునాడు తిరిగి మొదటినుండియు పారాయణము ప్రారంభించుట యను మరియొక పద్ధతియును కలదు.

ఈ ప్రక్రియ ననుసరించియే పుష్యమి నక్షత్రమున శ్రీమద్రామాయణమును ప్రారంభించి పునర్వసు నక్షత్రమునకు సమాప్తినిగావించి శ్రీరామచంద్రమూర్తియొక్క పట్టాభిషేకము గావించు విధాన మేర్పడినది

ఈ విధానమును అశ్వమేధ ప్రక్రియానుసారముగ "శ్రీరామాయణపారాయణము" అని వ్యవహరించుటగలదు.

అందుచే ఈ అశ్వమేధ ప్రక్రియానుసారముగ శ్రీరామాయణ పారాయణమును నూటఎనిమిది పర్యాయములు శ్రీరామమహాక్రతువు అనుపేరుతో గావించవలెనని మాకు, భగవత్ప్రేరణ కలిగినది.

తదనుసారముగ పుష్యమికి ప్రారంభించి పునర్వసునకు సమాప్తినిగావించి పట్టాభిషేక మొనర్చుచు ఇటుల ఒక్కొక్కపారాయణమును ఇరువదియేడురోజులు చొప్పున వరుసగా మొత్తము నూటయెనిమిది పర్యాయములు శ్రీమద్రామాయణముయొక్క పారాయణమును, నూటయెనిమిది సీతాకళ్యాణములతోను, నూటయెనిమిది పట్టాభిషేకములతోను శ్రీరాముని గుణగానమొనర్చుకొని యానందించవలెనని నిశ్చయించుకొంటిమి ఇందులకు కనీసము తొమ్మిది సంవత్సరములు పట్టును.

కాని, మధ్య, మధ్యలో బదరియాత్రలు శ్రీభాష్యభగవద్విషయాది ఉత్సవములు, గాయత్రి క్రతువులు, ఇతర క్రతువులు విశ్రాంతులు తటస్థించును గాన మొత్తం కాలపరిమితి పండ్రెండు సంవత్సరములవరకు పట్టవచ్చుననుకొనుచున్నాము.

మేము ఈ మహాక్రతువును మొత్తము హిందూదేశమునందంతటను, అన్నిరాష్ట్రములలోను, కాలినడకతో పర్యటించుచు సలుపగోరుచున్నాము

ప్రధానమార్గమున నిర్గమించుచు మార్గమున తటస్థించు జిల్లాకేంద్రపట్టణములలో ఆగి అచ్చట నొకక్రతువును పూర్తిగ 27 రోజులు జరిపి పిమ్మట తిర్గి జిల్లాకేంద్రము చేరువరకు మధ్యలో అచ్చటచ్చట ఒకటిరెండు లేక మూడు రోజులకు మించకుండగ అనుచు క్రతువును జరుపుకొనుచు పర్యటించవలెనని మాయుద్దేశ్యము.

ఈ క్రతుకార్యక్రమములోనే ద్వారకాతిరుమలలో, శ్రీవేంకటేశ్వర క్రతువును, సింహాచలమున "గాయత్రీ క్రతువును", తిరుమలలో, శ్రీభాష్యోత్సవమును శ్రీరంగములో శ్రీభగవద్విషయోత్సవమును, మరియు మద్రాసు, శ్రీపెరుంబాదూరు, కాంచీపురము, తిరుమాలిరంజోలై, ఇత్యాది దివ్యక్షేత్రములలో సంప్రదాయానుగుణమైన ఉత్సవములను జరుపుకొనుచు పర్యటించవలెనని యభిలషించుచున్నాము. ఈ మహాక్రతువునకు మే మొకర్తరమే నిర్ణీతదీక్షితులగు పారాయణ ఋత్విక్కులమైయుందుము శ్రీ ఉ వే శ్రీమాన్ న్యాయ వేదాంత విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామివారు వాల్మీకి స్థానీయులై యుందురు. నిస్వార్థపరులగు మరియొక స్వామివారిని హోతలుగను, అట్టిమరియొకస్వామివారిని పెరుమాళ్ళ కైంకర్యపరులుగను నిర్ణయించుకొనడమగును.

ఇంతమాత్రమే నిర్ణీతపరివారము వెళ్ళిన ప్రతిగ్రామములోను ప్రతిపట్టణములోనుకూడ అచ్చటనుండు శ్రీమద్రామాయణ ప్రియులు, ఆస్తికులునగువారందరున్న, పారాయణమునకై ఆహ్వానింపబడుచుండగలరు.

నిస్వార్థబుద్ధితో దక్షిణవాంఛారహితముగ పాల్గొనునట్టి ఆ యాగ్రామమందలియు మరియు ఆ, యా, ప్రాంతమందలియు పారాయణపరులు మాత్రమే ఈ క్రతువున ఋత్విక్కులుగ నుండవచ్చును. దక్షిణలిచ్చి దీక్షా వస్త్రములనిచ్చి, ఋత్విక్కుల నేర్పరచి పారాయణాదులను జరిపించుట మున్నగునవి ఈ క్రతువున ఉండవు.

ఈ క్రతు నిర్వహణార్థమై వేరే ప్రత్యేకముగ మేము చందాలు వసూలుచేయుట విరాళములు కోరుట మున్నగునవి యుండవు కాని ప్రతినిత్యమును ఉదయమున నిర్ణీతపారాయణము హోమములు, పూర్తియైనవెంటనే భిక్షకై బయలుదేరబడును ఆభిక్షలో భగవంతుడిచ్చిన వస్తుసామగ్రితో భగవంతునికి నివేదనాదికములు క్రతునిర్వహణము జరుపబడును. అయినను ఆయాగ్రామస్తులు ఎవరి మోమాటము గాని బలవంతముగాని లేకుండగ కేవలము భక్తిశ్రద్ధ

లతో ప్రత్యేకముగా తమంతట తామే స్వయముగ చందాలు విరాళములు వసూలుచేసుకొని పందిళ్ళు పాకలు వేయుట, ఉత్సవాదులను జరుపుట తదీయారాధనలను జరిపించుట మున్నగు వానిని చేసుకొనుటలో మాకెట్టి యభ్యంతరమున్నూ లేదు. వీలైనంతవరకు మాకు ధనముతో అధిక ప్రమేయము లేకుండగనే ఈ మహాక్రతు కార్యక్రమము జరుపవలెనని మాయొక్క ఆశయము. అంతమాత్రమే

ప్రతిక్రతువుకూడ 27 రోజులు జరుగుచుండును. ప్రతినిత్యము సాధారణముగ కార్యక్రమ మిట్లుల జరుగుచుండును.

ఉదయమున గం. 6-0 లకు తీర్థగోష్ఠి.
,, గం. 7-0 లగాయతు గం. 9-0 ల వరకు శ్రీమద్రామాయణము పారాయణము.
,, గం. 9-0 లగాయతు గం. 9-30 ల వరకు హవనము శాత్తుముఱ
,, గం. 9-30 లగాయతు గం. 10-0 ల వరకు శ్రీవిష్ణు సహస్రనామపారాయణముతో

భిక్షా కార్యక్రమము

మధ్యాహ్నం గం. 1-30 లగాయతు గం. 2-0 ల వరకు భగవద్విషయాది కాలక్షేపము.
,, గం. 2-0 లగాయతు గం. 4-0 వరకు కవితాగోష్ఠ్యాదికము లక్ష్మీపూజలు.
సాయంత్రము గం. 4-0 లగాయతు గం. 6-0 లవరకు శ్రీమద్రామాయణోపన్యాసములు.
,, గం. 6-30 లగాయతు గం. 7-0 ల వరకు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణ.
రాత్రి గం. 7-0 లగాయతు గం. 7-30 వరకు శాత్తుముఱ.
,, గం. 7-30 లగాయతు గం. 8-0 ల వరకు భజనలు.

ఇది సాధారణ కార్యక్రమము. ఇదిగాక, అదనముగా ఈ 27 దినములలోను ప్రతి దినము మధ్యాహ్నము గం. 2-0 లగాయితు గం 4-0 ల వరకు జరుగు విశేష కార్యక్రమము లిట్లుండును.

10 దినములు శ్రీభాష్య భగవద్విషయవేత్తల సభ.
3 దినములు ధర్మశాస్త్ర సభ.
3 దినములు వేదసభ.
3 దినములు పండితసభలు.
4 దినములు కవితాగోష్ఠులు.

అను విశేషకార్యక్రమములు జరుగుచుండును.

ఇదేసమయములో, అవసర, అవకాశానుసారముగ స్థలాంతరమందు స్త్రీలకై మాత్రము ప్రత్యేకముగా లక్ష్మీపూజాకార్యక్రమము ఏర్పాటు చేయబడు చుండును.

మరియు క్రతువు జరుగు ప్రతి గ్రామమునందు అచటగల స్త్రీ పురుషాదులు అందరిచేతను 27 దినములలో శ్రీరామకోటి వ్రాయించబడును. ఆ రామకోటి కాగితములను సన్నిధియందుంచి పై రామమంత్రమునుంచి దానిపైనొక స్థూపము నిర్మించబడును. ఆ స్థూపముపై సంక్షేపరామాయణమును (మొదటి సర్గ) చెక్కిన శిలాశాసనమొకటి అతికించబడును.

అవకాశమున్నచో శ్రీరామాయణశ్లోకములతో కొన్ని సులభ పాఠ్యగ్రంథములను సంస్కృతభాషావ్యాప్తికై తయారుచేయించి తద్ద్వారా సంస్కృతభాషాప్రచారమొనర్చవలెననియును మరియు ఇట్టి ఆధ్యాత్మిక చికిత్సతోపాటుగ ఒక మోటారు వ్యానులో ఒకరిద్దరు డాక్టర్లు మందులనుకూడ తీసుకొని వెళ్ళి, ఆయా గ్రామములలో బీదలగువారికి ఉచిత శారీరక వైద్యమును గూడ చేయించవలెననియు మా ఆశ.

ఈ మహాక్రతువులో ఉత్సాహముగల స్త్రీపురుషులందరును పాల్గొనవలెననియే మా ఆశయము. అర్హతల ననుసరించి అట్టివారందరునుకూడ సంస్కృత వాల్మీకి రామాయణమును గాని లేక దేశభాషలలోగల పద్యాత్మకమైన, ఆంధ్ర వాల్మీకి రామాయణమునుగాని లేక గద్యాత్మకమైన రామాయణములనుగాని తమతమ యోగ్యతానుసారముగ పారాయణమును జేయుచుండవచ్చును. పారాయణమును చేయజాలనివారు ఉదయమును జరుగు పారాయణమును మధ్యాహ్నమున జరుగు రామాయణోపన్యాసములను విని యానందింపవచ్చును.

ఇందుపాల్గొనదలచినవారందరును కూడ వసతి భోజనములగురించి తమతమ ఏర్పాటులను తామే స్వయముగ చేసుకొనవలసియుండును. ఎవరును కూడ ఒక్క భగవంతుని మీదతప్ప మరెవరిమీదను ఎట్టియాధారమును పడకూడదు. ఎవరివలనను ఏవిధమైన అర్థికాది సహాయమును ఆశించకూడదు. మేము కేవలము భిక్ష వలన మాత్రమే పెరుమాళ్ళ ఆరాధనాదికములను కూడ జరుపదలచుచున్నాము, కాన మాతోకూడ వచ్చినవారలకై వసతి నిమిత్తమైగాని భోజనాది నిమిత్తములకైగాని మేము భిక్షచేయుటగాని భిక్షాద్రవ్యమును వినియోగించుటగాని లేక యాయా గ్రామస్థులను కోరుటగాని తటస్థించదు.

మరియు సామాన్యముగ ప్రయాణము కాలినడకనే జరిగినప్పుడు అందరును నడచియే వెళ్ళుచుండవలయును. అప్పుడుకూడ ఎవరిసామానుల భారమును వారే వహించుటయో లేక తమతమ సొంతఖర్చులతో కూలీలనో బండ్లనో ఏర్పరచుకొనుటయో జరిగించవలెను. నడువ లేనివారు తాము సొంతముగ బండ్లనో మోటారులనో ఏర్పాటు చేసుకొనవచ్చును అందులకెవరికిని ఎట్టి అభ్యంతరమును లేదు. కాని యిందులకై ఎవరిమీదనుకూడ ఆధారపడుటమాత్రము కూడదు.

మరియు కొన్ని కొన్ని విశేషపరిస్థితులలో ఒకస్థలమునుండి మరియొక స్థలమునకు మేము మోటారుమీద వెళ్ళుట తటస్థించవచ్చును.

లేదా ఏయితర కార్యక్రమములవలననో లేక విశ్రాంతికో మధ్య మధ్య కొద్దికాలము క్రతు కార్యక్రమమును ఆపవలసి వచ్చుచుండవచ్చును. అట్టిసమయములలోకూడ వచ్చు యాత్రికులు తమ తమయొక్క ఉనికి ప్రయాణములను గురించిన ఏర్పాటులను తామే చేసుకొను చుండవలయును.

ఈ క్రమములో ఆర్థికముగ సేవచేయ వలెనని ఉత్సాహపడువారు ఈ క్రిందివిధముగ కైంకర్యమును చేసుకొనవచ్చును

1. పారాయణమును చేసుకొను ఋత్విక్కులకు శ్రీమద్రామాయణ గ్రంథములను సమర్పించు కొనవచ్చును.

2 హోమాదికార్యక్రమమును నిర్వహించుటకు స్థిరముగ 2 హోతలు 2 పరిచారకులు 2 పాచకులు, స్థిరముగ యుండవలసియుండును. వీరికై దాతలు తామే స్వయముగ అన్ని ఖర్చులను భరించుచుండవచ్చును.

3. ప్రతి క్రతువునందును హోమమునకు కనీసము ఒక డబ్బానెయ్యి చొప్పున కావలసి యుండును.

మరియు ప్రతి క్రతువునందును హోమమునకు కనీసము 30 మణుగుల సమిధలు (పుల్లలు) కావలసి యుండును.

ప్రతిక్రతువునందును అఖండదీపారాధనమునకును రాత్రిళ్లు అదనపుదీపారాధనకున్నూ కనీసము ౧ మణుగునూనె కావలసియుండును.

అవకాశమున్నవారు వారి వారి అవకాశానుసారముగ మొత్తముక్రతువు లన్నిటికో లేక కొన్నింటికో లేక ఏయొక్క దానికో ఏవిధముగానైనను పై వస్తువులను సమర్పింపవచ్చును.

తిరువారాధన పెరుమాళ్ళకు, చందన, కర్పూర, ధూప దీప హారతి, తీర్థద్రవ్యములను సమర్పించుకొనవచ్చును. మరియు సంస్కృతభాషావ్యాప్తికై గ్రంథప్రచురణాదులకు ధన సహాయముచేయవచ్చును. మరియు ఉచిత శారీరచికిత్స నిమిత్తమై తగు మోటారు వ్యానును గాని అందుపనిచేయువారినిగాని డాక్టర్లతోసహా తగు మందులనుగాని ఉచితముగ ఏర్పాటు చేయవచ్చును.

ఈ కార్యక్రమమును బహుశ ఈ చాతుర్మాస్యము గడచిన వెంటనే ప్రారంభించ వలెనని యుద్దేశమున్నది.

సుహృదయులైనవారు ఇందులకు తగు సలహాలను తెలియజేయగోరుచున్నాము.

ఇట్లు

(సం) శ్రీమన్నారాయణ రామానుజజీయర్.

శ్రీమతే రామానుజాయనమః



శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి

# షష్ఠ వార్షిక శ్రీ హరినామ సంకీర్తన మహాక్రతువు

ప్రారంభము:- శ్రీశార్వరి నామ సంవత్సర ఆషాఢశుద్ధ ద్వాదశీ బుధవారము (6-7-60)
సమాప్తి:- శ్రీ శార్వరినామ సంవత్సర కార్తీక శుద్ధద్వాదశీ సోమవారము (31-10-60)
అర్హత:- భగవంతునియందు భక్తిగల మానవమాత్రులందరును అన్నివర్ణముల వారును, అన్ని ఆశ్రమములలో నున్నవారును, అగు స్త్రీలు, పురుషులు, బాలురు. వృద్ధులును ఇందు పాల్గొన నరహత కలిగియున్నారు.
ఉద్దేశము:- లోకకళ్యాణము స్థలము:- భక్తులందరి గృహములలోను
రుసుము, లేక దక్షిణ: ప్రతి దినము, దినమునకు 108 పర్యాయములకు తక్కువగాకుండగ తమశక్తి ఉత్సాహావకాశముల ననుసరించి చేయగలిగినంత హెచ్చుగ నిష్కామముగా భగవదర్పణ బుద్ధితో భగవత్ప్రీతి కొరకై
హరేరామ, హరేరామ, రామ, రామ, హరేహరే హరేకృష్ణ, హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే అను 32 అక్షరములు గల మంత్రమును, జపించి చివర "శ్రీకృష్ణార్పణమస్తు" అని భగవంతుని కర్పణచేయుటయే
ఫలితము:- భగవత్కటాక్ష పాత్రులగుటయే.

ప్రియభక్తులారా!

దుర్లభమైన మానవ జన్మ మెత్తినందులకు ఫలితమా భగవంతునిగుణసంకీర్తన మొనరించగలుగుటయేకదా. ఇది భుక్తిముక్తిదాయకము. సర్వపాపహరము సర్వసంపత్సిద్ధి కరము. అనంతమగు భగవంతుని కళ్యాణ గుణగణములలో

"హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే"

అను నామ సంకీర్తనము అత్యంత వైభవోపేతమైనది. మరియు కలియుగమున ప్రత్యేకము దీనియొక్క ప్రభావము వర్ణించ శక్యముకానిది.

గాన బుభుక్షువులుగాని ముముక్షువులుగానిన్నీ దీనిని సదాజపించు చుండుట సర్వశ్రేయోదాయకమై యున్నది. సంవత్సరములో నతిపవిత్రమై పుణ్యవంతమై శ్రీహరికతి ప్రీతికరమైన మాసము చాతుర్మాస్యము. చాతుర్మాస్య మనగా, ఆషాఢ శుద్ధ ద్వాదశి మొదలు కార్తీక శుద్ధ ద్వాదశి వరకు గల నాలుగు మాసములున్నూ. ఈ 120 రోజులున్నూ తప్పక ప్రతి మానవుడున్నూ, నిష్ఠతో శ్రీహరి నామములను స్మరించు చుండవలెను. ఇదియే చాతుర్మాస్య వ్రతము. వ్రతము లన్నింటిలోను, సార్వత్రికమై శాశ్వత పవనీయగల వ్రతరాజమీచాతుర్మాస్యమే దీనిని మానవ మాత్రులందరు చేయవచ్చును. చేయవలెను.

భక్తాగ్రేసరులారా!

మీరుకూడ యీ వ్రత దీక్షను వహించి 120 దినములు శ్రీ హరినామసంకీర్తన మొనరించి, యీ క్రతువున

పాల్గొని తోడ్పాటు కావలెను. మీ బంధు మిత్రులను పరిచితులను యిందులకు ప్రోత్సహించవలెను.

ఈ క్రతువున పాల్గొని యీ మంత్రమును జపించు మందు నంతమాత్రమున మీరిదివరలో అనుష్ఠించుచుండు మంత్ర జపములు వేటిని వదలనవసరములేదు. వాటితో పాటుగా దీనిని గూడ భగవద్గుణానుభవరూపముగ జపించు చుండవలెను.

ఈ క్రతువున పాల్గొన దలచినవారు అనుసరింప వలసిన నియమములు.

## వి శే ష వి ధి

హెచ్చునిష్ఠతో విశేషవిధిని అనుసరించదలచినవారు

(1) శ్రీ నారాయణ అష్టాక్షరీ మంత్రోపదేశమును బడయనివారు యీ మంత్రమును మంత్రసిద్ధిగల బ్రాహ్మణుని వలన యుపదేశము పొందవలెను. (ఇదివరలోనే సక్రమముగ ఉపదేశమును పొందియున్నగాని, నారాయణాక్షరీ ఉపదేశమును పొందియున్నగాని తిరిగి యుపదేశమును పొందనవసరములేదు

(2) ప్రతి దినము ఉదయముననే స్నానమాచరించి వారీసులైనచో పర్వదినములు కానప్పుడు జుట్టు ముడివిప్పి పసుపుచల్లుకొని కంఠస్నానమాచరించిన చాలును. పర్వదినములలో శిరస్నానము చేయవలెను) ఆరవైచిన మడి బట్టలను ధరించి తమ సాంప్రదాయానుగుణమైన బొట్టును పెట్టుకొని తమ తమ నిత్యకర్మానుష్ఠానమంతయు క్రమప్రకారముగా చేసుకొని తమ అవకాశము ననుసరించి ఏకాంత స్థలమున మౌనముగ కూర్చుండి కళ్ళుమూసుకొని మనస్సున శ్రీమన్నారాయణుని ధ్యానించుచు దినము ఒక్కింటికి 108 పర్యాయములు తక్కువగాకుండగ (ఇంతకంటే హెచ్చైనను మంచిదియే) దీనిని జపించవలెను. 1008 పర్యాయములు చెయుచుండుట విశేషము.

మధ్యలో విఘ్నముకలిగినచో ఆ లోటుమిగతా కాలములో పూర్తి చేసుకొనవచ్చును

(3) సాత్వికాహారము, సత్సహవాసము, సద్గ్రంథపఠనము, భగవద్భాగవత సేవ, బ్రహ్మ చర్యము, వీటిని పాటించవలెను.

(4) అవకాశమున్నచో ప్రతిదినము జపాంతమున ఒక గుప్పెడు బియ్యమును ఒక కానిడబ్బును తీసి, కృష్ణార్పణమని వేరేయుంచి జాగ్రత్త పెట్టుచుండవలెను. వ్రతసమాప్తమున ఈ బియ్యము డబ్బులతో తదీయారాధనమును ఇంకను శక్తికొలది బీదలకు అన్నదానము, గోపూజ సలుపవలసినది.

స్త్రీలుగాని పురుషులుగాని తమ ఆశౌచకాలము లందు మానసిక ధ్యానమే గాని పైకి ఉచ్చరించరాదు, మానసికాను సంధానమును జేసుగొనవచ్చును.

పై సమయములందలి జపసంఖ్యను దీక్షానిర్ణీత సంఖ్యలో గణించరాదు.

ఇంటిలో ఎంత మందియున్న అంతమందియు ఈ జపమును చేయవచ్చును. విద్యార్థులు, ఉద్యోగస్థులు, రైతులు, వర్తకులు అందరు చేయవచ్చును.

దీనికి హోమముగాని, తర్పణముగాని లేదు. కాని జపమంతయు పూర్తియయిన పిమ్మట తులసితో గాని, పుష్పములతోగాని భగవంతునికి సహస్రనామార్చనము చేయవలసినది. ఇదిగాక తమశక్తి,ఉత్సాహ అవకాశముల ననుసరించి బీదలకు అన్న సంతర్పణము భూతబలియు (పశువులకు, పక్షులకు, జంతువులకు ఆహారమిడుట) జరిపించవలసినది.

ఆఖరి దినమున జపము పూర్తియాయి నపిమ్మట బంధు మిత్రాదులతో కలిసి గోపూజను గావించి సమిష్టిభజనను, అవభృథోత్సవమును జరిపించవలసినది.

ఇట్లు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ అధ్యక్షులు.

ప్రధాన కార్యదర్శి :
తె కం. గోపాలాచార్యులు

కవిరత్న గు. రామానుజాచార్యులు (సహాయకార్యదర్శి)

కార్యాలయము : శ్రీ వాసుదాసా శ్రమము
వడిగడ్డపాలెం, (పో) గుంటూరు (జి)

ఈ కాగితమును మీ బంధు మిత్రాదులకు కూడ అందచేయుడు. మీ గ్రామములో శ్రీ హరినామ సంకీర్తన మహామండలిని స్థాపించి ప్రతిసంవత్సరమున ఈ కార్యక్రమమును శాశ్వతముగ జరుగు యేర్పాటు గావింపదలచిన యెడల ఇట్టి కాగితములు కావలసియున్నచో మీరే స్వయముగా వచ్చి తీసుకొనవలసినది.

# శ్రీ గుణరత్నకోశము

## 12 వ శ్లోకము

శ్లో॥ మనసి విలసతాక్ష్ణా భక్తిసిద్ధాఞ్జనేన
శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి తే వక్షమాణాః,
నిధి మివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యాః
వను భగవతి దైవీం సంపదం తేఽభిజాతాః॥

:— * ♦♦♦ అర్థము * ♦♦♦ —:

భగవతి = షాడ్గుణ్యపరిపూర్ణురాలవను,
హే లక్ష్మి = ఓ లక్ష్మీదేవీ,
భక్తిసిద్ధాఞ్జనేన
భక్తి = భక్తియనెడు,
సిద్ధాంజనేన = సిద్ధాంజనముచే,
మనసి = మనస్సునందు,
విలసితా = ప్రకాశించుచున్న
అక్ష్ణా = దృష్టిచేత,
శ్రుతిశిరసి = ఉపనిషత్తులయందు,
నిగూఢం = రహస్యముగనున్న,
తే = నీయొక్క,
మహిమానం = మహిమను,
భక్తిసిద్ధాఞ్జనేన
భక్తి = గచించబడిన,

సిద్ధాఞ్జనేన = సిద్ధాంజనముచే,
విలసితా = ప్రకాశించు
అక్ష్ణా = దృష్టిద్వారా.
శ్రుతిశిరసి = చెవుల కొనములందు,
నిగూఢం = దాగియున్న,
నిధిం + ఇవ = నిధివలె,
వీక్షమాణాః = చూడగలవారలై,
యే = ఏ
ధన్యాః = ధన్యాత్ములు,
భుఞ్జతే = అనుభవించుచున్నారో,
తే = అట్టివారు,
దైవీం = దేవసంబంధమగు,
సంపదం + అగ్ని = సంపద ననుసరించి,
జాతాః + నను = జన్మించినట్టివారేగదా

## * :- తాత్పర్యము -: *

ఓ లక్ష్మీదేవి, నీవు జ్ఞాన - శక్తి - బల - ఐశ్వర్య - వీర్య - తేజస్సులను షడ్గుణములతోను పరిపూర్ణురాలవై, వేదాంతవేద్యురాలవై ప్రకాశించుచున్నావు. అయినను [illegible] కరణులై, జ్ఞానదృష్టిగలవారగుదురో అట్టివారు మాత్రమే నిన్ను తెలుసుకొని [illegible] ఒందనో జన్మించిన వారికి మాత్రమే గదా అట్టియదృష్టము కలుగును లోకములో కంటికి సిద్ధాంజనము ధరించి తద్వారా నిధులను కనుగొని రహస్యముగ ననుభవించగలవారేకదా లక్ష్మీకటాక్షపాత్రులు కాగలుగుచున్నారు.

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ ... తస్మై బ్రహ్మణే శ్రీనివాసాయ
... మమ ... శ్రీ ...



# భక్తినివేదన

## [ వేదాన్తమాసపత్రిక ]

★ సంపుటి ౧౩ ★ శార్వరి ★ ఆగష్టు

★ సంచిక ౪ ★ ఆషాఢము ★ 1960



శ్రీకృష్ణపరమాత్మను వసుదేవుడు యమునానదినిదాటి రేపల్లెకు గొనిపోవుచుండెను.

సంపాదకులు :- న్యాయవేదాన్త విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు.

సహాయసంపాదకులు :- కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్యులు.

# గోపికాగీతలు

## 13వ శ్లోకము

శ్లో॥ ప్రణత కామదం పద్మజార్చితమ్।
ధరణి మండనం ధ్యేయ మాపది।
చరణ పంకజం శంతమం చ తే।
రమణ న స్తనే ష్వర్పయాఽధిహన్.॥

### —: అర్థము :—

హే రమణ = ఓ సుందరుడా,
ప్రణత కామదం = నమస్కరించువారి కోర్కెలను దీర్చునదియును,
పద్మజార్చితం = చతుర్ముఖ బ్రహ్మచే పూజింపబడునదియును,
ధరణిమండనం = భూతలమున కలంకార భూతమైనదియును
ఆపది = ఆపదలో
ధ్యేయం = ధ్యానించ దగినదియును
శంతమం = మిక్కిలిసుఖరూపమైనదియునైన
తే = నీయొక్క
చరణ పంకజం = పాదకమలమును,
అధిహన్ = మనోవ్యథలను బోగొట్టువాడా!
నః = మాయొక్క
స్తనేషు = స్తనములయందు
అర్పయ = ఉంచుమా

### *:— తాత్పర్యము :— *

ఓ జనోన్మోహనకారుడా శ్రీ కృష్ణా. నీవు లోకము నాకర్షించు రూపము లేకున్ననుగాని లేక చూచు ఆకర్షింపబడు జ్ఞానము లేకున్ననుగాని యింతబాధ యుండెడిదికాదు. భవరోగ వైద్యుడవు-తాపత్రయముల నణచు మందువు నీవు. సంసారసర్ప సందష్టులము. తాపత్రయాభి తప్తులము అయిన మా హృదయములను నీ పాదములచే పరీక్షించి పరిరక్షింపుము. అచింత్య తపోంకుశ కర్దమశర్కరాదికమైన ధరాతలమున మనోబుద్ధ్యహంకార కరద్వయ శిరస్సులతో దండప్రణామ పతంతులగువారికి చతుర్విధ పురుషార్థముల ప్రసాదించు నీ పాదద్వంద్వమును మా స్తనద్వయమున చేర్చుము. త్రివిక్రమావతారమున బ్రహ్మచే కడుగబడుటచే నేటివరకు నీరు కారుచున్న నీపాద పద్మములను, హృదయపద్మమున విలసిల్లు లక్ష్మీదేవి చేనర్పింపబడు నీపాదపద్మములను, పద్మినీజాతులమైన మా ప్రణయరసముచే గడిగి మా యానందబాష్పములచే నభిషేకించి, మా నేత్ర పద్మములచే, మా స్తనపద్మములచే, హృదయపద్మములచే పూజించి విరహతప్తములైన మా స్తనములచే వత్తిడిమ్ము. త్రివిక్రముడవై భూమియందలి కొండలను గొలుచుటలో నలవాటుపడిన నీపాదముచే మా స్తన పర్వతములను కూడ గొలువుము. ఇంద్రాదుల యొక్క యాపదలను శకటాసురాదుల నీకు కలిగిన యాపదలను పోగొట్టిన నీ పాదద్వంద్వమును, నీ విశ్లేషాదుల దుఃఖాక్రాంతులమైన మాయొక్క స్తనముల యందు చేర్చి మా యాపదలను రూపు మాపుము. నీ పాదపద్మములు మా మానస సరోవరమున మా స్తన ముకుళములతో కలసి మెలసి బాసిల్లుట కోరపడుట సహజమేకదా-నీవు మా పాణి గ్రహణము చేశిన పిమ్మట నీ పాద గ్రహణమేకదా మా కర్తవ్యము చేతిలో గోవర్ధన మెత్తి గో గోపికా-గోపాలుర రక్షించినవాడవు నీ పాదములతో మా స్తనముల స్పృశించి మాకు శాంతి సౌఖ్యముల సమకూర్చుము. నీ పాద సరోజములచే మనోవ్యాధిపీడితులమైన మా కర్కశోరోజముల తాకి మహానందము కలిగించుము.

శ్రీ హయగ్రీవాయ నమః



# శ్రీ కృష్ణస్తుతిమాలిక

శ్రీశైలవర్య
గుడిమెళ్ల రామానుజాచార్య విరచితము

## ఉత్కలమాల

శ్రీరమణీయహార. మునిచిత్తవిహార! మయూరపింఛకో
టీర! సురాసురేంద్రమకుటీతటకీర్ణపదాంబుజప్రహా
వార! సుమేరుధీర! శ్రితపాపధరాధ్రశతార! భక్తమం
దార! పరావతార! విజృంభద్విటీలాజకుమార! గోపికా
జార! యదుప్రవీర! విలసత్కరుణామృతవృష్టిసించితా
కూపార! శ్రుతిస్ఫురన్మకరకుండలహార! సహస్రమన్మథా
కార! వ్రజాంగనాసమితిక్రమితరాంశుకచోర! శ్రీయశో
దామణికుమార! నిహతస్మయకాళియ భోగిభోగసం
చార! శరన్నిశాసమయసాంద్రతుషారమయూఖచంద్రికా
సారజటీకృతప్రకృతిశాద్వలసైకతలబ్ధరాసశృం
గార! కళిందజాహృదవగాహవిధాచ్యుతవత్సచిహ్నితా
భీరవధూకుచాగ్రసురభిస్ఫుటకుంకుమపత్రభంగసం
భార! భవాంధకారవినివారణసూర! సమస్తసద్గుణా
ధార! విలాసభావదయితాకరకీలితకర్ణపూర! వం
శీరవమాధురీపరవశీకృతగోపకిశోర! సాంధ్యవే
ళారభసప్రధావనఝులంఝులరావసువర్ణకింకిణీ

హారుసుకంఠ ఖేసరుంజనసంకుల ఘోరాతరజో విశేష రే

ఘాటు విచిత్రఫాలఫలకచ్యుతకుంతలభార ! గోపకని

షూదనివిపన్నివార ! సరసోపవనసమ మధురాధరామృతా

హార ! గభీరసార ! సమరాంగణాసార ! ఫలానుమేయసం

స్కార ! గోపల్లసత్తులసికాదళదామనిగూఢపుష్పవరా

లారమణీయసౌరభమిళన్మకరందరసాతిలోభను

శ్వారసమాగమభ్రమరపంక్తి చలద్వనమాలికాప్రభా

పూరితకౌస్తుభాభరణముగ్ధభుజాంతరసక్తసత్యభా

మారమణీమణీహృదయమార ! మహాప్రణయస్వరూపరా

ధారతికృత్సమీక్షణసుధారససించితకార ! మిత్రవిం

దారచితోపహార ! సురదారిరంభణ వైఖరీమహో

దార ! విదర్భభూపతిసుతాకలితప్రసనోపచార ! భ

ద్రారదనచ్ఛదామృత సుధారసపాన విశేషవిస్మృతా

న్యారతినార ! మందహాసనాదృత జాంబవతీసతీసమ

స్కార ! నిషేవితద్యుమణిజాఝరశీతలతీర ! లక్షణా

దార ! శ్రుతిప్రచార ! నిహతప్రియపార్థవిచార ! కంసచా

ణూరకృతాపకార ! సుమనోజనసంకలితోపకార ! కు

బ్జారచితాంగరాగపరివర్ధితకామవికార ! రత్నకే

యూర ! కుచేలసంస్మృతిమహోత్సవకార ! నమోనమోస్తుతే





శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

శుభమస్తు

# శ్రీ కృష్ణావతార కథాసంగ్రహః

## వాసుదేవ కథా విశేషం

1. శ్లో॥ వాసుదేవ కథా ప్రశ్నః.
పురుషాం స్త్రీన్ పునాతి హి.
వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్
తత్పాదసలిలం యథా ॥

వసుదేవపుత్రుడై యవతరించిన, శ్రీకృష్ణపరమాత్మయొక్క చరిత్రకు సంబంధించి ప్రశ్నించునట్టియు, వినునట్టియు పురుషులు-స్త్రీలు-న వరునుకూడ ఆయనయొక్క పాదముల నుండి యుద్భవించిన గంగాజలము వలెనే వారల సంపదను పవిత్ర తప్పకుండగ పవిత్రవంతులుగ జేయుచున్నది.

## భూదేవి శరణాగతిః

2. శ్లో. భూమి ర్దృప్త నృపవ్యాజ
దైత్యానీక శతాయుతైః।
ఆక్రాంతా భూరిభారేణ
బ్రహ్మాణం శరణం యయౌ॥

వధించిన రాజుల రూపముతోనున్న పెక్కుమంది రాక్షసులచే మోయలేని భారముచే నిండియున్నదై భూదేవి బ్రహ్మదేవుని శరణు జొచ్చెను.

3. శ్లో॥ గౌర్భూత్వా శ్రుముఖీ ఖిన్నా
రుదంతీ కరుణం విభోః
ఉపస్థితాంతికే తస్మై
వ్యసనం సమవోచత॥,

భూమి గోరూపమును ధరించినదై కన్నీరుగార్చుచు దీనురాలై, దయకలుగునటుల రోదనము చేయుచు, ప్రభువైన బ్రహ్మదేవుని సమీపించి, ఆయనకు తన దుఃఖమును వివరముగ విన్నవించుకొనెను.

4. శ్లో॥ బ్రహ్మా దదుపధార్యా థ
సహ దేవై స్తయా సహ।
జగామ సత్రిణయన
స్తీరం క్షీరపయోనిధేః॥

అటుపిమ్మట బ్రహ్మదేవు డామె నోదార్చి దేవతలను, ఆమెను, ఈశ్వరుని, తనతో తీసుకొని క్షీరసముద్రపు టొడ్డునకు వెళ్ళెను.

5. శ్లో॥ తత్రగత్వా జగన్నాథం
వాసుదేవం వృషాకపిం।
పూర్ణం పురుషసూక్తేన
హ్యుపతస్థే సమాహితః॥

బ్రహ్మదేవు డచ్చటకు వెళ్ళిన తరువాత సర్వాంతర్యామిత్వేన గదాధారభూతుడును జీవరూపేణ దేహములయందు ప్రవేశించి వాటిని చలింపజేయువాడును, పరిపూర్ణుడును, జగత్పతియునైన సర్వేశ్వరుని ఏకాగ్రచిత్తుడై పురుషసూక్త విధానముచే నారాధించెను.

6. శ్లో. గిరం సమాధౌ గగనే సమీరితాం,
నిశమ్య వేధా స్త్రిదశా నువాచ హ।
గాం పౌరుషీం మే శృణుతా
మరాః పునః,
విధీయతా మాశు తథైవ మాచిరం॥

బ్రహ్మదేవుడు సమాధిస్థుడై, అంతట ఆకాశవాణి ద్వారా పలుకబడిన వాక్యమును విని, దేవతలను గూర్చి యిట్లు పలికెను. ఓ దేవతలారా! భగవత్సంబంధమైన వాక్యమును నావలన వినుడు. మరియు తదనుసారముగనే మీరు వెంటనే ఆలసించకుండగ నాచరించుడు.

## క్షీరార్ణవ నికేతనస్యాజ్ఞా నివేదనం

7. శ్లో. పురైవ పుంసా వధృతో ధరాజ్వరో
భవద్భి రంశై ర్యదుషూప జన్యతాం।
సయావ దుర్వ్యా భర మీశ్వరేశ్వరః
స్వకాలశక్త్యా క్షపయం శ్చరే ద్భువి॥

మన ఈ విజ్ఞప్తికి ముందుగానే పురుషోత్తమునిచే భూదేవి యొక్క బాధ తెలుసుకొనబడెను. ఆ సర్వేశ్వరుడు భూభారమును తనయొక్క కాలశక్తులచే నశింపజేయుచు భూమి యందు అవతారరూపేణ సంచరించగలడు గాన మీరు మీమీ యంశములతో యాదవవంశమందు జన్మించుడు.

8. శ్లో. వసుదేవ గృహే సాక్షాత్
భగవాన్ పురుషః పరః।
జనిష్యతే తత్ప్రియార్థం
సంభవంతు సురస్త్రియః॥

వసుదేవగృహమందు జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజసాది షాడ్గుణ్య పరిపూర్ణుడైన సాక్షాత్తు అపరమ పురుషుడవతరించును. ఆయన పూజల సలుపుటకై దేవతా స్త్రీలుకూడ యచ్చటనే యవతరింతురుగాక.

9 శ్లో. వాసుదేవకళానంత
స్సహస్రవదన స్స్వరాట్।
అగ్రజో భవితా దేవో
హరేః ప్రియచికీర్షయా॥

నారాయణాంశ విశిష్టుడును, వేయిముఖములుగలవాడును, స్వప్రకాశ స్వరూపుడును దేవుడునైన యాదిశేషుడు శ్రీమహావిష్ణుమూర్తికి ప్రీతిని జేయగోరినవాడై ఆయన కన్నగా యవతరించగలరు.

10. శ్లో. విష్ణో ర్మాయా భగవతీ
యయా సంమోహితం జగత్।
ఆదిష్టా ప్రభుణాంశేన
కార్యార్థే సంభవిష్యతి॥

పూజ్యురాలును, సర్వజగత్తును మోహింపజేయునదియునగు విష్ణుమాయ విష్ణుమూర్తియొక్క యాజ్ఞచే ఆయనయొక్క అంశతో దేవకీదేవి గర్భము నాకర్షించి మార్చుట, యశోదాదేవిని మోహింపజేయుట మున్నగు కర్తవ్యార్థముల నిర్వహించు నిమిత్తమై యశోదాదేవియందు జన్మించగలదు.

11. శ్లో. ఇత్యాదిశ్యా మరగణాన్
ప్రజాపతిపతి ర్విభుః।
ఆశ్వాస్య చ మహీం గీర్భి
స్స్వధామ పరమం యయౌ॥

వక్షప్రజాపతి మున్నగువారల కధిపతియైన చతుర్ముఖ బ్రహ్మ దేవగణమునకీ విధముగ నాజ్ఞాపించి భూదేవిని సాంత్వన వాక్యములచే నూరడించి తనయొక్క స్వస్థానమునకు వెళ్ళి పోయెను.

## కంసచరిత్రం

12. శ్లో. శూరసేనో యదుపతిః
మధురా మావస త్పురీం।
మధురాన్ శూరసేనాంశ్చ
విషయా న్బుభుజే పురా॥

పూర్వమున యదువంశశ్రేష్ఠుడైన శూరసేనమహారాజు మధురా సంబంధమైనట్టియు, శూరసేన సంబంధమైనట్టియు దేశములను పరిపాలించుచుండెను. ఆయన మధురా పట్టణమును రాజధానిగ జేసుకొని యందు నివసించుచుండెను.

20. శ్లో॥ స్వసు ర్వధా న్నివవృతే
కంస స్తద్వాక్య సారవిత్।
వసుదేవోఽపి తం ప్రీతః
ప్రశస్య ప్రావిశ ద్గృహమ్॥

కంసుడు వసుదేవునియొక్క యావాక్యములయందలి సారమును తెలుసుకున్నవాడై తన సోదరిని చంపుటనుండి విరమించెను. వసుదేవుడుకూడ ఆ కంసుని ప్రశంసించి తన యింటికి వెళ్ళి ప్రవేశించెను.

21 శ్లో॥ కీర్తిమంతం ప్రథమజం
కంసాయా నకదుందుభిః।
అర్పయామాస కృచ్ఛ్రేణ
సోఽనృతా దతివిహ్వలః॥

అసత్యమువలన మిక్కిలి భయపడు స్వభావము గలవాడగు వసుదేవుడు తనకు మొదట పుట్టినట్టి కీర్తిమంతుడను కుమారుని అతికష్టముతో స్వయముగా తీసుకొనివెళ్ళి కంసునికి సమర్పించెను.

22. శ్లో॥ దృష్ట్వా సమత్వం తచ్ఛౌరే
స్సత్యే చైవ వ్యవస్థితమ్।
కంస స్తుష్టమనా రాజన్
ప్రహసన్నిద మబ్రవీత్॥

ఓరాజా, కంసుడు వసుదేవునియొక్క సమత్వబుద్ధిని, సత్యనిరతిని జూచి సంతోషించి నవ్వుచు వసుదేవునితో నిట్లనెను.

23. శ్లో॥ ప్రతియాతు కుమారోఽయం
నహ్యస్మా దస్తి మే భయం।
అష్టమా ద్యువయో ర్గర్భా
న్మృత్యు ర్మేఽభిహితః కిల॥

ఓ వసుదేవా, ఈ నీ కుమారుని నీవు తిరిగి తీసుకొని పొమ్ము. ఇతనివలన నాకు భయములేదు. మీ యొక్క ఎనిమిదవ కుమారునివల్లనుంచికదా నాకు మృత్యువని తెలుపబడెను.

24. శ్లో॥ తథేతి సుత మాదాయ
యయా వానక దుందుభిః।
నాభ్యనందత తద్వాక్య
మసతోఽవిజితాత్మనః॥

సరియేనని వసుదేవుడు తనకుమారుని తీసుకొని వెళ్ళిపోయెను. అసత్పురుషుడు యింద్రియలోలుడునైన అతనియొక్క యీ మాటలవలన వసుదేవుడు సంతోషించజాలక పోయెను.

25. శ్లో॥ దేవక్యా గర్భసంభూతం
విష్ణ్వంశం స్వవధం ప్రతి।
దేవకీం వసుదేవం చ
నిగృహ్యా నిగళై ర్గృహే
జాతం జాతమహన్ పుత్రం
తయోరజనశంకయా॥

దేవకీదేవియొక్క గర్భమందుద్భవించువాడు తనవధ నిమిత్తమై అవతరించు విష్ణువుయొక్క అంశయే యని నారదునివలన కంసుడు తెలుసుకున్నవాడై దేవకీవసుదేవులను సంకెళ్ళచే బంధించి ఒకగృహమునందునిర్బంధించి వారలకు కలిగిన పుత్రులనెల్ల వధింపజొచ్చెను.

26. శ్లో॥ హతేషు షట్సు బాలేషు
దేవక్యా ఔగ్రసేనినా।
సప్తమో వైష్ణవం ధామ
య మనంతం ప్రచక్షతే
గర్భో బభూవ దేవక్యా
హర్షశోకవివర్ధనః॥

ఉగ్రసేనుని కుమారుడైన కంసునిచే దేవకీదేవియొక్క ఆరుగురు బాలకులు జంపబడిరి. తిరిగి ఆమెకు విష్ణుకళా విభూషితుడై అనంతుడని పిలువబడునట్టివాడు, ఏడవగర్భస్థుడుగా నాయెను. అందువలన నామెకు భగవదంశ గర్భస్థుడాయెనని సంతోషము కంసునుభయముచే దుఃఖము వృద్ధికాజొచ్చెను.

27. శ్లో॥ భగవానపి విశ్వాత్మా
విదిత్వా కంసజం భయం।
యదూనాం నిజనాథానాం
యోగమాయాం సమాదిశత్॥.

విశ్వమునకు ఆత్మయైన భగవంతుడున్ను తనభక్తులగు యాదవులకు కంసునివలన సంప్రాప్తించిన భయమును తెలుసుకొని యోగమాయను గూర్చి యిట్లు ఆజ్ఞాపించెను.

28. శ్లో॥ గచ్ఛ దేవి వ్రజం భద్రే
గోపగోభి రలంకృతమ్।
రోహిణీ వసుదేవస్య
భార్యా ఽఽస్తే నందగోకులే॥.

ఓ మహాదేవీ! ఓ మంగళకరురాలా! నీవు గోపకుల తోను నలంకరించబడియున్న వ్రేపల్లెకు వెళ్ళుము. అచ్చట నందగోకులమునందు వసుదేవునిభార్య రోహిణి యను నామె యున్నది.

29. శ్లో॥ దేవక్యా జఠరే గర్భం
శేషాఖ్యం ధామ మామకం।
తత్సన్నికృష్య రోహిణ్యా
ఉదరే సన్నివేశయ॥.

దేవకీదేవియొక్క ఉదరమునందు శేషుడను పేరుగల నా సంబంధమైన కళయున్నది. ఆ కళను ఆమెయొక్క గర్భమునుండి యాకర్షించి రోహిణీదేవియొక్క గర్భమునందు ప్రవేశపెట్టుము!

30. శ్లో॥ అథాహ మంశభాగేన
దేవక్యాః పుత్రతాం శుభే।
ప్రాప్స్యామి త్వం యశోదయాం
నందపత్న్యాం భవిష్యసి॥

అటుపిమ్మట నేను పరిపూర్ణస్వరూపముతో దేవకీదేవికి పుత్రుడనుగా యవతరించెద. ఓ శుభప్రదురాలా! నీవు నందుని భార్యయైన యశోదాదేవియందు జన్మింతువుగాక.

31. శ్లో॥ అర్చిష్యంతి మనుష్యాస్త్వాం
సర్వకామవరేశ్వరీం।
నానోపహారబలిభి
స్సర్వకామ వరప్రదామ్॥.

అందరియొక్క యన్నకోరికల నీడేర్చుజాలనట్టియు, కోరి భజించు వారలందరకు కాంక్షితార్థముల ప్రసాదించు నట్టియు, నిన్ను మానవులు యనేకవిధములైన ఉపహారముల చేతను బలులచేతను పూజించుచుండగలరు.

32. శ్లో॥ నామధేయాని కుర్వంతి
స్థానాని చ నరా భువి।
దుర్గేతి భద్రకాళీతి
విజయా వైష్ణవీతి చ॥

33. శ్లో॥ కుముదా చండికా కృష్ణా
మాధవీ కన్యకేతి చ।
మాయా నారాయణీశానా
శారదేత్యంబికేతి చ॥

భూలోకమునందు నరులు నిన్ను దుర్గా, భద్రకాళీ, విజయా, వైష్ణవి, కుముదా, చండికా, కృష్ణా, మాధవీ, కన్యకా, మాయా, నారాయణీ, ఈశానా, శారదా, అంబికా అను పేర్లతో పిలిచెదరు మరియు ఆయా పేరుల కనుకూల పూజాస్థానములను నీకు నేర్పరచ గలుగుదురు.

34. శ్లో॥ గర్భం సంకర్షణా త్తం వా
ఆహుః స్సంకర్షణం భువి।
రామేతి లోకరమణా
ద్బలభద్రం బలోచ్ఛ్రియాత్॥,

దేవకీదేవియొక్క గర్భమునుండి, ఆకర్షించబడినవాడుగాన 'సంకర్షణు'డనియు లోకమున కానందమును గూర్చువాడగుటచే 'రాము'డనియు, అధికబల సంపన్నుడగుటవలన 'బలభద్రుడ'నియు, నీచేత ఆకర్షింపబడి రోహిణియందు ప్రవేశపెట్టబడుటద్వారా జన్మించినవానిని భూలోకమున బిలుచుచుందురు.

35. శ్లో॥ సందిష్టైవం భగవతా
తథేత్యోమితి తద్వచః।
పరిగృహ్య పరిక్రమ్య
గాం గతా తత్తథాకరోత్॥.

మాయాదేవి భగవంతునిచే నీవిధముగా నాజ్ఞాపించబడినదై యాయన యాజ్ఞాపించిన వచనములను యటులనే చేసెదనని సగౌరవముగా తలవాల్చి బహుపరి భూమిమీదకు వచ్చినదై భగవదాజ్ఞానుసారముగ జేసెను.

36. శ్లో॥ గర్భే ప్రణీతే దేవక్యా
రోహిణ్యాం యోగనిద్రయా।
అహో విస్రంసితో గర్భ
ఇతి పౌరా విచుక్రుశుః

యోగమాయచే దేవకీదేవినుండి రోహిణీదేవియందు గర్భము ప్రవేశపెట్టబడినతోడనే ప్రజలు యిందునుగురించి అతి యాశ్చర్యముతో 'దేవకికి గర్భము పోయినదే' యని సంభ్రమముతో జెప్పుకొనసాగిరి.

37. శ్లో॥ ఆవివేశాంశభాగేన
మన ఆనకదుందుభేః।
అంశేన భగవాన్ విష్ణో
ర్భూతో భారాపనుత్తయే॥

భగవంతుడైన శ్రీ మహావిష్ణువు భూభారమును బోగొట్టు నిమిత్తమై తన పరిపూర్ణకళతో వసుదేవుని యొక్క మనస్సునందావేశించెను.

38. శ్లో॥ సా దేవకీ సర్వజగన్నివాస
నివాసభూతా నితరాం న రేజే।
భోజేంద్రగేహే ఽగ్నిశిఖేవ రుద్ధా
సరస్వతీ జ్ఞానఖలే యథా సతీ॥

ఘటాదులయందు మూయబడియుండిన దీపమువలెను, దుర్బుద్ధుని యందరికట్టబడిన సరస్వతివలెను, కంసుని యింటికి యందు సమస్తజగత్తునకు నివాసభూతుడైన సర్వేశ్వరుని నివాసస్థానభూతురాలైన దేవకీదేవి కారాగృహమున యుంచబడియుండుటచే ఎవరికీ యేమాత్రము యానందమును కలిగింపజాలదయ్యెను.

39 శ్లో॥ తాం వీక్ష్య కంసః
ప్రభయాఽజితాంతరాం।
విరోచయంతీం భవనం
శుచిస్మితామ్,
ఆహైష మే ప్రాణహరో
హరిర్గుహాం।
ధ్రువం శ్రితో యన్నపురే
యమీదృశీ॥.

గర్భస్థుడైన పరమాత్మునిచే విరాజిల్లుచున్నట్టియు, భవనము ప్రకాశింపజేయుచున్నట్టియు, సుందరమందహాసవిశిష్టురాలైనట్టియు, ఆ దేవకీదేవిని కంసుడు జూచి ఈమె యింతవఱ పూర్వము నందీవిధముగా విలక్షణురాలై యుండలేదు. నా ప్రాణముల హరించు యా విష్ణుమూర్తి యీమె గర్భమందిపుడు నిశ్చయముగా నున్నాడు' అని దలచెను.

40. శ్లో॥ ఇతిఘోరతమా ద్భావా
త్సనివృత్త స్స్వయం ప్రభుః।
ఆస్తే ప్రతీక్ష్య తజ్జన్మ
హరే ర్వైరాను బంధకృత్॥.

(వైరాగ్యముచే) ఈ విధముగా దలచుచు ప్రభువైన కంసుడు ఘోరమైన యజ్ఞానమునుండి స్వయముగానే తన మనస్సు మరలించుకొని దేవకీదేవికి కేవిధమైన యాపదను కలుగజేయక విష్ణువునందు వైరమును మాత్రము పోగొట్టుకొనజాలనివాడై విష్ణుమూర్తి యొక్క యవతారమున కెదురు జూచుచుండెను.

—: బ్రహ్మాదయః దేవకీగర్భస్థితం పరమపురుషం స్తువంతి :—

41. శ్లో॥ బ్రహ్మా భవశ్చ తత్రైత్య
మునయో నారదాదయః॥
దేవై స్సానుచరై స్సాకం
గీర్భి ర్వృషణ మైడయన్॥.

బ్రహ్మ ఈశ్వరుడు, నారదాది మునీశ్వరులు, తమతమ యనుచరులగు దేవతలతోగూడ దేవకీదేవివద్దకు వెళ్ళి భక్తుల కోరికలను దీర్చు భగవంతుని నిట్లు దేవతలు స్తోత్రపాఠములచే స్తుతింపజొచ్చిరి,

42. శ్లో॥ సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం।
సత్యస్య యోనిం నిహితం చ సత్యే,
సత్యస్య సత్య మృతసత్య నేత్రం
సత్యాత్మకం త్వాం
శరణం ప్రపన్నాః॥

సత్యసంకల్పుడవైనట్టియు, సత్యవాక్పరిపాలనమే ప్రధానముగా నున్నట్టియు, సత్యమైనప్రకృతి-పురుష-కాలముల గలిగినట్టియు, పృథివ్యప్తేజో వాయ్వాకాశరూప భూతపంచకమునకు పరమకారణ భూతుడవైనట్టియు, పంచ భూతాత్మకమైన ప్రపంచము నందంతర్యామిరూపేణ సన్నిహితుడవైనట్టియు, సత్యాత్మకమైనట్టియు, ప్రపంచమునకు వినాశరహితనిలయు స్థానమైనట్టియు, సూనృతవాక్యములకున్ను ప్రవర్తకుడవైనట్టియు, నిర్వికారస్వభావుడవైనట్టియు, నిన్ను మేము శరణుజొచ్చుచున్నాము.

43. శ్లో॥ ఏకాయనో ఽసౌ ద్విఫల స్త్రిమూల।
శ్చతూరసః పంచశిఫ షడాత్మా,
సప్తత్వ గష్టవిటపో నవాక్షో।
దశచ్ఛదో ద్విఖగో హ్యాదివృక్షః॥

ప్రవాహతో నిత్యమై వినాశసహితమై యున్న దేహరూప ఈ ప్రపంచమను వృక్షము పరబ్రహ్మతత్త్వయొక్కదానిని మాత్రమే ఆశ్రయముగాకలిగినట్టిది. సుఖదుఃఖరూపములైన ఫలముల కలిగినట్టిది, సత్త్వరజస్తమోరూప గుణత్రయముల మూలముగా కలిగినట్టిది. ధర్మార్థకామమోక్షరూప చతుర్విధ పురుషార్థముల రసములుగా కలిగినట్టిది. పృథివ్యప్తేజో వాయ్వాకాశరూప పంచభూతముల అర్థప్రసారిణియగు శాఖలుగ కలిగినట్టిది బుబుక్షా-పిపాసా - శోక-మోహ-జరా-మృతిరూప షడూర్మ్ముల స్వభావముగా కలిగినట్టిది. చర్మ-రుధిర-మాంస-మేధో-మజ్జ-అస్థి శుక్లరూప సప్తధాతువుల చర్మములుగా కలిగినట్టిది. హస్త-పాద - శిరః-కంఠ-వక్షో-జఠరములను ఏనిమిదింటిని శాఖలుగ కలిగినట్టిది. రెండు నేత్రములు-రెండు శ్రోత్రములు-రెండు నాసికారంధ్రములు-నోరు-మలమూత్రద్వారములను నవరంధ్రముల తొర్రలుగా కలిగినట్టిది. ప్రాణా-పాన-వ్యానో-దాన - సమాన-నాగ-కూర్మ-కృకర-దేవదత్త-ధనంజయములను పదివాయువుల ఆకులుగ కలిగినట్టిది, జీవ-పరమాత్మలను రెండుపక్షుల కలిగినట్టిది.

44. శ్లో॥ త్వ మేక ఏవా స్య సతః ప్రసూతిః।
త్వం సన్నిధానం త్వ మనుగ్రహశ్చ।
త్వన్మాయయా సంవృతచేత సస్త్వాం
పశ్యంతి నానా న విపశ్చితో యే॥.

కార్యభూతమైన ఈ ప్రపంచవృక్షమునకు నీవొక్కడవే పరమకారణుడవు నీవు ప్రళయకాలమున లయమునకు స్థానమైనవాడవు నీవు ఇష్టప్రదానాదులచే పాలించువాడవు. జ్ఞానవిరోధియై నీశక్తిస్వరూపిణియైన నీ ప్రకృతిచే తిరోహితముగాని జ్ఞానులు నిన్నే పరమకారణునిగా, తెలుసుకొనుచున్నారు కాని యజ్ఞానులు నిన్ను ఇందులను వ్యతిరేకముగా నానావిధములుగ దలంచుచున్నారు.

45. శ్లో॥ బిభర్షి రూపాణ్య
వబోధ ఆత్మన్।
క్షేమాయ లోకస్య
చరాచరస్య
సత్వోపపన్నాని
సుఖావహాని,
సతా మభద్రాణి
ముహుః ఖలానామ్॥.

ఓ జ్ఞానస్వరూపా, ఓ పరమాత్మ! నీవు మోక్షప్రదుడవు కర్తవై శుద్ధసత్త్వప్రవర్తకములైనటువంటివిన్ని, సత్పురుషులకు సుఖమును కలుగజేయునటువంటివిన్ని, దుష్టులకు దుఃఖమును కలుగజేయునట్టియు, మత్స్యకూర్మాదిరూపములను చరాచరాత్మకమైన జగత్తుయొక్క క్షేమమునిమిత్తమై మాటిమాటికి ధరించుచున్నావు

46. శ్లో॥ త్వయ్యం బుజాక్షా
ఖిల లోక ధామ్ని।
సమాధినా వేశిత
చేతసై కే।
త్వత్పాదపోతేన
మహాత్మకృతేన,
కుర్వంతి గోపత్సపదం
భవాబ్ధిమ్॥.

ఓ వారిజాక్షా! మహాత్ములచే యుపదేశింపబడిన భక్తిరూపాపన్న జ్ఞానముచే సమస్తలోకమునకాధారభూతుడవైన నీయందు లగించబడిన చిత్తముచే భగవదవతారరూపాసక్తులగు కొందరు నిర్దోషాయమగు నీ పాదములను నావచే సంసారసాగరమును ఆవుదూడ యడుగువంటిదానినిగా అనగా అత్యంత సులభముగా దాటి శక్యమైనదానినిగా చేయుచున్నారు.

47. శ్లో॥ స్వయం సముత్తీర్య
సుదుస్తరం ద్యుమన్।
భవార్ణవం భీమ
మదభ్రసౌహృదాః।
భవత్పదాంభోరుహ
నావ మత్ర తే।
నిధాయ యాతా
స్నదనుగ్రహో భవాన్॥.

ఓ స్వప్రకాశ స్వరూపుడా! సమస్తభూతముల యందత్యంత సౌహార్దయుక్తులైన నీ భక్తులు కొందరు నీ పాదములను నావచే దాటుటకత్యంతాశక్యమై అతిభయంకరమైయున్న సంసార సాగరమును స్వయముగా నతిసులభముగా దాటినవారై మిగిలినవారికొరకై దానినిచ్చుటయుంచి వెళ్ళిరి. నీ సత్పురుషుల ననుగ్రహించు స్వభావముగలవాడవుగదా!

48. శ్లో॥ యే న్యే రవిందాక్ష
విముక్తమానినః।
త్వయ్య స్తభావా
దవిశుద్ధబుద్ధయః
ఆరుహ్యా కృచ్ఛ్రేణ పరం
పదం తతః
పతంత్య ధో
నాదృతయుష్మదంఘ్రయః॥

ఓ పద్మదళాయతాక్షా! మేము మహావిరాగులము అను వ్యర్థమైన యాత్మాభిమానము గలిగియున్నట్టియు, నీయందు భక్తిభావము లేనట్టియు. కుచ్ఛితమతులైనట్టియు, నీ పాదములనాశ్రయించునట్టియు, ఇతరజనులు పూర్వాచరిత విశేషముచే మోక్షసాధన యోగ్యమైన సద్బ్రహ్మాశ్రమ దుర్యోత్కృష్టస్థానమును పొందినవారలైనప్పటికి ఆస్థానమునందు ధఃపతితులగుచున్నారు.

49. శ్లో. తథా న తే మాధవ
తావకాః క్వచిత్।
భ్రశ్యంతి మార్గా
త్త్వయి బద్ధసౌహృదాః
త్వయాభిగుప్తా
విచరంతి నిర్భయా
వినాయకానీకప
మూర్ధసు ప్రభో॥

ఓ శ్రియఃపతీ, నీయందు భక్తిభావసంపన్నులై నిన్నే శరణుగా నమ్మియున్నట్టివారలు క్రిందటిశ్లోకమునందు వర్ణింపబడిన భక్తిశూన్యులవలె సత్పథమునుండి యెప్పటికిన్ని భ్రష్టులు కాజాలరు. ఓ ప్రభువా! నీచేత రక్షింపబడినవారలై విఘ్ననేథపతియొక్క శిరస్సునందు నిర్భయులై (విఘ్నములు జయించినవారలై) విలక్షణులై సంచరించగలరు.

50. శ్లో॥ సత్త్వం విశుద్ధం
శ్రయతే భవాన్ స్థితౌ।
శరీరిణాం శ్రేయ
ఉపాయనం వపుః।
వేదప్రియా యోగ
తప స్సమాధిభిః
తవార్హణం యేన
జన స్సమీహతే॥

నీవీ జగత్తుయొక్క రక్షణాసందు రజోతమోగుణములచే మిశ్రమముగానట్టి శుద్ధసత్త్వమయమైనట్టియు, శరీర ధారులయొక్క శ్రేయస్సుల కత్యంత సన్నిహితాశ్రయమైనట్టియు, రామకృష్ణాది శరీరములను ధరించుచున్నావు, అట్టి నీ దివ్యమంగళ విగ్రహముచే జనుడు నీయొక్క పూజను స్వాధ్యయనముచేతను యజ్ఞయాగాది కర్మలచేతను, నీ దివ్యమంగళ విగ్రహధ్యానముచేతను, అనశనాదివ్రతములచేతను, భక్తిభావనచేతను చేయకలుగుచున్నాడు.

51. శ్లో సత్త్వం నచే ద్ధాత రిదం
నిజం వపుః।
విజ్ఞాన మజ్ఞాన భిదా
ప మార్జనమ్,
గుణప్రకాశై రను
మీయతే భవాన్।
ప్రకాశతే యస్య చ
యేన వా గుణః॥

ఓ సృష్టికర్తా! నీ స్వకీయమై శుద్ధసత్త్వమయమైన ఈ నీ శరీరము లేనివానిచో అజ్ఞానమునుపోగొట్టి విశిష్టాపరోక్షజ్ఞానము లోపించినదే యగును. ఏ నీ చేత గుణమయ ప్రపంచము ప్రకాశించుచున్నదో, ఏ నీవు ప్రత్యక్షమగుచున్నదో అట్టినీవు గుణప్రకాశక కార్యములచే కారణభూతుడవని ఊహించి తెలుసుకొన బడుచున్నావు.

52. శ్లో॥ న నామరూపే
గుణకర్మ జన్మభిః
నిరూతవ్యే తవ
సర్వ సాక్షిణః
మనో వచోభ్యా
మనుమేయ వర్త్మనో
దేవ క్రియాయాం
ప్రతియం త్యథా పి హి.॥

వేదవాక్యములచేతను తదనుసారియైన మనస్సుచేతను స్వభావము కలిగినటువంటి నీ నామరూపములు సర్వసాక్షిభూతుడవైన నీయొక్క గుణ-కర్మ-జన్మలతో కూడ ఇతర సజాతీయములుగా నిరూపించబడజాలవు. ఓదేవా! ఇట్టివి లోకవిలక్షణములైనప్పటికిన్ని వైదికక్రియలయందు వీనిని అంగదేవతాది జాత్యములుగ వ్యవహరించుచున్నారు.

53. శ్లో॥ శృణ్వాన్ గృణన్ సంస్మరయం
శ్చ చింతయన్
నామాని రూపాణి చ
మంగళాని తే।
క్రియాసు య స్త్వ
చ్చరణారవిందయో।
రావిష్టచిత్తో న
భవాయ కల్పతే॥.

వైదికాది క్రియలలో నీపాదపద్మములయందు చక్కగా లగ్నముచేయబడిన మనస్సుకలవాడై సుమంగళ ప్రదములైన, నీయొక్క నామములను రూపములను వినుచు, కీర్తించుచు ధ్యానించుచు, సంస్మరించుచూ, యుండువాడు తిరిగి జన్మము నొందడు.

54. శ్లో॥ దిష్ట్యా హరే స్యాభవతః
పదో భువో।
భారోపనీత స్తవ
జన్మనే శితుః।
దిష్ట్యాంకితాం త్వత్పదకై
స్సుశోభనైః
ద్రక్ష్యామ గాం ద్యాం
చ తవా నుకంపితామ్॥.

ఓ విష్ణుమూర్తీ! మా భాగ్యవశమున నీయొక్క పాద స్థానీయమైన ఈ భూమియొక్క భారము జగన్నియంతయైన నీయొక్క జన్మచే పోగొట్టబడినదగుచున్నది. మా సుకృత విశేషమువలన వజ్రధ్వజాది చిహ్నాలచే సుశోభితమైన నీ కోమల పాదములచే చిహ్నితమైన భూమినిన్ని, భూభార భూత సురవిరోధుల సంహరించుటద్వాయ నీ దయకు విషయ గా చేయబడిన స్వర్గమున్నూ మేము చూడగలము.

55. శ్లో॥ న తేఽ భవస్యే శ
భవస్య కారణం।
వినా వినోదం బత
తర్కయామహే।
భవో నిరోధః
స్థితి రప్యవిద్యయా॥
కృతా యత స్త్వయ్య
భవాశ్రయాత్మని॥.

ఓ సర్వేశ్వరా! సంసారగంధస్పర్శమైనను లేనట్టి నీవవతరించుచుండుటకు కారణము నీ లీలామాత్రమేగదా! అంతకంటె మరితర కారణమేదియైన ఊహించజాలకున్నాము.

సంసారస్పర్శలేని పరమాత్ముడవైన నీవు సాక్షిభూతుడవై యుండగా సంసారుల జ్ఞానవిరోధియగు ప్రకృతిచే గలుగు కర్మాధీన సృష్టి-స్థితి-లయములు నీకెటుల కలుగజాలును.

56. శ్లో॥ మత్స్యాశ్వ కచ్ఛప
వరాహ నృసింహ హంస
రాజన్య విప్ర
విబుధేషు కృతావతారః।
త్వం పాహి న స్త్రిభువనం
చ యథాధునేశ।
భారం భువో హర
యదూత్తమ వందనం తే॥.

ఓ సర్వేశ్వరా! మత్స్య - అశ్వ-కూర్మ-వరాహ-హంస-శ్రీరామ-పరశురామాది యవతారములనెత్తి ఇదివరలో మమ్ములను ముల్లోకములను రక్షించునట్టిగానే యిప్పుడుకూడ యదువంశమునం దవతరించి భూమియొక్క భారమును పోగొట్టుమా యాదూత్తమా మీకు మేము వందనముల నాచరించుచున్నారము.

57 శ్లో॥ దిష్ట్యాంబ తే కుక్షిగతః
పరః పుమాన్।
అంశేన సాక్షా ద్భగవాన్
భవాయ నః।
మా భూ ద్భయం
భోజపతే ర్ముమూర్షో
ర్గోప్తా యదూనాం
భవితా తవా త్మజః॥.

ఓ తల్లీ, దేవకీదేవీ! పరమపురుషుడైనటువంటి భగవంతుడు సాక్షాత్తు పరిపూర్ణకళలతో మా సమృద్ధికొరకై అదృష్ట వశాత్తు నీయొక్క గర్భస్థుడైయున్నాడు మరణోన్ముఖుడైన కంసునివలన నీవు భయమును పొందకుమా! నీయొక్క ఈ కుమారుడు యాదవులకు రక్షకుడై యుండగలడు.

58. శ్లో॥ ఇత్యభిష్టూయ పురుషం
యద్రూప మనిదం యథా.
బ్రహ్మేశానౌ పురోధాయ
దేవాః ప్రతియయు ర్దివమ్॥.

ఏ పరమపురుషునియొక్క రూపము స్వరూపతః గాని గుణములచేగాని యథాతథముగా ఇట్టిదని నిర్దేశించి చెప్పశక్యము గానట్టి పరమపురుషునీవిధముగా స్తుతించి బ్రహ్మ-శివులను ముందునుంచుకొని దేవతలు స్వర్గమునకు తిరిగి వెళ్ళిపోయిరి.

59 శ్లో॥ అథ సర్వగుణోపేతః
కాలః పరమ శోభనః।
యర్హ్యేవా జన జన్మర్క్షం
శాంత ర్క్ష గ్రహతారకమ్॥.

అటుతరువాత (శ్రీకృష్ణపరమాత్మ యవతరించుచుండగా) కాలము సమస్తకల్యాణగుణములతో గూడుకున్నదై శోభతో విరాజిల్లుచుండెను. విష్ణోద్భవ బ్రహ్మదేవతాకమైన రోహిణీ నక్షత్రము శాంతిప్రదములైన అశ్విన్యాది నక్షత్రములు గురు శుక్రాది గ్రహములు తారలు కలదియాయెను.

60. శ్లో॥ దిశః ప్రసేదు ర్గగనం
నిర్మలోడు గణోదయమ్॥.
మహీ మంగళభూయిష్ఠ
పురగ్రామ వ్రజాకరా॥.

దిక్కులు ప్రసన్నములై యుండెను. ఆకాశము నిర్మలమైన నక్షత్రములయొక్క ఉదయముగలదై యుండెను. భూమి యత్యంత మంగళప్రదములైన పట్టణములు - గ్రామములు - గోపాలవసతులు కలదిగనుండెను

61. శ్లో॥ నద్యః ప్రసన్నసలిలా
హ్రదా జలరుహశ్రియః
ద్విజాలికులసన్నాద
స్తబకా వనరాజయః॥

నదులు నిర్మలోదకములు కలవి యాయెను, చెరువులు పద్మములశోభతో గూడుకున్నవిగనుండెను. వృక్షపంక్తులు పక్షులు - తుమ్మెదలతో విరాజిల్లు పుష్పగుత్తులతో గూడుకున్నవై యుండెను.

62. శ్లో॥ వవౌ వాయు స్సుఖస్పర్శః
పుణ్యగంధవహ శ్శుచిః
అగ్నయ శ్చ ద్విజాతీనాం
శాంతా స్తత్ర సమేధితాః॥

వాయువు సుఖస్పర్శగలదై చక్కటి పరిమళముగలదై పవిత్రవంతమునై వీవదొడగెను. బ్రాహ్మణులయొక్క అగ్నిహోత్రములా సమయమున కలుషరహితములై మిక్కిలి దీప్తి గలవై వెలుగుచుండెను.

63. శ్లో॥ మనాం స్యాసన్ ప్రసన్నాని
సాధూనా మసురద్రుహాం
జాయమానే ఽజనే తస్మి
న్నేదు ర్దుందుభయో దివి,.

పరమాత్ముడైన భగవంతుడవతరించుచుండగా సాధు పుంగవులందరియొక్క మనస్సులు ఆనందయుక్తములాయెను. ఆకాశమునందు దేవదుందుభులు మ్రోగదొడగెను.

64. శ్లో॥ ముముచు ర్మునయో దేవా
స్సుమనాంసి ముదాన్వితాః
మందం మందం జలధరా
జగర్జు రనుసాగరమ్
నిశీథే తమ ఉద్భూతే
జాయమానే జనార్దనే॥.

ఆ రాత్రిమునందు గాఢాంధకార సమావరింపబడియుండగా జనార్దను డవతరించెను. అప్పుడు మునీశ్వరులు దేవతలు సత్పురుషులు అత్యానందయుక్తులై సంతోషించిరి. మేఘములతిసర్వ్యలముగా సముద్రముపైపైనన ప్రయాణమై పోవుచ్చినవి.

65. శ్లో॥ దేవక్యాం దేవరూపిణ్యాం
విష్ణు స్సర్వగుహాశయః।
ఆవిరాసీ ద్యథా ప్రాచ్యాం
దిశీందు రివ పుష్కలః॥.

దేవస్వరూపిణియైన దేవకీదేవియందు అంతర్యామియైనట్టి సర్వహృదయగుహాంతర్వర్తియైన పరిపూర్ణుడగు విష్ణుమూర్తి తూర్పుదిక్కునందు పూర్ణచంద్రుడువలె యావిర్భవించెను.

66. శ్లో॥ తమద్భుతం బాలక
మంబుజేక్షణం
చతుర్భుజం శంఖగదా
ద్యుదాయుధమ్
శ్రీవత్సలక్ష్మం
గళశోభికౌస్తుభం।
పీతాంబరం
సాంద్రపయోద సౌభగమ్॥

పద్మదళాయతాక్షుడును, శంఖచక్ర గదా ఖడ్గములతో విరాజిల్లు చతుర్భుజ విశిష్టుడును, శ్రీవత్సలాంఛనుడును, కంఠమునందు ప్రకాశించు కౌస్తుభమణియుక్తుడును, పీతాంబరధరుడును, జలభరితమేఘవలె సుందరుడును.

67. శ్లో॥ మహార్హ వైడూర్య
కిరీట కుండల।
త్విషా పరిష్వక్త
సహస్ర కుంతలం।
ఉద్దామ కాచ్యం గద
కంకణాదిభిః।
విరోచమానం
వసుదేవ ఐక్షత॥.

అత్యంతామూల్యములైన వైడూర్య-కిరీట - కుండలముల కాంతితో కూడుకొన్నట్టి ముంగురులు గలవాడును, మంచి బంగారు భుజకీర్తులు కంకణములు మున్నగువాటితో మిక్కిలి ప్రకాశించుచున్నవాడును యగు, అత్యాశ్చర్య రూపముతో వెలుగొందు యాబాలకుని వసుదేవుడు దర్శించెను.

68 శ్లో॥ స విస్మయోత్ఫుల్ల
విలోచనో హరిం।
సుతం విలోక్యా
నకదుందుభి స్తదా।
కృష్ణావతారోత్సవ
సంభ్రమో స్పృశన్।
ముదా ద్విజోభ్యో
యుత మాప్లుతో గవామ్॥.

అప్పుడా వసుదేవుడు సంభ్రమముచే వికసించిన నేత్రములు కలవాడై కుమారుడై యవతరించిన యా విష్ణుమూర్తిని జూచి శ్రీకృష్ణావతారోత్సవానందముగలవాడై సంతోషముచే స్నాతుడై పదివేలగోవులను బ్రాహ్మణులకు మనసా దానము జేసెను.

69. శ్లో॥ అథైన మస్తౌ
దవధార్య పూరుషం।
పరం నతాంగః
కృతధీః కృతాంజలిః
స్వరోచిషా భారత
సూతికాగృహం।
విరోచయంతం
గతభీః ప్రభావవిత్॥.

అటుతరువాత ఓ పరీక్షన్మహారాజా! వసుదేవుడు తన యొక్క కాంతిచే పురుటింటిని ప్రకాశింపజేయునట్టి, ఈయ నను పరమపురుషునిగా తెలుసుకొని కుశలబుద్ధిగలవాడుగాన చేతులు జోడించి నమస్కరించుచు, ఆయన ప్రభావమును తెలిసినవాడుగాన కంసునివలన నెట్టిభయమును జెందనివాడై స్తుతించ ప్రారంభించెను.

70. శ్లో॥ విదితోఽసి భవాన్ సాక్షా
త్పురుషః ప్రకృతేః పరః।
కేవలాను భవానంద
స్వరూప స్సర్వ బుద్ధిదృక్

ఓస్వామి! నీవు ప్రకృతి కంటెను పరుడైనట్టి పరమపురుషుడనియు, కేవలజ్ఞానానంద స్వరూపుడనియు, సర్వవస్తు గోచర జ్ఞానధారియైన సర్వజ్ఞుడవనియు తెలుసుకొనుచున్నాను.

71. శ్లో॥ స ఏవ స్వ ప్రకృ త్యేదం
సృష్ట్వా గ్రే త్రిగుణాత్మకం
తదను త్వం హ్యప్రవిష్టః
ప్రవిష్ట ఇవ భావ్యతే॥.

అట్టినీవే నీకు కార్యోపయోగియై విశేషణభూతమైన ప్రకృతిచేత సత్వరజస్తమోరూప త్రిగుణాత్మకమైన ఈ జగత్తును ప్రళయాంత మందు తిరిగి సృజించి యపుడు నీవు, దీనియందు సత్తాది నిర్వహణార్థముమాత్రము అనుప్రవేశము గలవాడైనను అనాది కర్మవాసనాదులచే ప్రవేశము లేనివాడవైనను ప్రవేశించియున్నదానివలె తత్వము తెలియని వారలచే నిరూపించబడుచున్నావు.

72. శ్లో॥ యథేమే వికృతా భావా
స్తథా తే వికృతై స్సహ।
నానావీర్యాః పృథగ్భూతా
విరాజం జనయంతి హి॥

అధిష్ఠాతవైన నీచేమాత్రమే మహత్తత్వము, అహంకారము పంచతన్మాత్రలు (శబ్దతన్మాత్ర - స్పర్శతన్మాత్ర - రూపతన్మాత్ర - రసతన్మాత్ర - గ్రంధతన్మాత్ర) అను ఈ సుప్రసిద్ధ ఏడు పదార్థములు ఏర్పడినటువలెనే, ఇవి నీచేమాత్రమే విచిత్రశక్తియుక్తులై పరస్పరభిన్న స్వరూపులుకలవై స్థూలభూతములతో సహా నీయవయవస్థానభూతమైన బ్రహ్మాండమును బుట్టించుచున్నవిగదా!

73 శ్లో॥ సన్నిపత్య సముత్పాద్య
దృశ్యంతే నుగతా ఇవ।
ప్రాగేవ విద్యమానత్వా
న్న తేషా మిహ సంభవః॥

ఈ పృధివ్యాది భూతములు అండోత్పత్తికి పూర్వమే యున్నవి. అండోత్పత్త్యనంతరమున యివి యుత్పన్నములు కాలేదు. గావుననే ఇవి పంచీకరణము చేయబడినవై అండమును నిర్మించి అండాంతర్గములై గనిపించుచున్నవి. అటువలెనే నీవుకూడ నీశయనస్థానభూతమైన అండమునందు ప్రవేశించియున్నావు.

74. శ్లో॥ ఏవం భవాన్
బుద్ధ్యనుమేయలక్షణై ః।
గ్రాహ్యై ర్గుణై స్సన్నపి
తద్గుణాగ్రహః।

ఇట్టినీవు అంతటను కారణతయా వర్తించుచున్నవాడై నప్పటికిన్ని, రూపాదిజ్ఞానముచె ఊహించి తెలుసుకొనతగిన స్వరూపముగల యింద్రియములచే గ్రహించతగిన పదార్థములతో సమముగా, ఆ యింద్రియములచే గ్రహింపబడు

అనావృతత్వా
ద్బహిరంతరం న తే।
సర్వస్య సర్వాత్మన
ఆత్మవస్తునః॥

వాడవుకావు-అపరిచ్ఛిన్నుడగుటచే నీవు దీనిచేతను ఆవరింపబడశక్యమైనవాడవుగావు. సర్వశబ్దవాచ్యుడవు - సర్వశరీరకుడవు. సర్వభూతుడవు, ఇట్టినీకు వెలుపల-లోపల యనునవిలేవు కదా.

75. శ్లో॥ య ఆత్మనో దృశ్య
గుణేషు సన్నితి।
వ్యవస్యతే స్వవ్యతిరేకతో
ఒబుధః
వినానువాదం చ
నతన్మనీషితం
సమ్యగ్యతస్త్యక్త
ముపాదదత్పుమాన్॥

ఎవడైతే స్వస్వరూపవ్యతిరేకముగా అత్మకుండి తివాభ్యగ పదార్థములయందు ఇవి నిత్యములను నిశ్చయజ్ఞానము గలవాడగుచున్నాడో, అట్టివాడజ్ఞాని అట్టివాని నిశ్చయము అనువాద మవసరములేకుండగనే అయోగ్యమైనదగుచున్నది. అట్టివాడు (అనిత్యత్వ హేతువల్లనే) వివేకవంతులచే పరిహృతమైనదానిని స్వబుద్ధ్యా స్వీకరించునట్టి వాడగుచున్నాడు.

76. శ్లో॥ త్వత్తోఽస్య జన్మస్థితి
సంయమాన్ విభో।
వదంత్యనీహా
దగుణాద విక్రియాత్।
త్వయీశ్వరే బ్రహ్మణి
నో విరుధ్యతే
త్వదాశ్రయత్వా
దుపచర్యతే గుణైః॥

ఓ ప్రభువా! పరిదృశ్యమానమైన ఈ జగత్తుయొక్క సృష్టి-స్థితి లయములు, - సంకల్పేతర వ్యాపారరహితుడవైనట్టియు, సత్వ-రజో-తమో-గుణత్రయరహితుడవైనట్టియు, స్వరూప వికార రహితుడవైనట్టియు, నీవల్లనే మాత్రమే కలిగినవని చెప్పుచున్నారు. నీవు సర్వనియామకుడవు స్వరూపతః గుణములచే బృహత్వగుణ విశిష్టుడవు. అట్టి నీ యందు ఇవి యంతమాత్రము విరుద్ధము కాజాలవు. అంతరత్మతయా నీవు సమస్తకార్యవర్గమునకు ఆధారభూతుడవై యుండుట వలన ద్వారా భూతములైన నీ శరీరాత్మక గుణమయ కార్యాత్మతయా నీయందుపచారవశాత్తు జెప్పబడుచున్నదే గాని నీవు వికారశూన్యుడవుగాన నీయందు సాక్షాత్తుగా సృజ్యత్వాది వ్యపదేశము లేదుకదా!

77. శ్లో॥ సత్త్వం త్రిలోకస్థితయే
స్వమాయయా।
బిభర్షి శుక్లం ఖలు
వర్ణమాత్మనః।
సర్గాయ రక్తం రజసో
ప బృంహితం।
కృష్ణం చ వర్ణం
తమసా జనాత్యయే॥

అట్టి నీవు నీ సంకల్పముచే ముల్లోకములయొక్క రక్షణ నిమిత్తమై స్వయముగా సత్త్వగుణోపబృంహితమైన తెలుపు వర్ణమును, సృష్టినిమిత్తమై రజోగుణోప బృంహితమైన ఎఱుపు వర్ణమును, ప్రళయమునిమిత్తమై తమోగుణోప బృంహితమైన నలుపువర్ణమునుకూడ నీకు ధరింపజేసుకొనుచున్నావు.

78. శ్లో॥ త్వమస్య లోకస్య
విభో రిరక్షిషుః
గృహే ఒవతీర్ణోసి
మమా ఖిలేశ్వర।

ఓ ప్రభువా! ఓ సర్వలోకైకనాథా! నీవు లోకమును రక్షింపగోరినవాడవై నాయింటియందవతరించితివి - రాజులను పేరుతో కోట్లకొలదిగ యున్నట్టి రాక్షససమూహములచే యంతటను ప్రేరితులైయున్నట్టి సేనలను నీవు సంహరింతువుగాక!

రాజన్య సజ్ఞా
మితకోటి యూథపైః।
నిర్వ్యూహ్యమానాని
హనిష్యసే చమూః॥.

79. శ్లో॥ అయం త్వ సభ్య స్తవ
జన్మమే గృహే।
శ్రుత్వా గ్రజాం స్తే
న్యహన త్సురేశ్వర।
స తే వతారం
పురుషై స్సమర్పితం।
శ్రుత్వా ధునై
వాభిసర త్యుదాయుధః॥

ఓ దేవాదిదేవా! దుష్టాగ్రేసరుడైన ఈ కంసుడు నాయింటి యందు నీవు జన్మింతువను విషయమును విని నీయొక్క పెద్దగున్న యన్నలను యిదివరలోనే జంపివైచెను, ఆ దుర్మార్గుడు తన భటులచే ఈ నీయవతార విషయమును విని యిప్పుడే యాయుధములను ధరించి యిచ్చటకు రాగలడు.

**-: దేవకీకృత స్తుతిః :-**

80. శ్లో॥ అథై న మాత్మజం
వీక్ష్య మహాపురుషలక్షణం।
దేవకీ త ముపాధావ
త్కంసా ద్భీతా శుచిస్మితా॥

అటుపిమ్మట దేవకీదేవి మహాపురుషలక్షణ సమన్వితుడై తన పుత్రభూతుడైన భగవంతునిజూచి కంసునివలన భయము గలదైనప్పటికి మందస్మితవదనయై యాయనను స్తోత్రము జేయు సంకల్పముతో సమీపించెను.

81. శ్లో॥ రూపం య త్తత్ప్రాహు
రవ్యక్త మాద్యం।
బ్రహ్మ జ్యోతి ర్నిర్గుణం
నిర్వికారమ్।
సత్తామాత్రం నిర్విశేషం
నిరీహం।
స త్వం సాక్షా ద్విష్ణు
రధ్యాత్మదీపః॥.

ఓ స్వామి! నీవు అతీంద్రియమైనట్టి రూపము గలవాడవు. ప్రప్రథముడవు బృహత్స్వరూప - గుణములగలవాడవు. వీటినితరులకు కూడ కలిగించగలవాడవు. స్వయంప్రకాశ స్వరూపుడవు. సత్వాదిగుణ శూన్యుడవు. శోకమోహాది షడ్వికార రహితుడవు. వృద్ధిక్షయాది రహితుడవు శబ్ద స్పర్శాది విశేషశూన్యుడవు. పుణ్యపాపాది రూపవ్యాపార రహితుడవు, దీపమువలె సర్వమును ప్రకాశింపజేయు జ్ఞాన విశిష్టుడవు. నీవు సాక్షాత్తు విష్ణుడవేకదా।

82. శ్లో॥ నష్టే లోకే
ద్విపరార్ధావసానే।
మహాభూతే ష్వాది
భూతం గతేషు।
వ్యక్తేవ్యక్తం
కాలవేగేన యాతే।
భవా నేక శ్శిష్యతే
శేషసంజ్ఞః॥.

చతుర్ముఖ బ్రహ్మయొక్క ఆయుఃపరిమాణము దేవమానముచే నూరు వత్సరములు దానికే ద్విపరార్థమందురు. అదియే లోకమునకు ప్రళయరూప అవసానకాలము అట్టి ద్విపరార్ధావసానరూప ప్రళయకాలమునందు లోకము నశించగా, పృథివ్యాది పంచమహాభూతములు స్వకారణభూత అహంకారమందు లయమును పొందగా, ఆ అహంకారమునకు కారణమైనట్టి మహత్తత్వమునందు ప్రకృతియంతయు కాల పరిపక్వరూప వేగముచే లయమును బొందగా సర్వశరీరకుడవుగాన సర్వశబ్దవాచ్యుడవై నీవొక్కడవుమాత్రమే మిగిలి యుందువుగాదే!

83 శ్లో॥ యో యం కాల
స్తస్య తే వ్యక్త బంధో।
చేష్టా మాహు శ్చేష్టతే
యేన విశ్వమ్
నిమేషాది ర్వత్సరాంతో
మహేయాన్।
త్వాం త్వేశానం క్షేమ
ధామ ప్రపద్యే॥.

నిమిషము మొదలు సంవత్సరాంతమువరకు గల యీకాల మైతే గొప్పదైయున్నదో, ఏకాలముచే విశ్వము చేష్టకల దగుచున్నదో, అట్టి కాలమును ప్రకృతి కి నీదకుడవుగాన దానికి బంధుడైనట్టివాడా! అవిధముగా ప్రసిద్ధుడవైన నీయొక్క కిలనుగా తెలుపుచున్నారు. అభయస్థానమైనట్టియు, సర్వనియామకుడవైనట్టియు నిన్ను శరణుగా బొందుచున్నాను.

84. శ్లో॥ మర్త్యో మృత్యు
వ్యాళభీతః పలాయన్।
సర్వాన్ లోకా
నిర్భయం నాధ్యగచ్ఛత్।
త్వత్పాదాబ్జం ప్రాప్య
యదృచ్ఛయాద్య।
స్వస్థ శ్శేతే మృత్యు
రస్మా దపైతి॥.

మానవుడు మృత్యువను సర్పముచే భయమును జెందినవాడై సమస్త లోకములను తిరిగినవాడై యెచ్చటను మృత్యుభయరాహిత్యమును పొందజాలకున్నవాడై. ఓ యాది కారణస్వరూపా! యాదృచ్ఛికాది సుకృత పరిపాకవశముచే నీయొక్క పాదపద్మములను బొంది స్వస్థచిత్తుడై మనుచున్నాడు. ఇందువలన మృత్యువును బోగొట్టుకొనుచున్నాడు.

85. శ్లో॥ స త్వం ఘోరా
దుగ్రసేనాత్మజా న్నః।
త్రాహి త్రస్తాన్
భృత్యవిత్రాసహాసి।
రూపం చేదం
పౌరుషం ధ్యానధిష్ణ్యం
మా ప్రత్యక్షం
మాంసదృశాం కృషీష్ఠాః॥.

నీవు నీ భృత్యులయొక్క భయమును బోగొట్టువాడవు వదా! అట్టి నీవు దురాత్ముడైన కంసునివలన భయమును జెందియున్నట్టి మమ్ములను రక్షించుచూ పరమపురుషత్వ సూచకమైనట్టియు, యోగిధ్యానావలంబనమైనట్టియు, యోగిధ్యానావలంబనమైనట్టియు నీయీ రూపమును మావంటి మాంస చక్షుష్కులకు గోచరించుదానిగా జేయకుమా!

86. శ్లో॥ జన్మ తే మయ్యసౌ పాపో
మా విద్యా న్మధుసూదన।
స ముద్విజే భవ ద్ధేతోః
కంసా దహ మధీరధీః॥.

ఓ మధుసూదనా, నాయందు కలిగిన నీయొక్క ఈ జన్మను పాపుడైన కంసుడు తెలుసుకొన లేకుండుగాక. నీయొక్క ఈ యవతారమునకు కారణభూతుడైన సంసునివల్ల ధైర్యవిహీనురాలనై నేను భయపడుచున్నాను.

87. శ్లో॥ ఉపసంహర విశ్వాత్మ
న్నదో రూప మలౌకికమ్।
శంఖచక్ర గదాపద్మ
శ్రియా జుష్ట చతుర్భుజమ్॥.

ఓ విశ్వాత్మస్వరూపుడా! శంఖము-చక్రము-గద-పద్మముల శ్రీచే గూడుకొనిన చతుర్భుజములతో విరాజిల్లుచున్నట్టి యీ లోకాతీత రూపమును ఉపసంహరించుమా!

శ్రీ భగవాన్ !

88. శ్లో॥ త్వ మేవ పూర్వసర్గేభూః
పృశ్ని స్స్వాయంభువే సతి॥
తదా యం సుతపా నామ
ప్రజాపతి రకల్మషః॥

భగవంతుడు చెప్పుచున్నాడు :- ఓ దేవదేవీ! స్వాయంభువ మన్వంతర మందలి నీ మొదటి జన్మమునందు నీవు 'పృశ్ని' యను పేరుగల పతివ్రతా శిరోమణివై యుంటివి. అప్పుడు పాప రహితుడైనట్టి ఈ వసుదేవుడు 'సుతపుడు' ను పేరుగల ప్రజాపతియై నీకు భర్తగా నుండెను.

89. శ్లో॥ జీర్ణపర్ణానిలాహారా
వుపశాంతేన చేతసా।
మత్తః కామా నభీప్సంతౌ
మదారాధనమీహతుః॥

జీర్ణములైన యాకులున్ను, గాలియు యాహారముగాగల వారై విషయవాసనలచే శాంతి చిన మనస్సుగలవారై నావల్ల వరమును గోరినవారలై మీ రిద్దరపుడు నన్ను యాదరించితిరి.

90. శ్లో॥ ఏవం వాం తప్యతో భద్రే
తపః పరమదుష్కరమ్।
దివ్యవర్ష సహస్రాణాం
ద్వాదశేయు ర్మదాత్మనోః॥

ఓ మంగళప్రదురాలా! ఈ విధముగా యత్యంత కష్టకరమైనట్టి తపమును యాచరించుచు నాయందే చిత్తమును నిలిపి మీరు పన్నెండువేల దివ్యవత్సరములు గడిపితిరి.

91. శ్లో॥ తదా వాం పరితుష్టోఽహ
మమునా వపుషా నఘే।
తపసా శ్రద్ధయా నిత్యం
భక్త్యా చ హృది భావితః॥

ఓ పుణ్యాత్మురాలా! అపుడు నేను శ్రద్ధతో కూడిన మీ మనస్సుచేతను అనవరత భక్తిచేతను శంఖ-చక్ర-గదా-పద్మములతో గూడిన యీ రూపముతో నిత్యము మీ హృదయములందు ధ్యానింప బడినవాడనై మిక్కిలి సంతుష్టుడనైతిని.

92. శ్లో॥ ప్రాదురాసం వరదరా
డ్యువయోః కామదిత్సయా।
వ్రియతాం వర ఇత్యుక్తే
మాదృశో వాం వృత స్సుతః॥

వరప్రదాన శ్రేష్ఠుడనైన నేను మీ కోరిక దీర్చదలచి మీకు ప్రత్యక్షమైతిని. వరమును గోరుడని నేను మిమ్ముల నడుగగా నా వంటి కుమారుడు గావలెనని మీరు నన్ను వరమడిగితిరి

93. శ్లో॥ అజుష్ట గ్రామ్యవిషయా
వనపత్యౌ చ దంపతీ।
న వవ్రాథే పవర్గం మే
మోహితౌ మమ మాయయా॥

విషయవాంఛా రహితులైనప్పటికి సంతానవంతులు గాక పోవుటచే మీ దంపతులిద్దరు నాయొక్క మాయచే మోహితులై నావల్ల పరమపురుషార్థమైన మోక్షమును గోరరైరి.

94. శ్లో॥ గతే మయి యువాం
లబ్ధ్వా వరం మత్సదృశం సుతం।
గ్రామ్యాన్ భోగా నభుంజాథాం
యువాం ప్రాప్తమనోరథౌ॥

నావంటి కుమారుని బొందుట యను వరమును మీరు నావల్లబొందితిరి. తర్వాత నేనంతర్థానుడనైతిని. మనోరథప్రాప్తిగలవారై మీరు యింద్రియ భోగముల యథేచ్ఛ ననుభవించ జొచ్చిరి.

95. శ్లో॥ అదృష్ట్వా న్యతమం లోకే
శీలౌదార్యగుణైః సమమ్।
అహం సుతో వామభవం
పృశ్నిగర్భ ఇతి స్మృతః॥

శీలము, ఔదార్యము, మున్నగు గుణములచే నాతో సమమైనవాడే లోకమందును గనబడకబోవుటచే పృశ్నిగర్భుడను పేరుగలవాడనై నేనే మీకు కుమారుడనై జన్మించితిని.

96 శ్లో॥ తయోర్వాం పునరేవాహ
మదిత్యాం మథకశ్యపాత్ ।
ఉపేంద్ర ఇతి విఖ్యాతో
వామనత్వాచ్చ వామనః॥

అటుతరువాత మీరిద్దరు అదితి-కశ్యపులై జన్మించిరి. అప్పుడు మీరిద్దరకు తిరిగి నేను ఉపేంద్రుడననియు, పొట్టివాడనై యుండుటచే వామనుడననియు పేరుగలవాడనై జన్మించితిని.

97. శ్లో॥ తృతీయేస్మిన్ భవేహం వై
తేనైవ వపుషా నఘౌ।
జాతో భూయ స్తయోరేవ
సత్యం మే వ్యాహృతం సతి॥

ఓ పుణ్యాత్మురాలా! తిరిగి మీరు ఈ దేవకీ-వసుదేవ రూపములతో మూడవ జన్మమెత్తగా మీయందు నేను తిరిగి యట్టి శరీరము తోడనే జన్మించితిని. సత్పురుషుల విషయమై నా పలుకులు యథార్థములగు చున్నవి.

98. శ్లో॥ ఏతద్వాం దర్శితం రూపం
ప్రాగ్జన్మస్మరణాయ మే।
నాన్యథా మద్భవం జ్ఞానం
మర్త్యలింగేన జాయతే॥

ఇదివరలోని జన్మములయొక్క స్మరణను కలుగజేయుటకై ఈ నాయొక్క రూపము మీకిపుడు చూపబడినది. ఇటుల గానిచో మానవ చిహ్నచే నా సంబంధమైన జ్ఞానము మీకు కలుగదు కదా!

99. శ్లో॥ యువాం మాం పుత్రభావేన
బ్రహ్మభావేన చాసకృత్।
చింతయంతౌ కృతస్నేహౌ
యాస్యేథే మద్గతిం పరాం॥

నన్ను మీరు పుత్రుడనను ప్రేమభావములతోను పరాత్పరుడనను భక్తి భావముతోను యెల్లప్పుడు స్మరించుచు యాత్యంత స్నేహముగలవారై దేహావసానమునందు నా పరమపదమును బొందగలరు.

100. శ్లో॥ యది కంసా ద్బిభేషి త్వం
తర్హి మాం గోకులం నయ।
యశోదాయాశ్చ తాం కన్యాం
మన్మాయా మానయ ద్రుతం
స్వయం స్వ్యర్గీవృతా
ద్వారోయమునా చ సుదుస్తరా॥

నీవు కంసునివలన భయము జెందుచున్నచో నన్ను వ్రేపల్లెకు తీసుకొని వెళ్ళవలసినది, అచ్చట నాయొక్క యోగమాయ నందుని భార్యయగు యశోదాదేవికి జన్మించి యున్నది. ఆ కన్యకను వెంటనే యిచ్చటకు తీసుకొని రావలసినది. కారాగార ద్వారములు వానంతటయవియే తెరువబడగలవు. యమునా నదికూడ మీకు దాటుటకును వుగా నుండగలదు.

శ్రీశుకః :-

101. శ్లో॥ ఇత్యుక్త్వాసీ ద్ధరి స్తూష్ణీం
భగవానాత్మమాయయా।
పిత్రోస్సంపశ్యతో స్సద్యో
బభూవ ప్రాకృత శ్శిశుః॥

శ్రీ శుకులిటుల తెలిపిరి. భగవంతుడైన శ్రీహరి యిటుల పలికి ఊరకుండెను. మరియు వెంటనే తల్లిదండ్రులు జూచుచుండగనే యాయన ప్రాకృత శిశువుగానై పోయెను.

102. శ్లో॥ తతశ్చ శౌరి ర్భగవ
త్ప్రచోదితః
సుతం సమాదాయ
ససూతికాగృహాత్।

అటుపిమ్మట శ్రీకృష్ణపరమాత్మునిచే బోధింపబడినటువంటి వాడై వసుదేవుడు ఆ పురిటింటినుండి యాబాలకుమారుని తీసుకొని బయటకు వెళ్ళదలచుచుండగనే, పుట్టుకలేని యోగమాయ నందుని భార్యయగు యశోదాదేవికి బుట్టెను.

యదా బహిర్గంతు
మిమేష తర్హ్యజా
యా యోగమాయా
జని నందజాయయా॥

103. శ్లో॥ తయా హృతప్రత్యయ
సర్వవృత్తిషు।
ద్వాఃస్థేషు పౌరేష్వ
చ శాయితేష్వథ।
ద్వారస్తు సర్వాః
పిహితా దురత్యయా।
బృహత్కవాటాయస
శృంఖలైః కిల॥

మాయాదేవియొక్క మాయచేత కావలి ద్వారముల యందున్నట్టి కావలి వారలున్ను, పౌరజనులున్ను జ్ఞానహీనులై సర్వేంద్రియ వ్యాపారములనుండి విరమింపబడినవారలై నిద్రజెందియుండిరి. పెద్దతలుపులతోను, యినుప గొలుసులతోను దాటివెళ్ళ శక్యముగానివై యే ద్వారములన్నియు మాయబడినవై యుండినవియో

104. శ్లో॥ తాః కృష్ణవాహే
వసుదేవ ఆగతే।
స్వయం వ్యశీర్యంత
యథా తమో రవేః॥
వవర్ష పర్జన్య
ఉపాంశు గర్జితః।
శేషోఽన్వగా ద్వారి
నివారయన్ ఫణైః॥

అట్టి ద్వారములన్నియు శ్రీకృష్ణుని యెత్తుకొని వసుదేవుడు తమ సమీపమునకు వచ్చిన వెంటనే సూర్యుని రాకవలన చీకటి పటాపంచలై పోవునటులనే తమంతటతామే విడిపోయినవి పర్జన్యుడు నెమ్మదిగా గర్జించుచు వర్షింపజొచ్చెను. ఆదిశేషుడు తన పడగలను విప్పి వారలను గొడుగువలె యడ్డుగవచ్చినవాడై వర్షమువారిపై బడకుండగ వారివెనువెంట వెడలెను.

105. శ్లో॥ మఘోని వర్షత్య
సకృద్యమానుజా॥
గంభీరతోయౌఘ
జవోర్మి ఫేనిలా।
భయానకావర్త
శతాకులానదీ
మార్గం దదౌ సింధు
రివ శ్రియఃపతేః॥

ఇంద్రుడు విడువకుండగా గంభీరమైన నీటిప్రవాహముచే కలిగిన తరంగములతోను నురుగుతోను వ్యాపించి యున్నట్టియు, అతి భయంకరమైనట్టియు యనేక సుడిగుండములచే వ్యాకులమైనట్టియు యమునానది సీతాపతియగు శ్రీరామచంద్రునకు సముద్రుడువలె తననుండి యవతలగట్టునకు వెళ్ళుటకు వసుదేవునకు మార్గమొసంగెను.

106. శ్లో॥ నందవ్రజం శౌరి
రుపేత్య తత్ర తాన్।
గోపాన్ ప్రసుప్తా
నుపలభ్య నిద్రయా।

వసుదేవుడు నందునియొక్క వ్రేపల్లెనుజేరి యచ్చట మాయచే గాఢనిద్రను జెందియున్న గోపకులను చూచి బాలకృష్ణుని యశోదాదేవియొక్క ప్రక్కలో నుంచి యామె కుమార్తెను తాను తీసుకొని తిరిగి తానుండు కారాగృహము

శిశుం యశోదాశయనే
నిధాయ తత్॥
సుతా ముపాదాయ
పునర్గృహా నగాత్॥

నకు వచ్చెను.

107. శ్లో॥ దేవక్యా శ్శయనే న్యస్య
వసుదేవో థ దారికామ్।
ప్రతిముచ్య పదో ర్లోహ
మాస్తే పూర్వవదావృతః॥

అటుపిమ్మట వసుదేవుడు ఆ మాయా శిశువును దేవకీదేవి యొక్క ప్రక్కలోనుంచి తన పాదములయందు యినుప సంకెళ్ళను తగిలించుకొని పూర్వమువలెనే యుండెను.

108. శ్లో॥ యశోదా నందపత్నీచ
జాతం పరమబుధ్యత
న తల్లింగం పరిశ్రాంత
నిద్రయా పగతస్మృతిః॥

నందుని భార్యయగు యశోదేవి యత్యంతము యలసట జెంది యోగనిద్రచే స్మృతి తప్పినదై తనకు యేదో పుట్టినటుల మాత్రము తెలుసుకొనెను. ఆ పుట్టినది పురుషుడో స్త్రీయో మాత్రము తెలుసుకొన జాలకపోయెను.

శ్రీకృష్ణార్పణమస్తు
:- శ్రీ శ్రీ శ్రీ :-

అస్మద్గురుభ్యో నమః
శ్రీమతే రామానుజాయ నమః

శ్లో॥ శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్॥
శ్లో॥ లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్॥
శ్లో॥ యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ।
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురో ర్భగవతో స్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥
శ్లో॥ మాతా పితా యువతయ స్తనయా విభూతిః।
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం।
శ్రీమ త్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥
శ్లో॥ భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్।
శ్రీమత్పరాం కుశమునిం ప్రణతోస్మి నిత్యం॥



పెరియాళ్వార్ దివ్యతిరువడిగళే శరణం.

# వణ్ణమాడంగళ్

అపరూపతాళం - ఆటతాళం.

1. పా వణ్ణ మాడంగళ్ శూழ్
తిరుక్కోట్టియూర్,
కణ్ణన్ కేశవన్
నంబిపిఱందనిల్,
ఎణ్ణెయ్ శుణ్ణం
ఎదిరెదిర్ తూవిడ,
కణ్ణన్ ముత్తం
కళందళఱా యిత్తే।

(శ్రీకృష్ణపరమాత్మ ఉత్తరమధురాపట్టణమం దవతరించినారు. అచ్చట రాక్షసులభయముచే దేవతలు తిరుక్కోట్టియూరికివచ్చి భగవంతుని ధ్యానింపగా నచ్చటి పెరుమాళ్ళు శ్రీకృష్ణస్వరూపియై యవతారచేష్టితముల శ్రీ పెరియాళ్వారులకు సాక్షాత్కరించిరట అపుడు పెరియాళ్వార్లు శ్రీకృష్ణావతార రసానుభవమునందు మునిగి తీవ్రభక్తి భావనా ప్రకర్షంబుచే గోపజన్మమును వహించి యశోదాదులు వచించు వార్తలను తాము వారై ప్రబంధపూర్వకముగ ననుభవించుచున్నారు.)

రమ్యమైన మేడలచే చుట్టుగొనబడియున్న తిరుక్కోట్టియూరినందు, చక్కని జుట్టుతో, పరిపూర్ణకళతో, శ్రీకృష్ణపరమాత్మగా సర్వేశ్వరు డవతరించుటచే నచ్చటివారు, సంపంగినూనెలను పసుపుపొడియు అత్యంతానందముచే ఎదురెదురుగా పరస్పరము జల్లుకొనుటచే, శ్రీకృష్ణపరమాత్మ ముంగిలి వాకలి నూనె-పసుపులు గలిసి బురదయయినది.

2. పా ఓడువార్ విழువార్
ఉకందా లిప్పార్,
నాడువార్ నంబిరాన్
ఎంగుత్తా నెంబార్,
పాడువార్ కళుమ
పల్ పఱైకొట్ట నిన్ఱు,
ఆడువార్ కళుమ్
ఆయిత్తాయ్ ప్పాడియే॥

శ్రీకృష్ణావతారమును విని ప్రేపల్లెయంతయు పరుగిడువారును, సంతోషముచే పరుగిడునపుడు నూనెపసుపుగలిసియున్న యడుసునందు తొట్రుపాటుచే జారిపడిపోవువారును సంతోషించినవారై తజ్జనితోద్రేకముచే పరస్పరము నాలింగనము జేసుకొనువారును, పుట్టినబిడ్డడు యెక్కడున్నాడని వెదకువారును, మనస్వామి యెచ్చటనుంచబడినాడు యని ప్రశ్నించుచున్నవారును, ప్రేమాతిశయముచే పాటలు బాడువారును, అనేకవిధములైన వాయిద్యములను వాయించుకొనుచు నాట్యములు జేయువారును గలది యాయెను.

3. పా. పేణి చ్చీరుడై
పిళ్ళై పిఱందనిల్,
కాణ తాం పుకువార్
పుక్కు ప్పోదువార్,
ఆణప్పారివన్ నేరిల్లై
కాణ్, తిరు,
వోణ త్తానులకాళుం
ఎంబార్ కళే॥

మరియు తనరక్షణజేసుగొనమనిన తల్లిదండ్రుల యాజ్ఞనత్యంత యాదరములతో పుట్టినవెంటనే నిర్వర్తించుటాదిగా గల శీలముగల బాలకృష్ణు డవతరించినపుడు చూడగోరినవారై ఆయూరివారు నందుని యింటిలోనికి ప్రవేశించువారును, యింటిలోనికివెళ్ళి యాయననుజూచి తిరిగి బయలువెడలిపోవువారును, పురుషులలో ఈయనతో సమానులు లేరుసుమా యనువారును, శ్రవణనక్షత్రాధిపతియగు శ్రీమన్నారాయణునితో వలె ఈయన సమస్తలోకములను పరిపాలించుననియనువారును గలది యాయెను.

౪. పా. ఉఱియై ముత్తత్తు
రుట్టు నిన్ఱాడువార్,
నఱునెయ్ పాల్ తయిర్
నన్ఱాక త్తూవువార్
శెఱిమెన్ కూందలవిழ్త్తు
త్తిళై త్తెంగుమ్,
అఱివళ్హిందనరాయ్
ప్పాడి యాయరే॥

శ్రీకృష్ణావతార విషయమువిని శ్రేపల్లెయందు తటను గోపకులు ఉట్లను ముంగిలివాకళ్ళయందు పొర్లించుకొనుచు నాట్యముచేయువారను మంచి పరిమళించుచున్న నేతిని-పాలను పెరుగును బాగుగా దానము జేయువారును, దట్టముగాను మృదువుగాను యున్న శిరోజములముడి వీడిపోవునట్లు యత్యంతానందముచే ఎగురుచు కృత్యాకృత్యజ్ఞానశూన్యులు వలె నైపోయిరి.

౫ పా. కొండ తాళుఱి
కోల కొడుమళ్హు
తండి నల్పఱి
యోలై చ్చయన త్తర్
విండ ముల్లై
యరుంబన్న పల్లినర్
అండర్ మిండి
ప్పుకుందు నేయ్యాడినార్॥

మంచి బలమైన దారములతో తయారుచేయబడిన ఉట్లను అందమైన పదునుగల గొడ్డళ్ళను, కట్టెలను మొగలియాకుల చాపలను గలవారై, వికసించిన మల్లె మొగ్గలవంటి దంతములు గల గొల్లలు గుంపులుగ ప్రవేశించి "నెయ్యాడల్-నేతి యాట" అను యాటను యాడజొచ్చిరి.

౬. పా. కైయుమ్ కాలుమ్
నిమిర్త్త కడారనీర్
పైయ వాట్టి
పశుమ్ శిఱుమంజళాల్
ఐయ నావళ్హి
త్తాళుక్కంగాందిడ
వైయ మేళ్హుం కండాళ్
పిళ్లై వాయుళే॥

శ్రీకృష్ణుని స్నానము జేయించుటకై హస్తములను, పాదములను జాచి సుగంధద్రవ్యములచే కాచిన గంగాళములకొద్ది యున్న జలముచే సావధానముగా తిరుమంజనము చేశి పసుపు పచ్చని ఛాయపసుపు పొడితో అందమైన నాలికను యశోదాదేని వద్దినది. ఆమెకు శ్రీకృష్ణుడు నోరు తెఱచి చూపెను. అపుడా ఏడులోకములను బాలుడైన శ్రీకృష్ణుని నోటిలో గాంచెను.

౭. పా. వాయుళ్ వైయకమ్
కండమడనల్లార్,
ఆయర్ పుత్తిరనల్లన్
అరుమ్ తెయ్వమ్,
పాయశీరుడై ప్పణ్బుడై
ప్పాలకన్,
మాయనన్ఱు మకిళ్హ్ందనర్
మాతరే॥

నోటియందు లోకములను జూచిన భవ్యులును, యోగ్య గుణవిశిష్టులును, యగు గొల్లస్త్రీలు శ్రీకృష్ణుని గురించి "ఈయన గొల్లకుర్రవాడుగాడు. మనో వాగ్గోచరుడగు సాక్షాత్తు దేవుడు సర్వవ్యాపకమైన కళ్యాణగుణములు గల బాలకవేషధారి, ఆశ్చర్యగుణభూతుడగు పరమాత్ముడు యని మిక్కిలయు సంతోషించిరి

౮. పా. పత్తునాళుం కడంద
విరండానాళ్,
ఎత్తిశైయుం శయమరమ్
కోడిత్తు,
మత్తమామలై తాంగియ
మైందనై,
ఉత్తానమ్ శెయ్‌తు
ఉకందనరా యరే॥

పదిదినములు గడచినపిమ్మట నామకరణముచేయు పన్నిరెండవరోజున అన్నిదిక్కులయందును జయధ్వజస్తంభముల నాటి వాటినలంకరించి మదించిన యేనుగల గోవర్ధనపర్వతమును గొడుగుగా ధరించిన బలాఢ్యుడైన శ్రీకృష్ణుని గొల్లలందరు తమతమచేతులతో నెత్తుకొని సంతోషించిరి.

౯. పా. కిడక్కిల్ తొట్టిల్
కిళియ వుదైత్తిడుమ్
ఎడుత్తుక్కొళ్ళిల్
మరుంగై యిఱుత్తిడుమ్
ఒడుక్కిప్పుల్‌కిల్ ఉదరత్తే
పాయ్ందిడుమ్,
మిడుక్కిలామైయాల్ నాన్
మెలిందేన్ నంగాయ్

యశోదాదేవి తన చెలికత్తెలను జూచి యిట్లనుచున్నది. ఓ చక్కని చెలీ! నా బిడ్డయగు శ్రీకృష్ణుడు తొట్టిలో పరుండబెట్టినచో అది విరుగునటుల తన్నుకొనుచుండును. ఎత్తుకొనినచో నడుమును విఱుచుచుండును. ముడిచి వడిలో చేర్చుకొనినచో కడుపున కాళ్ళతో తన్నుచుండును. సరియైనబలము లేకపోవుటచే నేను మిక్కిలి బాధపడుచున్నాను.

౧౦. పా. శెన్నెలార్ వయల్
శూళ్ తిరుక్కోట్టియూర్,
మన్ను నారణన్
నంబి పిఱందమై,
మిన్నునూల్ విట్టుశిత్తన్
విరిత్త వి
ప్పన్నుపాడల్ వల్లార్క్కిల్లై
పావమే॥

ఎఱ్ఱని వరికైరుచే పరిపూర్ణమైయుండిన పంటభూములచే చుట్టుకొనబడి యున్న తిరుక్కోట్టియూరునందు నిత్యనివాసము జేయుచున్న నారాయణుడు గుణపరిపూర్ణుడై యవతరించిన విధానమును భుజమునందు మెరయుచున్న యజ్ఞోపవీతముతో విరాజిల్లుచున్న విష్ణుచిత్తులు (పెరియాళ్వారు) వివరముగ సాయించిన ఈ విజ్ఞానవిశిష్ట పదిపాశురములను అర్థముతోసహా యనుసంధించువారలకు భగవదనుభవ విరోధియగు పాపము తటస్థించజాలదు.

పెరియాళ్వార్ తిరువడికళే శరణమ్.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

## శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళి.

| | | | |
|---|---|---|---|
| ౧ హరిః | ఓం కేశవాయనమః | ౫ | ఓం విష్ణవేనమః |
| ౨ | ఓం నారాయణాయనమః | ౬ | ఓం మధుసూదనాయనమః |
| ౩ | ఓం మాధవాయనమః | ౭ | ఓం త్రివిక్రమాయనమః |
| ౪ | ఓం గోవిందాయనమః | ౮ | ఓం వామనాయనమః |

౯ ఓం శ్రీధరాయనమః
౧౦ ఓం హృషీకేశాయనమః
౧౧ ఓం పద్మనాభాయనమః
౧౨ ఓం దామోదరాయనమః
౧౩ ఓం సంకర్షణాయనమః
౧౪ ఓం వాసుదేవాయనమః
౧౫ ఓం ప్రద్యుమ్నాయనమః
౧౬ ఓం అనిరుద్ధాయనమః
౧౭ ఓం పురుషోత్తమాయనమః
౧౮ ఓం అధోక్షజాయనమః
౧౯ ఓం నారసింహాయనమః
౨౦ ఓం అచ్యుతాయనమః
౨౧ ఓం జనార్ధనాయనమః
౨౨ ఓం ఉపేంద్రాయనమః
౨౩ ఓం హరయేనమః
౨౪ ఓం శ్రీకృష్ణాయనమః



౧ ఓం శ్రీ కృష్ణాయనమః
౨ ఓం కమలనాథాయనమః
౩ ఓం వాసుదేవాయనమః
౪ ఓం సనాతనాయనమః
౫ ఓం వసుదేవాత్మజాయనమః
౬ ఓం పుణ్యాయనమః
౭ ఓం లీలామానుషవిగ్రహాయనమః
౮ ఓం శ్రీవత్సకౌస్తుభధరాయనమః
౯ ఓం యశోదావత్సాయనమః
౧౦ ఓం హరయే నమః
౧౧ ఓం చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖాద్యాయుధాయనమః
౧౨ ఓం దేవకీ నందాయనమః
౧౩ ఓం శ్రీశాయ నమః
౧౪ ఓం నందగోప ప్రియాత్మజాయనమః
౧౫ ఓం యమునాతీర సంచారిణే నమః
౧౬ ఓం బలభద్రప్రియానుజాయ నమః
౧౭ ఓం పూతనా జీవిత హరాయనమః
౧౮ ఓం శకటాసురభంజనాయ నమః
౧౯ ఓం నందవ్రజనానందినే నమః
౨౦ ఓం సచ్చిదానంద విగ్రహాయనమః
౨౧ ఓం నవనీత విలిప్తాంగాయనమః
౨౨ ఓం నవనీతనటాయనమః
౨౩ ఓం అనఘాయనమః
౨౪ ఓం నవనీత నవాహారాయనమః
౨౫ ఓం ముచుకుంద ప్రసాదకాయనమః
౨౬ ఓం షోడశస్త్రీ సహస్రేశాయనమః
౨౭ ఓం త్రిభంగిమధురాకృతయే నమః
౨౮ ఓం సత్యవాగమృతాబ్ధీందవే నమః
౨౯ ఓం గోవిందాయనమః
౩౦ ఓం యోగినాం పతయేనమః
౩౧ ఓం వత్సవాట చరాయనమః
౩౨ ఓం అనంతాయ నమః
౩౩ ఓం ధేనుకాసురభంజనాయనమః
౩౪ ఓం తృణీకృత తృణావర్తాయనమః
౩౫ ఓం యమళార్జున భంజనాయనమః
౩౬ ఓం ఉత్తాలతాల భేత్రేనమః
౩౭ ఓం తమాల శ్యామలాకృతయేనమః
౩౮ ఓం గోపగోపీశ్వరాయనమః
౩౯ ఓం యోగినేనమః
౪౦ ఓం కోటిసూర్య సమప్రభాయనమః
౪౧ ఓం ఇలాపతయేనమః
౪౨ ఓం పరంజ్యోతిషేనమః
౪౩ ఓం యాదవేంద్రాయనమః
౪౪ ఓం యదూద్వహాయనమః
౪౫ ఓం వనమాలినేనమః

౪౬ ఓం పీతవాససే నమః
౪౭ ,, పారిజాతాపహారకాయనమః
౪౮ ,, గోవర్ధనాచలోద్ధర్త్రేనమః
౪౯ ,, గోపాలాయ నమః
౫౦ ,, సర్వపాలకాయనమః
౫౧ ,, అజాయనమః
౫౨ ,, నిరంజనాయనమః
౫౩ ,, కామజనకాయనమః
౫౪ ,, కంజలోచనాయనమః
౫౫ ,, మధుఘ్నే నమః
౫౬ ,, మధురానాథాయనమః
౫౭ ,, ద్వారకానాయకాయ నమః
౫౮ ,, బలినే నమః
౫౯ ,, బృందావనాంత సంచారిణేనమః
౬౦ ,, తులసీదామ భూషణాయనమః
౬౧ ,, శ్యమంతక మణి హర్త్రేనమః
౬౨ , నరనారాయణాత్మకాయ నమః
౬౩ ,, కుబ్జాకృష్ణాంబరధరాయ నమః
౬౪ ,, మాయినేనమః
౬౫ ,, పరమ పురుషాయనమః
౬౬ ,, ముష్టికాసుర చాణూర మల్ల
యుద్ధ విశారదాయనమః
౬౭ ,, సంసార వైరిణేనమః
౬౮ ,, కంసారయేనమః
౬౯ ,, మురారయేనమః
౭౦ ,, నరకాంతకాయ నమః
౭౧ ,, అనాది బ్రహ్మచారిణేనమః
౭౨ ,, కృష్ణావ్యసన కర్శకాయనమః
౭౩ ,, శిశుపాల శిరశ్ఛేత్రేనమః
౭౪ ,, దుర్యోధన కులాంతకాయనమః
౭౫ ,, విదురా క్రూరవరదాయ నమః
౭౬ ,, విశ్వరూప ప్రదర్శనాయనమః
౭౭ ,, సత్యవాచేనమః
౭౮ ఓం సత్యసంకల్పాయనమః
౭౯ ,, సత్యభామ రతాయనమః
౮౦ ,, జయినే నమః
౮౧ ,, సుభద్రాపూర్వజాయనమః
౮౨ ,, విష్ణవేనమః
౮౩ ,, భీష్మముక్తిప్రదాయకాయనమః
౮౪ ,, జగద్గురవేనమః
౮౫ ,, జగన్నాథాయనమః
౮౬ ,, వేణునాద విశారదాయనమః
౮౭ ,, వృషభాసుర విధ్వంసినేనమః
౮౮ ,, బాణాసుర కరాంతకాయనమః
౮౯ ,, యుధిష్ఠిర ప్రతిష్ఠాత్రేనమః
౯౦ ,, బర్హి బర్హావతంసకాయనమః
౯౧ ,, పార్థసారథయే నమః
౯౨ ,, అవ్యక్తాయనమః
౯౩ ,, గీతామృత మహోదధయేనమః
౯౪ ,, కాళీయ ఫణ మాణిక్య రంజిత
శ్రీపదాంబుజాయనమః
౯౫ ,, దామోదరాయనమః
౯౬ ,, యజ్ఞ భోక్త్రేనమః
౯౭ ,, దానవేంద్ర వినాశకాయనమః
౯౮ ,, నారాయణాయనమః
౯౯ ,, పరబ్రహ్మణేనమః
౧౦౦ ,, పన్నగాశన వాహనాయనమః
౧౦౧ ,, జలక్రీడా సమాసక్త గోపీ వస్త్రాప
హారకాయనమః
౧౦౨ ,, పుణ్యశ్లోకాయనమః
౧౦౩ ,, తీర్థపాదాయనమః
౧౦౪ ,, వేదవేద్యాయనమః
౧౦౫ ,, దయానిధయేనమః
౧౦౬ ,, సర్వతీర్థాత్మకాయనమః
౧౦౭ ,, సర్వగ్రహరూపిణేనమః
౧౦౮ ,, పరాత్పరస్మైనమః

ఓం శ్రీ కృష్ణపరబ్రహ్మణేనమః
,, కేశవాయనమః
,, నారాయణాయనమః
,, మాధవాయనమః
,, గోవిందాయనమః
,, విష్ణవేనమః
,, మధుసూదనాయనమః
,, త్రివిక్రమాయనమః
,, వామనాయనమః
,, శ్రీధరాయనమః
,, హృషీకేశాయనమః
,, పద్మనాభాయనమః
,, దామోదరాయనమః

ఓం సంకర్షణాయనమః
,, వాసుదేవాయనమః
,, ప్రద్యుమ్నాయనమః
,, అనిరుద్ధాయనమః
,, పురుషోత్తమాయనమః
,, అధోక్షజాయనమః
,, నారసింహాయనమః
,, అచ్యుతాయనమః
,, జనార్దనాయనమః
,, ఉపేంద్రాయనమః
,, హరయేనమః
,, శ్రీ కృష్ణాయనమః

-: తిరునక్షత్ర తనియ :-

సింహమాసే రోహిణి

శ్లో॥ సింహమాసే సితేపక్షే రోహిణ్యా మష్టమీతిథౌ।
చరమార్థప్రదాతారం కృష్ణం వందే జగద్గురుమ్॥.

శ్లో॥ తతో౽ఖిల జగత్పద్మ బోధా - యాచ్యుత - భానునా।
దేవకీ - పూర్వ - సంధ్యాయా మావిర్భూతం మహాత్మనా॥.

(తిరుమగళుం మణ్మగళుం శిఱక్క వందోన్ వాళియే।
శెయ్య విడైత్తాయ్ మకళాల్ శెవిప్పోన్ వాళియే।
ఇరువిశుంబిల్ వీత్తిరుక్కుం ఇమైయవర్ కోన్ వాళియే
ఇడర్ కడియ పాఱ్కడలై ఎయ్తినాన్ వాళియే।
అరియ తయరతన్ మకనాయ్ అవతరిత్తాన్ వాళియే
అందరియా మిత్తునముమాయినాన్ వాళియే।
పెరుకివరుం పొన్నినడువిన్ తుయిన్డాన్ వాళియే
పెరియపెరుమాళ్ ఎంగళ్ పిరాన్ అడికళ్ వాళియే॥.)

# శ్రీ కృష్ణాష్టకము.

శ్లో॥ వసు దేవసుతం దేవం కంస - చాణూర - మర్దనం
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుం॥.

శ్లో॥ అతసీ పుష్ప సంకాశం హార నూపుర శోభితం
రత్న కంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుం॥,

శ్లో॥ కుటిలా లక సంయుక్తం పూర్ణ చంద్ర నిభాననం।
విలసత్కుండల ధరం కృష్ణం వందే జగద్గురుం॥

శ్లో॥ మందార గంధ సంయుక్తం చారుహాసం చతుర్భుజం।
బర్హిపింఛా వచూడాంగం కృష్ణం వందే జగద్గురుం॥

శ్లో॥ ఉత్ఫుల్ల పద్మ పత్రాక్షం నీల జీమూత సన్నిభం।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుం॥

శ్లో॥ రుక్మిణీ కేళి సంయుక్తం పీతాంబర సుశోభితం।
అవాప్త తులసీ గంధం కృష్ణం వందే జగద్గురుం॥

శ్లో॥ గోపికానాం కుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసం।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుం॥

శ్లో॥ శ్రీ వత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితం।
శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుం॥

శ్లో॥ కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాత రుత్థాయ యః పఠేత్।
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి॥



| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 290 | సత్యధర్మ పరాక్రమః | సత్యాహ్యవితథా ధర్మాః<br>గుణాః యస్య పరాక్రమః॥<br>చేష్టితాని చసన్తీతి<br>సత్యధర్మ పరాక్రమః | ధర్మములనగా సార్థకములైన కల్యాణ గుణములు. పరాక్రమ మనగా చేష్టలు ఈగుణచేష్టలు రెండున్ను సత్యముగా నుండువాడు |
| 291 | భూతభవ్య భవన్నాథః | ఐశ్వర్యం నాథస్వామ్యంవా.<br>త్రికాలేష్వపియస్యసః<br>భూతభవ్యభవన్నాథః<br>ఇత్యుక్త స్సద్భిరాదరాత్ | సకలమును నియమించునట్టి సామర్థ్యమున్ను, అన్నియు తనసొత్తగు స్వామిత్వమున్ను మూడుకాలములయందును. అవ్యాహతముగా పోషించువాడని సజ్జనులాదరముతో జెప్పుదురు |
| 292 | పవనః | సదా స్వయంతు సర్వత్ర<br>ప్రవాహ ఇవనిత్యశః<br>పవనః ప్రవహతియాః<br>కథ్యతే వేగదో మనుః | సహజముగనే సర్వదా సర్వత్ర నీటిప్రవాహమువలె నిత్యమును సంచరించు స్వభావముకలవాడు. దీనిని ఓమ్ పవనాయనమః అని మంత్రముగ నాదరించినచో నిది వేగము నొసంగును |
| 293 | పావనః | యస్య సంబన్ధి గంగాదీన్<br>పావయన్ లోకపావనాన్<br>సపావన ఇతిఖ్యాతః<br>పావనత్వ ప్రదోమనుః | తన సంబంధ గంధముచే గంగాది నదులు మొదలగు వాటిని లోకపావనములుగ జేయువాడు. 'దీనిని ఓమ్ పావనాయనమః అని మంత్రముగా నాదరించినచో నిది పవిత్రవంతునిగా జేయును. |
| 294 | అనలః | అపర్యాప్తోహి భక్తభ్యోఽ<br>ప్యుపకృత్య పునంః పునః<br>అనుగ్రహం యః కరోతి<br>సోఽనలః పరికీర్తితః | భక్తులకు మాటిమాటికిని అనేకరీతుల నుపకరించియు తృప్తిపడనివాడు. |
| 295 | కామహా. | పుంసాం స్వదర్శినాం యోఽసౌ<br>స్పృహాంచ విషయాన్తరే<br>హతవాన్ కామహా ప్రోక్తః<br>సర్వాశా పూరకో మనుః | తనను దర్శించు పురుషులకు సాంసారిక భోగ రుచిని మాన్పువాడు. దీనిని ఓమ్ కామఘ్నేనమః అని మంత్రముగా నాదరించినచో నిది కోరికలనన్నిటిని దీర్చును. |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 296 | కామకృత్ | స్వపాద పద్మే రాగాది<br>కరణాత్కామకృత్స్మృతః | తన పాదారవిందములయందాదరాతిశయమును బుట్టించువాడు |
| 297<br>298 | కాన్తః<br>కామః | సౌన్దర్యాదిగుణైః కాన్తః<br>మనోహరతయా భృశమ్ | సౌందర్యాది శరీరగుణములచే నందరి మనస్సులనత్యంత మాకర్షించువాడు. |
| 299 | కామప్రదః | స్వకామ్యక్షుద్రకామ్యేభ్యో<br>యథార్హం కామ్యదానతః<br>కామప్రదస్సమాఖ్యాతో<br>వ్యాప్తాప్తో మనుసత్తమః | శ్రీలౌదార్యదయాది ఆత్మగుణములచే నందరి మనస్సుల నాకర్షించువాడు గోరువారికి తననున్ను, క్షుద్రపురుషార్థముల తనను నపేక్షించువారికి వాటినిన్ని వారివారి యోగ్యతకు తగిన ట్లొసంగువాడు. ఇది సర్వోత్తమమైన మంత్రము. |
| 300 | ప్రభుః | సర్వేషాం చిత్తహరణే<br>ప్రభుః ప్రభవతీతియః<br><br>తృతీయం శతకం సంపూర్ణమ్. | ఇట్లందరి చిత్తముల నాకర్షించుటలో నారి తేరినవాడు. |
| 301 | యుగాదికృత్ | న్యగ్రోధశాయీ భగవాన్<br>పురాణ పురుషోత్తమః<br>కరోత్యాదియుగస్యాన్తే<br>యుగాది కృదు దీరితః | పురాణ పురుషుడగు జగన్నాథుడు ప్రళయ కాలమందును వటపత్రమున పవళించి యుండి జగత్తును మునుగకుండ కాపాడుటచే యుగావసానమందుకూడ యుగాదిని చేయువాడు |
| 302 | యుగావర్తః | ధర్మవ్యవస్థయా స్వస్య<br>యుగాద్యావర్తనాన్మహః<br>యుగావర్త స్సమాఖ్యాతః<br>కాలరూపధరో హరిః | కాల రూపుడగు శ్రీయఃపతి కృతాదియుగములను తమ తమ ధర్మములు చెడకుండగను, సంకరము కాకుండగను కాపాడుచు మాటి మాటికిని వాటిని త్రిప్పుచుండువాడు. |

శ్రీ హయగ్రీవాయ నమః

# నవవిధభక్తులు

శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

[ వెనుక సంచిక తరువాయి ]

శ్లో॥ జిహ్వే ! కీర్తయ కేశవం, మురరిపుం చేతో ! భజ, శ్రీధరమ్
పాణిద్వన్ద్వ ! సమర్చయా చ్యుతకథా శ్శ్రోత్రద్వయ ! త్వం శ్రుణు
కృష్ణం లోకయ లోచనద్వయ ! హరే ర్గచ్ఛాంఘ్రియుగ్మా లయమ్
జిఘ్ర ఘ్రాణ ! ముకుందపాదతులసీం మూర్ధ ! న్నమా ధోక్షజమ్॥

అని కులశేఖరులు సాయించినటుల -

జిహ్వను భగవద్గుణకీర్తనమునందును, మనస్సును భగవద్ధ్యానమునందును, కరద్వయమును భగవత్పూజలయందును, చెవులను శ్రియఃపతి దివ్యలీలాశ్రవణమందును, నేత్రములను భగవద్దివ్య మంగళవిగ్రహ దర్శనమందును, చరణద్వంద్వమును భగవన్మందిర పరిసరణము నందును ప్రాణేంద్రియమును ముకుందుని పాదతులసి నాఘ్రాణించుటయందును, శిరమును శ్రియఃపతిని నమస్కరించుటయందును వినియోగించుచు జీవనము గడుపవలెను.

## :— సఖ్యము —:

సఖ్యమనగా పరస్పర హితైషిత్వము ఇది సమానవయస్కులకున్న మైత్రియనియు విషమవయస్కులకున్నచో సౌహార్దమనియు జెప్పబడును కావుననే భగవంతుడు తనను సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి' (గీత 5 అ. 29 శ్లో) సుహృత్తునిగా నెఱుంగుట శాంతికి నిదానమని సెలవిచ్చెను సన్మైత్రికి లక్షణము భర్తృహరి తన సుభాషితములో

శ్లో॥ పాపా న్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం నిగూహతి గుణాన్ ప్రకటీకరోతి
ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణ మిదం ప్రవదన్తి సన్తః॥

పాపముల పరిహరించుట, హితము నుపదేశించుట, ఒండొరుల రహస్యములను బహిరంగపరచకుండుట, (దోషములను కప్పిపుచ్చుటఅనియును) గుణములనుచాటుట, ఆపదలో విడువకుండుట, సహాయమునకొసంగుట, అనునివి సన్మిత్రలక్షణములని సత్పురుషులు జెప్పుచున్నారు. శ్రీకృష్ణునకు కుచేలుడు శ్రీమాలికుడు మొదలగు మిత్రులు పెక్కురున్నను మిక్కిలి

ప్రీతితో 'పాండవానాం ధనఞ్జయః' అనియాదరించిన ముఖ్యమిత్రుడు అర్జునుడేగదా! కావుననే శ్రీకృష్ణుడు గీతలో పలుమారు

'భక్తో ఽసి మే సఖా చేతి (4 అ 3 శ్లో) ఇష్టో ఽసి మే దృఢ మితి (18 అ. 64 శ్లో)

ఇట్లనేకసారులాతనిని తనకు ముఖ్యమిత్రునిగా బేర్కొనెను. ఇంతమాత్రమేగాక ఉత్తరాగర్భంగతుడైన పరీక్షిత్తునుగాపాడుసమయమున నీయర్జునసఖ్యమునే పణముగానొడ్డెను చూడుడు.

శ్లో॥ యథాహం నాభిజానామి విజయేన కదాచన।
విరోధం తేన సత్యేన మృతో జీవ త్వయం శిశుః॥ (భార అశ్వ. 69. 21.)

నే నెన్నడును అర్జునితో విరోధించలేదు ఈ సత్యమే ఈ గర్భమునందు చనిపోయిన బిడ్డను గాపాడుగాక యనెను.

అర్జునుడును 'సఖేతి మత్వా ప్రసభం యదుక్తం'. అని 11వ అధ్యాయమున విశ్వరూపమును సందర్శించి భయవిహ్వలచిత్తుడై యాతనిని తాను స్నేహితునిగా భావించిగావించిన యపచారములను క్షమించమని వేడుకొనెను.

పాండవులందరిపట్లను శ్రీకృష్ణునకు మిత్రభావమేలయన్నట్లు ప్రసిద్ధి.

శ్లో॥ కామా ద్గోప్యః భయా త్కంసః ద్వేషా చ్చైద్యాదయో నృప!
సమ్బన్ధా ద్వృష్ణయ స్స్నేహా ద్యూయం భక్త్యా వయం నృప! ॥

అని భగవంతునొక్కొక్క భావముతో నాదరించిరి. అందు పాండవులు స్నేహభావముందినట్లీశ్లోకము తెలుపుచున్నది. కావుననే అర్జునుడు 'అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయం' అని బంధువధ పాపమని భయపడుచుండ శ్రీకృష్ణుడు –

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥

ఈ యుద్ధమువలన సిద్ధించు సుఖదుఃఖములను లాభా లాభములను జయాపజయములను సమముగ పాటింపుము.

'మా=లక్ష్మీః, తయాసహితఃసమః, తస్మిన్సమే, అనగా భగవంతునియందు అని యొక అర్థము అనగా ఇవిఅన్నియు భగవ దధీనములేగాన ఆయన సంకల్పానుసారము ఏమి వచ్చినను రానిమ్ము భృత్యుడు రాజాజ్ఞనువలె నేను నావిధిని నిర్వర్తింతునని చేయుట) అట్లు పాటించి 'యుద్ధే చా ప్యపలాయనం' "క్షాత్రం ధర్మ స్స్వభావజం" అనునీ విధ్యుక్తధర్మముగ యుద్ధమును జేయుము.

సశేషము.

# వార్తామాల

:— 23 వ వార్త. —:

[వెనుక సంచిక తరువాయి]

ఆత్మ ఈ దేహముయొక్క జన్మకు యతి కించి త్కారణ భూతులైన ఈ తల్లిదండ్రు లనబడు వారికి పరతంత్రమైనదికాదు. ఏలననగా దీనికి కలుగు యాపత్తులను వేనిని వారు నివారింప సమర్థు లెంతమాత్రమును కారుగనుక. ఆత్మ పితృదేవతలకు పరతంత్రమైనదికాదు. వారు దీనికి రక్షకులు కారుకదా.

ఆత్మ గృహ-ఆరామ-క్షేత్రాదులకు గాని భార్యబిడ్డలకుగాని పరతంత్రమైనదికాదు. ఏలననగా గృహాదులు అచేతనములు గనుకను, మరియు అవన్నియును తమకు తాము గాని లేక ఇతరులనుగాని రక్షింపసమర్థమైన వెంతమాత్రము కావు గనుకను.

తనకాశ్రయమిచ్చిన దానినే నశింపజేయునట్టిదిగాన అగ్నికి ఆత్మ పరతంత్రమైనదికాదు.

శాపకోప తాపాదులచే తన రాజ్యమును పోగొట్టుకొనుచుండునట్టి యశక్తుడగుట వలనను, ఇతరుల దయయున్ననేగాని తిర్గి రాజ్యసంపాదన చేసుకొనజాలని వాడగుటచేతను, అట్టి ఇంద్రునికి ఆత్మ పరతంత్రమైనది కాదు.

మధుకైటభుల చేతులలో వేదమును కోల్పోయిన వాడగుటచేతను, రుద్రుని కోపాగ్నికి గురియైనవాడగుటవలనను అట్టి చతుర్ముఖబ్రహ్మకు ఆత్మ పరతంత్రమైనదికాదు. తాను అభిమానించి వరములిచ్చిన బాణాసురుని రక్షించజాలక తాను దూరముగా తొలగిపోవుటవలనను, చతుర్ముఖబ్రహ్మయొక్క శిరస్సు తనచేతి నంటుకొనగా దానిని తాను విడిపించుకొనలేక సర్వేశ్వరుని ప్రార్థించి తనను రక్షించుకొనవలసినట్టి వాడగుట వలనను అట్టి రుద్రునికి ఆత్మ పరతంత్రమైనది కాదు.

"తిరుమాలే నానుమునక్కు పళవడియేన్" (ఓ శ్రియఃపతీ నేను నీకు దాసుడనని పెరియాళ్వార్లు మున్నగు పెద్దలు సాయించిన దానిననుసరించి కేవలమొక్క నారాయణునికి మాత్రమే ఆత్మ పరతంత్రమైనది కాదు

కావున ఈ ఆత్మయొక్క యదార్థమైన స్థిరమైన, నిత్యమైన స్వరూప మేమనగా

"నిన్ తిరువెట్టెళుత్తుం కత్తు నాను త్తతుం ఉన్నడియార్క్కు అడిమై (నీవు సాయించిన తిరుమంత్రార్థమును గ్రహించిన నేను వాంఛించునది నీ దాసులయొక్క కైంకర్యమే.)

అని ఆళ్వార్లు సాయించినటుల భాగవత పర్యంతమైన శ్రియఃపతికి పరతంత్రుడై, శేషభూతుడై యుండుటయే ఆత్మయొక్క స్వరూపము.

:— 24. ఇరువదినాల్గువవార్త :—

జగత్తులో చేతనము, అచేతనము, ఈశ్వరుడు అని తత్వములు మూడు. అందులో బద్ధులు, ముక్తులు, నిత్యులు అని ఆత్మతత్వములు మూడు. అందులో బద్ధాత్మలు ముగ్గురు.

అందులో భగవచ్ఛేషభూతులు, భాగవతశేషభూతులు, ఆచార్యశేషభూతులు అని
శేషత్వజ్ఞానము గలవారు మూడురకములు.
అందులో భగవచ్ఛేషత్వజ్ఞానముగలవారు ముగ్గురు.
అందులో ఆత్మప్రాప్తికాములు (కేవలులు ముగ్గురు)
అందులో ప్రపన్నులు, ఏకాన్తులు, పరమైకాంతులు అని ప్రపన్నులగు
అధికారులు మూడుతరగతులు.

:— 25 ఇరువదైదవవార్త —:

శుద్ధాద్వైతికిని, విశిష్టాద్వైతికిని తారతమ్యమేమియని యడుగగా పిళ్లై యిటుల సాయించిరి.

శుద్ధాద్వైతి, భగవద్రక్షకత్వమును వప్పుకొనలేదు. విశిష్టాద్వైతికి భగవంతుడేరక్షకుడు. తానతని రక్షవర్గములోనివాడు.

శుద్ధాద్వైతితనయందున్న భగవచ్ఛేషత్వమును వప్పుకొనడు. విశిష్టాద్వైతి భగవచ్ఛేషత్వమే తనస్వరూపమని నమ్మకముగలవాడు.

శుద్ధాద్వైతి భగవంతునియందు పరత్వము నంగీకరించడు. విశిష్టాద్వైతికి భగవంతుడె పరాత్పరుడు, శుద్ధాద్వైతి భగవచ్ఛరీరభూతుడనని యంగీకరించలేదు విశిష్టాద్వైతి తాను భగవంతునియొక్క శరీరస్థానీయుడనని తలంచును. శుద్ధాద్వైతి భగవంతునియందు కృపాదిగుణములను సమ్మతించలేదు. విశిష్టాద్వైతి భగవంతుని నిఖిలహేయప్రత్యనీకుడుగను, సమస్త కల్యాణ గుణాకరుడని ఆరాధించును. శుద్ధాద్వైతి తనయందుభగవద్దాస్యత్వమునకు సమ్మతించలేదు. విశిష్టాద్వైతి తనుతనను భగవద్దాసుడుగనే భావించును. శుద్ధాద్వైతి భగవద్విభూతిని సహించలేడు. విశిష్టాద్వైతి భగవద్విభూతి సత్యమైనదిప్రవాహాతో నిత్యమైనదియును శుద్ధాద్వైతి తనయందు భగవంతునితో కలిగియున్న నవవిధసంబంధమునకు సహించలేడు విశిష్టాద్వైతి భగవంతునితో తాను నవవిధసంబంధములు కలవాడై యుండును. శుద్ధాద్వైతి భగవత్కైంకర్యమును స్వీకరించలేడు. విశిష్టాద్వైతి భగవత్కైంకర్యమునే తనపరమాధిగా నాచరించును. శుద్ధాద్వైతి తనను శరీరిగ (బ్రహ్మనుగా) దలంచుటచే యనర్థమును పొందును. విశిష్టాద్వైతి భగవంతుని శరీర భూతుడుగా (శేషభూతుడుగా) దలంచి ఉజ్జీవించును.

'సోహం' అనుభావము అనర్థముల కాకరము దాసోహమను భావము ఆనందమునకు కారణము.

:— 26 ఇరువదారవ వార్త :—

ఆచ్చాన్ పిళ్లైగారిటుల సాయించిరి.

పురుషప్రయత్నభారమును (పౌరుషమును) జీవుడు తనపై ఆరోపించుకొనెనా భగవంతునికి అత్యంతపరతంత్రుడై యుండవలశిన తన స్వరూపము నశించును. అటులగాక భగవంతునిపై తన భారమునుంచి, ఆయననే విశ్వసించి, ఆయునకు పరతంత్రుడై యుండెనా స్వరూపోజ్జీవనము కలుగును.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవాసుదాస దేశిక స్వామివారి పరమపదోత్సవ ఆహ్వానపత్రిక





శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్వర్యమున స్వస్తిశ్రీ శార్వరినామ సంవత్సర శ్రావణశుద్ధ ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, గురు, శుక్ర, శని వారములందు. అనగా 4-8-60 మొదలు 6-8-60 వరకు వరుసగా మూడు దినములు తెనాలి తాలూకా నడిగడ్డపాలెంలో శ్రీవాసుదాసాశ్రమమందు. శ్రీవాసుదాస దేశికస్వామివారి పరమ పదోత్సవములు జరుగునుగాన శ్రీవారి పాదాశ్రితులు అభిమానులు తప్పక విచ్చేయ కోరుచున్నాము.

మరియు, ఈ పైమూడు దినములలోను ఆశ్రమమందలి శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో పవిత్రోత్సవములుకూడ జరుగును.

ఇట్లు

శ్రీవాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం పోష్టు,
వయా చేబ్రోలు, గుంటూరు జిల్లా.

భగవద్భాగవతాచార్య దాసుడు
కూనంనేని వెంకటప్పయ్యదాసు.

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారి జయంతీమహోత్సవ ఆహ్వానపత్రిక



స్వస్తిశ్రీ శార్వరినామ సంవత్సర శ్రావణబహుళ పంచమీ గురువారము నాడు (అనగా 11–8–1930) వ తేది శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘస్థాపకులగు. శ్రీమదిత్యాది శ్రీమాన్. ఉ. వే. శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామి, వారి తిరునక్షత్ర మహోత్సవము తెనాలితాలూకా నడిగడ్డపాలెం శ్రీవాసుదాసాశ్రమమందు జరుగును కాన శ్రీవారి శిష్యులును, శ్రీవారి అభిమాన పాత్రులును, అందఱు విచ్చేసి ఈ కైంకర్యమందు అన్వయించవలసినదిగా కోరుచున్నాము.

శ్రీవాసుదాసాశ్రమం
నడిగడ్డపాలెం,
గుంటూరు జిల్లా.

ఇట్లు
భగవద్భాగవతాచార్య దాసుడు
కూనంనేని వెంకటప్పయ్యదాసు



# బదరి శ్రీనివాస రామానుజ కైంకర్యము

బదరి క్షేత్రము మనకందరికిని ప్రధాన కైంకర్య కేంద్రమై యున్నది. అచ్చటి శ్రీనివాసరామానుజుల కైంకర్యము ప్రసన్నులైన ప్రతిజీవికి జీవితాంతము వరకు దేహయాత్ర రూపమై యున్నది అందుచే తరచు ఆ కైంకర్యమును గురించి భక్తజనులకు జ్ఞాపకము చేయవలసివచ్చుచున్నది ఇచ్చట అష్టాక్షరీక్షేత్రమందలి రామానుజకూట నిర్మాణకైంకర్యము చాలవరకు పూర్తియైనట్లే అందులకు వాగ్దానముల గావించిన దాతలు వాగ్దాన ధనమును యికను పూర్తిగ సమర్పింపకుండుటచే తన్నిర్మాణములో చాలా అప్పు చేయవలసి వచ్చినది. గాన ఆ దాతలు తమ వాగ్దాన ధనములోని శేషించిన ధనమును త్వరలో చెల్లింప గోరెదము. సత్సంగసదన విరాళముల వాగ్దాన పనులును, శాశ్వత పూజపనులును, తాత్కాలికపూజా కైంకర్యపనులును తమతమ బాకీలను త్వరలో సమర్పింతురుగాక ఇక సత్సంగసదనమున ప్రధాన కట్టడము పూర్తికావచ్చినది. ఈ సంవత్సరమున అదియు పూర్తికాగలదు అందు శ్రీనివాస రామానుజుల వేంచేపు చేయుటకై ప్రత్యేకముగా ఒక మంటపగదిని నిర్మింప బడుచున్నది అదియునుగూడ ఈ సంవత్సరమున పూర్తికాగలదు శ్రీమాన్ తె కం గోపాలాచార్యస్వామివారు ఈ సంవత్సరమున బదరికి వేంచేసి ఈ మిగిలినకట్టడపు పనులను పూర్తి చేయుచున్నారు.

గాని శ్రీనివాస రామానుజుల వేంచేపు చేయదలచిన గదికై మొత్తము పది వేలరూపాయలు ఎస్టిమేటు వేయబడినది పదిమంది భక్తులు వాటా ఒక్కొకటికి వెయ్యేసి రూపాయలు చొప్పున చెల్లించుటకు వీలుగ పదివాటాలుగ ఈ కైంకర్యము విభాగింపబడినది.

ఇప్పటికే అయిదుమంది భక్తులు అయిదు వాటాలకు అయిదువేల రూపాయలను సమర్పించుచున్నారు ఇంకను అయిదువేల రూపాయలు ఈపని పూర్తిచేయుటకు కావలసియున్నవి. భక్తులెవరైనను ఈ వాటాలు సమర్పించుటకు ఉత్సాహమున్నచో ఆ విషయమును తెలుపుచు ఆ వాటా ధనమును సమర్పింపవలసినది ఈ దాతల పేర్లన్నియు శిలాశాసనముపై చెక్కించి సత్సంగ సదనమున నుంచబడును-ధనము-ఉత్సాహము ఉన్న వారలకు ఈకైంకర్యము లభించుట చాల అదృష్టవిశేషమనియే మానమ్మిక.

శ్రియఃపతి మీకందరకును సమస్త సన్మంగళములను అనుగ్రహించుగాక ఇవియే అనేక మంగళ శాసనములు.

శ్రీవాసుదాసాశ్రమం
నడిగడ్డపాలెం
(వయా) చేబ్రోలు గుంటూరుజిల్లా

శ్రీమన్నారాయణ రామానుజ జీయర్

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క ప్రచారకులకును, సానుభూతి పరులకును, సభ్యులకును శ్రీయతిరాజసేవా మహాశా మండలి యొక్క ప్రచారకురాండ్రకును, సానుభూతిపరులకును, సభ్యురాండ్రకును భక్తినివేదన పత్రికా చందాదారులకును, వైదికాధ్యాత్మిక విద్యానిధి సంఘ సభ్యులకును ఈ చాతుర్మాస్యాంతము (ది 31-10-1960) వరకు ఈ సంఘముచే ప్రచురితమైన గ్రంథములన్నియును, మరియు లక్ష్మీపతకములును సగముధరకే ఇచ్చుటకు శ్రీ జీయర్ స్వామివారి యాజ్ఞానుసారముగ నిర్ణయించుటమైనది. పోస్టు ఖర్చులు కొనువారలే భరించవలయును ఈసదావకాశమును ఎల్లరు వినియోగించుకొందురుగాక.

ఇప్పుడు మా వద్దనున్న గ్రంథములు-వాని అసలు పూర్తి ధరలు. (ఈ ధరలలో సగము ధరకు మాత్రమే ఇవి సప్లై చేయబడును.)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విభీషణ శరణాగతి | 3 -0-0 | 32 | గురుపరంపరా | 0 -2-0 |
| 2 | ముముక్షుప్పడి | 1 -4-0 | 33 | ప్రపన్న తిరువారాధనం | 0- 2-0 |
| 3 | అర్థపంచకం | 0-12-0 | 34 | 108 దివ్య తిరుపతులు | 0 .1-0 |
| 4 | నిగమప్పడి | 0 -8-0 | 35 | బ్రాహ్మణ నేరమేమి | 0 -1-0 |
| 5 | తని ప్రణవము | 0 -8-0 | 36 | స్తుతిమాలికా | 0 -4-0 |
| 6 | సార సంగ్రహము | 0 -6 0 | 37 | విష్ణుసహస్రనామ వైభవం | 0 -2-0 |
| 7 | యాదృచ్ఛికప్పడి | 0 -6-0 | 38 | విష్ణు సహస్రనామ స్తోత్రం | 0 -2 0 |
| 8 | గీతోపదేశము | 1 -8-0 | 39 | సాధుపరిత్రాణం | 0 -2-0 |
| 9 | రామానుజ కీర్తనలు పెదవి | 2 -0-0 | 40 | కృష్ణ అష్టోత్తరం | 0 -2-0 |
| 10 | రామాయణగానము | 2 -0-0 | 41 | రామ అష్టోత్తరం | 0 -2-0 |
| 11 | రామనామ వైభవము | 0 -4-0 | 42 | పాతర్ని త్యాను సంధానము | 0 -3-0 |
| 12 | తిరునామ వైభవము | 0 -4-0 | 43 | 82 నార్తలు | 0 -2-0 |
| 13 | రామాయణ శిక్షలు | 0 -2-0 | 44 | అష్టశ్లోకి | 0 -2-0 |
| 14 | రామానుజ చరిత్ర | 0 -2-0 | 45 | శఠగోప అష్టోత్తరం | 0 -2-0 |
| 15 | రామరాజ్యం | 0 -4-0 | 46 | దర్శనములు | 0 -2-0 |
| 16 | రంగరాజ వైభవం | 0 -6-0 | 47 | ముముక్షుప్పడీ మూలం | 0 -4-0 |
| 17 | రంగనాయక వైభవం | 0 -4-0 | 48 | బదరికి వెండికవచ విగ్రహం | 0 -2-0 |
| 18 | గోదాకళ్యాణం | 0 -6 0 | 49 | బదరికి గాగిరేశు విగ్రహం | 1 -0-0 |
| 19 | తిరుపల్లాండు అర్థసహితము | 0 -8-0 | 50 | లక్ష్మీపతకములు | 0 -8-0 |
| 20 | భజ యతిరాజస్తోత్రం అర్థసహితం | 0 -4-0 | 51 | శుక్రవారోత్సవములు | 0 -2-0 |
| 21 | యతిరాజ కీర్తనలు చిన్నది | 0 -4-0 | 52 | విష్ణుపాదకేశాంతర స్తుతి | 0 -4-0 |
| 22 | పూర్ణశంగోలము | 0 -8-0 | 53 | గీతా ప్రశ్నోత్తరావళి 3 వ భాగం | 1 -0-0 |
| 23 | పండితగోష్ఠి | 1 -0-0 | | | |
| 24 | పూర్వమీమాంసా | 0 -2-0 | | | |
| 25 | బ్రహ్మకపాలశ్రాద్ధానంతరవిధి | 0 -2-0 | | | |
| 26 | శ్రీ మార్గదీపి | 0 -2-0 | | | |
| 27 | ప్రపన్న సంధ్యానుష్ఠానము | 0 -2-0 | | | |
| 28 | హనుమద్వైభవము | 0 -8 0 | | | |
| 29 | స్తోత్రరత్నం | 0 -2-0 | | | |
| 30 | ముకుందమాల | 0 -0-0 | | | |
| 31 | గీతాసంగ్రహం | 0 -2-0 | | | |

కవిగారు రచియించినవి.

| | | |
|---|---|---|
| 1 | గీతా సందేశము | 0 -8-0 |
| 2 | ధనుర్దాసుడు | 1 -0-0 |
| 3 | ఊర్మిళ | 0-12-0 |
| 4 | శబరి | 0-12-0 |
| 5 | మంగళాశాసనవైభవం | 0 -8-0 |
| 6 | సరమ | 0-12-0 |

వీటికి ప్రతి 1కి రు 0-2-0 వంతున తగ్గించి యివ్వబడును

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

శ్రీవాసుదాసాశ్రమము. నడిగడ్డపాలెం (వయా) చేబ్రోలు గుంటూరుజిల్లా

## Sri Visishtadwaitha Pracharaka Sangham,

President
THRIDHANDI
SRIMAN NARAYANA RAMANUJA JEEAR SWAMI
Secretary
VIDWAN T. K. GOPALACHARYA SWAMI

SRI VASUDASA ASRAMAM
NADIGADDAPALEM
(Via) CHEBROLE-GUNTUR Dt.

Camp ——————
Date ——————

ప్రియమహాశయా !

బదరీనారాయణమునందు మన సంఘముచే సుప్రతిష్ఠమై ఆరాధింపబడుచున్న శ్రీ శ్రీనివాస రామానుజస్వామివార్లను శేషధారనుండి తిర్గి ఈ సంవత్సరమున బదరీ నారాయణమునకు వేంచేపు చేయించి వైభవముగా అర్చనారాధనములు జరిపింపబడు చున్నవి

మనసంఘ ప్రధాన కార్యదర్శులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ టి. కె. గోపాలాచార్యస్వామివారు బదరీనారాయణమునకు వేంచేసి జరుగు కార్యములను స్వయముగ నిర్వహించుచున్నారు శ్రీ శేషదాస్ (రాజు) గారు కూడ అచ్చటనేయుండి సర్వ కార్యముల నన్నిటిని నిర్వహించుచున్నారు.

అచ్చట శ్రీమాన్ మహాంతు సుదర్శన ప్రపన్నాచార్యులవారి యొక్కయు, శ్రీమాన్ త్రిదండి వేదాంత రామానుజ పాదుకాసేవక జియ్యర్‌స్వామివారియొక్కయు పర్యవేక్షణ క్రింద శ్రీమాన్ జానకీ ప్రపన్నాచార్యులు గారు అర్చనారాధనాదికములను వైభవముగా జరుపుచున్నారు.

మరియు

శ్రియఃపతి కటాక్షముచే బదరీనారాయణమున మనము కట్టించుచున్న "అష్టాక్షరి క్షేత్రము" యొక్క నిర్మాణము పూర్తియైనది. కంట్రాక్టరువలన చేయబడిన లోపము లన్నియును కూడ పూర్తిగ సవరింపబడినవి. తిర్గి బల్లసరంభి చేయుట, గుమ్మములు మార్చుట పూర్తియైనది. రంగులు వగైరాలు వేయుట, కాంపౌండుగోడకు మద్రాసులో చేయించి సమర్పింపబడిన యినుపచట్రములు బిగింపబడుచున్నవి. సత్సంగసదనముయొక్క ప్రధాన కట్టుబడి పూర్తియైనది. బల్లసరంబియు తలుపులు వగైరాలు పనిజరుగుచున్నవి.

మరియు శ్రీనివాసరామానుజులవారి నిమిత్తమై ప్రత్యేకమంటప నిర్మాణము ప్రారంభింపబడి జరుపబడుచున్నది. దైవకటాక్షముచే ఈ సంవత్సరములో పూర్తికాగలదు. రాబోవు జూన్-జూలై మాసములలో శ్రీనివాసరామానుజులవారిని సత్సంగసదనములో వేంచేపుచేయుటయును, మరియు అంతట అవిచ్ఛిన్న తదీయారాధన యేర్పాట్లును జరుగ గలవు. యాత్రికుల సౌకర్యమునకై ప్రత్యేక [illegible] వస్త్రాలను ఏర్పాటుచేయబడ గలవు

గాన తాము శ్రీ శ్రీనివాస రామానుజస్వామివారి ------ ______ కైంకర్యమునకు నిమిత్తమై వాగ్దానమొనర్చినదానిలో తమవాయిదా రూ ______ వీలైనంతత్వరలో పంపించ కోరుచున్నాము.

మరియు

తాము ఈ కైంకర్యమును చేయుటయే గాక తమ ప్రాంతమందున్నవారిని తమ బంధుమిత్రులను ప్రోత్సహించి, శ్రీ అష్టాక్షరిక్షేత్రమున ఒక గదిని కట్టించుటకో, లేక శాశ్వత పూజానిధికై వారి వారి ఉత్సాహశక్తుల ననుసరించి రూ. 275, లేక, రూ. 116 లు, లేక, రూ. 58 లు, లేక, రూ. 29 లు, లేక తాత్కాలికపూజకై రూ. 11 లు, నో సమర్పించునటుల ప్రయత్నించ కోరుచున్నాము. అష్టాక్షరిక్షేత్రమున ఒక గదిని కట్టించుటకు ప్రస్తుత ఎస్టిమేటు ప్రకారము రూ 3500/- లు అగుచున్నది. ప్రస్తుతమున ఒక్కగదికిమాత్రమె కైంకర్యముచేయుట కవకాశమున్నది. మరియు సత్సంగసదనమున శ్రీనివాసరామానుజుల ఆరాధన మంటపమునకు పదివేలు రూపాయలు ఎస్టిమేటు వేయబడినది. ఈ పదివేలు రూపాయలను, వాటా 1కి వేయిరూపాయలు చొప్పున పదివాటాలక్రింద విభజింపబడినవి. ఇందు యిప్పటికి అయిదువాటాలు పూర్తియైనవి. యికను అయిదువాటాలుమాత్రమె మిగిలియున్నవి. అవకాశము ఉత్సాహము గలవారు మిగత అయిదు వాటాలలోను తమ శక్త్యానుసారముగ విరాళములను సమర్పించి తరించుదురుగాక.

మీ గోత్రనామములతో పూజజరిగిన వెంటనే మీకు ప్రసాదమును పంపు నేర్పాటుల చేయుచున్నాము.

కార్యాలయము:- శ్రీ వాసుదాసాశ్రమం నడిగడ్డపాలెం, (వయా) చేబ్రోలు, (గుం జి)

ఇట్లు

శ్రీమన్నారాయణ రామానుజ జీయర్

☞ నోటు:- శ్రీమాన్ జీయర్‌స్వామివారు [illegible] ఉన్నందునే [illegible]. గాన మీ [illegible] సొమ్మును ఇచ్చుటకే పంపవచ్చును [illegible] మనియార్డరు ఫారమును యిందుతో పంపుచున్నాము. [illegible] మీరు వాగ్దానముచేసియున్న సొమ్మునంతయు వెంటనే పంపజాలకున్నచో, ఇపుడు అవకాశమున్నంతదానిని పంపివేసి, మిగతదానిని మీ అవకాశము ననుసరించి [illegible] పంపుటకై ప్రయత్నింతురు గాక. [illegible]

T. K. [illegible]గారు, అష్టాక్షరీ క్షేత్రము
రామానుజకూటము, [illegible] జిల్లా గుం. జి.

లిబర్టి ప్రెస్, తెనాలి-2.

ఓం

## శ్రీమతే రామానుజాయనమః

ఏలూరు శ్రీ ఆండాళ సేవామహిళాసమితి ద్వితీయ వార్షికోత్సవములు జూన్ 15, 16, 17 తేదీలు శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిహెళ్ళ వెంకట ధర్మాచార్యుల స్వామివారి అధ్యక్షతన జరుపబడెను. అందు శ్రీమాన్. వ. తూ. వెంకటాచార్య స్వామివారు, శ్రీమాన్ తట్టారాఘవాచార్యులవారు, శ్రీమతి M. తాయారమ్మగారు, కొవ్వూరి సంస్కృతకళాశాల ప్రిన్సిపాల్ గారు, సమితి అధ్యక్షురాలు శ్రీమతి తె. కం. సీతమ్మగార్లచే అనేక వేదాంతోపన్యాసములు జరుపబడెను.

శ్రీమతి తె. కం. సీతమ్మగారిచే రచింపబడిన శ్రీ ఆండాళ్ చరిత్ర బుర్రకథ సమితి బాలికలచే చెప్పబడెను. సాంప్రదాయానుసారముగ సమితి బాల బాలికలచే "శ్రీమద్రామానుజీయము" అను నాటిక వేయబడెను.

శుక్రవారము శ్రీరంగనాథునియొక్కయు, లక్ష్మీతాయార్లయొక్కయు సహస్రనామ పూజలు, భగవద్గీత నాంచియార్ తిరుమొడి, తిరుప్పావు ప్రబంధములు సేవాకాలము జరుపబడెను.

పెద్దవాళ్ళకి సాంప్రదాయ గ్రంథములు, భగవద్గీతలలోను పోటీ పరీక్షలు జరుపబడెను. పిల్లలకు భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగం, దేవరాజాష్టకము, వెంకటేశ్వరస్తోత్రం పోటీపరీక్షలు జరుపబడెను. అందు ఉత్తమముగా నెంచబడిన వారికి బహుమతులు ఒసగబడెను. బుర్రకథ, నాటిక మొదలైనవాటిలో పాల్గొనినవారందరికి షుమారు రు. 50-0-0 లు బహుమతులు పంచిపెట్టబడెను. అధ్యక్షులకు, ఉపన్యాసకులకు, శక్తివంచన లేకుండా వస్త్రములు, దక్షిణలతో సత్కరించడమైనది.

ఈ వార్షికోత్సవ సందర్భమున నివేదన సంఘమువారికి రు. 5-0-0 లు సంభావన ఇవ్వడమైనది.

ఆండాళ్ తల్లికల్యాణముచే వేడుక అతి వేడుకగా కన్నుల పండువుగ జరుపబడెను.

ఈ సమితి తరఫున చిత్తూరు సంస్కృత పరీక్షలకు 10 మంది విద్యార్థులను మూడు పరీక్షలకు పంపడమైనది. పరీక్షకువెళ్ళినవారు చాలమంది ప్రథమ ద్వితీయ శ్రేణిలో ప్యాసు అయినారని తెలుపుటకు మేము చాల సంతసించుచున్నాము.

ఇట్లు
కార్యదర్శిని,
మట్టుపల్లి అనసూయమ్మ.

## శుక్రవార వార్షికోత్సవము.

శ్రీ రామతీర్థగ్రామమునందు శ్రీ 108 త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిచే స్థాపింపబడిన "శ్రీయతిరాజసేవా మహిళామండలి"వారు శ్రీ చక్రవర్తి తిరుమవగన్ సన్నిధియందలి శ్రీ తాయార్ల సన్నిధిని ప్రతిశుక్రవారము అవిచ్ఛిన్నముగా జరుపుకొనుచుండు శుక్రవార పూజలకు సంబంధించిన తృతీయ వార్షికోత్సవము శార్వరినామ సంవత్సర జ్యేష్ఠశుక్ల అష్టమీ శుక్రవారం రోజున అతివైభవముగా జరుపబడెను. శ్రీపిరాట్టికి ఈ సంఘగౌరవాధ్యక్షులైన శ్రీమత్తిరుమల పెద్దింటి లక్ష్మీనరసమ్మ అమ్మవార్లగారు నూతన వస్త్రమును సమర్పించిరి. గ్రామములోని పెద్దలందరును సంఘమువారికి సహాయపడి శ్రీవారికి ఎక్కువగా భోగాదివైభవములను జరిపిరి. శ్రీవారి సన్నిధిని సంఘము వారి కోరికపైని శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. ప. రామానుజస్వామివారు "పురుషకార వైభవము" నుగూర్చి విపులముగా నుపన్యసించిరి. ఈ సందర్భములో సంఘమువారు శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమువారికి రు. 1 లు కట్నముగా సమర్పించిరి.

ఈ సంఘమువారిచే జరుపబడుచున్న శ్రీ పిరాట్టి కైంకర్యము అవిచ్ఛిన్నముగా నెరవేరుచుండునట్లు భాగవత గోష్ఠములు ఆశింపగోరుచున్నాము.

ఇట్లు,

దాసి, తి. ప. రామప్రియ లక్ష్మీనరసమ్మ.
కార్యదర్శిని,
శ్రీ రామతీర్థ యతిరాజసేవా మహిళామండలి.

శ్రీ రామతీర్థము,
5—6—60.

శ్రీ హయగ్రీవాయనమః

# సాంఘిక వార్తలు

శ్రీమాన్ మన జీయ్యర్‌స్వామివారు. తమ పరివారముతో బరంపురమునుండి వాసుదాసాశ్రమమువరకు, మహావైభవముగా ప్రతిపల్లీపుర గ్రామములలో భక్తిప్రచారము గావించి 4-7-60 వ తేది సాయంకాలమునకు వడిగడ్డ పాలెం శ్రీ వాసుదాసాశ్రమమునకు సుఖముగా వేంచేసిరి. శ్రీవారు 7—7—60 వ తేది నుండి చాతుర్మాస్యదీక్షను స్వీకరించి ఆనాడే భగవద్విషయ కాలక్షేపమునకు ప్రప్రథమముగా తిరుప్పల్లాండు కాలక్షేపము ప్రారంభించిరి. అమరు నాడు కణ్ణినుణ్ శిరుత్తాంబు కాలక్షేపము గావించిరి. 10—7—60 వ తేది నుండి శ్రీ భగవద్విషయ కాలక్షేపమునకు ఆరంభించిరి.

కాలక్షేపము ఉదయము గం॥ 7-0 ల నుండి గం॥ 9-30 ల వరకున్ను మధ్యాహ్నము మరల గం॥ 2-0 లు మొదలు సాయంత్రం గం॥ 4-30 ల వరకు జరుగుచున్నది.

శ్రీ స్వామివారు పాశురమునకు ఈడువ్యాఖ్యానములో ప్రతిపదమునకు అర్థమును కృపజేయుచు కాలక్షేపమును కటాక్షించుచున్నారు. అవకాశమున్నవారు వచ్చి ఈ గోష్ఠిలో అన్వయించుకొనవచ్చును

## బదరీ వార్తలు.

శ్రీమాన్ మనసంఘ ప్రధానకార్యదర్శులగు శ్రీ తె. కం. గోపాలాచార్య స్వామివారు, క్రిందటి నెలలోనే బదరికి వేంచేసిరి. అచ్చట శ్రీరామానుజులవారి మందిరనిర్మాణము ప్రస్తుతము జరుగుచున్నది అష్టాక్షరీక్షేత్రము సత్సంగసదనము వీటియొక్క మిగిలిన పనులను చేయించుచున్నారు,

బదరికి విచ్చేసిన ఆగంతుకులైన భక్తులకు బదరిలో మనరాజుగారు (శేషదాసుగారు) అష్టాక్షరీక్షేత్రములో వసతులు చూపించి మిక్కిలి శ్రద్ధగా ఆదరించుచున్నారు.

## పద్మనాభములో

విశాఖ జిల్లా పద్మనాభ గ్రామములో కొండమీద, కొండక్రింద ఆలయములకు బహుకాలమునుండి ధ్వజస్తంభములు లేకుండుట గమనించి మన శ్రీ జియ్యర్ స్వామివారు అచ్చటికి వేంచేసినపుడు తే. . . . . . . . . నాడు స్థానికముగా నొక కమిటీని ఈ మూడు ధ్వజస్తంభముల ప్రతిష్ఠనిమిత్తమై ఏర్పరచి ముందుగా తాము రు. 116/- లు సమర్పించిరి. పిదప శ్రీమాన్ గాదె రామయ్యం గారికి(విజయనగరం)పురుషకారముచేసి వారిచే రు.116/ లు కూడ సమర్పింపజేసిరి మరియు తమను దర్శించుకొనుటకై అచ్చటకువచ్చిన విజయనగరం షావుకారుగారిచే రు. 116/- లు యిప్పించిరి. ఈ విజయమును గురించి విజయనగరం ఎస్టేటులో శ్రీదివానుగారితోను సింహాచలం శ్రీఎగ్జిక్యూటివు ఆఫీసరుగారితోను సంప్రదించి ఈ కైంకర్యమును త్వరలో ఫలింపజేయవలసినదిగా కోరిరి. త్వరలో ఈ కార్యమును శ్రీ అనంత పద్మనాభ స్వామి పూర్తిచేయించుకొనగలడని విశ్వసించుచున్నాము.

## బరంపురం

ఇచ్చట శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధిలో పెరియాళ్వారి తిరునక్షత్రము శ్రీ. తి. పె. తిరువెంగడమ్మ గారి ప్రోత్సాహవిశేషముచే విలక్షణముగా జరిగినది. ప్రస్తుతము శ్రీ గుండుమళ్ళ రంగనాథస్వామిగారు శ్రీ మహిళామండలిలో కొందరు స్త్రీలున్ను, శ్రీ భగవద్విషయ కాలక్షేపమునకు అంగముగా ముముక్షుప్పడి సేవించుచున్నారు. సంప్రదాయాభివృద్ధి సర్వాత్మనా బరంపురములో అభివృద్ధి చెందుచున్నందులకు ఆనందముగా నున్నది.

శ్రీ మతే రామానుజాయ నమః

# వైదిక ఆధ్యాత్మిక విద్యానిధి సంఘములు

## కసింకోట

శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాచార్యులుగారు (అధ్యక్షులు)
,, రేజేటి అప్పలాచార్యులు గారు (కార్యదర్శి)
,, శృంగారం జగన్నాథాచార్యులు గారు (సభ్యులు)
,, కొడవగుండ్ల శ్రీనివాసాచార్యులుగారు ,,
,, అవసరాల రంగారావుగారు ,,

## తుని

శ్రీమాన్ తెలికిచర్ల కందాడ శ్రీమన్నారాయణాచార్యులుగారు (అధ్యక్షులు)
,, రేజేటి గోపాలాచార్యులుగారు (కార్యదర్శి)
,, న. చ. నారాయణాచార్యులు గారు (సభ్యులు)

## గొల్లప్రోలు

శ్రీమాన్ ప్రతివాది భయంకరం వెంకటాచార్యులుగారు (అధ్యక్షులు)
,, భాగవతం వెంకట రామానుజాచార్యులు గారు (కార్యదర్శి)
,, తుయ్యణ్ణి రామావతారం గారు (సభ్యులు)

## పెద్దాపురం

శ్రీమాన్ చిలకమర్రి నరసింహాచార్యులుగారు (అడ్వకేటు) (అధ్యక్షులు)
,, ఆరాధ్యుల వెంకట నరసింహారావుగారు (ఉపాధ్యక్షులు)
,, డాక్టరు చిలకమర్రి తిరువెంగళాచార్యులుగారు (కార్యదర్శి)
,, ఖండవల్లి గోపాలాచార్యులు గారు (సహాయ కార్యదర్శి)
,, వంగల శ్రీ వెంకటేశ్వర్లుగారు (సభ్యులు)
,, తమిరిశ కందాళై సత్యనారాయణాచార్యులు గారు

## వీరవరం

శ్రీమాన్ న. చ. రామానుజాచార్యులుగారు (అధ్యక్షులు)
,, గుదిమెళ్ళ భాష్యకారాచార్యులుగారు (కార్యదర్శి)

## రాజానగరం

శ్రీమాన్ వేదాల వెంకటాచార్యులుగారు (అధ్యక్షులు)

## సామర్లకోట

శ్రీమాన్ ఎక్కిరాల రామస్వామి అచార్యులుగారు (అధ్యక్షులు-అయోధ్యారాంపురం)
,, శ్రీమత్తిరుమల బాబయ్యాచార్యులుగారు (కార్యదర్శి)
,, పరవస్తు సామవేదం శ్రీనివాస రామానుజస్వామిగారు (సహాయకార్యదర్శి)

## రాజమండ్రి

శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిమెళ్ళ వెంకటాచార్యుల అయ్యవార్లంగారు (అధ్యక్షులు)
,, తె. కం. కుమార రామానుజాచార్యులు గారు (కార్యదర్శి)
,, డాక్టర్ A. C. కృష్ణమాచార్యులుగారు (సభ్యులు)
,, శ్రీమాన్ ముడుంబై వరాహ నరసింహాచార్యులుగారు (సభ్యులు)

## ద్వారకా తిరుమల

శ్రీమాన్ శేషభట్టరు నరసింహాచార్యులు గారు అధ్యక్షులు
,, ఖండవల్లి ప్రభాకరాచార్యులుగారు ఉపాధ్యక్షులు
,, సిరిపురపు వెంకట రామానుజాచార్యులుగారు ,,
,, గోవర్ధనం లక్ష్మీనరసింహాచార్యులుగారు కార్యదర్శి
,, కొంపల్లి వెంకటప్పలాచార్యులుగారు సభ్యులు

## జగ్గయ్యపేట

శ్రీమాన్ న. చ. రాఘవాచార్యులుగారు అధ్యక్షులు
,, మరింగంటి సీతారామానుజాచార్యులుగారు కార్యదర్శి
,, తిరునగరి యోగానందాచార్యులుగారు ఉపాధ్యక్షులు
,, కోయిల రాఘవాచార్యులుగారు సభ్యులు
,, మరింగంటి రంగరాచార్యులుగారు ,,

## ఏలూరు

శ్రీమాన్ డాక్టర్ చిలకమర్రి లక్ష్మణాచార్యులుగారు అధ్యక్షులు
,, తె. కం. జగన్నాథాచార్యులు గారు కార్యదర్శి
,, ఫణిహారం ఎంబారాచార్యులుగారు, సహాయకార్యదర్శి
,, న. చ. కృష్ణమయ్యంగార్ అడ్వకేట్ ఉపాధ్యక్షులు
,, ఆరకిల్లి శ్రీరంగనాయకాచార్యులుగారు
,, K. V. రాఘవాచార్యులుగారు L. I. M.
,, కందాళ పార్థసారథి అయ్యంగార్ అడ్వకేట్
,, శ్రీనివాసాచార్యులు గారు (సంస్కృత పాఠశాల)

## కానుమోలు

శ్రీమాన్ అద్దంకి రామానుజాచార్యులు గారు అధ్యక్షులు
,, సాతులూరి రంగాచార్యులుగారు ఉపాధ్యక్షులు
,, నందూరి శ్రీరంగాచార్యులుగారు కార్యదర్శి
,, నందూరి సింహాద్రి అప్పలాచార్యులుగారు సహాయకార్యదర్శి
,, నందూరి శ్రీరామమూర్తి గారు కోశాధికారి.

## సభ్యులు

శ్రీ అద్దంకి ఉడయవరులు గారు
శ్రీ సాతులూరి శ్రీనివాసాచార్యులుగారు
శ్రీ అద్దంకి వీరరాఘవాచార్యులుగారు
శ్రీ నరపురపు శ్రీభాష్యకారాచార్యులు గారు

## నూజివీడు

శ్రీమాన్ న. చ. రామానుజాచార్యులు గారు అధ్యక్షులు
,, భట్టర్ వెంకట రామకృష్ణమాచార్యులుగారు కార్యదర్శి.

మైలవరం

శ్రీమాన్ ధర్మపురం తిరుమల లక్ష్మీ కుమార వేదాంత తిరుమలాచార్యులుగారు అధ్యక్షులు
,, వంగిపురం కృష్ణమాచార్యులుగారు ఉపాధ్యక్షులు
,, V. తోతాద్రి అయ్యంగార్
,, పులిపాటి రాఘవాచార్యులు గారు

తిరువూరు

శ్రీమాన్ కొదమసింహం శ్రీరంగాచార్యులుగారు అధ్యక్షులు
,, మారంగంటి పార్థసారథిగారు ఉపాధ్యక్షులు
,, మారంగంటి వెంకట నరసింహాచార్యులుగారు కార్యదర్శి
,, కొదమసింహం కృష్ణమాచార్యులు గారు

ఎర్రబోయినపల్లి

శ్రీమాన్ కొదమసింహం రామానుజాచార్యులుగారు అధ్యక్షులు
,, కొదమసింహం శ్రీమన్నారాయణాచార్యులుగారు కార్యదర్శి
,, కొదమసింహం రాఘవాచార్యులుగారు కోశాధికారి
,, కొదమసింహం వెంకటరంగాచార్యులు గారు

మంగళగిరి

శ్రీమాన్ పర్ణశాల రంగరామానుజా చార్యులుగారు అధ్యక్షులు
,, చిలకపాటి రామానుజాచార్యులు గారు కార్యదర్శి

నడిగడ్డపాలెం - శ్రీ వాసుదాసాశ్రమం

శ్రీమాన్ కవిరత్న సుదిమెళ్ళ రామానుజాచార్యులు గారు అధ్యక్షులు
,, కోడూరు వెంకటాచార్యులుగారు ఉపాధ్యక్షులు
,, ఉత్పల రాజగోపాలా చార్యులుగారు కార్యదర్శి

సానుభూతి

పాలకొల్లు వాస్తవ్యులు, లక్ష్మీసంపన్నులు, ప్రముఖ వైశ్యశిఖామణులు, అగు శ్రీ చేపాక శేషావతారం గారు ఇటీవల పరమపదించిరి. వీరు పరమవిలక్షణమైన శ్రీవైష్ణవ సంప్రదాయమునకు జెందిన ప్రపన్నులు పాలకొల్లులో నెలకొల్పబడిన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు అధ్యక్షులుగానుండి పెక్కు సభలు, సమావేశములు, కాలక్షేపములు జరిపించిరి. మరియు బవరిలో ప్రతిష్ఠించిన శ్రీ పెరియాళ్వార్ విగ్రహ ప్రతిష్టకు రు. 600/- లు సమర్పించిరి. ఈ లీలా విభూతిలో భగవద్భాగవతాచార్య కైంకర్యమునకు వీరులేనిలోటు తీర్చరానిది. శ్రియఃపతి వీరి ఆత్మకు తిరువడి బట్టుగాక.

వీరి పరమపదోత్సవసందర్భములో వీరి కుమార్తె శ్రీ తుమ్మలపల్లి సుభద్రమ్మగారు రు 25/- సంఘ సంభావనగా సమర్పించిరి.

To.

శ్రీ ______________________________

______________________________

## శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు మంగళాశాసన పూర్వకముగ తెలుపునది

శ్రీ యతిరాజ సేవా మహిళా మండలుల అధ్యక్ష కార్యదర్శినులకు:-

మీరందరు ప్రతి శుక్రవారమున శ్రీ మహాలక్ష్మీదేవి పూజలను సక్రమముగా జరుపు కొనుచు ఆనందించు చున్నారని వినుటకు చాలా సంతోషించు చున్నాము. ఈ పూజలో

ఇంకను హెచ్చుమంది స్త్రీలు పాల్గొనునటుల మీరు బాగుగ ప్రచారమును గావించు చుండవలసినది. ఒకొక్క వీధికి కనీసము ఇద్దరిద్దరు స్త్రీలను ప్రతినిధులుగ నిర్ణయించి వారిని ఆయా వీధులలో యింటింటికిని ప్రతి శుక్రవారము నను వెళ్ళి ఆ యిండ్లలోని స్త్రీలకు పుని స్త్రీలకు బొట్టుపెట్టియు మిగతా వారికి ఊరికేరు శుక్రవారము పూజకై తప్పక రావలసినదిగ నాహ్వానించుచుండవలసినది. ఎవరైనను ఒకటి రెండువారములు ఏకారణముచేనైనను రాకపోయినచో అట్టివారిని ఉపేక్షించరాదు. వచ్చువారిని రానివారిని అందరినికూడ మాటిమాటికిని, పిలుచుచుండవలెను. వచ్చుట బాగుగ అలవాటుపడిన పిమ్మట పిలువకపోయినను వారే వచ్చుచుండగలరు రాబోవు శ్రావణమాసమునకు ప్రతిమహిళామండలిలోనుకూడ సభ్యురాండ్ర సంఖ్య ఇప్పటి సంఖ్యకు రెట్టింపుగ పెరుగునటుల మీరు బాగుగ కృషిసల్పవలసినది. రాబోవు శ్రావణ మాసములోను మరియు శ్రీ ఆండాళు తిరునక్షత్రోత్సవము అయిదురోజులలోను మీరందరునుకూడ పదిమందిగ కలిసి ఒకొక్క వారమున మీ గ్రామములో ఒకొక్క వైపునకు వెళ్లి అందరిని నాహ్వానించి ప్రోత్సహించి పూజలు జరుపవలసినది.

1 పూజకాలము మొత్తము ఒక గంట కంటెను మించరాదు

2 సూర్యాస్తమయము అగులోపుననే పూజ పూర్తియై ఎవరిండ్లకువారు వెళ్ళిపోవలయును

3 పూజకై అధికమైనఆడంబరములు-అట్టహాసము- ధనవ్యయము ఉండరాదునోములో పూజకు రెండురూపాయలుమాత్రమే ఖర్చులగు నటులను, ఇండ్లలో జరిపించినచో ఎవరి పసుపు కుంకుమ-పుష్పములు-పండ్లు వారే తెచ్చుకొనవలసినదిగ ఏర్పాటు చేయవలసినదిగ పూజలను జరిపించు ఇంటివారికిగాని, పూజలు చేయువారికిగాని ఇంతకంటె ఏమాత్రము ఖర్చు కాకూడదు. కోవిలలో పూజచేయువారిలో కొందరు సంవత్సరమునకు ఒక పర్యాయము తమ పేరుతో పూజను జరుపుటకు రు. 2/- సమర్పించుటకు సందేహించుచున్నటుల వినుచున్నాము ఇందులకొక ఉపాయమును చెప్పెదము. తాము తమ ఇండ్లవద్ద ప్రతి శుక్రవారము ఉదయమున లక్ష్మి పూజను తప్పక చేసుకొనెదరు గదా, అటుల చేసుకొనునపుడే ప్రతివారును వారమునకు అర్ధణా చొప్పున ఒక డబ్బిలో "లక్ష్మిముడుపు" అని వేయుచున్నచో సంవత్సరమునకు మొత్తము రూ. 1-10-0 అగును తమపూజ జరుపునాడు ఆ రూ 1-10 0తో మీరొక 0-6-0 ను కలిపి కోవిలకు సమర్పించినచో సులువుగా పని పూర్తియగునుగదా ఈపై మూడు నియమములలో అందరును తప్పక పాటించగోరెదము మీకందరికిని ఉత్సాహముగ నుండు నిమిత్తమై ప్రతిష్ట చేయబడిన రాగిపై బంగారు గిల్టుగల లక్ష్మిపథకములను, పథకము 1కి 0-4-0 చొప్పునను, శుక్రవారోత్సవ పుస్తకము 1కి 0-1-0 చొప్పున ఇప్పించుటకేర్పాటు చేసితిమి పోస్టుఖర్చులు మీరే భరించవలెను గాన మీరందరు అత్యధిక ఉత్సాహముగ లక్ష్మిపూజ కార్యక్రమమును జరిపి మీకు, మీ కుటుంబమునకు. మీ వంశమునకు, మీ గ్రామమునకు, మీ దేశమునకు శ్రేయస్సు చేకూర్చుకొందురుగాక శ్రియఃపతి మిమ్ముల ననుగ్రహించుగాక. ఇవియే మంగళ శాసనములు.

☞ కావలసినవారు ఆశ్రమమునకు వ్రాసి తెప్పించుకొనుడు మీరు సభ్యురాండ్రకు మామూలుధరకే వానిని విక్రయించి ఆ తేడావచ్చు ధనము మీ ప్రచారమునకు వినియోగించుకొనుడు.

శ్రీమన్నారాయణ రామానుజ జీయరు
శ్రీ వాసుదాసాశ్రమం నడిగడ్డపాలెం
(వయా) చేబ్రోలు – గుంటూరుజిల్లా

# బదరీ శ్రీనివాస రామానుజ శాశ్వత పూజా విరాళములు

## గత నెలలోని ఈ నెలలోని వసూళ్లు

శ్రీ మల్లిం సీతారామరావుగారు, గోవిందపురం 29-0
,, ముదిగొండ రామచంద్రరావుగారు, నేలకొండపల్లి 29-0
,, మునగాల రామలక్ష్మమ్మగారు, సామర్లకోట 29-0
,, భవిరిశెట్టి రత్తయ్యగారి కుమారుడు బాపయ్యగారు, నడిగూడెం 275-0 లో ఈనాడు పూర్తిగా ఇచ్చినది 43-0
,, సామవేదం శేషమ్మగారు, మంగళగిరి 10-0
,, పచ్చిగోళ్ళ గోవర్ధనమ్మగారు, విజయవాడ 116-0
,, బచ్చు శ్రీరాములుగారి కుమారుడు మల్లిఖార్జునరావుగారు, విజయవాడ 29-0
,, దేవారపు చెల్లయమ్మగారు, మైలవరం 28-0
,, మేకా వెంకట చిన్నయమ్మగావుగారు గొల్లపల్లి 29-0
,, మూరానేని అలివేలు మంగతాయారమ్మగారు మైలవరం 28-0
,, అడపా రంగయ్యగారు నరసన్నపాలెం 29-0
,, చెలమశెట్టి కామయ్యగారు 29-0
,, పెరాతే నరసింహారావుగారి భార్య పద్మావతమ్మగారు 29-0
,, జయవరపు రామమూర్తిగారు, ఏలూరు 29-0
,, సుగ్గిశెట్టి సత్యనారాయణరావుగారు, ఏలూరు 29-0
,, పులివర్తి సత్యంగారు, ఇందుపల్లి 58-0
,, నల్లాని చక్రవర్తుల లక్ష్మినరసమ్మగారు (భర్త) వెంకటాచార్యులుగారు, తాడిపత్రి 116-0
,, ఉదుత్త కామేశ్వరమ్మగారు, రాజమండ్రి 29-0
,, అతాఘ్యుల సూరమ్మగారు, పెద్దాపురం 29-0
,, చినగంధం సూర్యనారాయణగారు, పెద్దాపురం 116-0
,, రాజావత్సవాయి వెంకట సూర్యనారాయణ సుదర్శనమ్మగారు, పెద్దాపురం 29-0

శ్రీ రాజావత్సవాయ వెంకట రమణమ్మగారు, పెద్దాపురం 29-0
,, నల్లానిచక్రవర్తుల సంపత్కుమార రామానుజాచార్యులుగారు, వీరవరం 29-0
,, దుర్గా వెంకటేశ్వర్లు, పెద్దాపురం 25-0
,, దామెర బుచ్చి వెంకటరావుగారు భార్య లక్ష్మి వెంకాయమ్మగార్లు, పిఠాపురం 116-0
శ్రీ వాసవీ పార్థసారధి గీతామహిళా సమాజం అనకాపల్లి 29-0
,, కడింశెట్టి నీలయమ్మగారు, అనకాపల్లి 29-0
,, తమ్మన సోమరాజుగారు, అనకాపల్లి 29-0
,, ఉప్పల శ్రీరామమూర్తిగారి భార్య రామయమ్మగారు అనకాపల్లి 29 0
,, దంగేటి సుబ్బరాజుగారు, అనకాపల్లి 29-0
,, ఉప్పల మల్లిఖార్జునరావుగారు, అనకాపల్లి 29-0
,, గోకవరపు వెంకటరాజుగారు, విజయనగరం 29-0
,, బైసాని సత్యనారాయణగారు, విజయనగరం 29-0
,, బైసాని పైడిశెట్టిగారు, విజయనగరం 116-0
,, కిఝుపు నారాయణమూర్తిగారు, విజయనగరం 29-0
,, రావు వెంకట జగన్నాథరావుగారు, సీతారాంపురం. రు. 29-0 వాగ్దానంలో జమ 11-0
,, న్యాపతి బాలకృష్ణమూర్తిగారు వీరి భార్య లక్ష్మమ్మగారు దంపతులు, శ్రీకాకుళం 20-0
,, పైడిశెట్టి అప్పారావుగారు, బరంపురం 29-0
,, కొండుపర్తి వెంకట సుందర రామదాసుగారు వాగ్దానం 29-0 లో జమ 2-0
,, గాదె రంగారావుగారు, B. L. డిస్ట్రిక్టుజడ్జి, బరంపురం 29-0
,, హద్దునూరి రత్తమ్మగారు బరంపురం 28-0
,, కోటిని సత్యనారాయణమూర్తిగారు భార్య మీనాక్షమ్మ (దంపతులు) వాగ్దానం 29-0 లో జమ 22-0
,, గుండాల రాఘవరావుగారు, అడ్వకేటు బరంపురం 29-0

## అష్టాక్షరీ క్షేత్రవిరాళము

కృష్ణాజిల్లా కవుతరం గ్రామ వాస్తవ్యురాలగు శ్రీ కాజా గుర్గమ్మగారు అష్టాక్షరీ క్షేత్రములో ఒక గది కట్టించుటకుగా లోగడ యిచ్చినదిగాక ఇప్పుడు మరల ఇచ్చినది రు. 600-0

### బదరీ శ్రీనివాస రామానుజుల తాత్కాలిక పూజా విరాళములు

శ్రీ శివగాజు శేషమ్మగారు, మడిపల్లి 11-0
,, ఊటుకూరు సూర్యనారాయణగారు, వల్లూపురం 11-0
,, కొండపల్లి వెంకట నరసింహారావుగారు, అనంతగిరి 11-0
,, పి సూర్యనారాయణమ్మగారు, శ్రీకాకుళం (తదీయారాధన నిమిత్తం) 30-0
,, వీరమాచనేని సోమబ్రహ్మంగారు భార్య వేదవల్లి తాయారమ్మగారు, ఏలూరు 11-0
,, ఆరాధ్యుల వెంకట నరసింహంగారు, పెద్దాపురం 11-0
,, కేశవరపు లక్ష్మీనరసమ్మగారు, పెద్దాపురం 11-0
,, మాలేటి పున్నమ్మగారు, అనకాపల్లి 11-0
,, పూసర్ల సత్యనారాయణ రామమూర్తిగార్లు శ్రీరామతీర్థం 11-0
,, గాదె రంగారావుగారు, బరంపురం 11-0
శ్రీ ప్రింటర్ లక్ష్మీప్రెస్, బరంపురం 11-0
,, గాదె శ్రీనివాసరావుగారు, ారివద 11-0
,, నూరానేని వరమంగయ్యమ్మారావు రాణీగారు మెలవరం (తదీయారాధన నిమిత్తం సమర్పణ) 24-0

### బదరి అష్టాక్షరీ క్షేత్ర మండలి సత్సంగ సదన విరాళములు

శ్రీ దామెర లక్ష్మీరామాయమ్మగారు విజయవాడ శ్రీరామానుజ మందిర నిర్మాణమున కిచ్చిన విరాళము రు. 200-0

శ్రీ వంకదారు సత్యనారాయణగారు, ఏలూరు, పెరియాళ్వార్ విగ్రహమునకై లోగడ ఇచ్చిన 300-0 లు గాక మరల ఈనాడిచ్చిన విరాళం రు. 300-0

శ్రీ B. V జోగారావుగారు, రాజానగరం 16-0
శ్రీ మంగిపూడి మాధవరావుగారు, పెద్దాపురం 16-0
శ్రీ మట్టుపల్లి స్వామిగారు, విజయనగరం 16-0
శ్రీ మంచుకొండ బుల్లెమ్మగారు, విజయనగరం 16-0
శ్రీ వసాది రామలక్ష్మీనర్సమ్మగారు, బరంపురం 16-0

### కట్నములు

శ్రీ బరాటం శ్రీనివాసరావుగారు తమతమ్ముని మూడవ కుమార్తె వివాహ సందర్భమున పంపిన సంఘ కట్నము 2-0

బరంపురం శ్రీయతిరాజసేవా మహిళా మండలివారు ఉడయవరుల తిరునక్షత్రము జరిపి శ్రీజియ్యరువారికి సమర్పించిన కట్నం 15-0

సంఘమువారు శ్రీ జియ్యర్ స్వామివారికి సమర్పించిన కట్నం 58-0

శ్రీ గాదె రాజగోపాలరావుగారు (బరంపురం) శ్రీజియ్యర్ స్వామివారిపాదపూజలో సమర్పించినది 58-0

ఏలూరు శ్రీ ఆండాళ్ సేవామహిళా సమితివారు తమ సంఘ ద్వితీయ వార్షికోత్సవ సందర్భములో సంఘ కట్నముగా ఇచ్చినది 5-0

కానుమోలు దేవస్థానం ధర్మకర్తలు శ్రీ జియ్యర్ వారికి సమర్పించినది 80-0

కాకినాడ వాస్తవ్యులగు శ్రీమాన్ వంగిపురం వెంకట రంగాచార్యులుగారు తమ కుమారుని వివాహ సందర్భమున సంఘమునకు పంపిన కట్నం 10-0

బదరి శ్రీనివాస రామానుజ శాశ్వత విరాళములు.

శ్రీ కానూరు సుశీలమ్మగారు (భర్త వెంకటరత్నంగారు) కేతవరం 29-0

# శ్రీ గుణరత్నకోశము

శ్లో॥ అస్యేశానా జగత ఇతి తే᳚ ధీమహే యాం సమృద్ధిం,
శ్రీ శ్శ్రీసూక్తంబహు ముఖయతే తాం చ శాఖానుశాఖం
ఈష్టే కశ్చి జ్జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః,
తం చ త్వత్తః పతి మధిజగౌ వుత్తర శ్చానువాకః॥

:— * ⬥◆⬥ అర్థము * ⬥◆⬥ —:

హే శ్రీః = ఓ లక్ష్మీదేవీ,
అస్య = ఈ
జగతః = ప్రపంచమునకు,
ఈశానా = అధికారిణివి,
ఇతి = అని,
తే = నీ యొక్క
యాం = ఏ
సమృద్ధిం = అతిశయమును.
అధీమహే = అధ్యయనము చేయుచున్నామో
తాం + చ అట్టి నీ యతిశయమునే,
శ్రీసూక్తం = శ్రీసూక్తము
శాఖానుశాఖం = అన్ని శాఖలును,
బహు = అధికముగా
ముఖయతే = స్తుతించుచున్నది

పౌరుషే + సూక్తే = పురుషసూక్తము
కశ్చిత్ = ఒకానొకడు,
జగతః = జగత్తునకు
ఈష్టే = ప్రభువై యున్నాడు
ఇతి = అని
యః = ఎవడు
ఉక్తః = చెప్పబడునో
తం + చ = అట్టివానికూడ
ఉత్తరః = తరువాతదగు
అనువాకః + చ = అనువాకమున్ను
త్వత్తః = నీ సంబంధమగు
పతిం = భర్తనుగా
అధిజగౌ = కీర్తించుచున్నది

* :- తాత్పర్యము -: *

ఓ లక్ష్మీదేవి. నీ యైశ్వర్యాతిశయము నేమని వర్ణింతుము ఈ జగత్తునకంతకు నీవే శాసనకారాలవని కీర్తించబడు చున్నావు. శ్రీసూక్తముగూడ ఒకయనువాకము వెంట మరొకయను వాకానుసారము మొత్తమంతయును కూడ నీ యతిశయమునే వర్ణించు చున్నది-పురుషసూక్తమున కూడ నీకు పతియగుటచేతనే పరమపురుషుడు జగత్తునకంతకు ప్రభువు కాగలిగినాడని యభివర్ణించినది.

# భక్తినివేదన - వేదాన్తమాసపత్రిక

భక్తినివేదన:— సాలుచందా రు 5/- లు    రి నెం. A 372


## గమనిక

భక్తినివేదన పత్రికయందు నేను ప్రచురించిన శ్రీశాంకరభాష్య సహిత భగవద్గీతలో కొన్నిచోట్ల కొన్ని అధ్యాయములయందు కొన్ని భాగములు తమకందలేదనియు, అవి తమకుపంపవలెనని కొందరు చందాదారులు వ్రాయుచున్నారు. అవిమావద్దను నిల్వలేవు. అందుచేత ఆ భాగములను త్వరలోనె మేముతిరిగి ముద్రించి కోరినవారందరికిని పంపగలము.

పాఠకులీవిషయమును గమనించవలసినదిగా కోరుచున్నాము.

## మనవి

భక్తినివేదన పత్రిక చందాదారులు తమ చందాధనమును వెంటనే పంపవలసినదిగా ప్రార్థించుచున్నాము. మరియు ఒక్కొక్క చందాదారుడు కనీసము క్రొత్తగా మరియొకచందాదారుని చేర్పించి మతప్రచారమునకు సహాకరించవలసినదిగా కోరుచున్నాము.

సంపాదకులు.

---


సాలుచందా రు. 5 లు    **భక్తినివేదన - BOOK POST**    రి. నెం. A 372

శ్రీ వాసుదాసాశ్రమం:— నడిగడ్డపాలెం పోస్టు [వయా-చేబ్రోలు] గుంటూరు జిల్లా


శ్రీ ____________

____________

28. శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ లైబ్రరీ.
తిరుపతి చిత్తూరు జి.

____________




Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Liberty Press, Tenali For Sriman Press, Nadigaddapalem.

శ్రీ

హరిః ఓం

# :— ప్రస్తావన —:

ఏకాదశులకు హరివాసరము లని పేరు. అనగా ఏకాదశి తిథులు శ్రీమహావిష్ణుదేవతాకమైన వనియు, విష్ణు ప్రీతికరము లనియు, విష్ణు కటాక్ష విశేషములుగల కాలవిశేషములన్ని, ఆనాడు చేయు విష్ణు అర్చన, ఆరాధన; ఉపవాసములు, విష్ణు కథాశ్రవణములు, విష్ణ్వారాధనరూపమైన సమస్త కర్మలు, సమస్త దానధర్మములు, శ్రీవిష్ణువునకు అత్యంత ప్రీతి పాత్రములగు వనియు చెప్పబడుచున్నవి.

ఈ ఏకాదశు లన్నింటిలోను కార్తీకశుద్ధ ఏకాదశి మరియు అత్యంత మహాత్మ్యము గలది. జగద్రక్షణార్థమై యోగనిద్రను జేయుచున్న శ్రీమహావిష్ణువు ఈనాడు ఆ యోగనిద్ర నుండి లేచును, గాన దీనికి ఉత్థానైకాదశి, ప్రబోధనైకాదశి, బోధనైకాదశి, కైశిక ఏకాదశి యని అనేక పవిత్ర నామములు గలవు.

ఈ ఏకాదశిని గురించి స్కాంధపురాణములో యిటుల వర్ణింపబడి యున్నది.

శ్లో॥ అశ్వమేథ సహస్రాని రాజసూయ శతాని చ ।
ఏకే నైవోపవాసేన ప్రబోధిన్యా లభే న్నరః ॥

(కార్తీక శుద్ధ ఏకాదశి నాడు ఉపవసించుట చేత వేయి అశ్వమేధయాగములను, నూరు రాజసూయ యాగములను ఆచరించుట వలన పొందదగు ఫలితమును నరుడు పొందుచున్నాడు.)

శ్లో॥ మేరుమందరమాత్రాణి పాపాన్యుగ్రాణీ యాని తు ।
ఏకేనైవోపవాసేన దహ్యతే పాపహారిణి ॥

(కార్తీక శుద్ధ ఏకాదశి నాడు ఉపవసించుట చేత మేరు పర్వతము వలెను, మందర పర్వతము వలెను. గూడు కట్టుకొని యున్న ఉగ్రమైన పాపములు కూడ దహింపబడగలవు.

శ్లో॥ పూర్వజన్మసహస్రైస్తు యద్దుష్కర్మ ఉపార్జితం ।
జాగరేణ ప్రబోధిన్యాం దహ్యతే తూలరాశివత్ ॥

(అనేక వేల జన్మల నుండి సంపాదించిన పాపపుంజములు దూదిరాశి అగ్నికణము చేత వలెనే కార్తీక శుద్ధ ఏకాదశి నాడు ఉపవాసముండి ఆ తెల్లవారు ఝామున నే సర్వేశ్వరునికి సుప్రభాతముల గానము చేయుటచే దహింపబడగలవు.

శ్లో॥ విష్ణుప్రియతరా హ్యేషా ధర్మసారస్యదాయినీ ।
సకృదేనా ముపోష్యైవ ముక్తిభావః భవే న్నరః ॥

(ఈ కార్తీక శుద్ధ ఏకాదశి విష్ణువునకు అత్యంతప్రియమైనది. సమస్త ధర్మముల యొక్క సారమును యిచ్చునది. ఒక పర్యాయమైనను దీని యందు ఉపవసించి విష్ణువును అర్చించు వాడు మోక్షమును తప్పక పొందగలడు.

శ్లో॥ స్నానం దానం జపో హోమః సముద్దిశ్య జనార్దనం ।
నరై ర్యత్క్రియతే వత్స ప్రబోధిన్యాం తదక్షయం ।
తత్సర్వం కోటి గుణితం ప్రబోధిన్యాం తు యత్కృతం ॥

(కార్తీక శుద్ధఏకాదశి నాడు నరులచే శ్రీమహావిష్ణువు నుద్దేశించి చేయబడు స్నానములు, దానములు, జపములు, హోమములు మున్నగునవి అక్షయము లగును. అట్టి వన్నియు కోటి రెట్లు అధిక ఫలితము నిచ్చును.)

శ్లో॥ యే కుర్వంతి కథాం విష్ణోః యే శృణ్వంతి సమాహితాః ।
శ్లోకార్ధం శ్లోక మేకం వా కార్తికే గోశతం ఫలం ॥

(కార్తీక శుద్ధ ఏకాదశి నాడు శ్రీమహావిష్ణుకథను ఎవరు ఏకాగ్రచిత్తులై చదువుదురో, ఎవరు తదేక మనస్కులై విందురో, వీనిలో ఒక శ్లోకమునే గాని శ్లోకములో సగము భాగమునే గాని చదువుట లేక వినుట వలన కూడ నూరు గోవుల దానమిచ్చిన ఫలితము కలుగును.)

ఇటుల బహు విస్తారముగ ఈ ఏకాదశిని గురించి అనేక స్థలముల యందు వర్ణించబడి యున్నది.

ఈ ఏకాదశి - ద్వాదశుల ఈఉత్సవములు ప్రతి విష్ణుసన్నిధి యందును విశేషముగ నాచరింపబడు చున్నవి.

అంతియు ఈ ఏకాదశి మహాత్మ్యమును వెల్లడింపబడి నీని యితిహాసము భట్టరు వారిచే ప్రకాశింపచేయబడి,తత్ఫలిత ప్రదర్శనమును ప్రత్యక్షముగ జూపించిన శ్రీరంగనాథుని సన్నిధానమందును, దీని ఫలితమును నిదర్శన పూర్వకముగ జూపించిన తిరుక్కురుంగుడి దివ్యదేశమందును ఈ ఉత్సవము విశేషించి నాచరింపబడు చున్నది.

భట్టరు వారికి పూర్వమునుండి ఈ ఉత్సవము అగమోక్తరీతిగ నాచరింపబడు చున్నను, భట్టరువారు స్వయముగ దీని మహాత్మ్యకథన పూర్వకముగ వైభవోత్త మొనర్చిరి. అప్పటి నుండియు ఈ ఉత్సవముమహావైభవముతో విలక్షణముగ అనుష్ఠింపబడు చున్నది.

ఈ ఉత్సవవిశేషము వలననే భట్టరు వారు అనాడే నిత్యవిభూతిని ఏలుకొనుటకై వేంచేయుటయు, తదాది నేటి వరకు భట్టరువారి వంశస్థులకు శ్రీరంగనాథుని సన్నిధానమందు బ్రహ్మరథోత్సవము జరుపబడుటయు ఆచారముగ వచ్చుచున్నది.

ఈ ఏకాదశి యందు ముఖ్యముగ నాచరింపబడవలసిన పనులేవియనగా:— పుణ్యతీర్థస్నానము, శ్రీమహావిష్ణువు యొక్క విశేషార్చనము, పూర్తి ఉపవాసము, రాత్రి జాగరణము, అఖండ హరినామ సంకీర్తనము, తెల్లవారిన ద్వాద యనగా ఆ తెల్లవారగట్లు తిరిగి పుణ్యతీర్థస్నానము, విష్ణ్వర్చనము, కైశిక మహాత్మ్య పఠనము - శ్రవణము. తదీయారాధనము, యథాశక్తి దానధర్మాచరణము - ఇవి ముఖ్యములు.

ఈ నాడు కైశిక మహాత్మ్య పఠన - శ్రవణాదులు అతిప్రధానము లగుటచేతనే ఈ ఏకాదశికి కైశిక ఏకాదశి యనియు, ఈ ద్వాదశి నాడు దీని ఫలితముగ బ్రహ్మరక్షసునకున్ను హరిజనునికిన్ని, శ్రీభట్టరువారికిన్ని పరమపద ప్రాప్తికలుగుటచే దీనికి కైశిక ద్వాదశి యనియు సుప్రసిద్ధ నామములు కలిగినవి.

వరహావతార కాలమున వరాహస్వరూపుడైన పెరుమాళ్లు ప్రళయార్ణము నుండి భూపిరాట్టిని ఉద్ధరించిన తరువాత నిరుపాధిక మాతృవాత్సల్యముచే భూపిరాటి చేతనోజ్జీవనసులభోపాయమును అనతివ్వమని వేడగా పెరుమాళ్లు, కైశిక ఏకాదశి నాడుపవసించి, రాత్రి జాగరణము సలిపి, కైశిక రాగముతో హరిసంకీర్తనము జరుపుటయే సంసార సముద్ర నిస్తరణోపాయమని యిందులకు ఉదాహరణముగా జరిగిన యితిహాసమును తెలిపి, కైశిక రాగము సంగీత సారజ్ఞులకే గాని తదితరులకు సాధ్యము కానందున ఆ నాడు ఈ మహాత్మ్య పఠన - శ్రవణాదుల వలననే తన సాయుజ్యరూప సత్ఫలితములను ఎట్టి దుష్కర్మకలిగిన సంసారియైనను పొందగలడని ఈ కైశిక మహాత్మ్యమును భూపిరాటికి ఉపదేశించిరి.

ఈ కైశిక మహాత్మ్యము వరాహపురాణములో, నలుబది ఎనిమిదవ అధ్యాయములోనిది - దక్షిణ - ఉత్తర ప్రాంతముల యందు ముద్రణమైనట్టియు, వ్రాతప్రతులైనట్టి వరాహపురాణములలో అధ్యాయభేదములుగను నామభేదములుగను మధ్యమధ్య శ్లోక - యితిహాస భేదములుగను యున్నను, మొత్తముమీద స్థూలముగ అన్నింటి యందును ఈ మహాత్మ్యము యున్నది

దీనికి భట్టరు వారు ద్రావిడమున ఒక చక్కని వ్యాఖ్యానము సాయించిరి - వారి వ్యాఖ్యానమునకు అవతారికను వ్రాయుచు అందు.

1. వేదోపబృంహణము లన్నింటి యందును స్వతంత్రప్రమాణము లగుటచే పురాణములే సర్వశ్రేష్ఠము లనియు,
2. భగవదవతారము లన్నింటిలోను వరహావతారమే జ్ఞానస్వరూపమైనది, జ్ఞానోపకారకమైనది, రక్షకత్వ పూర్తి గలది, ఉత్తారకమైనది యనియు,
3 తన ప్రేయసియై, తనచే ప్రళయార్ణవమునుండి ఉద్ధరించబడిన భూపిరాట్టికి స్వయముగ చేతనోజ్జీవన సులభతమోపాయముగ ఉపదేశింపబడిన దగుటచే మిగత అవతారవాక్యము లన్నింటికంటెను శ్రేష్ఠతమమైనదనియు,
4. భగవత్ప్రాప్త్యుపాయములలో సులభతమమైనది గానమని ఉపదేశింపబడి, గోదాదేవి యవతారముఖమున తానే దాని నాచరించి, తరించి భూపిరాటి భగవద్వాక్యమును రుజువు చేసినదనియు,

సప్రమాణముగ మహోదారముగ రుజువు చేసిరి. ఆండాళు గానముచే భగవత్సాయుజ్యమును చెందగా, భట్టరు వారు ఈ మహాత్మ్యపఠనముచే భగవత్సాయుజ్యమును చెందిరి. మనము కూడ ఈ మహాత్మ్యపఠన - శ్రవణాదులచే భగవత్సాయుజ్యమును చెందుదుముగాక:

కార్తీక శుద్ధ ఏకాదశి నాడు కైశికరాగ గానము, తన్మాహాత్మ్యపఠనము - తచ్ఛ్రవణము. ఈ మూడును కూడ భగవత్సాయుజ్య ప్రాప్తికి సమానమైన సాధనములే యని శ్రియఃపతియే ఈ మహాత్మ్యములోనే తెలిపి యున్నాడు.

5. శ్లోకమున.— + + + మమగేయ పరాయణః : ప్రముక్త సర్వసంసారైః మమలోకంచ గచ్ఛతి,
(నా గానమును జేయుచును, తన్మాహాత్మ్యమును పఠించుచును, దానిని వినుచును దీని యందు ఏ విధముగనైనను సరియే అత్యంత భక్తి - శ్రద్ధ ఆసక్తుల గలవాడు సమస్త పాపముల నుండియు విడువడినవాడై నా లోకము పొందగలడు)

92 వ శ్లోకమున:— శ్లో॥ ఏతద్గీతఫలం దేవి । కౌముద ద్వాదశీ పునః ।
యస్తు గాయతి సద్భక్త్యా । మమ లోకం చ గచ్ఛతి॥

(ఓ భూపిరాటీ కార్తీక శుక్ల ద్వాదశి నాడు పాడిన ఈ గీతఫల మేమనగా - ఎవరైతే ఆ నాడు దీనిని పాడుదురో అట్టివారు నీ యొక్క పురుషకారమును, నా యొక్క కటాక్షమును పొందినవారై నా సాలోక్య - సాయుజ్యములను పొందగలరు.)

ఈ కైశిక మహాత్మ్య సంబంధి కథాభాగ మేమనగా:— దక్షిణ భారతదేశమందు తిరునల్వేలిజిల్లాలో మహేంద్ర మను పర్వత సమీపమున సిద్ధాశ్రమమను నొక దివ్యదేశము గలదు. శ్రియః పతి తన విశేష కటాక్షముచే అర్చావతార రూపేణ అవతరించగా ఆళ్వార్లు పాడి ఆనందించిన నూటు ఎనిమిది దివ్యతిరుపతులలోను ఇది యొకటి, దీనిని ద్రావిడమున "తిరుక్కురుంగుడి" అందురు. తిరునల్వేలి స్టేషనుకు 24 మైళ్లలో యున్నది. మధ్యలో 16 మైలులో నానమామలై యున్నది. అనగా నానమామలకు 8 మైళ్లలో తిరుక్కురుంగుడి యున్నది. దీనికి దక్షిణ బదరి, సౌకర క్షేత్రము, సిద్ధాశ్రమము, వామనక్షేత్రము అని పురాణ ప్రసిద్ధ నామములు గలవు. ఇచ్చట క్షీరనది (దీనికే పాలేరు, సింధునది, నంబియారు అని కూడ అందురు) ప్రవహించు చున్నది.

ఇచ్చట వైష్ణవనంబి, మలైమేల్ నంబి, నిన్ననంబి, ఇరుందనంబి, కిడంథనంబి తిరుప్పాల్కడల్ నంబి, అని పేర్లతో పెరుమాళ్లు వేంచేసి యున్నారు, వీరిలో నిన్ననంబియే ప్రధానులు, వీరిని తిరుక్కురుంగుడినంబి, అళ్గియనంబి, సుందర పరిపూర్ణుడు అని కూడ పిలుచుట కలదు. వీరు భగవద్రామానుజులవద్ద పంచసంస్కారములను పొందిరట. అందుచే ఉడయవర్లు యిచ్చట గర్భాలయములో ఆచార్యస్థానమున వేంచేసి యున్నారు. ఉడయవర్లు పెరుమాళ్లకు పంచ సంస్కారములు చేసిన 'తిరుమల్ పార' యని సుప్రసిద్ధ స్థలము కూడ తిరుపార్కడల్ నదిలో రేవువద్ద యున్నది.

ఇచ్చటు పిరాట్టుమార్లకు 'కురుంగుడివల్లితాయార్లు' అని తిరునామము, పంచకేతకవిమానము, తూర్పుతిరుముఖ మండలము, నిన్నతిరుక్కోలం, ప్రక్కనున్న శివునికి ప్రత్యేకము కోవిల ఆవరణలో శివవిగ్రహము, శివార్చకులచే వారికి ప్రత్యేక ఆరాధనము కలదు.

ఇచ్చట సమీపముననే హరిజనవాడలోని ఒక హరిభక్తుడు ప్రతిదినము వేకువఝాముననే వచ్చి పెరుమాళ్లకు సుప్రభాతమును పాడు చుండెడివాడు. ఆయన ప్రాకారము లోపలికి రాకుండగ బయటనే యుండి పాడు చుండుటనే వారికి దర్శనమిచ్చుటకై అడ్డగా యున్న ధ్వజస్తంభమును పెరుమాళ్లు ప్రక్కకు నెట్టిరట ఇప్పటికిన్ని యిచ్చటి ధ్వజస్తంభము పెరుమాళ్లకు ఎదురుగ లేదు. ప్రక్కగనే యున్నది.

కార్తీక శుక్ల ఏకాదశి నాడు ఈ హరిజనుడు ఉపవాసముండి రాత్రి ఒక ఝాము గడచిన పిమ్మట వీణతీసుకొని భగవంతుని కీర్తించుటకై బయలుదేరెను. చీకటిలో దారి తప్పి ఒక అడవిని చేరెను. ఆ అడవిలో బ్రహ్మరాక్షసు డుండెను. 10 పాశురములద్వారాను నమ్మాళ్వార్లు అయిదవ పత్తులో అయిదవ తిరువాయ్‌మొళ్లి యగు "ఎంగనేయో" అను 11 పాశురములద్వారాను మంగళాశాసనము జేసిరి. ఈ పెరుమాళ్లను పెరియాళ్వార్లు పెరియాళ్వార్ల తిరుమొళ్లి ద్వారాను తిరుమడిశైయాళ్వార్లు తిరుచ్చందవిరుత్తం 62 పాశురముద్వారాను, ఈ రాక్షసి పూర్వజన్మములో సోమశర్మ యను బ్రహ్మణుడై లోభమోహములతోను క్రమరహితముగను యాగ మొకదానిని ప్రారంభించి అది సమాప్తము గాకుండగనే అయిదవ రోజున మరణించెను. అందుచే ఈయన ఆ అరణ్యములో బ్రహ్మరాక్షసుడై అందరిని హింసించు చుండెను. హరిజనగాయకుడు అతని చేతిలో చిక్కెను.

భగవంతుని, గానము జేసి వచ్చిన పిమ్మట తనను ఆహారముగ గొనుమని హరిజనగాయికుడు బ్రహ్మరాక్షసిని బ్రతిమాలెను. ఎన్నియో ప్రమాణములను జేసెను. మొదట బ్రహ్మరాక్షసు డిందుల కంగీకరించలేదు. చివరకు హరిజన గాయకుడు తాను తిరిగి దానిలో వాసుదేవుని విడిచి అన్యదేవతారాధన చేయునట్టి పాపమును, శ్రీమన్నారాయణుని దేవతాంతరములతో సమముగ తలచుటచే తటస్థించునట్టి పాపమును పొందగలనని ప్రమాణము జేసిన పిమ్మట, ఈ ప్రమాణమును విశ్వసించి బ్రహ్మరాక్షసుడు ఈ హరిజనగాయకుడు విడిచెను. ఈ హరిజనగాయకుడు తిరుక్కురుం

గుడి పెరుమాళ్ల సన్నిధికి వెళ్లి తెల్లవారు వరకు పెరుమాళ్లను గానము జేసి, వెంటనే తిరిగి బ్రహ్మరాక్షసుని వద్దకు వచ్చెను త్రోవలో పెరుమాళ్లే తన మారువేషముతో వచ్చి సత్యవ్రతమును, దృఢ సంకల్పమును, దేహవిరాగమును, త్యాగశీలతను, ధైర్యసాహసములను, భక్తి శ్రద్ధలను పరీక్షించిరి. ఈయన తన దృఢసంకల్పము నుండి రవ్వంతయైనను చలించలేదు. చివరికి పెరుమాళ్లు ఆశీర్వదించి పంపిరి.

తిరిగి వచ్చిన హరిజనగాయకుని జూచి బ్రహ్మరాక్షసుడు ఆశ్చర్యచకితుడై ఈతని సత్యవ్రతమునకు, భగవద్భక్తికి లొంగిపోయి, ఇతని చంపలేదు సరిగదా ఇతనికి భృత్యుడై, ఇతనిని శరణజొచ్చి, భగవద్గానమునచే లభించిన పుణ్య విశేషముచే తననీ బ్రహ్మరాక్షసత్వము నుండి విముక్తిని చేయ అత్యంతము ప్రార్థించెను. కరుణార్ద్ర హృదయుడు, దయామయుడు భగవదనన్యభక్తుడు నగు హరిజనగాయకుడు చిట్టచివరకు అందుల కంగీకరించి తానా రాత్రి పాడిన కైశికరాగ ప్రీతుడైన భగవత్కటాక్షముద్వారా బ్రహ్మరాక్షసుని విముక్తిని గావించెను. పిమ్మట తాను కూడ గాన మాహాత్మ్యమున భగవత్సాయుజ్యమును పొందెను.

ఈ కథను కైశిక గాన మహాత్మ్యమును శ్రీవరాహస్వామి భూపిరాట్టికి వామన పురాణముద్వారా ఉపదేశించిరి.

ఈ సంస్కృత శ్లోకములకు ద్రావిడమున భట్టరువారు చక్కని వ్యాఖ్యానమును సాయించిరి. ఆంధ్రులు కార్తీక శుక్ల ద్వాదశి దివస ఉషఃకాలమున ఈ ఉత్సవము చేయునప్పుడు ఉపయుక్తముగ యుండుటకై శ్రీ భట్టరువారి వ్యాఖ్యను మాతృకగ తీసుకొని ఆంధ్రమున అనువాద వ్యాఖ్య వ్రాయ బడినది. సగసత హృదయులగు భాగవతోత్తములు దోషముల మన్నింతురు గాక.

## —: ఉత్సవ ప్రకారము :—

ఈ ఉత్సవము శ్రీరంగమునందు ప్రారంభమైనందున అచ్చటి ఉత్సవవిధానమున్ను; ఈ ఉత్సవమునకు తిరుక్కురుంగుడి ప్రధానస్థలముగాన అచ్చటి ఉత్సవవిధానమున్ను సంగ్రహముగా వ్రాయబడుచున్నది.

## —: శ్రీరంగ ఉత్సవ విధానము :—

కార్తీక శుక్ల దశమి దివసమున సాయంకాలమున అంకురార్పణము, ఏకాదశి నాటి ఉదయముననే మామూలు ప్రకారము ప్రథమారాధనము పొంగలి నివేదన, పెరుమాళ్లకు చందన మంటపములో తిరుమంజనము, తళిగ నివేదనము, తీర్థప్రసాద వినియోగములు, అయిన పిమ్మట పెరుమాళ్లు లోపలికి వేంచేయుదురు. రాత్రి నివేదన కావలసిన 'శెలశంబా', 'అరవణ' ప్రసాదములు సాయంకాలమే నివేదించబడి బీగముద్రలు వేయబడును. తిరిగి రాత్రి 10 గంటలకు తలుపు తీయబడి పెరుమాళ్లు పగల్ పత్తు మంటపమునకు వేంచేయుదురు. పెరుమాళ్లు నాడు ఒక యింద్రనీల పతకమును. శిరస్సుపై కుళ్లాయియు, పట్టువుప్పలూ మాత్రము ధరింతురు. వారు మంటపములో వేంచేసిన వెంటనే తెర వేయబడును, శ్రీపాదాంగులు పచ్చవటముల యొక్క (వివిధ రంగులు గల పట్టు ఉత్తరీయముల యొక) పెట్టెను తెత్తురు. తెర తీయపడిన వెంటనే పచ్చవటముల సమర్పణ ప్రారంభమగును పట్టవటములు మొత్తము 360 సమర్పింపబడును. ఒక్కొక్క పచ్చవటము సమర్పించిన వెంటనే వెండిగిన్నెతో పచ్చకర్పూర తాంబూలము, పిమ్మట వెండి పళ్లెరముతో కర్పూర హారతి చొప్పున సమర్పించబడును.

పచ్చవటముల సమర్పణ ప్రారంభములోనే అరయర్లను పిలిపించెదరు, వారికి సేవ, తీర్థము, చందనము, పరివట్టము, మాల. శ్రీశఠకోపాది మర్యాదలు జరిగిన పిమ్మట వారు గోష్ఠి మధ్యమున పెరుమాళ్లకు ఎదురుగ నిలబడి తిరుమంగైయాళ్వార్లు సాయించి పెరియతిరుమొళిలో 7 పత్తు 2 తిరుమొళిలోని "అన్నంపులియున" పాశురము పెరియవాచ్చాం పిళ్లైగారి వ్యాఖ్యానమును అభినయముతోను, ఆ తిరుమొళిలోని మిగత 9 పాశురములను మూల మాత్రముగను విన్నవింతురు. ఈ విన్నపము మధ్యలో అయిదు పర్యాయములు పెరుమాళ్లు ఆరగించిన పచ్చకర్పూర తాంబూలములు అరయర్లు పెరుమాళ్ల వద్దకు వచ్చి పుచ్చుకొనుచుందురు.

పిమ్మట తెర వేయబడి పచ్చవటముల సమర్పణము తాత్కాలికముగ ఆపబడి వెండి కంచు పళ్లెరములలో వడపప్పు తేబడి ఆరగింపు చేయబడును.

తిరిగి తెరతీయబడును. వెంటనే అరయర్లు నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళిలో సాయించిన 2 పత్తు 2 తిరువాయ్‌మొళిలోని "ఎంగనేయో" అని పాశురమును, నంబిళ్లగారి ఈడు వ్యాఖ్యానముతో । అరయర్లు అభినయముతో సేవింతురు. తరువాత ఆ తిరువాయ్‌మొళిలోని 10 పాశురములను మూల మాత్రముగను విన్నవింతురు. పిమ్మట వ్యాఖ్యా

తిరునామములు, మంగళములు అరయర్లు విన్నవింతురు. పెరుమాళ్లు అరగించిన కలము క్షీరాన్నము పడపప్పు అరిసెలు ఈయబడును.

ఈ లోపుగ శ్రీభట్టరువారు మర్యాదలన్నింటితోను కోవెలకు వేంచేసి సేవించబడుదురు. అరయర్లకు వినియోగానంతరమైన వెంటనే స్థానికులు భట్టరు వారికి అనుజ్ఞ ప్రాప్తమును చెప్పుదురు. భట్టరువారు వేంచేసి స్థానికులు చేతికి కైశిక మహాత్మ్య శ్రీకోశ మివ్వగా వారు దానిని పెరుమాళ్ల పాదములవద్ద యుంచుదురు. భట్టరు వారికి తీర్థము, చందనము, పరివట్టము, మాల శ్రీశఠగోపాది మర్యాదలు జరిగిన వెనుక వారు కైశిక మహాత్మ్య శ్రీకోశమును తీసుకొని గోష్ఠి మధ్యలోనికి వెళ్ళి పెరుమాళ్ళకు ఎదురుగ నిలబడి "శ్రీకైశికదయాపాత్రం" ప్రారంభించి అవతారికతో కూడ కైశిక మహాత్మ్యమును వ్యాఖ్యానముతో విన్నవింతురు, ఈ మధ్యలో పెరుమాళ్లు అరగించిన పచ్చకర్పూర తాంబూలములను పరిపర్యాయములు భట్టరు వారు పెరుమాళ్ళ వద్దకు వెళ్లి పుచ్చుకొను చుందురు.

ఈ మహాత్మ్య విన్నపము పూర్తియైన పిమ్మట పెరుమాళ్ళు ఆరగించిన వెండి క్షీరాన్నము పడపప్పు భట్టరు వారికి సమర్పించబడును.

భట్టరు వారు మేళవాయిద్యములతో వారి తిరుమాళిగకు వేంచేయుదురు. పెరుమాళ్ళకు వేదవిన్నపము, పుష్పాంజలి, ఘంటాదీపదర్శనము, అలంకారము అరగింపు తీర్థప్రసాద వినియోగము అయి ఏకాంతములో వేంచేయుదురు, అప్పటికి అరుణోదయమగును.

అప్పుడు అచ్చటికి తిరిగి భట్టరు వారు నిలయంగి, కుళ్లాయి, పరివట్టము ధరించుకొని వేంచేయుదురు. పెరుమాళ్ళతో కూడ వారు లోపలికి వేంచేయుదురు. అరయర్లు గానము చేయుచుందురు, చాత్తాద శ్రీవైష్ణవులు పుష్పములను, పచ్చ కర్పూర పొడిని కలిపి జల్లు చుందురు, మెట్లవద్ద కుంభహారతి సమర్పించబడును.

నేటికి భట్టరువారు పరమపదమునకు వేంచేసిన రోజుగాన ఆ అనుకార ఉత్సవము బ్రహ్మరథోత్సవము పేరుతో జరుగు చున్నది.

పెరుమాళ్లు ఆజ్ఞయివ్వగా పెరుమాళ్ళతో పాటు భట్టరువారు లోపలికి వేంచేయగా సన్నిధి తలుపులు మూయ బడును. పెరుమాళ్ళ భట్టరు వారికి తాము ధరించిన మాలను అనుగ్రహింతురు భట్టరువారు పెరుమాళ్ళ ఆజ్ఞగొని యివతలకు వేంచేయుదురు. పెరుమాళ్లు మూల స్థానమునకు వేంచేయగా హారతి అయి బయట ద్వారపాలకుల వద్ద నున్న భట్టరు వారికి శ్రీశఠారి సాయించబడును. వీరు ప్రదక్షిణముగ బయటకు వచ్చుచు సేన మొదలియార్ల సన్నిధిలో మర్యాదను స్వీకరించి వాకిలివద్ద యున్న కేడయములో వేంచేయగా శ్రీపాదతాంగులు దానిని వహించి మధ్యలో గరుడాళ్వార్ల సన్నిధిలో, నమ్మాళ్వార్ల సన్నిధిలో, కూరత్తాళ్వార్ల సన్నిధిలో, పెరియపిరాట్టి సన్నిధిలో, మెట్టు అళగియరు సన్నిధిలోను మాల్యాది మర్యాదల జరుగగా భట్టరు వారిని వారి తిరుమాళిగ వద్దకు తీసుకొని వచ్చి దింపుదురు. భట్టరు అందరికిన్ని చందన తాంబూలాది మర్యాదల జరుపుదురు.

పిమ్మట పెరుమాళ్ళకు మామూలు ప్రకారము తిరుమంజన తీర్థాదులు తేబడి తిరువారాధనాదికములు జరుగును.

## —: తిరుక్కురుంగుడిలోని ఉత్సవ విధానము :—

ఈ దివ్యస్థలమున ఈ కైశిక వృత్తాంతమును గాయకహరిజనుడు, బ్రహ్మరక్షస్సు, నంబివృద్ధుడు, అనుమాక పాత్రములతో దేవదాసీలు యిద్దరు (గాయకహరిజనుని నంబివృద్ధుని పాత్రలు) పెరుమాళ్ళ తిరుమేని కావలివాడు (బ్రహ్మరాక్షసుని పాత్ర ధరించి) నాటకరూపమున ప్రదర్శింతురు. వీరు ఈ ఏకాదశికి 10 రోజులు ముందుగనే పెరుమాళ్ళవద్ద అనుజ్ఞతీసుకొని ఆ పది రోజులు ఏకభుక్తముతో నాటకమును అభ్యసించుచు, ఏకాదశినాడు ఉపవాస ముండి ఆ రాత్రి పెరుమాళ్ళ ఎదుట నాటక ప్రదర్శనము చేతురు.

ఏకాదశినాడు విశ్వరూపానంతరము కాంచిపూర్ణతో పెరుమాళ్ళకు కులశేఖర మంటపమున తిరుమంజనానంతరము, శుక్రవార కొరటులో వేంచేయగా అరగింపులు, తీర్థప్రసాద వినియోగములు జరుగును. రాత్రి ఆళ్వారాదులతో సహా పెరుమాళ్ళు కైశిక మండపములో వేంచేయగా అరగింపులు చాత్తు తీర్థప్రసాద గోష్ఠి, జియ్యంగారికి మర్యాదలు జరుగును. పిమ్మట అచ్చటనే ప్రత్యేకముగ వ్రాయబడిన కైశిక నాటకము ప్రదర్శించబడును బ్రహ్మరాక్షసుని వలె కొయ్యతో ఒక శిరస్సు తయారు చేయబడి ఒక గదిలో పూజించబడుచు యున్నది. దానిని ధరించి బ్రహ్మరాక్షస పాత్రధారి యభినయించును, నాటకానంతరము పాత్రధారులకు మర్యాదయై యింటికి వెళ్ళుదురు. తరువాత పెరుమాళ్ళకు తిరువారాధనము, కర్పూర సేవ, పిమ్మట శ్రీ శైలేశతనియలతో పెరియతిరుమొళ్రి తొళ్ళక్కించబడి పెరియతిరుమొళ్రి తొమ్మిదవ పత్తు అయిదవ తిరుమొళ్రియగు "తళవిళంబిరై" పది పాశురములు సేవించబడును.

పిమ్మట శ్రీవిల్లిపుత్తూరి అరయరుచే "అక్కుంబుతియన్" పాశురమునకు అభినయముతో వ్యాఖ్యానముతో సేవించబడగా, పిమ్మట అధ్యాపకులు ఆ తిరుమొళ్రిలోని తొమ్మిది పాశురముల మూలమును సేవింతురు. పిమ్మట అరయరు తిరువాయిమొళ్రిలోని "ఎంగనేయో" పాశురమునకు అభినయముతో వ్యాఖ్యానము సేవించగా అధ్యాపకులు మిగిత పది పాశురముల మూలమును సేవింతురు.

పిమ్మట తీర్థప్రసాద గోష్ఠి వినియోగము జరుగును అటు తరువాత స్థానికులు కైశిక మహాత్మ్యమును శ్రీ భట్టరు వారి అరవ వ్యాఖ్యానముతో సేవింతురు. ఇప్పటికి సూర్యోదయమగుచుండును. ఆ నాడంతయు పెరుమాళ్ళు కైశిక మంటపములో ఉందురు.

రాత్రి గరుడసేవతో పెరుమాళ్ళు లోపలికి వేంచేయుగా తిరువారాధనము జరుగును.

## —: ఇతర దివ్యస్థలములందు జరుగు విధానము :—

దశమినాడు సాయంకాలమున అంకురార్పణము, ఏకాదశినాడు పెరుమాళ్ళకు స్నపనము అర్చనలు వగైరా లందురు. ఆ నాడు ఉపవాసముండి వివిధరీతుల భగవద్గుణానుభవము చేయుదురు, రాత్రి అంతయు జాగరణము, రాత్రి 10 గంటలు దాటిన పిమ్మట భగవద్ధ్యానము తెల్లవారు ఝామున "కైశిక మహాత్మ్య పఠనము" భగవత్తిరువారాధన పిమ్మట తదీయారాధన జరిపెదరు.





హరిః ఓం

# కైశికమహాత్మ్య - ఉత్సవ ప్రారంభమున అనుసంధించునది·

శ్రీమతే రామానుజాయ నమః

తిరుమంగైయాழ்వార్ అరుళిచ్చెయ్ద

## పెరియ తిరుమొழி

తనియన్గళ్.

(తిరుక్కోట్టియూర్ నంబి అరుళిచ్చెయ్యదు)

కలయామి కలిధ్వంసం కవిం లోకదివాకరం।
యస్య గోభిః ప్రకాశాభిః అవిద్యం నిహతం తమః॥

(ఎంబెరుమానార్ అరుళిచ్చెయ్దదు) నేరిశైవెణ్బా

వాழி పరకాలన్ వాழி కలికన్ఱి,
వాழி కుఱైయలూర్ వాழி వేందన్, - వాழியరో
మాయోనై వాళ్ వలియాల్ మందంగాళ్ మంగైయర్కోన్,
తూయోన్ శుడర్మానవేల్॥

(ఆழி వానరుళిచ్చెయ్యదదు.) తలిత్తుఱై.

నెంజుక్కిరుళ్ కడిదీప మడంగా నెడుంపిఱవి,
నంజుక్కు నల్లవముదం, తమిழ் నన్నూల్ తుఱైగళ్,
అంజుక్కిలక్కియ మారణశారం, పరశమయ
పంజుక్కనలిన్ ప్పొఱి, పరకాలన్ పనువల్గళే॥

(ఎంబార్ అరుళిచ్చెయ్దదు.) నేరిశైవెణ్బా.

ఎంగళ్ గదియే యిరామానుశమునియే,
శంగై కెడుత్తాండవరాశా, పొంగుపుగழ்
మంగైయర్ కోనీంద మఱై యాయిర మనైత్తుం,
తంగుమనం నీ యెనక్కుత్తా.

# 9 పత్తు 6 తిరుమొఴి

అక్కుం పులియిన్
అదళముడైయార్, అవరొరువర్
పక్కం నిఱ్కనిన్ఱ
పణ్బరూర్ పోలుం,
తక్కమరత్తిన్ తాఴ్ శిన్నై
యేరి, తాయ్ వాయిల్
కొక్కిన్ పిళ్ళై వెళ్ళిఱా
వుణ్ణుం కుఱుంగుడియే॥

హస్తమున కపాలమును, శరీరముపై పులితోలును ధరించిన శూలాకరు, ప్రక్కగ నిలచియుండగ తాను నిలబడియున్న సుశీలుడు వేంచేసియున్న ఊరు కదా తాటి చెట్టుయొక్క పైగ గూటిలోయుండి, తల్లినోటియందలి మత్స్యంవిశేషమును కొంగ పిల్లలందుకొని తినుచు డునట్టి యనుదివ్యదేశము తిరుక్కురుంగుడి యను క్షేత్రముగదా.

## అక్కుంపులియిన్ ప్రవేశం

కాల్నడై తారాదే యిరుక్కిఱవనై కాల్నడై తన్దవార్,
అవనిరుంద దేశత్తిలే కొడుపోయ్ పొగడుంగోళ్ ఎన్గిఱార్।
"తిరుమామగళై పెత్తుం ఎన్నెంజగంకోయిల్ కొండ పేరరుళాన్॥
ఎన్ఱు పిరాట్టి సన్నిధి యుండాగవుం అనుసంధిక్కిఱార్। తమక్కు
పురుషకారమానవార్ అంగే యుండెన్ఱు అనుసంధిత్తవాఱే,
తమక్కే వాళ్నడై తరుమళవాయ్ వందు విఴుందదగు.
అత్తాలే అంగునిఱ్కిఱవన్ శాలశీలవానాయ్, నాందాన్ వరు
వదెప్పోదో ఎన్ఱు తాం ముర్పాడనాయ్, నమ్మవసరం పార్త్తు
నిఱ్ప్పానొరువన్, అనుకూలరాయ్ యిరుక్కుం శ్రీవైష్ణవర్గళైయుం,
పోరుంగోళ్ ఎన్ఱు కూట్టిక్కొండు తామే పోగపార్కిఱార్ :-

## ముదల్ పాట్టు - అక్కుంపులియిన్

వ్యాఖ్యానం : (అక్కుమిత్యాది) అవనుక్కాకాదారిల్లై యెన్గిఱాళ్.
ఈశ్వరాభిమానిగళాయ్ యిరుప్పార్కు ముగంకొడుత్తుక్కొండు
యిరుక్కిఱవన్. అనుకూలరాయ్ శెన్ఱు కిట్టుగిఱ నమక్కు
ముకందర చొల్లవేణుమో. "తోడైయొత్త తుళబముం
కూడైయుం పొలిందు" ఎన్గిరపడియే, అనుకూలచిహ్నత్తోడే

(అవరొరువర్ అత్తికారొకరు) ఆయన తప్పనిసరిగా దర్శనమిచ్చినను, తమకు యిందులో ఎట్టి ఆదరణయు లేకపోవుటచే ముఖమును చాటుపరచుకొని జెప్పుచున్నారు.

(పక్కంనిఱ్కి-నిన్ఱ - ప్రక్కగనిలచియుండగ నిలబడి వేంచేసియున్న ఆయన ఒకవైపున నిలచి యుండగ । అంతమాత్రమే కాదు, ఇంకను అల్పులనైనను రండి యనునట్టి సౌశీల్యమును గలవాడు వేంచేశియున్నట్టి ఊరువంటిది.

(తక్క-విత్యాది - తాటిచెట్టు) అచ్చట నిలచియున్న ఈ సర్వేశ్వరుని స్వభావమును అచ్చటనున్న స్థావరములకు కూడ ఉన్నదికాబోలు,

(తక్క-మరత్తిఱ్ - తాటిచెట్టుయొక్క) ఒక్క-ముల్లునైనను లేకుండగ బాలురకుగూడ ఇరుక్కం అంగుత్తైవృక్షంగళిఱ్బడి ఎన్ఱు భట్టర్ అరుళిచ్చెయ్‌దారాగ ప్రసిద్ధమితే, అన్ఱిక్కే మేలే. కొక్కినిప్పిళ్ళై, యెన్ఱె యాలేతన్నోడు నామ సామ్యత్తై యుడైత్తాన మరత్తిలే యెన్ఱ్వాసం ఉండు కొక్కు ఎన్ఱు మావుక్కుంపేర్. "కొక్కిన్పళంవీళు కూడలూరే" ఎన్ఱుండాగైయాలే.

(తాయ్‌వాయిత్యాది) కొక్కినిప్పిళ్ళై - తాయ్‌వాయిల్ వెళ్ళిఱావై యుణ్ణానిఱ్కు మాయిఱ్ఱు. వెళ్ళిఱామెన్ఱు ఒరుమత్స్య విశేషం। అదిఱ్వాయ్ క్కడంగుమను. తేడిక్కొణ్డువందు కొడుక్కుమాయ్‌త్తు ముత్తై కెడామల్ భజిత్తు ప్పోరుమాయ్‌త్తు. తాయ్ కొడువందు కొడుక్క అదు జీవిత్తు ప్పోరుమాయ్‌త్తు. ఆగ రక్ష్యరక్షకభావం మాఱాదే పోరుం దేశమాయ్‌త్తు శీలవానాయ్ యిరుక్కిఱవఱ్ వర్తిక్కిఱదేశం అవ్వానారిల్ మరంగళుక్కుం అవఱ్బడి యుండు ఎన్గిరార్॥ ౧.॥

1

అక్కం పులియఱ్ అడళయుడైయార్ అవరొరువర్।
పక్కం నిఱ్క నిన్ఱ పణ్బరూర్ పోలుం।
తక్కమరత్తిన్ తాళ్శినై యెటి తాయేవాయిల్।
కొక్కిఱ్పిళ్ళై వెళ్ళిఱవుణ్ణుం కుఱుంగుడియే॥

సులభముగ ఎక్కుటకు వీలుగలవై యున్నవి అచ్చటి వృక్షములయొక్క స్వభావము అని భట్టరువారు సాయించినటుల లోకప్రసిద్ధమైయున్నది కదా. యరియు ముందు "కొంగపిల్ల" అనుటచే తనతో నామసామ్యమునుగల చెట్టునందు, అనిచెప్పువారున్ను గలరు. కొక్కు అని చెట్టునకుకూడ పేరు. "కొక్కుచెట్టు పండ్లుపడునట్టి తిరుక్కడలూరు" అని యున్నదికదా.

(తాయ్‌వాయ్ ఇత్యాది - తల్లినోరు ఇత్యాది) కొంగపిల్ల తల్లినోటియందలి మత్స్యమును తీసుకొని తినుచున్నది కాబోలు వెళ్ళిఱా అనగా మత్స్యవిశేషమనిపేరు. దానినోటికి సరిపోవుదానిని వెతికికొనివచ్చి యిచ్చునుకాబోలు. క్రమము తప్పకుండగ, భుజించకుండయుండి తల్లి యివ్వగా, అదితిని జీవించుచుండునుకాబోలు అనగా రక్ష్యరక్షకభావము మారిపోకుండగ

యుండు దేశము, సౌశీల్యవంతుడైన సర్వేశ్వరుడు వేంచేశియున్న దేశము. ఆ వూరిలో వృషభము లకుకూడ ఆయనయొక్క స్వభావమున్నది అని అనుచున్నారు.

2

తుంగార రపత్తిరై వందు లవ్వోదు కడలుళ్ ।
పొంగారరవిల్ తుయిలుం పునిదరూర్ పోలుం ।
శెంగాల అన్నం తిగళ్ తణ్ పణ్ణైయుల్ పెడైయోడుం ।
తొంగార్ కమలత్తలరిల్ శేక్కుం కుఱుంగుడియే॥

2, గొప్పదైన ధ్వనితో కూడుకున్న అలలుపచ్చు చిన్న అలలతో కొట్టుకొనుచున్న గంభీరమైన సముద్రమున। పూర్తిగ వ్యాపించియున్న ఆదిశేషునిపై యోగనిద్ర జేయుచున్న ఆశ్రితరక్షణపవిత్రతతో కూడుకున్న సర్వేశ్వరుడు వసించు క్షీరసముద్రమువంటిదే సుమా! ఎర్రని పాదములుగల హంస కాంతివంతమై చల్లని ఏరస్సులలో పరిమళయుక్తమైన తామరపుష్ప మధ్యమున తన ఆడహంసతో క్రీడించుచుండునట్టి తిరుక్కుఱుంగుడి అను దివ్యదేశము.

3

వాఴైక్కండ్రోం వందుకాణ్మిన్ తొండీర్ కాళ్ ।
కేఴల్ శెంగణ్ మాముగిల్ వణ్ణన్ మరువుమూర్ ।
ఏఴ చ్చెంగాల్ ఇన్ తుణై నారైక్కిరై తేడి ।
కూఴ ప్పాడ్చ్చె కార్వయల్ మేయుం కుఱుంగుడియే ॥

3 ఓ భక్తులారా! ఆనందించతగిన స్థానమును కనిపెట్టితిమి వచ్చి సేవించండి। భక్తాభిమానుకూలమైన శరీరసౌందర్యమును, ఎర్రని నేత్రములును, గొప్ప చల్లని మేఘమువంటి వర్ణమును కలిగియున్న సర్వేశ్వరుడు నిత్యనివాసము జేయు ఊరు। మృధువైన ఎర్రనైన కాళ్ళుగల, భోగ్యమైన, సహకారియైన మొగకొంగకు ఆహారమును వెతకుటకై కృత్రిమైన దృష్టిగల ఆడకొంగ నల్లనై ఫలించియున్న పొలములలోనికి పోయి మేయుచుండు తిరుక్కుఱుంగుడి యను దివ్యదేశమే ”

4

శిరమున్నైందు మైందుం శిందచ్చెన్ఱు, అరక్కన్ ।
ఉరముం కరముం తుణి - త్త వురవో నూర్ పోలుం ।
ఇరవుం పగలుం ఈన్ఱ తేన్ మురల మన్ఱెల్లాం ।
కురవిన్ పూవే తాన్ మణనాఱుం కుఱుంగుడియే॥

4 పది తలలను నరకి రావణాసురునియొక్క। హృదయబలమును బాహుబలమును నశింపజేసిన వీరశిఖామణి యగు సర్వేశ్వరుడు (శ్రీరాముడు) నివసించు ఊరువంటిది సుమా। రాత్రింబగళ్ళు తుమ్మెదలు తేనెను త్రాగి ధ్వనించుచు లోకమంతటను। కురవి పుష్పములయొక్క అత్యధిక పరిమళమును వెదజల్లుచుండెడి తిరుక్కుఱుంగుడి యను దివ్యదేశము.

౫

కవ్వై క్కళిత్తు మన్నర్ మాళ క్కడిమాన్దేర్ |
ఐవర్క్కాయ్ అమరి లుయ్త్తా నూర్పోలుం |
మైవైత్తిలంగు కణ్ణార్ తంగళ్ మొఴియొప్పాన్ |
కొవ్వై క్కనివాయ్ క్కిళ్ళై పేసుం కుఱుంగుడియే ||

5. పెద్దగ ఘీంకారించుచు గుంపులు గుంపులుగ యున్న యేనుగుల సేనను కలిగియున్న రాజులు నశించునటుల గొప్పబలముగల పెద్దరథమును పంచపాండవుల తరపున భారతయుద్ధమున నడిపించిన శ్రీకృష్ణపరమాత్మ వేంచేసియుండు ఊరువంటిది సుమా! కాటుకచే అలంకృతమై మిక్కిలి ప్రకాశించుచున్న నేత్రములు గల స్త్రీలయొక్క పలుకులనువిని తాముకూడ అటులనే పలుకవలెనని దొండపండువంటి ముక్కులుగల చిలుకలు మాటలను అభ్యసించుచుండునట్టి తిరుక్కుఱుంగుడి యను దివ్యదేశము.

౬

తీనీర్ వణ్ణ మామలర్ కొండు విరై యేంది |
తూనీర్ పరవి త్తొఴుమిన్ ఎఴుమిన్ తొండీర్కాళ్ |
మానీర్ వణ్ణర్ మరువి యుఱైయు మిడం వానిల్ |
కూనీర్ మదియై మాడం తీండుం కుఱుంగుడియే ||.

6. దూపదీపములకు అగ్నియు, అర్ఘ్య - పాద్య - ఆచమన స్నానాదులకు జలము, అర్చనకు పరిశుద్ధమైన పుష్పములను వీనితో చందనము మొదలైనవాటిని తీసుకొని, పరిశుద్ధమైన నీటితో ఉపచారముల సమర్పించి పెరుమాళ్ళను సేవించండి. తద్వారా ఓ భక్తులారా ఉజ్జీవించండి. గొప్ప నీటిమయమైన సముద్రమువంటి వర్ణముగల సర్వేశ్వరుడు.

7

వల్లి చ్చిఱు నుణ్ణిడై యారిడై నీర్ వైక్కిన్ఱ |
అల్లల్ శిన్దై తవిర అడైమిన్ అడియీర్కాళ్ |
శొల్లిల్ తిరువే యనైయార్ కనివాయ్ ఎయిఱొప్పాన్ |
కొల్లై ముల్లై మెల్లరుంబీనుం కుఱుంగుడియే ||.

౮

నారారిండై నాణ్మలర్ కొండు నందమర్కాళ్ |
ఆరా వన్బొడు ఎంబెరుమానూ రడైమిన్గళ్ |
తారావారుం వార్ పునల్ మేయ్ందు వయల్ వాఴుం |
కూర్వాయ్ నారై ప్పేడైయొ డాడుం కుఱుంగుడియే ||

9

విస్త పిన్నైయుం తుయుం కేడ మానులకెంది ।
శెన్ఱు పణిమిన్ ఎఴుమిన్ తొఴుమిన్ తొండర్ కాళ్ ।
ఎన్ఱుం ఇరవుం పగలుం వరివండు ఇన్నైపాడ ।
కున్ఱిన్ ముల్లై మన్ఱిడై నాఱుం కణ్ణంగుడియే॥.

10

శిలైయాల్ యిలంగై శెత్తాన్ వత్తోర్ శినవేఴం ।
కొలైయార్ కొంబుకొండాన్ మేయ కణ్ణంగుడిమేల్ ।
కలైయార్ పనువల్ వల్లాన్ కలియన్ ఒలిమాలై ॥
నిలైయార్ పాడల్ పాడ పావం నిల్లావే॥.

తిరుమంగైయాళ్వార్ తిరువడిగళేశరణం

## తిరువాయ్మొఴి

తనియన్లు:- (1) భక్తామృతం విశ్వజనానుమోదనం । సర్వార్థదం శ్రీశఠకోపవాఙ్మయం ।
సహస్రశాఖోపనిషత్సమాగమం । నమామ్యహం ద్రావిడవేదసాగరం ॥
(2) తిరువఴుతి నాడెన్ఱుం తెన్ కురుకూరెన్ఱుం । మరువిని యవన్ పొరునలెన్ఱుం ॥
అరుమఱైకళందాది శెయ్ తా నడియిణైయే నొప్పొఴుతుం। శిందియాయ్
నెంజే తెళిందు ॥
(3) మనత్తాలుం వాయాలుం వణ్ కురుకూర్ పేణుం । ఇనత్తారై యల్లాతిఱైంజేన్ ।
తనత్తాలుం ఏతుం కుఱైవిలేనెందై శఠకోపన్ । పాతంగళ్ యాముడయపత్తు ॥
(4) ఏయ్ంద పెరుంకీర్త్తి యిరామానుజమునితన్ । వాయ్ంద మలర్ ప్పాతం
వణంగుకిన్నేన్ ॥
అయ్ంద పెరుం శీరార్ శఠకోపన్ శెందమిఴ్ వేతంతరిక్కుం పెరాదవుళ్ళం పెఱ ॥
(5) వాన్తిగఴుంశోలై మతిళరంగర్ వణ్ పుగఴ్ మేల్ । ఆన్తతమిఴ్ మఱైకళాయిరముం ।
ఈన్తముతల్ తాయ్ శఠకోపన్ మొయ్ంబాల్ వళర్త్త । ఇతత్తాయి రామానుశన్ ॥
(6) మిక్కవిఱైనిలైయుం మెయ్యాముయిర్ నిలైయుం । తక్కనెఱియుం తడైయాకి ।
తొక్కియలుం, ఊఴ్ వినైయుం వాఴ్వినయు మోతుం కురుకైయర్కోన్ ।
యాఴినిశై వేతత్తియల్ ॥

## ౫ పత్తులో ౫ తిరువాయ్ మొఴి

1. ఎంగనేయో వన్నైమీర్‌కాళ్ ఎన్నై మునివతు నీర్।
నంగళ్ కోల త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్।
శంగినోడుం నేమియోడుం తామరై క్కణ్‌గళోడుం।
శంగనివాయ్ ఒన్ఱినోడుం శెల్‌కిన్ఱతు ఎన్నెంజమే॥

### నంబిళ్ళై ఈడువ్యాఖ్యానం

**అవతారిక:-** తిరుక్కోయిల్ ఆళ్వార్‌కళోడే శేర్ంద నంబి తిరుముకత్తిల్ అఴకిలే।
ఎన్ అంతఃకరణం మికప్పం ప్రవణమాకా నిన్ఱతు ఎన్కిఱాళ్॥

(ఎంగనేయోవిత్యాది) హితం శొల్ల త్తొడంగినవాఱే తందామై మాఱుక్క మిత్తనైయో ఒన్ఱై పరిహరిక్క ప్పార్త్తాల్ అతినుడైయ నిదానం అఱిందు పరిహరిక్క వేండావో? ఎన్నుడైయ ప్రావణ్యత్తై పరిహరిక్క ప్పార్త్తాల్ ఎనక్కు ఇవ్వళవాన ప్రావణ్యత్తై విళైత్త నంబియుడైయ వఴకై యఱిందు అత్తై యన్ఱో పొడివతు.

ఎన్నుడైయ నిలైక్కుం, ఉంగళుడైయ యహితవచనత్తుక్కుం, ఎన్న శేర్త్తియుండు, నంబియుడైయ వఴకై యఱిందు అనుభవిత్తిరుక్కిఱ నీంగళ్, అతిలే తువక్కుండు ఇరుక్కిఱ వెన్నై మీట్క పార్క్కిఱపడి యెంగనేయో।

(అన్నైమీర్‌కాళ్) ఇక్కులధర్మత్తుక్కు నాన్ ఏతేనుం తప్పనిన్ఱతుండో? "పేరాళన్ పేరోతుం పెరియోరై" (తి. మొ. ౬౪ ౪) "యనకేటుమవర్" (తిరువా. ౨౭. ౧) ఎన్ఱుం నీంగళ్ శొల్లుం వార్తై కేట్టు వళర్ందవళ్ అన్ఱో నాన్, తందాం శెయ్యుమత్తై వయిత్తిల్ పిఱందార్ శెయ్‌తవాఱే కుత్తమాం ఇత్తనైయో! పుత్రర్‌కళాకప్పమాం, శిష్యర్‌కళ్ ఆగప్పమాం, భగవద్విషయత్తిల్ ఓరడి వరనిన్ఱవర్‌కళ్ శ్లాఘనీయరాం ఇత్తనై యన్ఱో, కూరత్తాఴ్వార్ ఓరళవిలే నంగైయార్ తిరువడి శార్ందవాఱే "ఇన్నముం ఒరు వివాహాం పణ్ణువోమో" ఎన్ఱు విచారిత్తు.

**తాత్పర్యము:—** ఎందులకై ఓచెలులారా నన్ను కోపపడెదరు మీరు।
మన యొక్క సుందరాంగుడైన తిరుక్కురుంగుడి పెరుమాళ్ళను నేను జూచిన తరువాత।
ఆశంఖముతోను, చక్రముతోను, తామరపద్మమువంటి నేత్రములతోను।
ఎఱ్ఱని దొండపండువంటి అద్వితీయమైన అధరోష్ఠముతోను నా మనస్సు లగ్నమైపోవు చున్నది॥

### నంబిళ్ళగారి ఈడు వ్యాఖ్యానువాదము

ఆళ్వారు నాయకి కోపించు తన తల్లిగారితో "హస్తముల యందు శంఖుచక్రముల ధరించి యున్న పరిపూర్ణ సుందరవిగ్రహుడగు తిరుక్కురుంగుడి పెరుమాళ్ల తిరుముఖమండల సౌందర్యమున, నా మనస్సు మిక్కిలి మగ్నమై యున్నది" అని అనుచున్నారు.

(ఎంగనేయో విత్యాది) హితమును జెప్ప ప్రారంభమైన వెంటనే తమను తామే మఱచి పోవుటయేనా ! ఒకదానిని పరిహరింప జూచినపుడు దానియొక్క మూలకారణమును తెలుసుకొని పరిహరించవలదా ! నా యొక్క ప్రావణ్యము పరిహరింప జూచినచో నాకు యిటువంటి ప్రావణ్యమును పెంచిన సుందరపరిపూర్ణుని సౌందర్యమును తెలుసుకొని దానినేకదా కోపించవలసినది నా యనుభవమునకున్ను, మీ యొక్క అహిత వాక్యములకున్ను ఏమి సంబంధమున్నది. సుందర పరిపూర్ణుని యొక్క సౌందర్యమును తెలుసుకొని అనుభవించియున్న మీరు, ఆ సౌందర్యమున మగ్నమైయున్న నన్ను మరలించ జూచుట ఏమి బాగున్నది ?

(అన్నైమీర్ కాళ్) భగవదాదాస్యకులమైన ఈ కులధర్మమునకు నేనేమైన తప్పుజేసితినా ? "పేరాళన్ పేరోతుం పెరియోరై" (సర్వేశ్వరుని తిరునామముల ననుసంధించు మహాత్ములను) "యవగేలుం అవర్" (భక్తిగలవారు ఏ హీనకులమువారైనను పెద్దలే) అని మీరు చెప్పినట్టి మాటలను విని పెరిగినదానినే కదా నేను. ఈ కులము చేయుపనిని తిరుగర్భజలు చేసినచో దోషమగుటయేనా ! పుత్రులే యగుగాక, శిష్యులే యగుగాక, భగవద్విషయములో ఒక యడుగు ముందు వేసినవారు శ్లాఘనీయులే యగుదురు కదా. కూరత్తాళ్వార్లు ఒకప్పుడు దేవిమార్లు పరమపదించినపుడు "ఇంకను ఒక వివాహము చేయుదుమా" అని ఆలోచించి ఇతుతాన్; క్రమత్తాలే వందు అనుష్ఠానుక్కు విరోధమాయ్ త్తలైకట్టుం, ఇనిత్తాన్ "అనాశ్రమీ న తిష్ఠేత్" ఎన్ఱు శాస్త్రం శొల్లా నిఱ్కు ఇశ్శాస్త్రార్థత్తై యనుష్ఠిప్పోమో; భాగవత పరిచర్యైయై పణ్ణువోమో; ఎన్ఱు విమర్శించ, "అసామాన్య ధర్మత్తిత్తాట్టిల్ ఇవ్విశేషధర్మమే ప్రబలం" ఎన్ఱు తలైరందార్.

(ఎన్నై మునివతు నీర్) ఎన్నై యుంగళ్ శొల్ కేళాతపడి పణ్ణిన నంబి యాళ్నై మున్నో మునివతు (ఎన్నై) నంబియుడైయ వళ్ళిలే తువక్కుండు యిరుక్కిఱ ఎన్నై, ఇతువే యాత్తైయాయ్ యిరుక్కిఱ నీంగళ్ విలక్కిక్కపడి యొంగనేయో ?

(నంగళిత్యాది) ఉంగళై యఱియాపిట్టాల్ అవ్విషయత్తైయుం అఱియా తొఴియవేణుమో నంగిరాళ్ !

(నంగళ్) ఇస్కడిక్కాక ముత్తూట్టుప్పోలే కాణుం నంబియుడైయ వళ్ళివు సర్వేశ్వరనై నోక్క అనంతప్రతం నోత్తు పెత్తవర్కళై పోల్ అన్నిక్కే, నంబియై యాశ్రయిత్తాయిత్తు యివర్తై పెత్తదు. "ఉడైయనంగైయార్ నంబియై యాశ్రయిత్తు అవ్వారై త్తిరువయిఱు వాయ్ త్తార్" ఎన్ఱు ప్రసిద్ధమిఱే. "నెడుంకాలం కణ్ణనీళ్ మలర్ పాతం పరవియిఱే పెత్తదు కోలం ఎన్ఱిఱవితు - నగరత్తుక్కు వేషుం అలంకారంగళై యుడైత్తాయ్ ఇరుక్కుమెన్ఱు, తిరుక్కుఱుంగుడిక్కు విశేషణ మాతల్.

అన్నిక్కే, నంబి తన్నుడైయ సౌందర్యత్తై వాఙ్ఙుకల్,

(నంబియై) కల్యాణగుణగళాల్ పూర్ణమాన విషయత్తైయకప్పట్టు ఇరుక్కిఱ వెన్నై యొంగనే మీట్క ప్పార్క్కిఱపడి.

(నంబియైనాన్) అకప్పడుత్తుకై నున్న సౌందర్య లీలాదికళాల్ అకప్పడుత్తు నత్తిరుక్కణ్ణపురత్తే యాయిత్తు అకప్పడుత్తుకై నున్న చాపలత్తాల్ ఇకత్తిలుత్త వత్తిరుక్కు ఉనక్కే.

(కండపిన్) నీంగళుం యివ్విషయత్తై కండాన్నో హితం శొల్లక్కడవదు.

(కండపిన్) గతే జలే సేతుబంధమన్నో నీంగళ్ శెయ్యనిఱ్ఱదు. కాణ్బతఱ్కు మున్నే మీట్టు కొళ్ళల్లిరోళే; ఇని మీట్కప్పోమో ? మీట్కప్పోకామల్ ఇప్పోదు వంపిలు ఎన్నునన్న ? నైమమ్మే ఒరు ముకత్తాలే తానకప్పట్టపడియై చొల్లుకిఱాళ్.

(శంగిత్యాది) నీంగళ్ హితం శొల్లుపతు తాన్ నెంజుక్కై పూనక్కన్నో.

(శెంగినోడుం) "శెంగమల నాణ్మలర్ మేల్ తేనుకరుం అన్నం పోల్" ఎన్నైజకడిగా, శ్యామమాన తిరుమేనిక్కు పరభాగమాన వెళ్ళత్తనిజత్తయుడైత్తాయ్ శ్రీపాంచజన్యత్తోడు, ఇక్కైక్కు ఆభరణమానాల్, వేఱొన్ఱు వేండాతే తానే ఆభరణమాక ప్పోరుంపడి యిరుక్కిఱనోడు సెంగిడం,

ఈ పని క్రమముగా వచ్చి ఆశ్రమమునకు విరోధకరమై పర్యవసించును, ఇక "అనాశ్రమీన తిష్ఠేత్" (ఏ ఆశ్రమము లేకుండగ నుండరాదు) అని శాస్త్రము చెప్పుచున్నది. ఈ శాస్త్రము ననుసరించుమా లేక భాగవతపరిచర్య నాచరింపుమా; అని విమర్శించి "అ నామాన్యధర్మము కంటెను ఈ విశేషధర్మమే ప్రబలమైనది" అని మానివేసిరి.

(ఎన్నై మునివతు నీర్ నన్ను కోపబడిపరే మీరు) నన్ను మీమాటలను వినకుండునటుల చేసిన సుందరపరిపూర్ణస్వామిని గదా కోపబడవలయును. (ఎన్నై నన్ను) సుందరపరిపూర్ణస్వామి యొక్క సౌందర్యమున మగ్నమై యున్న నన్ను; యిట్టి స్థితినే జీవసూత్రగా కలిగియున్న మీరు అభ్యంతర పెట్టుట ఎంత వింతగ నున్నది !

(నంగళిత్యాది - మన ఇత్యాది) మిమ్ములను మీరు తెలుసుకొన జాలకపోయినను ఆస్వామినైనను తెలుసుకొన లేకుండగ పోవలెనా అనుచున్నది.

(నంగళ్ - మన యొక్క) ఈ వంశమునకే ప్రధానమైన భోగపదార్థము వంటిది గదా సుందరపరిపూర్ణుని సౌందర్యము. సర్వేశ్వరుని ఉద్దేశించి అనేకవ్రతములు నాచరించి కన్న దేవకీ దేవివంటి వారిగాక, సుందరపరిపూర్ణునే ఆశ్రయించియే కదా పేరిని కనినది. "ఉడైయనంగై యార్గళ్ సుందరపరిపూర్ణస్వామిని ఆశ్రయించు నమ్మాళ్వార్లను గర్భమున ధరించిరి" అని లోకప్రసిద్ధమే కదా. చాలకాలము శ్రీకృష్ణపరమాత్మయొక్క నిరతిశయభోగ్యమైన పాదపద్మముల నాశ్రయించియే కదా లభించుచున్నది॥ 'కోలం' అను శబ్దము, నగరమునకు ఉండవలసిన అలంకారములను కలిగి యున్నదై యున్నది అని తిరుక్కురుంగుడికి విశేషణముగనైనను చేయవచ్చును. లేక సుందరపరిపూర్ణుని సౌందర్యమును తెలుపుచున్నదనియైనను చెప్పవచ్చును.

(నంబియై - సుందరపరిపూర్ణుని) కల్యాణ గుణములచే పరిపూర్ణుడైన వాని విషయములో మగ్నమై యున్న నన్ను ఎటుల మరలించ జూచెదరు.

(నంబియైనాన్ - సుందరపరిపూర్ణుని నేను) లోబరచుకొనుటకు ఆ సర్వేశ్వరుడు ఏలోటు లేకుండగ పరిపూర్ణుడై యున్నటులనే కదా లోబడుటకు చాపల్యముచే ఈ నాయకియు ఏ లోపము లేనిదై యున్నది.

(కండపిన్ చూంచిన పిమ్మట) మీరు కూడ ఈ సర్వేశ్వరుని జూచియే కదా హితమును జెప్పుచున్నారు.

(కండపిన్) వరదనీరు కొట్టుకొనిపోయిన పిమ్మటనే గదా సేతుబంధనమును మీరు జేయునది. చూచుటకు ముందే వరలించలేకపోతిరి కదా; ఇకమీద మరలించగలరా ? మరలించలేకపోవుటకు యిప్పు డేమి వచ్చి న దందురా ? సాక్షాత్తుగా ఒక విధమున తాము లోబడిన విధానమును జెప్పుచున్నారు.

(శంగిత్యాది శంఖము ఇత్యాది) మీకు హితమును జెప్పవలశినది మనస్సును నదియున్న వారికే కదా.

(శంగినోడుం - శంఖముతోను) శెంగముల నాణ్మలర్ మెల్ తేనుకరుం అన్నంపోల్ "సద్యోవికసితమైన ఎఱ్ఱతామరపద్మముమీద తేనెను ఆరగించు హంసవలె" అనునటులశ్యామల వర్ణమైన దివ్యమంగళవిగ్రహమునకు అలంకారభూతమైన తెలుపువర్ణమును కలిగియున్న శ్రీపాంచ జన్యముతోను, ఈ హస్తమునకు ఇది ఆభరణమైనచో, మరిఒకటి వేరే అవసరము లేకుండగ తానే ఆభరణముగ చాలియుండిన చక్రముతోను,

(తామరైక్కణ్గళోడుం) కణ్ణాక్కైష్టట్టు పోయిస్తుకాణుం వికాసాదికళాలే తామరైప్పోలే యిరుక్కిర తిరుక్కణ్గళోడుం.

(శెంగనివాయ్) కండపోతు, నాన్ ఉన్శరక్కన్ట్రో! "తవాస్మి" ఎన్ఱ మఱువలోడుం,

(ఒన్ఱినోడుం) సంసారయాత్రైయై ముక్తిన్ మఱప్పుమోహాతి, ఇవ్వగుగుండానవత్తోడు అవ్వగుగుండానవత్తోడు వాశియఱ ఎల్లావత్తైయుం మఱక్కప్పణ్ణవత్తాన తిరునధరత్తోడుం; అన్ఱిక్కే, జాతి వ్యక్తితోఱుం పరిసమాప్య వర్తిక్కుమాప్పోలే, నె జు అళవుతోఱుం శెల్లానిన్ఱతు, సర్వేశ్వర. నోడు సామ్యం పెత్తతాకిలుం తెరికిఱతిలై, అవన్ వ్యాపియానిఱ్కుచ్చెయ్తే ఆకాశవ్యాప్తి పోలన్ఱిక్కే పదార్థం గళ్ దోఱుం పరిసమాప్య వర్తిక్కుమాప్పోలే, యితువుం అళవుకళ్ తోఱుం పరిసమాప్య వర్తియానిన్ఱతు,

(శెల్కిన్ఱతు) ఇన్నముం తరై కండదిలై. "నాంగళుమెల్లాం సంబియుడైయ వళికై యను భవిత్తిరుక్కిఱో మన్ఱో, ఎంగళ్ శొల్లు మఱక్కలాకాతుకాన్" ఎన్న, ఉంగళ్ శొల్లై మఱుత్తేనే యాకిలుం సంబియుడైయ తిరుముకం మఱక్కవొణ్ణాతు ఎన్గిఱాళ్, ఎంగళుక్కు యిప్పడి యిరాతో వానెన్నెన్న.

(ఎన్నెంజమే) ఉంగళైప్పోలన్ఱిక్కే అవంతానే కాట్ట ప్పెఱుకైయాలే ముఱక్క వనుభవిత్త తెన్నెంజానతు.

(ఎంగనేయోవిత్యాది) హేతువాన సంబియుడైయ వస్తువైకె ప్పాడియాతే, ఎన్నై ప్పాడియక్కూడినపడి యెంగనేయో, ప్రావణ్యమే స్వభావమాంపడి వళర్త్తువైత్తు ఇప్పోతాక ప్పాడికిఱపడి యెంగనేయో! మున్బు నీంగళ్ కఱ్పిత్తుప్పోందు, అదు పలిక్కప్పుక్కవాఱే పొడియుమత్తనైయో !

(కోలం) ఉంగళ్ హితవచనత్తుక్కు మీళాతపడియాన సౌందర్యత్తై యుడైయవర్.
(తిరుక్కుఱుంగుడి నంబియై) పర్వత్తిల్ మూత్తన్మైయితేయో అకప్పట్టతు మీళ్కైక్కు,
(నంబియై) గుణత్తిల్ అపూర్త్తియుండాయ్త్తాన్ మీళుకిఱతో,
(నాన్ కండపిన్) ఇవ్విషయత్తిల్ చాపలం యిల్లామల్ మీళుకిఱేనో,

(శంగినోడుం) శ్రీపాంచజన్యత్తోడే విశేషిత్తు ఒరు ప్రాప్తియుండుకాణుం యివళుక్కు, వాగమృతచ్చువడు అఱిందు యిరుక్కైయాలే; ఒరు కలత్తిలే జీవిప్పారై ప్పోలే,

(తామరైక్కణ్ణోడుం తామరపద్మములవంటి నేత్రములతోను) నేత్రములను సేవించుటకై చేయివిడిచిపోయినది కాబోలు, వికాసాదులచే తామరపుష్పమువలె యున్న దివ్యనేత్రములతోను.

(శెంగనివాయ్ - ఎఱ్ఱదొండపండువంటి అధరోష్టము) చూచినపుడు, నేను నీవాడినే కదా ! (తవాస్మి - నీవాడను) అనుచున్నటు చిరునగవుతోను.

(ఒన్ఱినోడుం- అద్వితీయమైనదానితోను) సంసారజీవితమును ముక్తపురుషుడు మరచునటుల, ఈవైపునయున్న శంఖుచక్రములను, ఆపైనియున్న పద్మనేత్రాదులను విభేదము లేకుండగ మరపింప చేయజాలిన దివ్య అధరోష్ఠముతోను; జాతి అనుసదీ సజాతీయవ్యక్తు లన్నింటి యందు పూర్తిగ వ్యాపించి వర్తించునటుల, మనస్సు అన్ని సౌందర్యములతోను అనుసరించుచున్నది. సర్వేశ్వరునితో సామ్యమును పొందనప్పటికిన్ని తెలుసుకొనజాలకున్నది. ఆయన వ్యాపించువాడై యుండు నప్పటికిన్ని, ఆకాశ వ్యాప్తివలె గాకుండగ అన్నిపదార్థముల యందును పూర్తిగవ్యాపించి వర్తించు నటులనే, ఈ మనస్సు కూడ సౌందర్యము లన్నింటి యందును పూర్తిగ వర్తించుచున్నది.

(శెల్కిన్ఱతు - సంచరించుచున్నది) ఇంకను అవుగుప్రదేశమును జూడలేను. "మేము 'సుందరపరిపూర్ణుని' యొక్క సౌందర్యమును అనుభవించి యుండలేదా, మా మాటను త్రోసివేయ కూడదు సుమా" అనగా, "మీ మాటను మరచినను, సుందరపరిపూర్ణుని శ్రీముఖమును మఱువ జాలను" అనుచున్నారు. మాకు ఈ విధముగ లొంగనిదానివైపోతివేల అనగ,

(ఎన్నెంజమే - నా మనస్సే) మీ వలెగాక ఆ సర్వేశ్వరుడే స్వయముగ చూపించగా దర్శించినదగుటచే పరిపూర్ణముగ అనుభవించినది నా మనస్సు.

(ఎంగనేయోవిత్యాది - ఎటుల) కారణభూతమైన సుందరపరిపూర్ణుని సౌందర్యమును కోపించక, నన్ను కోపించుట ఏమీ బాగున్నది. భగవత్ప్రావణ్యమే స్వభావమగునటుల యిప్పటి వరకు పెంచి, ఇప్పుడు కోపించుట ఏమి బాగున్నది ! ఇదివరలో మీరు నేర్పి, అది ఫలించ మొదలిడిన వెంటనే కోపగించుటయేనా !

(కోలం - సౌందర్యము) మీరు తెలుపు హితవాక్యములను మరల్పబడ జాలనట్టి సౌందర్యమును గలవారు.

(తిరుక్కుఱుంగుడి నంబియై-తిరుక్కుఱుంగుడిలో యున్న సుందరపరిపూర్ణుని) పరత్వ మందలి మహిమలోనా ఆకర్షించబడినది మరలించబడుటను.

(నంబియై - సుందరపరిపూర్ణుని) కల్యాణములలో లోటు యున్నందువలన మరలనా !

(నాన్ కండపిన్ - నేను దర్శించిన పిమ్మట) ఈ సర్వేశ్వరుని యందు ప్రేమ లేకుండగ మరలగలనా ?

(శంగినోడుం - శంఖముతోను) శ్రీపాంచజన్యముతో విశేషించి ఒక సంబంధ మున్నది కాబోలును ఈమెను, వాగామృతరసమును అనుభవించి యుండుటచే, ఒక కంచములో తిని జీవించు వారివలె.

2

ఎన్నెంజినాల్ నోక్కి క్కాణీర్ ఎన్నై మునియాతే ।
తెన్నన్ శోలై త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ ।
మిన్ను నూలుం కుండలముం మార్విల్ తిరుమఱువుం ।
మన్ను పూణుం నాన్గుతోళుం వందెంగుం నిన్ఱిడుమే ॥

2. నా మానసిక ప్రేమ దృష్ట్యా చూచి తెలుసుకోనండి. నన్ను వ్యర్థముగా కోపించక దక్షిణ దిక్కునందలి విలక్షణమైన తోటలుతో నిండియున్న తిరుక్కుఱుంగుడిలో వేంచేశియున్న సుందరపరిపూర్ణుని నేను సేవించిన పిమ్మట । ఆయన యొక్క ప్రకాశించెడి యజ్ఞోపవీతమున్ను, కుండలములున్ను, వక్షస్థల మందలి శ్రీవత్సమున్ను । చక్కగ అమరియున్న ఆభరణములున్ను, చతుర్భుజములున్ను వచ్చి ఎచ్చట యున్నను ఎదుటనే సాక్షాత్కరించుచున్నవి.

3

నిన్ఱిడుం తిశైక్కుం నైయుం ఎన్ఱన్నై యరుమ్మునితిర్ ।
కున్ఱమాడ త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ !
వెన్ఱి విల్లుం తండుం వాళుం శక్కరముం శంగముం ।
నిన్ఱు తోన్ఱి క్కణ్ణుళ్ నీంగా నెన్నెంజుళ్ళుం నీంగావే ॥

3. స్తబ్ధురాలై యుండును; చంచలమతికలదిగ నుండును; శిథిలాంతః కరణురాలై యుండును అని తల్లులైన మీరే నన్ను కోపపడదరే ? । పర్వతము వంటి మేడలు గల తిరుక్కుఱుంగుడిలో వేంచేశియున్న సుందరపరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట । జయప్రదమైన విల్లున్ను, గదయు, ఖడ్గమున్ను, చక్రమున్ను, శంఖమున్ను । స్థిరముగా దర్శన మిచ్చుచు కంటి నుండి ఎడ బాసి పోకున్నవి. నా మనస్సు నుండియు ఎడబాసి పోకున్నవి.

4

నీంగనిల్లా క్కణ్ణనీర్కళ్ ఎన్ఱన్నై యరు మ్మునితిర్ ।
తేంగోళ్ శోలై త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ ।
పూందణ్ మాలై త్తణ్ తుఴాయుం పొన్ ముడియుం వడివుం ।
పాంగు తోన్ఱుం పట్టునాణుం పావియేన్ పక్క త్తవే ॥

4. ‘అంతము లేదమ్మా కంటిధారకి’ అని తల్లులైన మీరే నన్ను కోపపడదరే! తేనెను స్రవించు తోటలతో నిండియున్న తిరుక్కుఱుంగుడి యందు వేంచేశియున్న సుందరపరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట! వికసితమైన చల్లని పుష్పమాలికయున్ను, చల్లని తిరుత్తుఴాయిన్ని, స్పృహణీయమైన కిరీటమున్ను, శరీరమున్ను, చక్కగా కనుపించు పట్టుపీతాంబరమున్ను, పాపాత్మురాలనైన నా ప్రక్కనే యుంటూ యున్నవి.

5

పక్కం నోక్కి నిఱ్కుం నైయుం ఎన్ఱన్నై యరుం మునితిర్ ।
తక్క కీర్త్తి త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ ।
తొక్క శోతి త్తొండైవాయుం నీండపురువంగళుం ।
తక్క తామరైక్కణ్ణుం పావియేన్ ఆవి యిన్మేలనవే ॥

5. ఇటు నటు ప్రక్కలకు జూచుచుండును; దుఃఖించుచుండును, అని తల్లులైన మీరే నన్ను కోపపడెదరే! గొప్ప కీర్తిమంతుడైన తిరుక్కుఱుంగుడి యందు వేంచేశియున్న సుందర పరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట! గొప్ప తేజస్సు గలదై దొండపండువలె నున్న అధరోష్ఠమును; నిడుపైన కనుబొమ్మలున్ను; చక్కటి పద్మనేత్రములున్ను; పాపాత్మురాలనైన నా ఆత్మమీదనే హత్తుకొనిపోయి యున్నవి.

6

మేలుం వన్పఴి నంకుడిక్కు ఇవళ్ ఎన్ఱన్నై కాణకొడాళ్ ।
శోలై శూఴ్ తణ్ తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ ।
కోలనీళ్ కొడిమూక్కుం తామరైక్కణ్ణుం కనివాయుం ।
నీలమేనియుం నాన్గుతోళుం ఎన్నెంజం నిఱైందనవే ॥

6. “ఇక ముందెల్లప్పటికిని చెడ్డ అపకీర్తికరమైనది మన వంశమునకు ఈమె” అని తల్లిస్వామిని చూడనివ్వదే. తోటలును చుట్టు కలిగియున్న చల్లని తిరుక్కుఱుంగుడి యందు వేంచేశి యున్న సుందరపరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట! అందముగా పొడుగుగా తీగవలె నున్న ముక్కున్ను; పద్మము వంటి నేత్రములున్ను; దొండపండువంటి అధరోష్ఠమున్ను, నీలవర్ణమైన దివ్య మంగళ విగ్రహమున్ను, చతుర్భుజములున్ను నాహృదయమున నిండి యున్నవి.

7

నిఱైంద వణ్ణపఴి నంపడిక్కు ఇవళ్ ఎన్ఱన్నై కాణకొండాళ్ |
శిఱందకీర్త్తి త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ |
నిఱైంద శోతివెళ్ళం శూఴ్ంద నీండ పొన్మేని యోడుం !
నిఱైందు ఎన్నుళ్ళే నిన్ఱొఴిందాన్ నేమి యంగైయుళతే ॥

7. పూర్తిగ మహాచెడ్డ అపకీర్తికరమైనది మన వంశమునకు ఈమె, అని తల్లిస్వామిని చూడనివ్వదే! శ్లాఘనీయమైన కీర్తిగల తిరుక్కురుంగుడి యందలి సుందరపరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట | పరిపూర్ణ జ్యోతి పుంజమును చుట్టును కలిగి శ్లాఘనీయమై స్పృహణీయమై యున్న దివ్యమంగళవిగ్రహముతోను | అంతటను నిండి యుండి నా మనస్సు నుండి తొలగకుండ నున్నాడు చక్రము కూడ ఆ సుందరహస్తమునందు యున్నది.

8

కైయుళ్ నన్ముగం వైక్కుం నైయుం ఎన్ఱన్నై యరుమ్మనితిర్ |
మైకొళ్ మాడ త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ |
శెయ్యతామరైక్కణ్ణుం అల్కులుం శిత్తిడైయుం వడివుం |
మెయ్కొళ్ నీళ్ కుఴల్ తాఴ్ంద తోళ్కళుం పావియేన్ మున్నిఱ్కుమే ॥

8, “చేతిలో ఆ చక్కని ముఖము నుంచుకొని యుండి దుఃఖించుచుండును” అని తల్లులైన మీరు కోపపడెదరే | సుందరమైన మేడలుగల తిరుక్కురుంగుడిలో వేంచేశియున్న సుందర పరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట | ఎర్ర తామరపద్మముల వంటి నేత్రములున్న; నితంబ ప్రదేశమున్న; సన్నని నడుమున్న, దివ్య మంగళ విగ్రహమున్న | నల్లని దీర్ఘమైన కుంతలములున్న; దీర్ఘమైన బాహువులున్న పాపాత్మురాలనైన నా ఎదుట నిలిచియున్నవి.

9

మున్నిన్ఱా యెన్ఱు తోఴిమారుకళుం అన్నైయరుమున్నితిర్ |
మన్ను మాడ త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ |
శెన్నినీళ్ ముడి యాతియా యులప్పిల్ అణికలత్తన్ |
కన్నల్ పాలముతాకి వందు ఎన్నెంజం కఴియానే ॥

9. అందరి ముందరను నిలిచియుండెదవేల యని చెలికత్తెలున్న, తల్లులును కోపపడెదరే | స్థిరమైన మేడలు గల తిరుక్కురుంగుడి యందు వేంచేశియున్న సుందరపరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట | శిరస్సునందు దీర్ఘమైన కిరీటము మొదలైన అసంఖ్యేయ యాభరణముల ధరించియున్న నా స్వామి | కలకండవలెను పాలవలెను అమృతమువలెను భోగ్యభూతుడై వచ్చి నా మనస్సు నుండి కదలకుండగ నున్నాడు.

## 10

కఴియ మిక్కతోర్ కాతల్ ఇవ ళెన్ఱన్నై కాణక్కొడాళ్ ।
ఒఴివిల్ కీర్తి త్తిరుక్కుఱుంగుడి నంబియై నాన్ కండపిన్ ।
కుఴుమి త్తేవర్ కుఴాంగళ్ కైతొఴ చ్చోతి వెళ్ళత్తినుళ్ళే ।
ఎఴువతోరురు నెన్నెంజుళ్ ఎఴుం ఆర్క్కుమఱివరితే ॥

10. "మిక్కిలి అతిశయించిన ఒక విధమైన ప్రేమస్వరూపురాలు ఈమె" అని తల్లి నన్ను స్వామిని సేవించనిచ్చుట లేదు। నాశనరహితమైన కీర్తిగల తిరుక్కుఱుంగుడి యందు వేంచేశి యున్న సుందరపరిపూర్ణస్వామిని నేను సేవించిన పిమ్మట। గుమిగూడిన దేవతా సమూహములు చేతులెత్తి సేవించుచుండగా తేజోపుంజమునందు। ఉజ్వలమై ప్రకాశించుచున్న ఒక విలక్షణ మూర్తి నా మనస్సు ప్రకాశించుచున్నాడు. భక్తిరహితులైనవారెవరికిని తెలుసుకొనుటకు శక్యము కాదు కదా."

## 11

అఱి వరియ పిరానై యాఴి యంకైయనైయే యలత్తి ।
నఱియ నన్మలర్ నాడి నన్ కురుగూరు చ్చడకోపన్ శొన్న ।
కుఱికొళాయిరత్తుళ్ ళివై పత్తుం తిరుక్కుఱుంగుడి యతన్మేల్ ।
అఱియ క్కత్తువల్లార్ వైట్టణవరాఴి కడల్ ఞాలత్తుళ్ళే ।

ఆఴ్వార్ తిరువడిగళే శరణం

11. తెలుసుకొన దుర్లభుడై నట్టియు, చక్రమును సుందరమైన హస్తమున ధరించియున్నట్టియు సర్వేశ్వరుని భక్తితో ప్రార్థించి। పరిమళించు చక్కని పుష్పములను వెతకి సంపాదించి, సుందరమైన తిరుక్కురుగూరు నందు వేంచేసియున్న నమ్మాళ్వార్లు సాయించిన। భగవచ్చిహ్నాల వర్ణించు, వెయ్యింటియందలి ఈ పదిపాశురములను తిరుక్కురుంగుడి విషయముగ। తెలుసుకొని అభ్యసించ సమర్థులైనవారలు, ఈ అగాధ సముద్రమధ్యమందలిభూమియందుండియే శ్రీమహావిష్ణుభక్తులై విలసిల్లగలరు.

ఆఴ్వార్ తిరువడిగళే శరణము.



శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీపరాశర భట్టార్యాయ నమః

# కైశిక మహాత్మ్యము

తనియనులు

శ్రీశైలేశ - దయా - పాత్రం ధీ - భక్త్యాది - గుణార్ణవం ।
యతీంద్ర - ప్రవణం వందే రమ్యజామాతరం మునిం.॥
లక్ష్మీనాథ - సమారంభాం నాథ - యామున - మధ్యమాం ।
అస్మదాచార్య - పర్యంతాం వందే గురుపరంపరాం॥.
యో నిత్య మచ్యుత - పదాంబుజ - యుగ్మ - రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవ తోఽస్య దయైకసింధోః ।
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥.
మాతా పితా యువతయ స్తనయా విభూతిః ॥
సర్వం యదేవ నియమేన మదన్వయానాం ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం ।
శ్రీమత్ తదంఘ్రి - యుగళం ప్రణమామి మూర్ధ్నా॥
భూతం సరశ్చ మహదాహ్వయ - భట్టనాథ ।
శ్రీ - భక్తిసార - కులశేఖర - యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణు - పరకాల - యతీంద్ర - మిశ్రాన్ ।
శ్రీమ త్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యం॥.
శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।
శ్రీవత్సాంకసుత శ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే॥.
నమ స్తస్మై వరాహాయ లీలయోద్ధరతే మహీం ।
ఖురమధ్యగతో యస్య మేరుః కణకణాయతే॥.
ప్రళయోన్వదుత్తీర్ణాం ప్రపద్యేఽహం వసుంధరాం ।
మహావరాహ - దంష్ట్రాగ్ర - మల్లికోశ - మధువ్రతాం॥.

# —: అవతారిక :—

"వేదోఽఖిలో ధర్మమూలం (వేదమంతయు ధర్మమునే మూలముగ గలిగియున్నది) అనియు, "పితృదేవ - మనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనం" (పితృలోకవాసులకు - దేవతలకు మనుష్యులకు అందరకును సనాతనమైన వేదమే జ్ఞాననేత్రమైయున్నది) అనియు, తెలుపబడినటుల తత్త్వ - హిత - పురుషార్థములలో ప్రమాణభూతములైన వేదములకు పరికరభూతములైన విద్యాస్థానములు పదిగలవు.

వీనిలో 1. శిక్షయనునది - వర్ణముల యొక్క ఉచ్చారణ విశేష ప్రతిపాదన మాత్రమునందే తత్పరత కలది గనుకను,

2. నిరుక్త మనునది - వర్ణసామాన్యాదులను బట్టి పదార్థ విశేష ప్రతిపాదనమునందే తత్పరత కలది గనుకను,

3. ఛందోవిచితి యనునది—వర్ణసంఖ్యా విశేషనియతమైన గాయత్ర్యాది చ్ఛందో మాత్ర మునే ప్రతిపాదించునది గనుకను,

4. వ్యాకరణ మనునది - వర్ణసముదాయాత్మకమైన పదములయొక్క సాధుత్వ - అసాధుత్వముల తెలుపుటలో మాత్రమే వ్యాపృతమైనది గనుకను,

5 కల్పసూత్రములనునవి - పదసంఘాత రూపమైన వాక్యవిశేషములచే చోదితములైన కర్మానుష్ఠాన విశేషముల కల్పించుటలో ప్రవృత్తములైనవి గనుకను,

6. జ్యోతిషము అనునది - యథాశాస్త్రానుష్ఠేయములైన కర్మలను యథాకాలమున అనుష్ఠించునటుల కాలవిశేషమును ప్రదర్శించుటలో ప్రధానమైనది గనుకను,

7. న్యాయశాస్త్ర మనునది - ప్రమాణాది షోడశ పదార్థవ్యవహారమాత్రముననే ప్రతిష్ఠాపకమైనది గనుకను,

8. మీమాంస యనునది - సోపబృంహణములైన వేదములయొక్క వచనవ్యక్తి విశేష నిర్ధారణార్థ యుక్తి విశేషముల ప్రతిపాదించునది గనుకను,

9. ఉపబృంహణములలోని ధర్మశాస్త్రములు - కర్మభాగమును ఉపబృంహణ మొనరించుటలోనే ప్రధానములైనవి గనుకను,

10. బ్రహ్మభాగమును ఉపబృంహణ మొనరించినవానిలో ప్రధానములైన ఇతిహాస పురాణములలో ఇతిహాసములు - ధర్మము మున్నగు పురుషార్థవిశేషముల స్వరూపమును పురస్కరించుకొని ప్రవర్తించిన వగుటచేతను, తత్త్వప్రతిపాదనమునందు ఆలస్యముగ అర్థమును స్ఫురింపజేయునవి గనుకను,

ఇవి తత్త్వ - హిత - పురుషార్థముల ప్రతిపాదించుట యందు అప్రయోజకము లగుచున్నవి. పురాణములు పరతత్త్వము - పరమహితము-పరమపురుషార్థములలో సాక్షాత్తు ఉపబృహణములు కాగలగుచున్నవి.

పురాణములలోను "సంకీర్ణాః సాత్త్వికాశ్చైవ రాజసా స్తామసా స్తథా" (సంకీర్ణపురాణములు, సాత్వికపురాణములు రాజసపురాణములు, తామసపురాణములు అని విభజించబడియున్నవి) అని కల్పవిశేషములవిభాగించి,

"యస్మిన్ కల్పేతు యత్ప్రోక్తం పురాణం బ్రహ్మణా పురా ।
తస్య తస్యతు మహాత్మ్యం తత్స్వరూపేణ వర్ణ్యతే॥

పూర్వము బ్రహ్మచేత ఏ ఏ కల్పమునందు ఏ ఏ పురాణము తెలుపబడినదియో। దానిదానియొక్క మహాత్మ్యము ఆయా స్వరూపముతో వర్ణించబడియున్నది).

"ఆగ్నేః శివస్యమాహాత్మ్యం తామసేషు ప్రకీర్త్యతే ।
రాజసేషు మహాత్మ్యం అధికం బ్రహ్మణో విదుః॥
సంకీర్ణేషు సరస్వత్యాః పిత్రూణాం చ నిగద్యతే ।
సాత్త్వికేష్వథ కల్పేషు మహాత్మ్య మధికం హరేః ।
తెష్వేవ యోగసంసిద్ధా గమిష్యంతి పరాం గతిం.॥

(తామస పురాణములయందు అగ్నియొక్కయు, శివునియొక్కయు మహాత్మ్యము అధికమున తెలుపబడెను. రాజస పురాణముల యందు చతుర్ముఖ(బ్రహ్మ)యొక్క మహాత్మ్యమధికముగ తెలుపబడినది) సంకీర్ణపురాణములయందు సరస్వతీదేవి యొక్కయు పితృదేవతలయొక్కయు మహాత్మ్యము తెలుపబడినది। సాత్త్విక కల్పమందలి పురాణములయందు శ్రీమహావిష్ణు మహాత్మ్యము అధికముగా తెలుపబడినది. ఈ సాత్త్వికపురాణార్థగ్రహణమువలన మాత్రమే యోగసిద్ధినిపొందినవారై మోక్షమును జనులు పొందగలుగుచున్నారు.) అని చెప్పినప్రకారముగ సాత్వికకల్పములలో సత్త్వోత్తరుడైన బ్రహ్మచేత ప్రోక్తములై

"మహాన్ ప్రభుర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః॥

(సత్వగుణమునకు పరమపురుషుడు సర్వేశ్వరుడు అగు శ్రీమన్నారాయణుడే ప్రవర్తకుడు, అని తెలిపినటుల సత్వప్రవర్తకుడైన పరమపురుషుని ప్రవర్తకములై

"సత్త్వాత్ సంజాయతే జ్ఞానం"

(సత్వగుణముచే జ్ఞానము చక్కగా పుట్టుచున్నది) అనియు,

"సత్వం విష్ణుప్రకాశకం"

(సత్త్వగుణము విష్ణువును తెలుసుకొనునటుల జేయును) అనియు, చెప్పబడినటుల అజ్ఞానము - సంశయము - విపరీతజ్ఞానము నశింపజేసి పరతత్త్వాది విశేషముల నిశ్చయించి తెలుపు సాత్త్విక, పురాణములే ముముక్షులకు ఉపజీవ్యము లగుచున్నవి.

సాత్త్వికపురాణములలోను భగవదితరులు వక్తలుగయుండి చెప్పిన పురాణములకంటె, పరమసత్వ సమాశ్రయుడైన భగవంతుడే వక్తయై చెప్పగా ప్రవృత్తమైన పురాణమే ఉత్కృష్టమైనది,

భగవద్వాక్యములయందు కూడ :-

"కళ్ళ వేడత్తై క్కొండుపోయ్ ప్పుఱంబుక్కవాఱుం కలందసురర్గై ।
యుళ్ళం బేదం శెయ్దిట్టు యురుండ ఉపాయంగళం"
"తిణ్ కళలాల్ అసురర్క్కు త్తీంగిళైక్కుం తిరుమాల్",

ఆసురులను పరమేశ్వరుడు అసురప్రకృతిగలవారలను మోహింపజేయునిమిత్తమై సాయించిన వాక్యములు సాత్త్వికులైనవారల కుపజీవ్యములు కాజాలవు.

మరియు ఈయనయొక్క అవస్థావిశేషములందలి వాక్యములను జూచినచో - పరమపదనిలయుని సాయించు మాటలు పరుని వాక్యముగనుక బంధములలేనివారు వినదగినవై యుండును.

క్షీరాబ్ధినాథుని వాక్యములను జూచినచో సముద్రఘోషతో కలసినవియై అర్థమును గ్రహించుటకు శక్యమైనవిగ యుండవు.

మత్స్యావతారుని మాటలను జూచినచో ఒకపర్యాయమైన గట్టెక్కనివాని మాటలగుటచే జలాశయ సంబంధము (అచేతనమైన ప్రకృతి సంబంధము నీటి సంబంధము) గలదిగ తోచుచుండును.

కూర్మావతారుని మాటలను జూచినచో గంభీరులు (సముద్రుడు జ్ఞానులు) కలతచెందునటులను, స్థిరమైనవారు (పర్వతము - భక్తులు) భ్రమించునటులను నీచత్వమును సముద్రమందలి అడుగు భాగము - ప్రకృతి) విడిచిపెట్టనివాని చెప్పుమాటలగుటచే పైకిఎక్కించు (మోక్షప్రదములగు) మాటలుగ యుండవు

శ్రీ నృసింహావతారుని వాక్యము - కంఠమునకు పైన ఒకవిధముగను కంఠముక్రింద ఒకవిధముగను యుండుటచే ప్రమాదోపహితమై యుండును,

శ్రీవామనావతారుని వాక్యము — క్రింద తెలిపిన ప్రకారముగ గాక విషమపదముగ నుండును: కపటియైయుండువానొకని విషయమున దృష్టిలోపమును కలిగించునదై యుండును.

పరశురామావతారుని వాక్యము - గండ్రగొడ్డలిని ధరించి అన్నివేళల యందునుకూడ క్షమను (క్షమాగుణమును-కాశ్యపునికి దానమిచ్చుటద్వారా భూమిని) వదలినవాని మాటయగుటచే విశ్వాసమును కలిగింపజేయజాలదు.

శ్రీరామచంద్రావతారునివాక్యము కపులతో కలిసి పుణ్యజనుల బాధాపర్యంతమైనదై యుండును.

బలభద్రావతారుని వాక్యము - నదీప్రవాహముచేత క్రిందకు పోవునట్టి (యమునను) వారిని ఉత్పథప్రవృత్తులుగ జేసినవాని మాటయగుటచే మదవికారము గలదిగ కనుపించును, అంతమాత్రమేగాకుండగ శుద్ధవర్ణుడై యుండినప్పటికిన్ని దోషవిశిష్టుడైనవానియొక్క మాటయగుటచే విశ్వసించతగనిదై యుండును.

శ్రీకృష్ణావతారునివాక్యము — పుట్టినది మొదలు చేజిక్కిన దొంగతనమునందు తెలుసుకొన తగినదైయుండును.

కల్క్యవతారుని వాక్యము — అనాగతమైనదని ఎదురుజూచుచుండవలసినదే తప్ప ఎవరికిని కూడ అవగతమైయున్న వాక్యము కాదు. అంతమాత్రమే గాకుండగ అనుమానప్రమాణముచే తెలుసుకొనవలసినదై యుండును.

ఈ విధముగ ఏవిధ అన్యథాశంకను చేయుటకు అవకాశము లేకుండగ

"ఏనత్తినురువాగి నిలమంగై యెళ్లిల్ కొండ జ్ఞానత్తి నొళియురు"

(వరాహరూపుడై భూపిరాట్టిని కోరలయందు ధరించిన జ్ఞానప్రకాశకమైన స్వరూపుడు) అనియు

"ఏనత్తురువాగ్ యిడంద జ్ఞానప్పిరాన్"

(వరాహరూపుడై నీటినుండి భూమిని ఉద్ధరించిన జ్ఞానప్రదాత) అనియు, తెలిపినటుల యోగ్యమైన జ్ఞానప్రదుడు అగుట వలనను,

"జ్ఞాలమ్ముయ్ అన్ఱు పారగం కీండ పాళియాన్ అళియానరుళే।
నన్ను నానుయ్య" —

(వరాహరూపుడుగనై కృతయుగమున భూమిని నీటినుండి పైకితీసి రక్షించిన ... కటాక్షమే నేనుజ్జీవించుట కారణముకాగలదు అని జ్ఞానవంతులు విశ్వసించి ఆశ్రయించతగిన కృపా ... చేతను,

"అది మున్నేన మాగియ అరనాయమూర్త్తి
యదు నమ్మై యాళు మరశే॥

(పూర్వము కృతయుగమున ఆ వరాహస్వరూపుడై ఈశ్వరాత్మకుడైన ఆ స్వామియే మనలను రక్షించు రక్షకుడు) అనియు చెప్పినటుల రక్షకత్వపూర్తికలవాడగుటచేతను,

"+ + + + + ఇమం కర్పగం శేర్

వానత్తవర్క్కుం అల్లాదవర్క్కుం మత్తెల్లా యెవర్క్కుం

జ్ఞానప్పిరానై యల్లాల్ ఇల్లై నాన్ కండ నల్లదు."

(సుస్లభమైన కల్పవృక్షము కలిగియున్న దేవతలకున్ను, మఱితరులకున్ను జ్ఞానప్రదాతయైన వరాహరూపుడైన సర్వేశ్వరుని తప్ప నేను మఱి రక్షకులను ఎఱుగను.)

అని ఆళ్వార్లు ప్రథమ ప్రబంధములో అందరకున్ను ఈయన తప్ప మఱి రక్షకులు లేరు అని సిద్ధాంతీకరించి, చరమ ప్రబంధసమాప్తియందును

... ... ... ... ... ... ... ...

"నీలవరై యిరండు పిఱై కవ్వి నిమిర్ న్దదొప్ప।

కోలవారాహ మొన్ఱాయ్ నిలంకోట్టిడైక్కొండ యెందాయ్।

నీలక్కడల్ కడైందాయ్ ఉన్నై ప్పెత్తిని ప్పోక్కువనో"

(నల్లనైన పర్వతమును రెండుచంద్రకళలను నోటకరచుకొని పైకి లేచినట్టున్న సుందరమైన వరాహస్వరూపముతో అద్వితీయుడవై భూమిని దంతముల మీద ఎత్తుకొనివచ్చిన ఓ మాస్వామీ ! నల్లనైన సముద్రమును చిలికినవాడా ! నిన్ను పొంది ఇకమీద విడుతునా!)

అనియు భగవంతునియొక్క అవతారము లన్నియు యుండగా ఈ వరాహావతారమునే తాము ఆదరించి అనంత మహానందమును పొందిన విధానమును సాయించి యుండుటచేతను,

ఈ యవతారమూర్తియొక్క రక్షకత్వమే ఉత్తారకమైన రక్షకముగుటచేతను, ఈ విధముగ ఈయన చేయు రక్షణము వాత్సల్యమూలకమైనదని తోచునటుల.

"ఏనమాయ్ నిలం కీండ ఎన్నప్పనే"

(వరాహరూపుడవై భూమిని ఉద్ధరించిన నా స్వామీ) అనియు.

"అప్పన్ముట్టి యిడం దెయన్ను కొండానాళ్"

(వరాహావతారమెత్తి భూమిని యపుడు రక్షించినట్టి రోజు) అనియు, వాత్సల్యావినాభూతమైన పితృత్వము ఈయనకు గలదు యని సాయించుటచేతను వరాహావతారమే సర్వోత్కృష్టమైనదగుచున్నది.

సకలలోకపితయైన ఈయనను సకలలోకమాతయైన భూమిపిరాట్టి తమసంతానమునకు హితమైనదేది యని. ప్రశ్నించగా ప్రవృత్తమైన పురాణమగుటచే, ఈ పురాణము మిగత అన్ని పురాణములకంటె ఉత్కృష్టమైనదగుచున్నది

ఇది సర్వేశ్వరుడు తన పిరాట్టుమార్గను జూచి సాయించిన మాట యగుటచే

"పాంబణై యార్క్కుం తం పాంబుపోల్

నావు ఇరండుళవాయ్త్తు"

(అనునటుల శేషశయునికి కూడ తన శేషునికివలెనే నాలుకలు రెండున్నవి కాబోలును)

అనునటుల ఇది కూడ ఉపాలంభవిషయమైనచో అనిన ఆ మాటకూడ

"శెమ్మొయుడైయ తిరువరంగర్ తాం పణిత్త।

మెయ్మ్మై ప్పెరువార్త్తై విష్ణుచిత్తర్ కేట్టిరుప్పర్" ॥ (నాచ్చిమార్ తిరు ౧౧-౧౦)

(ఋజుత్వముగల శ్రీరంగనాథుడు శ్రీకృష్ణావతారములో తాము సాయించిన యథార్థమగు చరమశ్లోకరూప గొప్పవార్తను విష్ణుచిత్తులు వినియుందురు) అని తమకు తెలిసియున్నప్పటికిన్ని భగవద్విశ్లేషమును సహించజాలని గర్వాతిశయముచే "పాంబణై యార్క్కుం తం పాంబుబోల్ నావుం ఇరండుళవాయ్త్తు" (శేషశయునికికూడ తన శేషునికివలెనే నాలుకలు రెండున్నవి కాబోలును) అని అనంతభుజగుని సంసర్గదోషముచే అబద్ధమగునేమో యని అతి శంక కలిగినదాయెను. ఇంతియే.

ఈ మాటలు అట్టివి గాకుండగ

"పార్వణ్ణమడమంగై పత్తర్" (భూపిరాట్టియొక్క ప్రియుడు)

అని నటుల పిరాట్టిమారుల పట్ల యుండుకున్న ప్రేమబంధముచే ప్రళయార్ణవమగ్నురాలైన ఈమెను దాని నుండి పైకి లేవనెత్తి, ఈమెయొక్క క్లేశమును పోగొట్టినపిమ్మట, సంసారార్ణవ మగ్నులైన తన సంతానము యొక్క దుఃఖనివృత్తికి ఒక సుకరమైన ఉపాయము కనుపించకపోవుటచే, విచారగ్రస్థురాలైయున్న ఈమెను జూచి దయతో సాయించిన భగవంతుడు ఈమెధైర్యము వహించుటకై సాయించిన మాటలగుటచే అతిశంకించవలసిన అవకాశము లేదు.

గనుక, అవసాంతరము లందు వలె గాకుండగ వరహావస్థ యందు తమకు సాయించిన మాటను తప్పరు అను యర్థమును.

"పాశిత్తూరు క్కిడంద పార్మగళుక్కు ప్పండొరునాళ్ ।
మాశుడంబిల్ నీర్వారా మానమిలా ప్పన్రియాం ।
తేశుడైయ దేవర్ తిరువరంగచ్చెల్వనార్ ।
పేశియిరుప్పనగళ్ పేర్కవుం పేరావే.॥ (నాచ్చియార్ తిరు ౧౧-౮)

(నీటియొక్క పాచి శరీరమునకు పట్టుకొనగా, భూపిరాట్టికి కృతయుగమున వరాహావతారమునెత్తినపుడు బురద పట్టి శరీరమునుండి నీరుకారుచుండగా అభిమానరహితుడై వరాహరూపముధరించి। తేజోవంతులై ప్రకాశించుచుండెడి శ్రీరంగనాథస్వామివారు। సాయించిన శ్రీసూక్తులు హృదయమునుంచి పోగొట్టుకొన ప్రయత్నించినను పోవుగదా॥). అని శ్రీగోదాదేవియే స్వయముగ సాయించియుండిరి కదా.

గనుక ఈ వరాహపురాణము అన్ని పురాణముల కంటెను ఉత్కృష్టమైనదగుటలో ఎట్టి లోటును లేనిది,

ఎటులయనగా :- ఈ పురాణములో భగవంతుడు తెలిపిన ఉపాయము లన్నింటిలోను గానరూపమైన ఉపాయమే అత్యంత ఉత్కృష్టమైనది.

వీరు అనేక ఉపాయములను సాయించగా విని కటాక్షించిన పిరాట్టిమార్లు ఈ గాన రూపమైన ఉపాయమును తామాదరించి

"పార్కడలుల్ పైయ్యత్తుయిన్ఱ పరమనడి పాడి"

(పాల సముద్రమునందు ఆదిశేషునిపై యోగనిద్రచేయుచున్న పరమాత్ముని శ్రీపాదములగూర్చి గానముచేసి") అనియు,

"ఓంగి 'యులగళంద ఉత్తమన్ పేర్ పాడి"

(త్రివిక్రమరూపముతో పెరిగి లోకములను కొలిచి ఉత్తమునియొక్క తిరునామములను గానము చేసి") అనియు,

"మా మలర్గళ్ తూవి త్తొழுదు వాయినాల్ పాడి"

(భక్తిచే శ్రేష్ఠమైన పుష్పముల సమర్పించి, నమస్కరించి వాక్కుచే గానముచేసి) అనియు,

"నారాయణన్ మూర్త్తి కేశవనై ప్పాడవుం నీ"

(నారాయణ స్వరూపియు, బ్రహ్మరుద్రాదిపతియునైన సర్వేశ్వరుని పాడినను నీవు) అనియు,

"పావాయ్ ఎழுందిరాయ్ పాడిప్పఱై కొండు"

(ఓ ముగ్ధురాల లేచిరమ్మా, సర్వేశ్వరుని గుణగానముజేసి ఆయనవల్ల పురుషార్థమును పొంది) అనియు,

"నిన్ ముత్తం పుగుందు ముకిల్వణ్ణన్ పేర్ పాడ"

(నీ ముంగిలివాకిలిని ప్రవేశించి మేఘవర్ణుడైన సర్వేశ్వరుని తిరునామములు గానముచేయగా) అనియు,

"మనత్తుక్కినియానై ప్పాడవుం నీ"

(మనోహరుడైన సర్వేశ్వరునిగూర్చి గానము జేసినను నీవు అనియు,

"కిళ్ళి క్కళైందానై క్కీర్తిమై పాడి"

(నష్టులను తుంపి పారవేసిన శ్రీరామచంద్రుని కీర్తిని గానమొనర్చి) అనియు,

"పంగయ క్కణ్ణానై ప్పాడేలోర్"

(పద్మదళాయతాక్షుని గానమొనర్చుడు) అనియు,

"మాత్తారై మాత్తళిక్కవల్లానై ప్పాడేలోర్"

(ఎదుర్కొనిన శత్రువులయొక్క బలమును నశింపజేయు సమర్థుడైన సర్వేశ్వరునిగూర్చి గానమొనర్చుడు) అనియు

"తూయోమాయ్ వందోం తుయిలెళ ప్పాడువాన్"

(భక్తిచే పరిశుద్ధులమై వచ్చితిమి. సర్వేశ్వరునికి మేల్కొలుపులను పాడుటకై) అనియు,

"తిరుత్తక్క శెల్వముం శేవకముం యాం పాడి"

(లక్ష్మీదేవి యాశపడి సర్వేశ్వరుని ఐశ్వర్యమును, ఆయనయొక్క వీరచరితమును మేము గానము చేయుదుము) అనియు,

"గోవిందా వుందన్నై ప్పాడి ప్పఱై కొండు"

(ఓ గోవిందుడా, నిన్ను గానము జేసి నీవల్ల పురుషార్థమును పొందుదుము) అనియు,

వీరు సాయించగా వినిన ఉపాయము లన్నింటిలోను శ్రీ గోదాదేవి మనస్సున కెక్కగా ఆమె తాను పాడిన తిరుప్పావై పాశురములలో అనుష్ఠించి జూపిన ఉపాయము యిదియేయై ఉన్నది. గనుక అనేక ప్రదేశముల యందు తాను పాడిన పాశురములను సాయించి "పాడవల్ల నాచ్చియార్" "పాడతగిన పెరాట్టుమార్గ" అనియు తిరునామమును పొందగలిగిన దగుటచే, ఈ గానరూపమైన ఉపాయమే ముఖ్యమైనదగుచున్నది అని పెరాట్టిమార్గను జూచి సాయించినారు.

అవతారిక సమాప్తము.



శ్రీః

హరిః ఓం

# కైశికమహాత్మ్యము ప్రారంభము

(ఆంధ్రానువాదము)

శ్రీవరాహ స్వామివారు చెప్పుచున్నారు.

శ్లో॥ జాగరే తు విశాలాక్షి ।
జానతో వా ప్యజానతః ॥
యో మే ప్రగాయతే గేయం ।
మమ భక్త్యా వ్యవస్థితః ॥

1. ఈ శ్లోకమునందు తననుగూర్చి గానము చేయువానియొక్క గానవిధానమును సాయించుచున్నారు పాడ సమర్థుడైన వాడొకడు జాగరణ వ్రతనిష్ఠుడై "బ్రహ్మే ముహూర్తే చ ఉత్థాయ" (బ్రహ్మముహూర్తమున లేచి) అనుసరించుల సూర్యోదయాత్పూర్వమున బ్రహ్మముహూర్తమున వచ్చి, నేను శ్రద్ధగా వినని లేక జగద్రక్షణ చింతలో అన్యపరుడనై యుండనీ, మన కళ్యాణగుణముల వర్ణనలతో కూర్చబడిన గాథలను, మనవలన ఎట్టి ఫలమును అపేక్షించక యుండగ, మనపట్టగల భక్త్యతిశయముతో మన యానందము కొరకే పాడగలడు అని పిరాట్టిపూర్గను జూచి సాయించిరి.

2

శ్లో॥ యావన్తి త్వక్షరాణ్యస్య ।
గీయమానే యశస్విని ।
తావద్వర్ష సహస్రాణి ।
స్వర్గలోకే మహీయతే ॥

2. ఓ కీర్తిమంతురాలా! ఈ విధముగ నీ యొక్కయు నాయొక్కయు కీర్తిని విశిష్టముగా రచింపబడిన గాథలను మనల నుద్దేశించి గానము చేయుట వలన, ఆ గాథలయందలి అక్షరములకును, వాటి స్వరాలాపనలచే ఆరోపితములైన ఒక్కొక్క యక్షరమునకున్న వెయ్యేసి సంవత్సరములు స్వర్గలోకమునందు వసించును సుమా మన గాయకుడు అని సాయించిరి.

3

శ్లో॥ రూపవాన్ గుణవాన్ శుద్ధః ।
సర్వధర్మభృతాం వరః ।
నిత్యం పశ్యతి వై శక్రం ।
వజ్రహస్తం న సంశయః ॥

3. ఈయన స్వర్గలోకమందున్నంతకాలము అచ్చట నున్నవారందరికంటెను సుందరుడై, గుణవంతుడై, స్వర్గసుఖమున సక్తుడు గానివాడై, సమస్తధర్మములను ఎరింగి, అచ్చటను కూడ మనలను మరవకుండయుండును. ఆ దేవలోకాధిపతియగు ఇంద్రుడు తన యాయుధసహితుడై వచ్చి సేవించుచుండ అతనిని ఈయన క్రీగంట జూచుచునుండును సుమా మన గాయకుడు అని సాయించిరి.

4

శ్లో॥ మద్భక్తశ్చాపి జాయేత ।
ఇంద్రేణైకపదే స్థితః ।
సర్వధర్మగుణశ్రేష్ఠః ।
తత్రాపి మమ లుబ్ధకః ॥

4. ఈ విధముగ ఇంద్రుడు తనను సేవించుచు నుండినను ఇంద్రుడు అచ్చట మనలను మరచియుండకుండగ యుండుటమాత్రమే గాక, మన యారాధనరూపములైన కర్మలను చేయుచు మనలనే అనుసంధించుకొనుచు యుండును సుమా మనగాయకుడు - అని సాయించిరి.

5

శ్లో॥ ఇంద్రలోకాత్ పరిభ్రష్టో।
మమ గేయ - పరాయణః।
ప్రముక్తః సర్వ - సంసారైః।
మమ లోకం చ గచ్ఛతి॥

5. ఇంద్రలోకము నందున్నంతకాలము అచ్చటనున్న వారి నందరిని పిలిచి గానము వినిపించుచుండుట మాత్రమే గాకుండగ, మనలను స్మరించుచు గానము జేయుచు యుండుటచే, అచ్చట నుండి వీనిని మన పెద్ద సన్నిధిలో "ఏతత్సామ గాయన్నాస్తే" (నిత్యులు ముక్తులు సర్వేశ్వరుని గూర్చి సామగానము చేయుచుందురు) అనునటుల ఎపుడున్ను మన అనే పాడుకొనుచుండునటుల యుంచితిమిసుమా - అని సాయించిరి.

6

శ్లో॥ ఏవం తు వచనం శ్రుత్వా।
తత్ప్రసాదాత్ వసుంధరా।
వరాహరూపిణం దేవం।
ప్రత్యువాచ శుభాననా॥

6. ఈ విధముగ వరాహప్పెరుమాళ్ళు సాయించగా విని మనస్సునందు జనించిన ఆనందాతిశయమంతయును తిరుముఖమండలమున కనుపించునటుల వికసితవదనారవిందయై శ్రీవరాహ పెరుమాళ్ళను జూచి భూమిపిరాట్టి ఒకవార్తను విన్నవించుచున్నారు.

7

శ్లో॥ అహో గీతప్రభావో వై॥
యస్త్వయా ప్వరికీర్తితః।
కశ్చ గీతప్రభావేణ।
సిద్ధిం ప్రాప్తో మహాతపాః॥

7. వేదములద్వారా గాని, ఋషులద్వారా గాని చెప్పుట గాకుండగ. దేవరవారే స్వయముగ సాయించుచున్నారు. ఈ విధమైన విలక్షణ గాన ప్రభావముచే దేవరవార్లయొక్క శ్రీపాదములను పొందినవారెవరో ఆయనను గూర్చి సాయించవేడెద। అని విన్నవించెను.

8

శ్రీవరాహ ఉవాచ

శ్లో॥ శృణు తత్త్వేన తే దేవి।
కథ్యమానం యశస్విని।
యస్తు గీతప్రభావేణ।
సిద్ధిం ప్రాప్తో మహాతపాః॥

8. ఈ విధముగ విన్నవించిన భూపిరాట్టిని జూచి శ్రీవరాహ పెరుమాళ్ళు సాయించుచున్నారు

"సొంబైయార్క్కుం తం పాంబుపోల్ నావు మిరండు శవాయిత్తు" శేషశాయి అయిన సర్వేశ్వరునికి కూడ తమ పామునకు వలెనే నాలుకలు రెండున్నవి కౌబోలును. అని నీవనున్న ననువటుల నీతో నవ్వులాటకై అను మాటలుగ వీనిని తలంచకుము. ఇపుడు నేను తెలుపునది యదార్థమైన సంగతి. ఎవడైతే మనలను గానమొనర్చి మనవైకుంఠపురమును చేర కలిగెనో వానిని గురించి చెప్పుచున్నాము సుమా వినుమా. అని సాయించిరి.

శ్లో॥ అస్తి దక్షిణ దిగ్భాగే।
మహేంద్రో నామ పర్వతః।
తత్ర క్షీరనదీ పుణ్యా।
దక్షిణే సాగరంగమా॥

9. ఓ పిరాట్టీ! దక్షిణ దిక్కునందు మహేంద్రమని ఒక పర్వతము ప్రసిద్ధమై యున్నది. అచ్చట క్షీరనది యను ఒక నది దక్షిణ సముద్రమును గూర్చి ప్రవహించుచున్నది.

10

శ్లో॥ తత్ర సిద్ధాశ్రమే భద్రే।
చండాలః కృతనిశ్చయః।
దూరాత్ జాగరణే గాతి।
మమ భక్త్యా వ్యవస్థితః॥

10 పూర్వము నీవు నేను కురుంగుడిగ కట్టి యున్న ఆశ్రమమున పాపయోని సంభవుడైనవాడొకడు మనలను గూర్చి గానము జేయ సంకల్పించుకొని, జాగరణ వ్రతమున నిష్ఠగలవాడై, మరియు మన యందుగల భక్త్యాతిశయముతో బ్రాహ్మముహూర్తమున లేచి వచ్చి మన యెదుట దూరముగ నిలచి పాడుచుండెడివాడు సుమా - అని సాయించిరి.

11

శ్లో॥ ఏవం తు గాయమానస్య ।
గతాః సంవత్సరా దశ ।
శ్వపాకస్య గుణజ్ఞస్య ।
మద్భక్తస్య వసుంధరే ॥

11. ఈ విధముగా అంత్యజాతిలో ఉద్భవించినవాడై నప్పటికిన్ని, మన గుణాను సంధానము జేయుచు మనకు భక్తుడై వచ్చుచు పది సంవత్సరములు పాడినాడు సుమా - అని సాయించిరి.

12

శ్లో॥ కౌముదస్య తుమాసస్య ।
ద్వాదశ్యాం శుక్లపక్షకే ।
సుప్తేజనే గతేయామే ।
వీణామాదాయ నిర్యయా ॥

12. తరువాత ఒక కార్తీకమాస శుక్లపక్ష ద్వాదశినాటి రాత్రి ఒక ఝామువకై పైన అందరు నిద్రించియున్న సమయమున తాను జాగరణ వ్రత నిష్టుడగుటచే మేలుకొని యుండి, మనమున్న స్థలమునకు వచ్చి మనలను గానము జేయుటకై చేతిలో వీణనుధరించెనవాడై తనయింటివద్దనుండి బయలుదేరెను సుమా అని సాయించిరి.

13

శ్లో॥ తతో వర్త్మని చండాలో ।
గృహీతో బ్రహ్మరక్షసా ।
అల్పప్రాణః శ్వపాకో వై
బలవాన్ బ్రహ్మరాక్షసః ॥

13. అనంతరము మార్గ మధ్యమునకు వచ్చిన పిమ్మట ఆయన ఒక బ్రహ్మరాక్షసుని చేతిలో చిక్కెను. ఆ బ్రహ్మరాక్షసుడు మాంసాహారముచే వృద్ధిపొందినవాడై బలవంతుడై యుండెను. మన గాయకుడు మన ధ్యానముచే చిత్తము కరగి ద్రవించుచుండువారలగుటచే శరీర దౌర్బల్యము గలవాడై యుండెను - అని సాయించిరి.

14

శ్లో॥ దుఃఖేన స తు సంతప్తో ।
న చ శక్తో విచేష్టితుం ।
ఉవాచ వచనం మందం ।
మాతంగో బ్రహ్మరాక్షసం ॥.

14. మన గాయకుడు బలవంతుడు గాకుండుటచే పరాక్రమించి విడిపించుకొని పోవుటకు సమర్థుడు కాజాలడాయెను. బ్రాహ్మణ జాతీయుడున్ను గాకుండుటచే ఏ పంచాక్షరినో, ఏ వేద పనసనో ఉచ్చరించి విడిపించుకొని పోవుటకు సమర్థుడు కాజాలడాయెను. మనయందు భరన్యాసము జేసినవాడై బ్రహ్మరాక్షసుని జూచి మధురముగ ఒక మాటను చెప్పెను సుమా - అని సాయించిరి.

15

శ్లో॥ గచ్ఛామి సంతోషయితుం ।
అహం జాగరణే హరిం ।
గానేన పుండరీకాక్షం ॥
బ్రహ్మరాక్షస ముంచ మాం ॥

".5 శిత్తుం శిరుకాలే వందున్నై చేవిత్తు" (బాగ తెల్లవారు ఝామునకే లేచి వచ్చి నిన్ను సేవించుకొని) అనునటుల పుండరీకాక్షుడగు సర్వేశ్వరుని గానము జేసి ఆయన కటాక్షపాత్రుడ నగుటకై పోవుచున్న నన్ను ఓ బ్రహ్మరాక్షసా నన్ను విడిచిపెట్టుమా అని మనగాయకు డనెను.

16

శ్లో॥ ఏవ ముక్తః శ్వపాకేన ।
బలవాన్ బ్రహ్మరాక్షసః ।
అమర్షవశ మాపన్నో ।
నచ కించిత్ త మబ్రవీత్ ॥

16 ఈ విధముగ హీనుడైన మన గాయకునిచే పలుకబడిన మాటలను విని బలవంతుడైన బ్రహ్మరాక్షసుడు అత్యంత క్రూరచిత్తుడై ఉదాసీనుడై మన గాయకునితో ఏమియు మాటాడకుండ యుండెను.

17

శ్లో॥ ఆత్మానం ప్రతి ధావంతం ।
చండాళః ప్రాహ రాక్షసం॥
కిం త్వయా చేష్టితవ్యం మే ।
శ్లో॥ య ఏవం పరిధావసి.॥

17. ఈ విధముగ తనవైపే పరుగిడి వచ్చుచున్న బ్రహ్మరాక్షసుని జూచి, తిరిగి మన గాయక హరిజనుడు వినయముతో ఒక వాక్యము నిటుల పలికెను. ఈ విధముగ నాకొరకై పరుగిడి వచ్చిన నీవు నన్ను ఏమిచేయబోవు చున్నావు. అని అడిగెను.

18

శ్లో॥ శ్వపాకవచనం శ్రుత్వా ।
తతో వై బ్రహ్మరాక్షసః ।
ఉవాచ వచనం ఘోరం ।
మానుషాహార - లోలుపః

18. మన గాయక హరిజనుని మాటను విని పిమ్మట బ్రహ్మరాక్షసుడు మానవ - మాంసాహారము నందు ఆశ గలవాడై అతిక్రూరమైన మాటలను ఆడజొచ్చెను.

19

శ్లో॥ అద్యమే దశరాత్రం వై ।
నిరాహారస్య గచ్ఛతః ।
ధాత్రా త్వం విహితో మహ్యం ।
ఆహారః పరితో మమ.॥

19. "నిగరిల్ అవన్ పుగళ్ పాడి ఇళైప్పిలం" (సాటిలేని సర్వేశ్వరుని కీర్తిని గాన మొనర్చి క్లేశరహితులమై యున్నాము) అనుచు నీవు పది సంవత్సరములనుండి పాడుచు ఏ క్లేశము లేకుండగ నున్నావు. నేను పదిరోజులనుండియు ఆహారము లేక ఉపవాసములతో కృశించియున్నాను. గాన నాకొరకై బ్రహ్మచే ఆహారముగ నిర్దేశించబడితివి. ఇది చాలును నాకు. నిన్ను ఇక విడువను అని అనెను.

20

శ్లో॥ అద్య త్వాం భక్షయిష్యామి ।
స - వసా - మాంస - శోణితం ।
తర్పయిత్వా యథాన్యాయం ।
యాస్యామి చ యథేప్సితం॥.

20. ఇపుడు నిన్ను నేను విడువను నీ అవయవములను విడతీసి నీ శరీరమందలి క్రొవ్వు - మాంసము - రక్తములను నా యిష్టదైవమునకు నివేదించి భక్షించి, నా యాకలిని తీర్చు కొని నాకిష్టమువచ్చిన స్థలమునకు బోయెదను.

21

శ్లో॥ బ్రహ్మరక్షో వచః శ్రుత్వా ।
శ్వపాకో గీతలాలసః ।
రాక్షసం ఛందయామాస ।
మమ భక్త్యా వ్యవస్థితః ॥

21. ఈ విధముగ బ్రహ్మరాక్షసుడు చెప్పిన మాటలను విని మన గాయక హరిజనుడు శరీరావసాన రూపమైన ఆపద కలిగినను మనయందు భక్త్యతిశయముతో కూడుకున్నవాడై, మనలను గూర్చి గాన మొనరించవలెనను ఆశచే ఆ రాక్షసుని బ్రతిమాలుకొనుచు ఒక చక్కని వాక్యమును పలికెను.

22

శ్లో॥ శృణు తత్త్వం మహాభాగ,
భక్ష్యోఽహం సముపాగతః।
అవశ్య మేతత్ కర్తవ్యం ।
ధాత్రా దత్తం యథా తవ.॥

22. ఓ అదృష్టవంతుడా! యదార్థమును జెప్పుచున్నాను. వినుము. నీ వనినటుల నే నేను నీకు ఆహార రూపుడనై యున్నాను, బ్రహ్మకల్పించిన ప్రకారము వర్తించుట నాకును ఆవశ్యకమైనదియే కదా.

23

శ్లో॥ పశ్చాత్ ఖాదసి మాం రక్షో।
జాగరే వినివర్తితే।
విష్ణోః సంతోషణార్థాయ।
కృమైత ద్వ్రత ముత్తమం॥

23. ఓ రాక్షసా! నా కొక నియమము కలదు, సర్వేశ్వరుని ప్రీతికొరకై చేయు జాగరవ్రతమను నా ప్రతిన కలదు. దానిని ముగించుకొని నేను నీ వద్దకు తిరిగి వత్తును. అప్పుడు నీవు నన్ను ఆహారముగ గైకొందువు గాక.

24

శ్లో॥ రక్ష మాం వ్రతభంగా ద్వై।
దేవం నారాయణం ప్రతి।
జాగరే వినివృత్తే తు
మాం భక్షయ యథేప్సితం॥

24. భగవంతుడైన నారాయణుని గురించి నేను ఆవలంభించిన వ్రతమునకు ఎట్టి భంగము రాకుండునటుల నన్ను కాపాడవలయును. ఈ జాగరణ వ్రతము సమాప్తమైన వెంటనే నీ యిష్టము వచ్చినటుల నన్ను నీవు భక్షింతువుగాక.

25

శ్లో॥ శ్వపాకస్య వచః శ్రుత్వా।
బ్రహ్మరక్షః క్షుధార్దితం।
ఉవాచ మధురం వాక్యం।
శ్వపాకం తదనంతరం॥

25. మన నాయకుడైన హరిజనుని ఈ వాక్యములను వినిన పిమ్మట ఆకలి బాధతో అలమటించుచున్న బ్రహ్మరాక్షసుడు ఆ హరిజనుని గూర్చి మధురముగ నొక వాక్యమును పలికెను.

26

శ్లో॥ మోఘం భాషసి చండాళ।
పున రేష్యా మ్యహం త్వితి।
కోహి రక్షోముఖా ద్భ్రష్టః।
తన్ముఖా యాభివర్తతే.॥

26. ఓ చండాలుడా! నీ జాతికి తగినటులనే యున్నవి. నీవు చెప్పిన మాటలు పోయి తిరిగివత్తునని సాక్షాత్తు అబద్ధమునే పలికితివి. ఎవడైనను బ్రహ్మరాక్షసుని చేతిలో జిక్కి తప్పించుకొని పోయి, తిరిగివచ్చి వానిచేతిలో పడునా?

27

శ్లో॥ బహవ స్సంతి పంథానో।
దేశా శ్చ బహవ స్తథా।
ఆత్మదేశం పరిత్యజ్య।
పరేషాం గంతు మిచ్ఛసి॥

27. ఈ మార్గమె గాక యింకను అనేకమార్గము లున్నవి. ఈ దేశమెగాక యింకను అనేక దేశములున్నవి. నీ దేశమును విడిచి దేశాంతరమునకు పోవుటకై ఆలోచించుచున్నావు.

28

శ్లో॥ స్వశరీర-వినాశాయ।
న చా గచ్ఛతి కశ్చన।
రక్షసో-ముఖ - విభ్రష్టః।
పున రాగంతు మిచ్ఛసి॥

28. తనకు శరీరనాశనము కలుగు స్థలమును ఎఱిగి యుండియు ఆ స్థలమును ఎవరైన వత్తురా? రాక్షసుని చేతిలో బడియుకూడ తప్పించుకొనిపోయి తిరిగి రాగోరెదవా? సాక్షాత్తు అబద్ధమునే యాడుచున్నావు.

29

శ్లో॥ రాక్షసస్య వచః శ్రుత్వా ।
చండాలో ధర్మసంశ్రితః ।
ఉవాచ మధురం వాక్యం ।
రాక్షసం పిశితాశనం॥.

29. రాక్షసునియొక్క ఈవాక్యములను విని మనగాయకుడైన హరిజనుడు ధర్మయుక్తమైనట్టియు మధురమైనట్టియు, ఒక మాటను మాంసభక్షకుడైన రాక్షసుని గురించి పలికెను.

30

శ్లో॥ యద్యప్యహం హి చండాలః ॥
పూర్వ - కర్మ - విదూషితః ।
ప్రాప్తోఽహం మానుషం భావం ।
విది తే నాంతరాత్మనా ॥

30. పూర్వకర్మదోషముచే ఈ చండాల జాతిలో బుట్టితిని. అయినను పరమాత్మ జ్ఞానముండుటచే, ఒక మానవునికి యుండవలసిన జ్ఞానము నాకు గూడ యున్నది సుమా గాన నా మాటను వినుమా.

31

శ్లో॥ శ్రుణు తత్సమయం రక్షో ।
యేనా గచ్ఛా మ్యహంపునః ।
దూరా జ్జాగరణం కృత్వా ।
లోకనాథస్య తృప్తయే.॥

31. త్రిలోకనాథుడైన సర్వేశ్వరునికి మేలు కొలుపులను దూరమునుండి పాడి ఆయన తృప్తికి లక్ష్యభూతుడనై నా వ్రతమును పూర్తిజేసుకొని నీ వద్దకు తప్పక తిరిగి వత్తును ఈ నా ప్రతిజ్ఞను వినుమా.

32

శ్లో॥ సత్యమూలం జగత్ సర్వం ।
లోకః సత్యే ప్రతిష్ఠితః ।
నాహం మిథ్యా ప్రవక్ష్యామి ॥
సత్య మేవ వదా మ్యహం ॥.

32 ఈ లోకమంతయు సత్యము చేతనే నిలచి యున్నది. సత్యమునందు మాత్రమే లోకము ప్రతిష్ఠితమై యున్నది. నేను ఎంతమాత్రము అసత్యమును వచించుటలేదు. సత్యమును మాత్రమే పలుకుచున్నాను.

33

శ్లో॥ అద్య మే సమయ స్త్వత్ర ।
బ్రహ్మరాక్షస తం శ్రుణు ।
శపామి సత్యేన గతో ।
యద్యహం నాగమే పునః ॥

33. ఓ బ్రహ్మరాక్షసుడా ! ఈ విషయములో నేను జేయుచున్న ప్రమాణమును వినుమా, నేనుగనుక తిరిగి నీ వద్దకు రానిచో సమస్తమునకు కారణభూతమైన సత్యము నుండి భ్రష్టుడైనవాడు పొందు ఆపత్తును పొందగలను.

34

శ్లో॥ యో గచ్ఛేత్ పరదారాం శ్చ ।
కామ - మోహ - ప్రపీడితః ।
తస్య పాపేన లిప్యేయం ।
యద్యహం నాగమే పునః ॥

34. నేనే గనుక నీవద్దకు తిరిగిరానిచో, మన్మథపీడితుడై కామాంధకారుడై పరస్త్రీగమనము చెందినవాడే పాపమును పొందునో అట్టి పాపమును పొందగలను.

35

శ్లో॥ పాకభేదం తు యః కుర్యాత్ ।
ఆత్మన శ్చోపభుంజతః ।
తస్య పాపేన లిప్యేయం ॥
యద్యహం నాగమే పునః ॥

35 నేనే గనుక నీవద్దకు తిరిగి రానిచో, పంక్తిలో భుజించునపుడు తనకొకరకమైన వంటకమును వడ్డించుకొని, ప్రక్కవానికి మరొకవిధమైన వంటకమును వడ్డించి భుజించువాడు ఏ పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

36

శ్లో॥ దత్వా వై భూమిదానం తు ।
పున రాచ్ఛిందతీహ యః ।
తస్య పాపేన లిప్యేయం ।
యద్యహం నాగమే పునః ॥

36. నేనే గనుక నీ వద్దకు తిరిగి రానిచో, ఒక బ్రాహ్మణునకు భూమిని దానము జేసి తిరిగి ఆభూమిని తానే అపహరించువాడు ఎట్టి పాపమును పొందునో అట్టి పాపమును పొందగలను.

37

శ్లో॥ స్త్రియం భుక్త్వా రూపవతీం ।
పున ర్యస్తాం వినిందతి ।
తస్య పాపేన లిప్యేయం ।
యద్యహం నాగమే పునః ॥

37. నేనే గనుక నీవద్దకు తిరిగి రానిచో, రూపవతియైన స్త్రీని ఆమె యవ్వన కాలమున అనుభవించి, కొంత కాలమైన పిమ్మట ఆమెను మిక్కిలియు దూషించుచు విడిచి పెట్టినవాడు ఏ పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

38

శ్లో॥ యోఽమావాస్యాం విశాలాక్షి ।
శ్రాద్ధం కృత్వా స్త్రియం వ్రజేత్ ।
తస్య పాపేన లిప్యేయం ।
యద్యహం నాగమే పునః ॥

38 నేనే గనుక నీవద్దకు తిరిగి రానిచో, అమావాస్య నాడు శ్రాద్ధమును పెట్టి స్త్రీగమన మాచరించినవాడు ఏ పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

39

శ్లో॥ భుక్త్వా పరస్య చాన్నాని ।
య స్తం నిందతి నిర్ఘృణః ।
తస్య పాపేన లిప్యేయం ।
యద్యహం నాగమే పునః ॥

39. నేనే గనుక నీ వద్దకు తిరిగి రానిచో, పరుల యన్నమును చక్కగా భుజించి, దయారహితుడై కృతఘ్నుడై ఆ యన్నము పెట్టినవానిని దూషించువాడు ఏ పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

40

శ్లో॥ యస్తు కన్యాం దదామీతి ।
పున స్తాం న ప్రయచ్ఛతి ।
తస్య పాపేన లిప్యేయం ।
యద్యహం నాగమే పునః॥

40. నేనే గనుక నీ వద్దకు తిరిగి రానిచో, ఒకనికి కన్యను దానము చేయుదునని వాగ్దానము జేసి, ఆ తరువాత ఆవిధముగ దానము చేయనివాడు ఎట్టి పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

41

శ్లో॥ షష్ఠ్యష్టమ్యో ర్యమావాస్యా।
చతుర్దశ్యో శ్చ నిత్యశః।
అస్నాతానాం గతిం గచ్ఛే।
యద్యహం నాగమే పునః॥

41. నేనే గనుక నీవద్దకు తిరిగి రాకపోయినచో, షష్ఠి, అష్టమి, అమావాస్య, చతుర్దశి. ఈ తిథుల యందు స్నానమాచరించకుండగ భుజించునట్టివాడు ఏ పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

42

శ్లో॥ దాస్యామీతి ప్రతిశ్రుత్య।
న చ యస్తత్ప్రయచ్ఛతి।
గతిం తస్య ప్రపద్యే వై।
యద్యహం నాగమే పునః॥

42. నేనే గనుక నీవద్దకు తిరిగి రాకపోయినచో, ఒకనికి ఒక వస్తువును దాన మిచ్చెదనని వాగ్దానము జేసి, పిమ్మట ఆ వస్తువును వానికి యివ్వనివాడు ఏ పాపమును పొందునో అట్టి పాపమునుపొందగలను.

43

శ్లో॥ మిత్రభార్యాం తు యోగచ్ఛేత్।
కామ - బాణ - వశానుగః।
తస్య పాపేన లిప్యేయం।
యద్యహం నాగమే పునః॥

43. నేనే గనుక నీవద్దకు తిరిగి రాకపోయినచో, మితాత్ త్రాయత ఇతి మిత్రం - అనిపలుకుల మహా..కారకుడైన తన మిత్రుని భార్యను మన్మథబాణ పీడితుడై వశపరచుకొనునట్టివాడు ఏ పాపమును పొందునో, అట్టి పాపమును పొందగలను.

44

శ్లో॥ గురుపత్నీం రాజపత్నీం చ।
యే తు గచ్ఛంతి మోహితాః।
తేషాం గతిం ప్రపద్యే వై।
యద్యహం నాగమే పునః॥

44 నేనే గనుక నీవద్దకు తిరిగి రాకపోయినచో, తమకు ఆముష్మిక ప్రదాతయగు స్వాచార్యుని భార్యను రాజుయొక్క భార్యను కామమోహితుడై యనుభవించువాడు ఏ గతిని పొందునో, అట్టిగతిని పొందగలను.

45

శ్లో॥ యో వై దారద్వయం కృత్వా।
ఏకస్యాం ప్రీతిమాన్ భవేత్।
గతిం తస్యప్రపద్యే వై।
యద్యహం నాగమే పునః॥

45. నేనే గనుక నీ వద్దకు తిరిగి రాకపోయినచో, ఇద్దరు స్త్రీలను పెండ్లాడి, అందు ఓకామెను ఉపేక్షించి, రెండవ యామె యందు మాత్రము ప్రీతివంతుడై యుండు నట్టివాడు ఏ గతిని పొందునో, అట్టిగతిని పొందగలను.

46

శ్లో॥ అనన్యశరణాం భార్యాం।
యౌవనే యః పరిత్యజేత్।
తస్య పాపేన లిప్యేయం।
యద్యహం నాగమే పునః॥

46. నేనే గనుక నీ వద్దకు తిరిగి రాకపోయినచో, అనన్యగతికురాలై పతివ్రతయై యుండు భార్యను యౌవ్వనములో విడిచిపుచ్చిన వాడు ఎట్టి పాపమును పొందునో, అట్టిపాపమును పొందగలను:

47

శ్లో॥ గోకులస్య తృషార్తస్య।
జలార్థ మభిధావతః।
విఘ్నం మాచరతే యస్తు।
తత్ పాపం స్యాదనాగమే॥

47. నేనే గనుక నీ వద్దకు తిరిగి రాకపోయినచో, మిక్కిలి దాహముచే బాధింపబడుచు జలపానము కొరకై వేగముగ పరుగులిడుచు వచ్చుచున్న పశుగణమునకు జలపాన విఘ్నము నాచరించు నట్టివాడు పొందునట్టి పాపము నే పొందగలను.

48

బ్రహ్మఘ్నే చ సురాపే చ।
చోరే భగ్నవ్రతే తథా।
యా గతి ర్విహితా సద్భిః॥
తత్ పాపం స్యాదనాగమే॥

48. నేనే గనుక నీ వద్దకు తిరిగి రాకపోయినచో, బ్రహ్మహత్య చేసినట్టివాడున్ను, మద్యపానమొనరించునట్టి వాడును, బంగారును దొంగిలించినట్టివాడున్ను, వ్రతభంగ మొనరించినట్టివాడున్ను, ఇట్టి మహాపాపాత్ములు ఏగతిపొందుదురని పెద్దలచే చెప్పబడినదో. అట్టి క్రూరమైన గతిని పొందగలను.

49

శ్లో॥ వాసుదేవం పరిత్యజ్య।
యేఽన్యం దేవ ముపాసతే।
తేషాం గతిం ప్రపద్యే వై।
యద్యహం నాగమే పునః॥

49. నేనే గనుక నీ వద్దను తిరిగి రాకపోయినచో ఆశ్రితసులభుడై, సర్వవ్యాపియైయున్న శ్రీ వాసుదేవుని ఆరాధించకుండగ, ఇతర దేవతల నుపాసించువారలు ఏ గతిని పొందుదురో, అట్టిగతిని పొందగలను,

50

శ్లో॥ నారాయణ మథాన్యై స్తు।
దేవై స్తుల్యం కరోతి యః।
తస్య పాపేన లిప్యేయం।
యద్యహం నాగమే పునః॥

50. నేనే గనుక నీవద్దకు తిరిగి రాకపోయినచో, సర్వస్మాత్ పరుడై సర్వాంతర్యామియై, సర్వకర్మసమారాధ్యుడై, ముముక్షువుపాస్యుడై, మోక్షప్రదుడై, ముక్తప్రాప్యుడైన సర్వేశ్వరుని "కాశీలు మురుక్కిలాల్ తెరిక్క నాదకీర్తియార్! పేణిలుం వరందరుం ముడిక్కాదా దేవరాయ్" (చూడతగిన విగ్రహసౌందర్యము లేనివారై, వినతగినకీర్తి లేనివారై, అర్చనను వరమీయతగిన శక్తిలేనివారై దేవతాంతరములుందురు) అనునట్టుల కర్మపరవశులై యుండు భగవద్వ్యతిరిక్త దేవతలను భగవంతునితో సములుగ తలంచు వాడెట్టి పాపమును పొందునో, అట్టిపాపమును పొందగలను. అని తెలిపెనని శ్రీ వరాహ పెరుమాళ్ళు భూపిరాట్టికిని తెలుపుచు యింకను నిటుల నుడివిరి.

51

శ్లో॥ చండాల వచనం శ్రుత్వా।
పరి తుష్టస్తు రాక్షసః।
ఉవాచ మధురం వాక్యం।
గచ్ఛ శీఘ్రం నమోఽస్తుతే॥

51. ఈ విధముగ చేయబడిన మనగాయక హరిజను వాక్యములను విని చాల సంతోషించినవాడై ఆ రాక్షసుడు మధురముగ యిటుల పలికెను, ఓయి, నీవు శీఘ్రముగ పోయిరమ్ము. నీకు నమస్కారము, అనెను.

52

శ్లో॥ రాక్షసేన వినుర్ముక్తః।
చండాళః కృతనిశ్చయః।
పునర్గాయతి మహ్యాం వై।
మమ భక్త్యా వ్యవస్థితః॥

52. మన గాయక హరిజనుడు ఆ బ్రహ్మరాక్షసుని విడివిడి సంసారమునుండి వచ్చు ముక్తపురుషుని వలె మన వద్దకు వచ్చి, పూర్వమువలెనే మనలను గూర్చి నాయందు అత్యంత భక్తియుక్తుడై గానము జేసెను సుమా!

53

శ్లో॥ అథ ప్రభాతే విమలే।
వినివృత్తే తు జాగరే।
నమో నారాయణే త్యుక్త్వా।
శ్వపాకః పున రాగమత్॥

53 పిమ్మట చక్కగా, తెల్లవారగా భగవంతునికి సుప్రభాతము పాడునట్టి వ్రతముముగియగానే మన గాయకుడు మనకు ఆత్మసమర్పణ మొనరించి "నమోనారాయణ" యనచు, తనకు త్యాజ్యమైన శరీరావసానమందలి ఆశతో వేగముగ మరలివచ్చెను.

54

శ్లో॥ గచ్ఛతః త్వరితం తస్య।
పురుషః పురత స్థితః।
ఉవాచ మధురం వాక్యం।
శ్వపాకం తదనంతరం।

54 మనగాయకుడు మరలిపోవునపుడు,-పాడుటకై మనవద్దకు వచ్చునప్పటికంటె రెట్టింపు వేగముతో వెళ్ళజొచ్చెను. ఈ విధమున పోవునట్టి వాని ఎదుట ఒక పురుషుడు వచ్చినిలిచి మన గాయకుని జూచి మధురముగ యిటుల పలికెను.

55

కుతో గచ్ఛసి చండాళ।
ద్రుతం గమననిశ్చితం।
ఏతదాచక్ష్వ తత్త్వేన।
యత్ర తే వర్తతే మనః॥

55. ఓ హరిజనుడా! నీ నడక చూడగా వెనుకటి వలె గాక మిక్కిలి వేగవంతమై యున్నది. నీ మనస్సు దేనిమీద నున్నది? నీ వెచ్చటికిటుల పరుగిడి పోవుచున్నావు. దీనిని నాకు యదార్థముగ చెప్పవలెను సుమా.

56

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా।
శ్వపాకః సత్యసమ్మతః॥
ఉవాచ మధురం వాక్యం॥
పురుషం తదనంతరం॥

56. సత్య ప్రతిజ్ఞావంతుడైన మన గాయకుడు ఆ పురుషుని మాటలను విని, వానిని జూచి మధురముగ ఒక వాక్యమును యిటుల పలికెను.

57

శ్లో॥ సమయో మే కృతో యత్ర।
బ్రహ్మరాక్షస - సన్నిధౌ॥
తత్రాహం గంతు మిచ్ఛామి।
యత్రాసౌ బ్రహ్మరాక్షసః॥

57. బ్రహ్మరాక్షసుని యెదుట యిదివరలో శపథము జేసి వచ్చితిని. ఆ శపథమును తప్పకుండగ బ్రహ్మరాక్షసుడు ఉన్నచోటునకు పోవుచున్నాను. వాడచ్చట కనపించనిచో వాడెచ్చట యుండునో అచ్చటికి వెతకికొనుచు పోవుదును, అనెను.

58

శ్లో॥ శ్వపాక వచనం శ్రుత్వా।
పురుషో భావశోధకః ॥
ఉవాచ మధురం వాక్యం।
శ్వపాకం తదనంతరం॥

58. హరిజనుని ఈ మాటలను విని, ఇమ్మాట తనను మనస్సును పరీక్షించుకోరినవాడై ఆ పురుషుడు హరిజనునితో మధురముగ యిటుల పలికెను.

59

శ్లో॥ న తత్ర గచ్ఛ చండాల!
మార్గేణానేన సువ్రత ॥
తత్రాసౌ రాక్షసః పాపః ॥
పిశితాశీ దురాసదః ॥

59. ఓయి సువ్రతుడవైన హరిజనుడా! నీవు ఈమార్గమున అచ్చటకు వెళ్ళవలదు. అచ్చట జాత్యారాక్షసుడై అందును విభీషణుడవలె ధర్మికుడై యుండకుండగ పాపిష్ఠుడై అందును శరీరముతో బ్రతుకుటకు లేకుండగ మాంస భక్షకుడై, మరియు వానిని చంపుటకు వీలులేనంత బలవంతుడైన వాడొకడున్నాడు. నీ వచ్చటకు పోవలదు, అనెను.

60

శ్లో॥ పురుషస్య వచః శ్రుత్వా।
శ్వపాకః సత్యసంగరః
మరణం తత్ర నిశ్చిత్య ॥
మధురం వాక్య మబ్రవీత్ ॥

60. ఆ పురుషుడు పలికిన వాక్యమును విని సత్యవాదియగు ఆ హరిజనుడు సత్యవ్రతమును విడుచుట కంటెను ప్రాణమును విడుచుట శ్రేష్ఠముగ తలంచినవాడై, మధురమైన వాక్యమును యిటుల పలికెను.

61

శ్లో॥ నాహ మేవం కరిష్యామి।
య న్మాం త్వం పరిపృచ్ఛసి ॥
అహం సత్యే ప్రవృత్తో వై ॥
శీలం సత్యే ప్రతిష్ఠితం॥

61. ఓయీ! నేను నీవుచెప్పినటుల చేయజాలను. నేను సత్యమును తప్పకుండగ నుండెదను. నేను సత్యమును తప్పినను, నా స్వభావము సత్యమును తప్పదు సుమా!

62

తత స్స పద్మపత్రాక్షః।
శ్వపాకం ప్రత్యువాచ వా।
యద్యేవం నిశ్చయ స్తాత।
స్వస్తి తేఽస్తు గమిష్యతః।

62. ఈ విధముగ పలికిన మన గాయకుని జూచి, ఆ పురుషుడు 'వీడు ప్రాణమును విడిచి సత్యమును రక్షించెద' నని ప్రతిన బూనినాడుకదాయని ప్రీతికంతుడై "అమలంగళాగ విభుక్ష్యం" (నిర్మలమైన జూపులు ప్రసరించును.) అనినటుల మనగాయకుని పాడుటకై పంపించిన బ్రహ్మరాక్షసుని ఆపదయు మన గాయకుని ఆపదయు పోవునటుల పరిపూర్ణముగ కటాక్షించి "నీకు మంగళ మగుగాక పోయిరమ్ము" అని పంపివేసెను. ఆపురుషుడు ఎవరోయని సందేహించవలదు "మహా వరాహః స్ఫుటపద్మలోచనః" (గొప్ప వరాహస్వరుపుడైన కన్నులాయుత లోచనుడు.) పురుషః పుష్కరేక్షణః" (ఎర్రతామరపువ్వు రేకులవంటి నేత్రములు గల మహాపురుషుడు) అని చెప్పబడునటుల యిద్దరు ఒకేవ్యక్తి విశేషమే సుమా

63

శ్లో॥ బ్రహ్మరక్షోంతికం ప్రాప్య ।
సత్యోసౌ కృతనిశ్చయః ।
ఉవాచ మధురం వాక్యం ।
రాక్షసం పిశితాశనం ॥

63. ఆ పురుషుని యనుజ్ఞనుగొని మనగాయకుడు సత్యవ్రత పాలనమున నిష్ఠగలవాడై, బ్రహ్మరాక్షసును వెదకుకొనుచు అతని వద్దకుచేరి, మాంసభక్షకుడైన ఆ రాక్షసునితో మధురముగ నిటుల ఒక వాక్యమును పలికెను.

64

శ్లో॥ భవతా సమనుజ్ఞాతో ।
గానం కృత్వా యథేప్సయా ।
విష్ణవే లోకనాథాయ ।
మమ పూర్ణో మనోరథః

64. ఓయీ బ్రహ్మరాక్షసా, నీచే యనుజ్ఞను బడసి పోయిననేను, బ్రహ్మణానుజ్ఞను బొంది వెళ్ళిన వాడనగుటచే నాకు తృప్తితీరునటుల సర్వేశ్వరుడైన శ్రీమహావిష్ణువైన సుందరాంగుని పాడి ఆనందింపజేసి పరిపూర్ణమైన మనోరథము గలవాడనైతిని.

65

శ్లో॥ ఏతాని మమ చాంగాని ।
భక్షయస్వ యథేచ్ఛయా ।
శ్వపాకవచనం శ్రుత్వా ।
బ్రహ్మరక్షో భయానకం ॥

65. నీవున్ను నాయొక్క ఈశరీరమందలి రక్త మాంసాదులను నీకు తృప్తి కలుగునటుల భక్షించుమూ, అనెను. భయంకరుడైన ఆ బ్రహ్మరాక్షసుడు భీతినిగొలుపునట్టు హరిజనుని ఈ వాక్యములను విని ఆయన సత్యవ్రత నిష్ఠకు భీతిచెందెను.

66

శ్లో॥ ఉవాచ మధురం వాక్యం ।
శ్వపాకం సంశితవ్రతం ।
త్వమద్య రాత్రౌ చండాల !
విష్ణోర్జాగరణం ప్రతి ॥

66. అప్పుడు ఆ బ్రహ్మరాక్షసుడు పలికిన మాటను పరిపూర్ణముగ అక్షరశః నెరవేర్చు చున్నట్టి మన గాయక హరిజనుని గూర్చి మధురముగ యిటుల ఒకమాటను పలికెను. ఓయీ హరిజనుడా నీవు ఈరాత్రి శ్రీమహావిష్ణువును జాగరణమును జేయించితివి.

67

శ్లో॥ ఫలం గీతస్య మే దేహి ।
జీవితం యది చేచ్ఛసి
బ్రహ్మరక్షో వచః శ్రుత్వా ।
శ్వపాకః పున రబ్రవీత్ ॥

67. నీవు జీవించుటనే కోరుకొన్న వాడవయినచో ఈ విష్ణు జాగరణమునకై నీవు పాడిన గీతము యొక్క ఫలితమును నాకిచ్చి నీయిష్టము వచ్చిన స్థలమునకు, సుఖముగ బ్రతికిపొమ్ము, అనెను.

బ్రహ్మరాక్షసుని యొక్క ఈ మాటలను విని మనగాయక హరిజనుడు తిరిగి యిటుల పలికెను.

68

॥ యత్ త్వయా భాషితం పూర్వం ।
మయా సత్యం చ యత్కృతం ।
భక్షయస్వ యథేచ్ఛం మాం ।
దద్యాం గీతఫలం న తు ॥

68. నీవు యిదివరలో నన్ను ఏమిచేయుమంటివో నేనటులనే సరిగా జేసితిని. నీవుకూడ అటులనే నీ యిచ్చానుసారముగ నాశరీరమును భక్షించుమూ, అంటివి గాని నేను పాడిన గీతఫలమును నీకు నీయజాలను,

శ్లో॥ చండాలస్య వచః శ్రుత్వా ।
హేతుయుక్త మనంతరం ।
ఉవాచ మధురం వాక్యం ।
చండాలం బ్రహ్మరాక్షసః ॥

70

శ్లో॥ [illegible] తే మే దేహి ।
పుణ్యం గీతస్య యత్ ఫలం ।
తతో మోక్షామి కళ్యాణ ।
[illegible] దస్మా ద్విభీషణాత్ ॥

70. ఓ మంగళకరుడా ! నీవుపాడిన గీతముయొక్క పూర్తిఫలితమును యివ్వకపోయిన పోనిమ్ము. అందలి సగము ఫలితమునైనను నాకిమ్ము. అందువలన నేను నిన్ను ఈభయంకరమైన భక్షణమునుండి విడిచి బుత్తును, అనెను.

71

శ్లో॥ బ్రహ్మరక్షో వచః శ్రుత్వా ।
శ్వపాకః సంశిత వ్రతః ।
వాణీం శ్లక్ష్ణాం సమాదాయ
బ్రహ్మరాక్షస మబ్రవీత్ ॥

71. బ్రహ్మరాక్షసుని యొక్క ఈవాక్యమును విని వ్రతనిష్ఠాగరిష్ఠుడైన మనగాయక హరిజనుడు ఇంపగు మాటలతో బ్రహ్మరాక్షసునితో యిటులపలికెను.

72

శ్లో॥ భక్షయామీతి సంశ్రుత్య ।
గీత మస్మత్ కిమిచ్ఛసి ।
శ్వపాకస్య వచః శ్రుత్వా ।
బ్రహ్మరక్షో భయావహం ॥

72. ఓయీ, నీవు నన్ను భక్షించెదనని నమ్మకముగ పలికి, యిపుడు అటులచేయకుండగ నాగాన ఫలమును ఏల కోరెదవు ? దానిని నేనీయజాలను. భయంకరుడై ఆ బ్రహ్మ రాక్షసుడు హరిజనుని యొక్క ఈవాక్యమును విని.

73

శ్లో॥ ఉవాచ మధురం వాక్యం ।
శ్వపాకం సంశితవ్రతం ।
ఏకయామస్య మే దేహి ।
పుణ్యం గీతస్య యత్ఫలం ॥

73. వ్రతనిష్ఠాగరిష్ఠుడైన ఆ మనగాయక హరిజనుని గూర్చి మధురముగ ఒకవాక్యమును యిటుల పలికెను. ఓయీ గాయకా ! ఒక ఝామున నీవుపాడిన గీతము యొక్క ఫలితమునైనను నాకు యిమ్మా !

74

శ్లో॥ తతో యాస్యసి కళ్యాణ ।
సంఘమం పుత్ర దారకైః ।
శ్రుత్వా రాక్షసవాక్యాని
చండాలో గీతలాలసః ॥

74. ఓయీ శుభుడా ! ఇటుల చేయుట వలన నీవు నీభార్యా పుత్రాదులతో కలుసుకొని సుఖముగ యుండగలవు అనెను. భగవద్గాన రసలోలుడగు నా హరిజనుడు బ్రహ్మ రాక్షసునియొక్క ఈమాటలు విని.

75

శ్లో॥ ఉవాచ మధురం వాక్యం।
రాక్షసం కృతనిశ్చయః।
న యామస్య ఫలం దద్యాం।
బ్రహ్మరక్ష స్తవేప్సితం॥.

75. మనగాయకుడు తన సత్యవ్రత పాలనము నుండి కించిత్తైనను చలించ దలంచనివాడై బ్రహ్మరాక్షసుని గూర్చి మధురముగ యిటుల నొకవాక్యమును పలికెను. ఓయి బ్రహ్మరాక్షసుడా, నీవు కోరినటుల నేనుపాడిన భగవద్గీతములలో ఒక జాములో పాడిన గీతముయొక్క ఫలితమునైనను నీకు ఈయజాలను.

76

శ్లో॥ పిబస్వ శోణితం మహ్యాం।
యత్ త్వయా పూర్వభాషితం।
శ్వపాకస్య వచః శ్రుత్వా॥
రాక్షసః పిశితాశనః॥.

76. నావద్ద రాగము వలెనే రక్తముగల నాగరక్తమున్నది. నీవు యిదివరిలో పలికినటుల ఆ నారక్తమును పానము జేయుము అనెను మాంసభక్షకుడైన రాక్షసుడు మనగాయక హరిజనుని వాక్యమును విని,

77

శ్లో॥ సత్యవంతం గుణజ్ఞం చ।
చండాళ మిద మబ్రవీత్।
ఏకం గీతస్య మే దేహి।
యత్ త్వయా విష్ణుసంసది॥.

77. సత్యవ్రత నిష్ఠుడున్ను, ప్రాణముకంటె భగవద్గానానుభవము నందుగల వైభవము నెరింగిన గుణగ్రాహియున్ను అయిన మనగాయక హరిజనుని జూచి యిటుల పలికెను. ఓయీ, శ్రీమహావిష్ణు సన్నిధానము నందు నీవుపాడిన ఒక్క గీతముయొక్క ఫలితమునైనను నాకిమ్మా!

78

శ్లో॥ నిగ్రహా త్తారయాస్మా ద్వై।
తేన గీతఫలేన మాం।
ఏవ ముక్త్వాతు చండాలం।
రాక్షసః శరణం గతః॥.

78. ఓ మహానుభావా! ఆ గీతఫలదానము ద్వారా నన్ను ఈ బ్రహ్మరాక్షస జన్మము నుండి ఉద్ధరించుమా, అని యనుచు ఆ బ్రహ్మరాక్షసుడు మనగాయక హరిజనుని శరణు జొచ్చెను.

79

శ్లో॥ శ్రుత్వా రాక్షస వాక్యాని।
శ్వపాకః సంశ్రితవ్రతః।
ఉవాచ మధురం వాక్యం।
రాక్షసం పిశితాశనం॥.

79. ఈ విధముగ పలుకుచున్న శరణాగతుడైన బ్రహ్మరాక్షసుని వాక్యములను విని సత్యవ్రత గరిష్ఠానిష్ఠుడైన మన గాయక హరిజనుడు మాంసభక్షకుడైన ఆ బ్రహ్మరాక్షసుని జూచి మధురముగ నొక వాక్యమును పలికెను.

80

శ్లో॥ కిం త్వయా దుష్కృతం కర।
కృతపూర్వం తు రాక్షస।
కర్మణో యస్య దోషేణ।
రాక్షసీం యోని మాశ్రితః॥

80. ఓయి రాక్షసా! నీవు ఈ బ్రహ్మరాక్షస జన్మమును పొందుటకు పూర్వము ఎట్టి పాపకృత్యమును చేసి యుంటివి. ఏదుష్కృత కర్మయొక్క ఫలితముగ యిట్టి బ్రహ్మరాక్షస పుట్టుకను పుట్టితివి?

81

శ్లో॥ ఏవ ముక్తః శ్వపాకేన ।
పూర్వవృత్త మనుస్మరన్ ।
రాక్షసః శరణం గత్వా ।
శ్వపాక మిద మబ్రవీత్ ॥.

81. ఈ విధముగ మనగాయక హరిజనునిచే అడుగ బడిన వాడై బ్రహ్మరాక్షసునికి తన పూర్వజన్మ వృత్తాంతము స్మరణరాగా, మనగాయక హరిజనుని శరణ జొచ్చుచు ఆ బ్రహ్మరాక్షసుడు ఈతనితో యిటుల చెప్పజొచ్చెను.

82

శ్లో॥ నామ్నా నై సోమశర్మాహం ।
చరకో బ్రహ్మయోనిజః ।
సూత్ర మంత్ర పరిభ్రష్టః ।
యూపకర్మ ణ్యధిష్ఠితః ॥.

82. ఓయి మహానుభావా ! పూర్వ జన్మమున నేను సోమశర్మయను పేరుగల ఒక బ్రాహ్మణుడనై, చరక గోత్రాగ్భవుడనై జన్మించితిని. గాని సూత్ర మంత్ర భ్రష్టుడనై యుంటిని అయినను యాగము నొకదానిని జేయవలెనని ఉపక్రమించితిని,

83

శ్లో॥ తతోహం కరయే యజ్ఞం ।
లోభ మోహ ప్రపేడితః ।
యజ్ఞే ప్రవర్తమానే తు ।
శూలదోష స్త్వజాయత ॥.

83. ధనమందలి ఆశతోను, కీర్తియందలి కాంక్షతోను మిక్కిలియు అజ్ఞానినై ఆ యజ్ఞమును జేయ మొదలిడితిని. ఆ యజ్ఞము జరుగుచుండగ ఒక గొప్ప శూలదోషము సంభవించెను.

84

శ్లో॥ అథ పంచమ రాత్రే తు ।
అసమాప్తే క్రతావహం ।
అకృత్వా విపులం కర్మ ।
తతః పంచత్వ మాగతః ॥.

84. ఇటుల యాగము జరుగుచుండగా అయిదవనాటి రాత్రియందు యాగము ముగియ కుండగనే యింకను జరుప వలసిన క్రియా కలపములు ఎన్నియో మిగిలి యుండగనే నేను మరణించితిని

85

శ్లో॥ తస్య యజ్ఞస్య దోషేణ ।
మాతంగ శృణు యన్మమ ।
జాతోఽస్మి రాక్షస స్తత్ర ।
బ్రాహ్మణో బ్రహ్మరాక్షసః ॥.

85 ఓయి హరిజనుడా నాసంగతి వినుము, యజ్ఞమును పూర్తిచేయజాలక పోవుటచేతను, అంతవరకు చేసిన యజ్ఞమైన నిష్కామతయా గాక లోభమోహములతో గూడుకొని బ్రాహ్మణుడనైన అజ్ఞాన రూపముగ జేయుటచేతను అదొక గొప్ప దోషముగ పరిణమించుటచే నేను బ్రహ్మరాక్షసుడనై జన్మించితిని,

86

శ్లో॥ ఏవం తు యజ్ఞదోషేణ ।
వపుః ప్రాప్త మిదం మమ ।
ఇత్యుక్త్వా తు తదా రక్షః ।
శ్వపాకం శరణం గతః

86. ఈ విధమైన యజ్ఞదోషముచే యిట్టి బ్రహ్మ రాక్షస శరీరము నాకు ప్రాప్తించెను, అని యిటుల తెలుపుచు ఆ బ్రహ్మరాక్షసుడు మనగాయక హరిజనుని శరణు జొచ్చెను.

87

శ్లో॥ బ్రహ్మరక్షో వచః శ్రుత్వా
శ్వపాకః సంశితవ్రతః ।
భాడ మిత్యబ్రవీ ద్వాక్యం ।
బ్రహ్మరాక్షస చోదితః ॥.

87. సత్యవ్రత [illegible] పలికిన మాటలను బ్రహ్మరాక్షసునియొక్క ఈ మాటలను విని, మనము విభీషణునికి యిచ్చినరలో అభయప్రధాన మొనర్చి నటులనే ఈ బ్రహ్మరాక్షసునచే ప్రార్థితుడై "భాడం" (మంచిది) అని యిటుల పలికెను.

88

శ్లో॥ య న్మయా పశ్చిమం గీతం ।
సర్వం కైశిక ముత్తమం ।
ఫలేన తస్య భద్రం తే ।
మోక్షయిష్యామి కిల్బిషాత్ ॥.

88 ఓయీ ! నేను ఈనాటి రాత్రియం భగవత్ సన్నిధియందు పశ్చిమముగా కైశికమను ఒక ఉత్తమమైన రాగమును ఆలాపించి పాడితిని భగవత్కటాక్షము ద్వారా ఆ గీతఫలితముచే ఈ రాక్షసజన్మము నుండి విడిపింప బడుదువుగాక, నీకు శుభమగుగాక, అనెను.

89

శ్లో॥ యస్తు గాయతి భక్త్యావై ।
కైశికం మమ సంసధి ।
స తార యతి దుర్గాణి ।
శ్వపాకో రాక్షసం యథా ॥

89. ఎవరైతే మన యందు భక్తితో మన సన్నిధియందు కైశికమను ఈ రాగమును పాడుదురో అట్టివారు బ్రహ్మరాక్షసుని ఉద్ధరించిన మన గాయక హరిజనుని వలెనే తనను ఆశ్రయించిన వారలను దుర్గతులనుండి ఉద్ధరింపించగలడు.

90

శ్లో॥ ఏవం తత్ర వరం గృహ్య ।
రాక్షసో బ్రహ్మ సంస్థితః ।
జాత స్తు విమలే వంశే ।
మమ లోకం చ గచ్ఛతి ॥

90 ఈవిధముగ ఆ బ్రహ్మరాక్షసుడు మనగాయకుని వల్లవరమును బొంది బ్రహ్మజ్ఞానియై పవిత్రమైన వంశమునందు జన్మించి, పిమ్మట మన లోకమును పొందెను సుమా.

91

శ్లో॥ శ్వపాక శ్చాపి సుశ్రోణి ।
మమ చైవోపగాయకః ।
కృత్వా తు విమలం కర్మ ।
స బ్రహ్మత్వ ముపాగతః ॥

91. ఓ సుందరాంగి భూపిరాట్టి ! పిమ్మట మన గాయక హరిజనుడున్ను ఈ విధముగ మనలను గానము జేయుచు పవిత్రకార్యముల జేసి బ్రహ్మజ్ఞానియై మన సాయుజ్యమును పొందెను సుమా.

92

శ్లో॥ ఏత ద్గీతఫలం దేవి ।
కౌముద ద్వాదశీం పునః।
యస్తు గాయతి స శ్రీమాన్ ।
మమ లోకం చ గచ్ఛతి ॥

92. ఓ దేవి ! ఈ గానము యొక్క ఫలమును చెప్పెద వినుము, ఎవరైతే కార్తీకమాస మందలి శుక్లపక్ష ద్వాదశి నాడు మనయొక్క సన్నిధిలో ఈ కైశిక మహాత్మ్యమును గానము చేయునో, ఎవరైతే విందురో, వారందరు కూడ "శూழ்ం దిరుందు ఎత్తువర్ పల్లాండే" (అనేకవేల దివ్య వత్సరములు మాసన్నిధిని చుట్టియుండి మాకు మంగళా శాసనము జేయుచు యుండగలరు) అనియు, "ఏతత్ సామగాయ న్నాస్తే" (సర్వేశ్వరుని సామగానముతో కీర్తించుచు యుందురు.) అనియు చెప్పినటుల, మనగాయక హరిజనునివలెనేమన వైకుంఠలోకమును పొంది, మనకుపల్లాండు పాడుచు ఆత్మానుభవమును జేసుకొనుచు యుందురుసుమా అని వరాహ పెరుమాళ్ళు భూపిరాట్టిని జూచి సాయించిరి. ఈ విధముగ సాయించిన మాటలను విని భూపిరాట్టియు, ప్రళయార్ణవము నందు కలిగిన శ్రమయంతయు తీరి ఈ గానరూపమై యున్న ఉభయ వైభవమెంత గొప్పది యని సంతోషించి కృతార్థురాలాయెను.

ఇతి వరాహపురాణే భూమివరాహ సంవాదే
కైశిక మహాత్మ్యం నామ
అష్టచత్వారింశోధ్యాయః
భట్టర్ తిరువడిఘళే శరణం
శ్రీ శ్రీ శ్రీ

ఇది వరాహపురాణమందలి భూమివరాహ సంవాదమందలి
కైశిక మహాత్మ్యమని పేరుగల
నలుబది ఎనిమిదవ అధ్యాయము
శ్రీ భట్టరు తిరువడిఘళే శరణము
శ్రీ శ్రీ శ్రీ



శ్రీమతేరామానుజాయనమః



శ్రీరామపట్టాభిషేకము

# —: ప్రచారవిభాగము :—

## పద్మనాభము

ఈ గ్రామములో శ్రీ మహిళా సంఘమువారు, శ్రావణమాసములో ఆఖరి శుక్రవారమున లక్ష్మీపూజా మహోత్సవము, చాల వైభవముగా జరిపిరి. అమ్మవారికి క్రొత్తసిల్కు చీరె సమర్పించిరి. విశేషభోగములుచేయించిరి.

## రామతీర్థము

ఈ గ్రామంలో మహిళామండలివారున్ను, పెద్దలున్ను, 9-8-60వ తేదీ నాడు శ్రీ చక్రవర్తి తిరుమఘన్ సన్నిధిలో శ్రీ బదరీ శ్రీనివాసరామానుజ స్వామివారల తిరునక్షత్రోత్సవము వైభవముగా జరిపిరి. మధ్యాహ్నం గం॥ 4-0 ల. మొదలుకొని స్తోత్ర పారాయణము, శెన్నియోంగు, "బ్రహ్మవిల్ కొలమ్" అనేకదశకములను సేవచేసి పూజ, ఉభయము జరిపిరి.

## బరంపురం

ఇచ్చట శ్రీ తిరువెంగడముడయాన్ సన్నిధిలో శ్రీ మహిళామండలివారు, చాతుర్మాసదీక్షగా నిత్యము, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ, హరేరామ నామ సంకీర్తనమున్ను జరుపుచున్నారు. శ్రీమతి, తి. పె. తాయారమ్మగారు. ఈ గోష్టిని పరమవిలక్షణముగా నిర్వహించుచున్నారు.

## విశాఖపట్నం

ఇచ్చట, శ్రీ మహిళామండలివారు, శ్రీ దాసరి ఆండాళమ్మగారి ప్రోత్సాహముతో, శ్రావణమాసమున శ్రీ ఆండాళుతల్లి, తిరునక్షత్రమహోత్సవము, వైభవముగా జరిగినది. తిరుమంజనము సేవాకాలము, ప్రసాదగోష్ఠి చాలా విలక్షణముగా జరిపి సంఘమునకు రు. 3/- లు కట్నం సమర్పించిరి.

## ఏలూరు

ఇచ్చట శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమువారు శ్రీ జనార్దనస్వామివారి సన్నిధిలో అశ్వయుజశుద్ధ పంచమి శ్రీ రాజ్యలక్ష్మీతాయారు శరన్నవరాత్రోత్సవములు జరుపుటకు నిశ్చయించిరి.

## బెంగుళూరు

బెంగుళూరు, తులసీవనంలో శ్రీవైకుంఠ జనార్దన స్వామివారి సన్నిధియందు 7—9—1960 బుధవారం శ్రీ పాంచరాత్రాగమ విద్యాభివర్ధినీసభయొక్క 39 వ వార్షికోత్సవము. మైసూరు సంస్థాన ధార్మిక సంస్థ కమీషనర్ శ్రీయుత N. S. రామచంద్ర, A. S. వారియొక్క ప్రారంభకత్వమున శ్రీదొడ్డ బళ్ళాపురద సుప్రసిద్ధ న్యాయవాది శ్రీమాన్ M. సీతారామయ్యంగారు B. A. వారి అధ్యక్షతక్రింద అత్యంత వైభవముగా జరిగినది.

## బదరి శ్రీనివాస రామానుజ స్వామివారల

## శాశ్వతపూజా విరాళములు  తాత్కాలికపూజా విరాళములు

| | |
|---|---|
| శ్రీ రాజుపూడి రామదాసుగారు కోడేరు రు. | 29-00 |
| శ్రీ K. V. నరసింహం శెట్టిగారు శ్రీకాకుళం | 100-00 |
| శ్రీ కోటాసుబ్బారాయుడుగారు నెల్లూరు | 47-00 |
| శ్రీ యలమంచిలి జైవాధీనంగారు కల్వపాముల | 25-00 |

శ్రీ పూరా శ్రీదేవమ్మగారు మద్రాసు అష్టాక్షరీ క్షేత్రములో ఒక గదికిగాను లోగడ యిచ్చినది రు. 1750/- లు గాక ఇప్పుడు మరల యిచ్చిన విరాళము - 1750-00

| | |
|---|---|
| శ్రీ సూర్యదేవర నరసయ్యగారు శిరిపురం రు. | 11-00 |
| శ్రీ తటవర్తి రామమోహనరావుగారు రేపల్లె | 11-00 |
| శ్రీ గోపు శేషావతారంగారు విజయవాడ | 11-00 |
| శ్రీ చెలికాని పెదశీతాయమ్మగారు బొబ్బిలి | 12-00 |
| శ్రీ P. M. వెంకటరమణగారు | 32-40 |
| శ్రీ మరికిపూడి వీరాంజనేయ గుప్తగారు | 5-00 |
| శ్రీ చక్రవర్తుల తాతాచార్యులుగారు క్రొత్తపేట విజయనగరం, వీరి తండ్రితాతల పిండప్రదానం నిమిత్తం పంపినది - | 30-00 |

# సత్సంగ సధన విరాళములు

ఒక భక్తురాలు రు, 400-00

## కట్నములు

రాజనగరం శుక్రవార పూజాకట్నములు.

శ్రీ వేదాల సుభద్రమ్మగారు రు. 1-00
శ్రీ వెలిచేటి సుబ్బాయమ్మగారు 1-00
శ్రీ సదానందమ్మగారు 1-00
శ్రీ పెద్దాడ సుబ్బాయమ్మగారు 1-00
శ్రీ గోపు శేషావతారంగారు తమ మనుమడు చి॥ శ్రీనివాస రంగశాయికి నామకరణము జరిపినప్పుడు పంపిన సంఘకట్నం 5-00
శ్రీ గుండుమళ్ళ రంగనాథస్వామిగారు తమ షష్టిపూర్తి ఉత్సవ సందర్భములో పంపిన సంఘకట్నం. 5-00

బరంపురం

బరంపురం కన్యకాపరమేశ్వరీ ఆలయములో జరిగిన మహిళామండలియొక్క శుక్రవారపూజలకు వచ్చిన కట్నం - 2-00
శ్రీ N రంగనాయికమ్మగారు, హైదరాబాద్ శ్రీ స్వామివారి జయంతికి పంపిన కట్నం - 2-00
మద్రాసు శ్రీ యతిరాజ సేవామహిళామండలి వారు శ్రీ స్వామివారి జయంతి ఉత్సవం జరిపి కట్నంగా పంపినది - 12-00

## సంభావనలు

శ్రీ తట్టా సీతమ్మగారు పరమపదించినప్పుడు ఆమె కుమారులు పంపిన సంభావన రు 2-00
నరసాపురం శ్రీ. త్రి. బుచ్చివెంకట రంగాచార్యులు తమ తండ్రిగారి తిరువధ్యయన సందర్భమున పంపిన సంభావన. 2-00
శ్రీ శ్రీరంగారం పెరిందేవితాయారమ్మగారు తమతల్లిగారి తిరువధ్యయన సందర్భములో సంఘసంభావనగా పంపినది 2-00
(ఈ రూపాయిలు శ్రీ రాజానగరం శ్రీ వేదాల వెంకటాచార్యులుగారివల్ల జమవచ్చెను.)

## శ్రీరామక్రతు విరాళములు

శ్రీమద్వాల్మీకి రామాయణకోశమునకు శ్రీ చింతపల్లి కాంతమ్మగారు సమర్పించిన విరాళము - (పునికిలి) - రు. 12-00
శ్రీ చింతపల్లి కాంతమ్మగారు (పునికిలి) చామరములు నిమిత్తంగా సమర్పించినది - 50-00
శ్రీ చింతపల్లి దమయంతమ్మగారు పునికిలి భూచక్రగొడుగుల నిమిత్తం వాగ్దానము గావించినది. 50-00
చావలి శ్రీ మహిళామండలివారు సమర్పించినది. 100-00
శ్రీ చింతపల్లి దమయంతమ్మగారు శ్రీ దుత్తా వెంకటాయమ్మగారు (పునికిలి) సమర్పించినది. 85-00
శ్రీ కందాళ కనకమ్మగారు, నరసాపురం 25-00
శ్రీ కొపూరు సీతారామమ్మగారు గుంటూరు 60-00

శ్రీమతే రామానుజాయనమః



# మదరాసు

శ్రీ యతిరాజ సేవామహిళామండలి అధ్వర్యమున 1—8—60 మొదలు 3—8—60 వరకు గీతా మందిరములో జరుపబడిన వస్తుప్రదర్శనముయొక్క ఉపసమితివారు సమర్పించుని వేదిక :

శ్రీ రాధాకృష్ణుని కృపాకటాక్షముచే మనప్రదర్శనము అత్యంతవైభవముగా జరిగినదని తెలియజేయుటకు ఎంతయు సంతసించుచున్నాము.

మన సంఘముయొక్క ఆదర్శములననుసరించి, స్త్రీలలో చేతిపనులయందు ఆసక్తికలిగి అభివృద్ధి కలుగ జేయు ఉద్దేశముతో ఈ ప్రదర్శనము ఏర్పాటు చేయబడినది. ఇందు ప్రదర్శింపబడిన అత్యుత్తమశ్రేణికి చెందిన అనేక అందమైనవస్తువులు వాటిని తయారుచేసిన మన సభ్యురాండ్ర కళాకౌశలమును వ్యక్తపరచుచున్నది.

ఈ ప్రదర్శనమునకును, మనసంఘమునందు కుట్టుపని తరగతులకును ప్రారంభోత్సవము జరుపుటకై మన ఆహ్వానమును వెంటనే అంగీకరించి, విచ్చేసి మనల నానందభరితులను జేసిన శ్రీమతి పార్వతి హనుమంతరావుగార్కి మనమెంతయు కృతజ్ఞులము. వీరు, తమనిస్వార్థసేవతో అనేకమంది బీదలయొక్కయు, వ్యాధిగ్రస్తులయొక్కయు బాధలకు నివృత్తి కల్పించి, తోటి సోదరీమణులకు మార్గదర్శకులైనారు. అట్టి మహనీయులు మన ప్రదర్శనమునకు ప్రారంభోత్సవము చేయుట మనకందరికి మహదానందకరమైన విషయము. వారి అమూల్యమైన సలహాలు మనసంఘ పురోభివృద్ధికెంతయు తోడ్పడగలవు ఆ రోజువారి భాషణమును వినగలిగిన సోదరీమణులు వారి సలహాలను తప్పక ఆచరణలోపెట్టి సంఘ పురోభివృద్ధికి తమశాయశక్తుల పాటుపడగలరని ఆశించుచున్నాము. ఈ ప్రదర్శనమంత జయప్రదముగా జరుగుటకు కారణభూతులైన, అత్యుత్సాహభరితులైన మనసభ్యురాండ్ర అవిరామకృషి, మేధాశక్తి ఈ ప్రదర్శనమునకు రూపము తీర్చిదిద్దినది.

ప్రదర్శనములోని ప్రథమభాగములో శ్రీమతి ఇందిరచే మిక్కిలి నిపుణతతోతయారుచేయబడిన చతురతతో పేర్చబడిన మిషన్ ఎంబ్రాయిడరీ వస్తువులు కలవు. ఉల్లు, తోలు, గుడ్డ, యిత్యాది అనేక వస్తువులపై అందమైన రూపములను చిత్రించిన శ్రీమతి ఇందిర కౌశలము ప్రశంసించతగినది. జనుపనారతో, వుల్లుతోను తయారుచేయబడిన తివాసీలు ఉన్నత శ్రేణికి చెందినవి,

మన విద్యార్థినులేర్పరచిన చేతికుట్టు, అల్లిక మొదలైనవిశల విభాగము ప్రత్యేకమైన శోభకలిగియుండినది. పలువిధములైన గుడ్డలపై వారు మనోరంజకముగ రూపొందించిన చిత్రములు ప్రజల మన్ననల నందుకొన్నవి. అతి రమణీయముగా తయారుచేయబడిన తెరలు, షాడోవర్కు చేయబడిన గుడ్డలు, రిబ్బన్లతో తయారుచేయబడిన సంచి మొదలగునవి. ఆ విభాగమునకు నూతనశోభనొనగూర్చినవి. మనవిద్యార్థినులు తమ ప్రథమ ప్రయత్నములోనే యింతచక్కగాచేయుట మనకు ఎంతయు ప్రోత్సాహకరముగానున్నది.

పువ్వుల విభాగము చూపరులకు కన్నుల పండుగగా నుండినది ఈ విభాగము మన ప్రదర్శనమునకే ఒక విశిష్టత చేకూర్చినది. శ్రీమతి పార్వతి హనుమంతరావుగారు కూడ యీవిభాగమును ప్రత్యేకముగ ప్రశంసించిరి. విభిన్న వర్ణములలో తయారుచేయబడిన పలువిధములైన పుష్పములు ప్రకృతిశోభనంతయు వొక్కచోటనే సేకరించినట్లనిపించినవి. ఈ విభాగము ప్రదర్శనమునకు నేత్రమువంటిదైనది. గులాబీ మల్లెపూల దండలు, సూర్యకాంత పుష్పము మొదలగువాటిని అతి రమణీయముగా తయారుచేసి నేత్రానందముగొల్పిన మన విద్యార్థినుల కళానైపుణ్యము ప్రశంసనీయము.

శ్రీమతి వేదమ్మగారిచే ఆకర్షణీయముగా పేర్చబడిన విభాగములో ప్లాస్టిక్ దారముతో పలువిధములైన సూక్ష్మమైన క్రమములలో, అతిశ్రమతో తయారుచేయబడిన అనేక సంచులు, యిత్యాది నైనందిక వ్యవహారములలో నుపయోగపడు వస్తువులు కలవు. ఇట్టివి తయారుచేసిన వారి కల్పనా చాతుర్యము మెచ్చుకొనదగినది, ఈ విభాగమునందు చక్కని కుట్టుపనులుకూడ గలవు.

చి॥ అమృతవల్లిచే ప్రదర్శింపబడిన చిత్రములలో ఉన్నతస్థాయి నందుకొనకల్గిన కళాకారిణి సూచనలు కనబడుచున్నవి. ప్రత్యేకముగా శ్రీ రాధాకృష్ణుల చిత్రము చాల రమణీయముగా నున్నది

బదరీ విభాగమునందు విశాల రామాలయముల నడుమ శ్రీబదరీనాథుని ఆలయమును అష్టాక్షరక్షేత్రము. దానియందు రామానుజకూటము సత్సంగసదనభవనమును యిచ్చటనే సాక్షాత్కరించెనా యనునటుల ప్రేక్షకుల కన్నులు గట్టినవి బదరీనారాయణుని సందర్శన భాగ్యము లభించినట్లెంచి అనేకమంది ప్రేక్షకులు భక్తిపూర్వకముగా ప్రణామములిడి, యథోచిత నివేదనలర్పించిరి. శ్రీ కృష్ణుడు రుక్మిణీదేవిని చేబట్టి రథముపై గొనిపోవునట్లు ఏర్పరచిన రథము చాల ఆకర్షణీయముగా నుండినది.

దీపములు వెలిగినప్పుడు, రథచక్రముల భ్రమణము, అశ్వములు పరుగినడుట్లు చలనము శ్రీకృష్ణుని వెనుక జ్యోతిర్భ్రమణము మొదలైనవి కృష్ణుడే రుక్మిణీతోసహా మనదరి కేతెంచుచున్నాడా యనిపించుచున్నవి దీనిని సందర్శించి నమస్కరించని, పొగడని ప్రేక్షకులే లేరు. ఈ విభాగమింత బ్రహ్మాండముగా నున్నందుకు కారణభూతులైన మన సంఘశ్రేయోభిలాషుల నిస్వార్థసేవకు వారికి మనమెంతయు కృతజ్ఞులము

తరువాతివిభాగమునందు వివిధరకములైన ప్లాస్టిక్ చేతిసంచులు, కుట్టుపనులు, ముష్వలతో తయారుచేసిన అనేక రకములైన సంచులు చూచుటకెంతయు రమణీయముగా నుండినవి. బొమ్మసినీ కుషన్ ప్రత్యేకముగా చాల ఆకర్షణీయముగా నున్నది. గవ్వలతో తయారుచేసిన పక్షులు, బొమ్మలు, యిత్యాది ఆకారములుగల పేపర్ వెయిట్స్ తయారుచేసినవారి ప్రతిభను ప్రదర్శించినవి. ముత్యములతో అలంకరించిన చీరలు ఆ విభాగమునందు చక్కగా పేర్చబడినవి. ఈ విభాగములోనే అనేకమంది దాతలిచ్చిన చిల్లరవస్తువులతో లక్కీడిప్ ఏర్పాటు చేయబడినది,

అంతమునందు రుచికరములైన ఫలహారములతో ఏర్పరచిన ఫలహారశాల, పాకశాస్త్రమునందు మన సభ్యురాండ్ర సామర్థ్యమును వెలిబుచ్చుచున్నది.

ఇవిగాక సామాన్య విజ్ఞాన సంబంధమైన విషయములుగల చిత్రప్రదర్శనము,(Slide show)గూడ జరిగినది. ఈ ప్రదర్శనమును ప్రేక్షకులసంఖ్యాకముగా వచ్చి సందర్శించిరి.

అనివార్యమైన కారణములచేత ప్రజలు కోరుచున్నను, వస్తుప్రదర్శనము నింకను కొలదిదినములు పొడిగించుటకు వీలుకాకపోయినందులకు విచారము తెలియబరుచుచున్నాము.

వస్తు, ధనరూపములుగా మనకు సహాయమొనర్చినందుకు ఈ క్రిందిదాతలకు కృతజ్ఞతాభివందనములు తెలియజేయుచున్నాము.

శ్రీమతులు ఇందిరమ్మ, P. వేదమ్మ, V. శ్రీదేవమ్మ, G. అమ్మణ్ణమ్మ, M. చంద్రమ్మ, N. సులోచనమ్మ, S. సరోజినమ్మ. శ్రీరంగమ్మ, A. సత్యవతి, D. స్వర్ణమ్మ, చెంచమ్మ, P. అండాళమ్మ, C. సీతమ్మ, B. రాజామణి, M. సుకన్య, M. పద్మాలమ్మ.

అనేక ఉపయోగకరములగు వస్తువులను బదులిచ్చిన క్రిందివారికి మా కృతజ్ఞత తెలుపుచున్నాము. శ్రీమతులు N. సులోచనమ్మ, M. చెంద్రమ్మ, A. సరస్వతి, A. సత్యవతి, S. సుధామణి, D. వత్సల.

స్లైడుషోను జరిపించి ప్రదర్శనముయొక్క విజయమునకు తోడ్పడిన శ్రీమతి G. జయమ్మగారికి మా కృతజ్ఞత తెలుపుచున్నాము.

ఈ ప్రదర్శనమునకు ప్రధాన పర్యవేక్షకురాలైయుండి, సర్వవిధముల సహకరించిన శ్రీమతి D. V. లక్ష్మీదేవిగారికి మాకృతజ్ఞత తెలుపుచున్నాము.

నిస్వార్థబుద్ధితో, అవిరామ కృషిచేసి మన ప్రదర్శనమును జయప్రదముగావించిన. అత్యుత్సాహ పూరితులైన యువతీమణులకు (మన వాలంటీర్లు) మా కృతజ్ఞత తెలియజేయుచున్నాము.

ఈ ప్రదర్శనము ధనరూపముగాకూడ జయప్రదమైనదని తెలియజేయుటకు చాల ఆనందించుచున్నాము.

## —: ప్రచార విభాగము :—

### బదరీనారాయణము

బదరీనారాయణములో, మన సత్సంగసదనమందు శ్రీ కృష్ణా తిరునక్షత్రోత్స సందర్భమును పురస్కరించుకొని 5 దినములు శ్రీమాన్ ఉ. వే. న్యాయవేదాన్త విద్వాన్ తె కం. గోపాలాచార్య స్వామి అధ్యక్షతతో శ్రీ విశిష్టాద్వైత ప్రచారకపండిత సభలు పరమవిలక్షణముగా జరిగినవి. శ్రీ త్రిదండిస్వామివారు, పంజాబు సింధు క్షేత్రం శ్రీ వాసుదేవానందస్వామిగారు చక్రవర్తిగారు, ధర్మాధికారిగారు, ఇత్యాది విద్వాంసులు వేదాంత సిద్ధాంతమును గురించి ఉపన్యసించిరి.

ఒకనాడు బొంబాయిగవర్నర్ శ్రీ శ్రీ శ్రీ ప్రకాశ్ గారు. తమ పరివారముతో శ్రీ. T. K. గోపాలాచార్య స్వామివారి ఆహ్వానమును అంగీకరించి, అష్టాక్షరీ మందిరమును, సత్సంగసదనమును స్వయముగాచూచి చాల ఆనందించిరి, ఆమోదసూచకముగా అల్పాహారవిందును అష్టాక్షరీ మందిరములో ఆరగించిరి. విజయదశమినాడు రాష్ట్రపతి శ్రీ శ్రీ శ్రీ రాజేంద్రప్రసాద్ గారుకూడ మన అష్టాక్షరీక్షేత్రమునకు విచ్చేయుదురని బదరినుండి వార్తలు వచ్చినవి.

శ్రీకృష్ణజయంతినాడు మన శ్రీనివాసరామానుజ స్వామివారి సన్నిధిలో విశేషపూజలు, విశేషముగా ఆరగింపులు జరిగినవి. పండిత సభానంతరము శ్రీమాన్ తె కం. గోపాలాచార్యస్వామివారు, పండితులకు ఒకకాలువ రు. 5/- లు చొప్పున సంభావన సంఘముద్వారా గావించిరి.

### చౌటపల్లి

ఇచ్చట భక్తులు శ్రద్ధగా శివ చాతుర్మాసదీక్షను గావించుచున్నారు. ప్రతిదినము భారతము పురాణము జరుగుచున్నది భారతం పూర్తిఅయినతరువాత శ్రీ ధర్మరాజు పట్టాభిషేకము జరుపుటకు భక్తులు ప్రయత్నించుచున్నారు. మొదటి చాతుర్మాసదీక్షలో శ్రీ భాగవతం పూర్తి గావించి శ్రీ రుక్మిణీకళ్యాణం జరిపించిరి, రెండవ చాతుర్మాసదీక్షలో శ్రీమద్రామాయణము పూర్తిగావించి సీతాకళ్యాణము జరిపిరి.

ఈ కైంకర్యమును శ్రీ అట్లూరి చెల్వపిళ్ళరావుగారు శ్రద్ధగా నిర్వహించుచున్నారు.

---

### శాశ్వత విరాళాలు

P. విజయలక్ష్మమ్మగారు 10-00

### తాత్కాలిక విరాళాలు.

కడికచెర్ల వెంకట్రాజుగారిభార్య బుచ్చిరాజు రాజమండ్రి రు. 11-00

దుక్కిపాటి మానిక్యమ్మగారు పెయ్యేరు 11-00

K. శేషాచార్యులుగారు విజయవాడ 11-00

దుక్కిపాటి మానిక్యమ్మగారు C/o సుబ్బారావుగారు పెయ్యేరు 11-00

12-7-59 ని. ఉప్పల రంగనాయకమ్మగారు ప్రొద్దుటూరు, తదీయారాధననిమిత్తం సమర్పణ 50-00

పంచాంగం లక్ష్మమ్మగారు ప్రొద్దుటూరు తదీయారాధన నిమిత్తం సమర్పణ 50-00

### కట్నములు

శ్రీమాన్. తి. గుడిమెళ్ళ శ్రీనివాస రంగాచార్యులుగారు చిన్నశ్రీరంగపురం కృష్ణాష్టమి పండుగకు 1-00

పర్వతనేని నాగయ్యగారు గొల్లపల్లి 11-00

### ప్రొద్దుటూరు - కడపజిల్లా.

ఉప్పల రంగనాయకమ్మగారున్ను వీరిచెల్లెలు పంచాంగం లక్ష్మమ్మగారున్ను కలసి, శ్రీ వాసుదాసాశ్రమములో శ్రీరామక్రతువు జరుపు యజ్ఞశాలపైన సిమెంటురేకులు వేయు కైంకర్యమునకుగాను సమర్పించిన రొఖం రు.25-00 లు.



శ్రీ C. మొదలియాన్‌డాన్ శెట్టిగారు మద్రాసునుంచి యీ బ్లాకును అచ్చు వేయించవలసినదిగా పంపిరి.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ గుణరత్నకోశము

## 15 వ శ్లోకము.

శ్లో॥ ఆకుద్రగ్రామనియామకా దపి విభో రా సర్వనిర్వాహకా
దైశ్వర్యం య దిహోత్తరోత్తరగుణం శ్రీరంగభర్తుః ప్రియే,
తుఙ్గం మఙ్గళ ముజ్జ్వలం గరిమవత్ పుణ్యం పునః పావనం।
ధన్యం యత్త దదశ్చ వీక్షణభువః తే పఞ్చషా విప్రుషః॥

### —: అర్థము :—

శ్రీరఙ్గభర్తుః = శ్రీరంగనాథునియొక్క,
ప్రియే = ప్రియమైన ఓ లక్ష్మీదేవి !
ఇహ = ఈ లోకమున,
ఆకుద్రగ్రామనియామకాత్ = కుద్రగ్రామమునకు అధికారి యగువాని మొదలు,
సర్వనిర్వాహకాత్ = సర్వమునకు నిర్వాహకుడగు,
ఆవిభోః + అపి = ప్రభువగు బ్రహ్మవరకును,
ఉత్తరోత్తరగుణం =
ఉత్తరోత్తర = క్రమానుసారముగ,
గుణం = అధికమగుచుండునట్టి,
యత్ = ఏ
ఐశ్వర్యం = ఐశ్వర్యముగలదో,
తత్ = అట్టిదియును,
తుఙ్గం = ఉన్నతమైన,
మంగళం = మంగళకరమైనట్టియు,
ఉజ్జ్వలం = ప్రకాశమైనట్టియు,
గరిమవత్ = ఘనమైనట్టియు,
పుణ్యం = పుణ్యకరమైనట్టియు
పునః = అధికముగ.
పావనం = పవిత్రమైనట్టియు,
ధన్యం = ధన్యమైనట్టియు,
యత్ = ఏదికలదో,
అదః + చ = ఈ ఐశ్వర్యమున్ను,
తే = నీ యొక్క,
వీక్షణభువః = కటాక్షములవలన కలిగిన,
పంచషాః = అయిదారు
విప్రుషః = బిందువులు,

### ❋ —: తాత్పర్యము :— ❋

అమ్మా ఓ లక్ష్మీదేవి. నీవు శ్రీరంగనాథుని కత్యంత ప్రేమాస్పదురాలవు కదా. ఈ లోకమున ఏదో చిన్న కుద్రగ్రామవాని మొదలు అంతాధిపతి యగు చతుర్ముఖ బ్రహ్మవరకు యనుభవించు ఐశ్వర్యమై గాని మరియు నింతకంటెను గొప్పదైనట్టియు, మంగళకరమైనట్టియు, ఘనమైనట్టియు, పుణ్యమైనట్టియు, పవిత్రమైనట్టియు, ధన్యతనొందించునట్టియు ఐశ్వర్యమైగాని యిట్టి సమస్తైశ్వర్యమును కూడ నీ కరుణాకటాక్షవీక్షణ లేశముల వలన మాత్రమే కలిగినట్టివేగదా ! కాన నన్నుకూడ నీకటాక్షపాత్రునిగ జేసుకొనుమా.

# గోపికాగీతలు

17వ శ్లోకము.

శ్లో॥ 17. రహసి సంవిదం హృచ్ఛయోదయం।
ప్రహసితాననం ప్రేమ వీక్షణం।
బృహదుర శ్శ్రియో ధామ వీక్ష్యతే।
ముహు రతిస్పృహా ముహ్యతే మనః॥

-: అర్థము :-

తే = నీయొక్క
రహసి = రహస్యము నందలి
సంవిదం = సంకేతమును,
హృచ్ఛయోదయం = కామమును గలిగించు
ప్రేమవీక్షణం = ప్రేమతోగూడిన చూపులను,
ప్రహసితాననం = నవ్వుముఖమును,
శ్రియః = లక్ష్మికి.
ధామ = స్థానమైన
బృహత్ = విశాలమైన,
ఉరః = వక్షస్థలమును,
వీక్ష్య = చూచి,
అస్మాకం = మాకు
అతిస్పృహా = అత్యాశ,
భవతి = కలుగుచున్నది,
ముహుః = మాటిమాటికిని,
మనః = మనస్సు,
ముహ్యతే = మోహమును చెందుచున్నది.

* -: తాత్పర్యము :- *

ఓ కృష్ణా! నీవు రహస్యముగ జేసిన సంకేతధ్వనులు మమ్ములను బట్టబయలునకు త్రాడువలె లాగివేసినవి. కామవికారముల రేకెత్తించు నీ ప్రేమ దృక్కులు మాతో మాట్లాడుచు మమ్ముల నీవద్దకు పిలిచితెచ్చినవి. నీ నవ్వు ముఖము మా కాళ్ళను నీ వద్దకు నడిపించి మాట్లాడించినది. లక్ష్మినివసించు నీ విశాల వక్షస్థలము మా చేతులను నీ మెడకు జుట్టించుచున్నది. నీ సౌదర్యమె నీ దివ్యమంగళ విగ్రహమె మా మనస్సులను ఉక్కిరి బిక్కిరిజేసి మూర్ఛలో పడగొట్టుచున్నది. గాన నీవు వచ్చి నా ఈ బాధల నివారించుమా.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 316 | క్రోధకృత్. | క్రోధకృత్ క్షత్రియేష్వోయః।<br>పూర్వం క్రోధం కరోతిసః। | క్షత్రియులకు ముందుగ కోపము నుదయింప జేయువాడు. |
| 317 | కర్తా. | క్రుద్ధేతో కార్తవీర్యస్య।<br>ఛేత్తాకర్తేతి శబ్ద్యతే। | క్రోధమునకు కారణమైన కార్తవీర్యుని చీల్చి చెండాడినవాడు. |
| 318 | విశ్వబాహుః. | విశ్వస్మై బాహుర్యస్యేతి।<br>విశ్వబాహుః ప్రకీర్తితః। | లోకకంటకుల నుసంహరించి సాధు ప్రపంచమునంతను బ్రోచదగిన బాహువులు కలవాడు. |
| 319 | మహీధరః | భారావతరణం కృత్వా.<br>గాం ధత్తే సమహీధరః. | భారమునంతను తొలగించి భూమిని ధరించియుండువాడు. |
| 320 | అచ్యుతః. | చ్యవనోత్పత్తి యుక్తేషు.<br>బ్రహ్మేంద్ర వరుణాదిషు।<br>యస్మాన్నచ్యవతే స్థానాత్।<br>తస్మాత్సంకీర్త్యతేఽచ్యుతః।<br>సాధర్మ్యేణావతారేఽపి।<br>బ్రహ్మేంద్ర వరుణాదిభిః।<br>నస్యైశ్వర్యాత్ప్రచ్యుతోయః।<br>అచ్యుతః పరికీర్తితః। | జననమరణాదులతో కూడిన బ్రహ్మేంద్రవరుణాదులతో సమముగ నవతరించినను వారివలె తనగని విసుగని యధికార పదవికలవాడు.<br>వారివలె తానును అవతరించినను వారివలె నెన్నడును తొలగనితనయైశ్వర్యముకలవాడు. |
| 321 | ప్రథితః. | అచ్యుతత్వేన లోకేఽస్మిన్।<br>ప్రఖ్యాతః ప్రథిత స్మృతః॥ | అచ్యుతుడని లోకమున ప్రఖ్యాతిగాంచినవాడు. |
| 322 | ప్రాణః. | పుంసాం జీవితరూపత్వాత్<br>ప్రాణ ఇత్యభిధీయతే। | తనభక్తులకు ప్రాణమువలె పోషకుడైయుండువాడు. |
| 323 | ప్రాణదః. | మరుతాంజల దానాద్ధి<br>సముద్రమథనే భృశమ్।<br>ప్రాణదశ్చ సముద్దిష్టః<br>కూర్మరూపతయాచసః। | సముద్రమును మథించుతరి తాను కూర్మరూపమును ధరించి తనభక్తులగు దైవీసంపన్నులైన దేవతలకు అత్యధికమైన బలము నొసంగినవాడు. |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 324 | వాసవానుజః | వాసవస్యానుజత్వేన। జాతత్వా ద్వాసవానుజః। | దేవేంద్రునకు తమ్ముడై అదితి కశ్యపులకు సంతానముగా నుదయించినవాడు. |
| 325 | అపాం నిధిః. | అపాం నిధిరమృత్యమాన మహార్ణవ విధారణాత్. | మథింపబడుచున్న సముద్రమును ధరించుటచే నీటికాధారమగువాడు. |
| 326 | అధిష్ఠానమ్. | భ్రమమాణం మన్దరాద్రిం. ధృతవాన్ యో మహాజలే। అధిష్ఠానంతమేవాహుః అధిష్ఠాన ప్రదో మతః. | సముద్రమథన సమయమునగిరగిర తిరుగుచున్న మన్దర పర్వతమున కాధారమై ధరించియుంచినవాడు. దీనిని 'ఓమధిష్ఠానాయనమః' యని మంత్రముగా నాదరించిన వా నిదియాధారమునొసంగును. |
| 327 | అప్రమత్తః. | అత్యన్తావహితత్రాణే హ్యప్రమత్తః ప్రకీర్తితః। | తనభక్తులనుబ్రోచుటకై తానెల్లవేళల సన్నద్ధుడై యుండువాడు. |
| 328 | ప్రతిష్ఠితః | స్వమహిమ్నిస్థితో యస్తు స ప్రతిష్ఠిత ఉచ్యతే। | ఇతరాపేక్ష లేకయే తనమహిమయందుమాత్రమాధారపడి యుండువాడు. |
| 329 | స్కన్దః. | ఆసురాదీన్ శోషయతి స్కన్దః స్కన్దయతీతియః। | ఆసుర ప్రకృతికి చెందిన నాస్తికులను శోషింప జేయువాడు. |
| 330 | స్కన్దధరః. | స స్కన్దధర ఆఖ్యాతః షడానన విధారణాత్, | దేవ సేనా నాయకుడగు కుమారస్వామిని తన విభూతిగా ధరించువాడు. |
| 331 | ధుర్యః | భువనం ధృతవాన్ ధుర్యో। | లోకముల భారమును ధరించువాడు. |
| 332 | వరదః | వరదో ఽభీష్టదః స్మృతః। | లోకకార్యములను నిర్వహించు దేవతలకుగూడ అందులకు తగిన వరముల నొసంగువాడు. |
| 333 | వాయువాహనః | జగత్ప్రాణం. వహతి యో. వాయువాహన ఉచ్యతే। | జగత్తునకు ప్రాణమైయుండు వాయువును ప్రవహింప జేయువాడు. |
| 334 | వాసుదేవః | సర్వభూతాన్ వాసయతి। వాసుస్స పరికీర్తితః। దివ్ ధాతో రపి క్రీడా | సకల ప్రాణులను తనయందు వసింప జేయగలవాడు. వాసుడనబడును. దేవుడనగా క్రీడించువాడు, జయింపగోరువాడు, ప్రకాశించు |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| | | ద్వ్యర్థకత్వా ద్విశేషతః।<br>వాసుశ్చాసే దేవశ్చేతి<br>వాసుదేవః ప్రకీర్తితః।<br>సర్వభూతే ష్వపివసన్<br>స్వస్మిన్ భూతాని వాసయన్<br>యః క్రీడతి ముదా యద్వా<br>వాసుదేవ స్సఉచ్యతే.<br>సర్వత్రాసౌ సమస్తంచ<br>వసత్యత్రేతి వైయతః।<br>తత స్స వాసుదేవేతి<br>విద్వద్భిః పరికీర్తితః। | వాడు. స్తుతింపబడువాడు. పోవువాడును,<br>కావున వాసుదేవు డనగా జగత్తునందంతను వ్యాపించి క్రీడించుట మొదలగు పనుల చేయువాడు,<br>తాను సకల ప్రాణుల యందంతరాత్మగా నెల్లప్పుడు నివసించుచు వాటిని తనయందు నివసింపజేయుచు నిట్లు వాటితో నానందముగ క్రీడించుచుండువాడు.<br>తానన్నిటియందును అన్నియు తనయందును నివసించు నట్లు చేయుటచే వాసుదేవు డనబడుచున్నాడు, |
| 335 | బృహద్భానుః | బృహన్తో భానవో యస్య<br>సబృహ ద్భాను రుచ్యతే. | అంతటను వ్యాపించు కిరణములు కలవాడు, |
| 336 | ఆదిదేవః | యః క్రీడతీత్యాది దేవః।<br>పాదాత్మక విభూతిభిః। | తనయొక్క పాదపరిమిత మగు లోకములతో సృష్ట్యాది వ్యాపారములతో నాడుచుండు నాదిదేవుడు. |
| 337 | పురన్దరః | పురన్దర ఇతి ఖ్యాతః<br>త్రిపురాణాం విదారణాత్. | త్రిపురములను సంహరించినవాడు. |
| 338 | అశోకః | అశోకః శోకమోహాది<br>నాశకః పరికీర్తితః. | తన భక్తుల దుఃఖము అజ్ఞానము మొదలగు వాటిని నశింప జేయువాడు. |
| 339 | తారణః | యాస్తారణ స్తారయతి<br>వైరివ్యాధ్యాది భీతితః। | శత్రువులు, రోగములు మొదలగు వాటివలన కలిగెడు భయమునుండి తనభక్తులను గాచువాడు. |
| 340 | తారః | తార స్సంసార భయతో<br>నిత్యం తారయతీతి సః। | తన భక్తులను సంసారభయమునుండి సదా తరింప జేయు వాడు, |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 41 | శూరః | విజిగీషు తయా జైత్రః<br>సమర్థ శ్శూర ఉచ్యతే. | జయించు కోరిక కలవాడగుటచే సమర్థుడగు జయశీలుడు. |
| 343 | శౌరిః | సూరస్య వసుదేవస్య<br>యోఽపత్యం శౌరిరుచ్యతే. | శూరుడనగా వసుదేవుడు ఆతని కుమారుడు. |
| 343 | జనేశ్వరః | ప్లవనోజ్జ్వల నైశ్వర్య,<br>మహౌఘస్స్యా జ్జనేశ్వరః। | అన్నిటిని ముంచునట్టి తేజస్సు, ఐశ్వర్యము అను మహాప్రవాహము కలవాడగుటచే అందరకు ప్రభువైనవాడు. |
| 341 | అనుకూలః | స్వభావతో మహాత్మ్యేఽపి.<br>మదవిస్మయ వర్జనాత్.<br>భక్తైకప్రవణో నిత్యం.<br>అనుకూల ఇతిస్మృతః. | ఇట్లు సహజమైన మహాత్మ్యముకలవాడైనను మదము గర్వము మొదలగునవి లేనివాడగుటచే నెల్లప్పుడును భక్తులకు పరతంత్రుడై యుండువాడు. |
| 345 | శతావర్తః | ఐశ్వర్య జృమ్భితాభిఖ్యాః.<br>ఆవర్తా యస్య నిత్యశః।<br>శతం సన్తి శతావర్తః,<br>వస్వర్ణో భుక్తిముక్తిదః। | కూలంకషమగు నైశ్వర్య విజృంభణము లనబడు సుడిగుండము లెప్పుడును శతశ్శతములుగా కలవాడు.<br>దీనిని 'ఓమ్ శతావర్తాయనమః' అని మంత్రముగా నాదరించినచో నిది భుక్తిని ముక్తిని యొసంగును. |
| 346 | పద్మీ | లీలాపద్మధరో నిత్యం<br>పద్మీతి పరికీర్త్యతే। | విలాసార్థమై యెల్లప్పుడును చేతిలో పద్మమును ధరించువాడు. |
| 347 | పద్మనిభేక్షణః | స్వచ్ఛాంబుజాతి సదృశే,<br>వీక్షణం శ్రమహారిచ<br>యస్యాస్తి భక్తరక్షాయాం।<br>సస్స్యాత్పద్మనిభేక్షణః॥ | భక్తులను రక్షించుటలో దక్షమైనట్టియు, సంసార తాపమును హరించునట్టియు నిర్మలమగు నీటియందు బుట్టిన తామర పువ్వును పోలిన నేత్రద్వయము కలవాడు. |
| 348 | పద్మనాభః | నాభిశ్చ పద్మవద్యస్య!<br>పద్మనాభ స్సఉచ్యతే॥ | పద్మమును పోలిన బొడ్డు కలవాడు. |
| 349 | అరవిన్దాక్షః | రక్తార విన్దనయనః।<br>స్స్యాదరవిన్దాక్ష ఈరితః॥ | ఎర్రని తామరపూవును బోలిన కనులుగలవాడు. |

# ప్రథమ శ్రీరామ మహాక్రతువు

తెనాలితాలూకా, నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమములో శ్రీ జియ్యర్‌స్వామి వారి అధ్వర్యమున శ్రీరామ మహాక్రతువు 27 దినములు మహావైభవముగా జరిగినది. ఈ ప్రథమ శ్రీరామ మహాక్రతు స్మారకముగా ఆశ్రమములో ఒక రామక్రతు స్థంభము, నిర్మింపబడెను. ఆ స్థంభము 4 వైపుల శ్రీ వాల్మీకి రామాయణ మందలి సంక్షేపసర్గ చెక్కింపబడెను. పైన 3 శిఖరములు ప్రతిష్ఠించిరి. క్రింది ప్రదేశమున శ్రీరామ పట్టాభిషేకముగల శిల ప్రతిష్టింపబడెను. ఆ పట్టాభిషేక శిలక్రింద శ్రీరామ యంత్రముల ప్రతిష్ఠయు జరిగెను. ఆ స్థంభములో ఈ 27 రోజులు దాదాపు 50000 మంది వ్రాసిన రామకోటి పుస్తకములు ఉంచబడెను. ఆ స్థంభము యొక్క క్రిందిభాగమున ఈ విధముగా శిలాశాసన శ్లోకములు చెక్కబడెను.

1 శ్లో॥ శ్రీమతే సర్వలోకానా మత్యంత ప్రీతిహేతవే
సేతవే చ భవాంభోధే శ్రీరామ క్రతవే నమః

2 శ్లో॥ శ్రీమన్నారాయణాచార్య రామానుజయతీశ్వరైః
స్థాపితోఽయం క్రతుస్థంభ వర్ధతామభి వర్ధతాం.

3 శ్లో॥ రామకోటీ రామయంత్రః, రామపట్టాభిషేచనమ్
యస్మిన్ విభ్రాజతే సోఽయం క్రతుస్థంభోఽభివర్ధతాం.

4 శ్లో॥ అష్టోత్తరశతావృత్తి క్రియమాణేషు సర్వతం
రామక్రతుషు పూర్ణోఽభూ దాద్యః క్రతురిహాశ్రమే.

9-11-60 వ తేది మధ్యాహ్నము పునర్వసు పట్టాభిషేకం జరిగెను. పండితులకు, యాజ్ఞికులకు భూరి సత్కారములు జరిగెను. ఆనాడు శ్రీ కూనంనేని బాపయ్యగారు, ఆంబోతును వేసిరి విశేషముగా అన్ని వర్ణములవారికి అన్నదానము విరివిగా జరిగెను. పట్టాభిషేక సమయములో శ్రీమార్గ మన కవిగారు, సంక్షేపసర్గను, ఆంధ్రీకరించిన పద్యకావ్యమును గానముచేసి శ్రీ కోదండరామస్వామివారికి కృతిఇచ్చిరి. ఆసమయములో శ్రీ కవిగారిని శ్రీ జియ్యర్‌స్వామి వారు పట్టువస్త్రములతో 116/ రూ॥లతో కవిసత్కారము గావింపజేసిరి. ఈ 27 దినములు వాల్మీకి స్థానమందుండి, ఏకధాటిగా శ్రీరామాయణమును పారాయణ గావించి మధ్యాహ్నము తదర్థము ననుగ్రహించి అశేషజనుల నానందిపజేసిన శ్రీమాన్ ఉ. వే. విద్వాన్ తె, కం. గోపాలాచార్య స్వామివారికి శ్రీ జియ్యర్‌స్వామివారు, హార్ద సత్కారమును గావించిరి. ఈ శ్రీరామ క్రతువునకు ప్రతిదినము పరిసర ప్రాంతములనుండి పెక్కురు భక్తులు విచ్చేసిరి. పట్టాభిషేకమునాడు కొన్నివేల మంది ప్రేక్షకులు విచ్చేసిరి.

ఈ రామాయణ పారాయణ సందర్భములో సుగ్రీవునిముందు సీత నగలమూటవేయు ఘట్టమున శ్రీ సూరపనేని సీతారామమ్మ రెండు బంగారు కాసులు చేయించి సమర్పించెను.

హనుమంతునకు రాముడు ఉంగరమిచ్చు ఘట్టములో ఒక భక్తురాలు బంగారు ఉంగరము సమర్పించెను. సీతకు హనుమంతుడు, ఉంగరమిచ్చు ఘట్టములో ఉయ్యూరు సుబ్బమ్మ గారు, బంగారు ఉంగరము సమర్పించిరి.

విభీషణ పట్టాభిషేక సమయములో శ్రీ గుంటేటి సుబ్బారెడ్డిగారు భూదానముగావించిరి. పట్టాభిషేక ఘట్టము ఇంక 4 రోజులు ఉన్న దనగా నడిగడ్డపాలెం గ్రామవాసులు, దాదాపు 40 బస్తాల బియ్యమును 4 వేల రూపాయలను ప్రోగుచేసి విరివిగా అశేష జనమునకు అన్న దానముగావించిరి ఈ సమయములో శ్రీ కూనంనేని బాపమ్మగారు రాజదండములకు 25/రు సమర్పించిరి. శ్రీ తుమ్మల బసవమ్మగారు (కొల్లూరు) అఖండదీపమునకు ఇత్తడి కాయ సమర్పించిరి.

శ్రీ మందలపు క్రిష్టయ్యగారు శ్రీరామ పట్టాభిషేక విగ్రహ నిర్మాణమునకు 100/లు విరాళమిచ్చిరి. ఆనాడు పట్టాభిషేకోత్సవము, వృషోత్సర్జము క్రతు స్థంభ ప్రతిష్ఠాపన, అవభృధోత్సవము. ఇత్యాది కార్యక్రమములు పూర్తి అగునప్పటికి దాదాపు రాత్రి 7 గం లు అయినది రాత్రి 8 గం. లకు శ్రీజియర్ స్వామివారు తమ పరివారముతో బయలుదేరి ద్వితీయ రామ క్రతువునకుగా చుండూరు వేంచేసిరి. చుండూరులో అశేష జనము స్వామివారికి బ్రహ్మాండమైన స్వాగతోత్సవము జరిపిరి.

9-11-60 వ తేది రాత్రి 9 గం. లకు శ్రీ స్వామివారు చుండూరులో ప్రవేశించి శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో ద్వితీయ శ్రీరామ మహాక్రతువునకు అంకురారోపణ గావించిరి. 10-11-60 వ తేదినుండి ద్వితీయ శ్రీరామ క్రతువు ఆరంభమయ్యెను. ప్రతిదినము ఉదయము 7 గం. లకు శ్రీ స్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి. 7-30 లకు సముష్టిగా తిరువాయి మొళ్ళి సేవాకాలము (ప్రతిదినము రేపు మాపు ౨ తిరువాయి మొళ్ళి చొప్పున) ఆ తరువాత చుండూరులో శ్రీ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్య స్వామివారు వాల్మీకి స్థానీయులుగా యుండి శ్రీమద్రామాయణము రోజుకు 20 సర్గలుచొప్పున పారాయణము గావించుచు మధ్యాహ్నం తదర్థములను వినిపించుచున్నారు. పారాయణానంతరము రామనామము 108 పర్యాయములు వ్రాయుట ఆపిదప గీత పారాయణము, ఆపిదప, సహస్రనామ పూజలు ఆపిదప తీర్థ ప్రసాదగోష్ఠి మరల మధ్యాహ్నము 2 గం. లకు భగవద్విషయ కాలక్షేపము ఆపిదప రామాయణ కాలక్షేపము, రాత్రి లక్ష్మీపూజలు తిరువాయి మొళ్ళి సేవాకాలము మహాశ్రీరామనామ భజన తీర్థ ప్రసాదగోష్ఠి ఇత్యాది కార్యక్రమములో చుండూరు ద్వితీయ శ్రీరామ మహాక్రతువు మహావైభవముగా జరుగుచున్నది. ప్రతిదినము ఒక్కొక్కరు చొప్పున ఉభయదారులు ఏర్పడి స్వాములకు తదీయారాధన ప్రసాధములు గావించుచున్నారు.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ సభ్యులకు, ప్రచారకులకు, సానుభూతిపరులకున్ను శ్రీయతి రాజసేవా మహిళామండలి ప్రచారకురాండ్రు, సానుభూతిపరులకున్ను భక్తి నివేదన పత్రిక చందాదారులకున్ను

భక్తాగ్రేసరులారా!

శ్రీమతే నారాయణాయనమః.

శ్రియఃపతి కటాక్ష విశేషముచే ప్రథమ శ్రీరామ మహాక్రతువు వైభవముగా పూర్తియైనది. చుండూరులో ద్వితీయ శ్రీరామ మహాక్రతువు ప్రారంభమైనది. ప్రథమ క్రతువునకు దాదాపు ఒకటిన్నర కోటి వరకు శ్రీరామనామ లిఖిత పత్రములు వచ్చినవి. వానితో ప్రథమ శ్రీరామ మహాక్రతు స్తంభము సుందరముగా నిర్మింపబడినది. స్తంభ నిర్మాణమునకు సుమారు రూ 1,500/లు అయినవి. నిర్మాణపు ఖర్చును ఇంకను తగ్గించుటకు ప్రయత్నించితిమి, గాని సాధ్యపడలేదు. ఇంకను తీరును చేయుట ఇంకను సుందరముగ నుండునటుల, కైవారమును ఎత్తును పెంచుట చేసినచో యింకను రూ 500/- వరకు ఖర్చు పెరగవచ్చును. చుండూరులోని ద్వితీయ శ్రీరామ మహాక్రతు స్తంభము ఈ హెచ్చుఖర్చు పద్ధతిగనే నిర్మింప బడుచున్నది.

శ్రీవాసునాస ఆశ్రమములోని ప్రథమ శ్రీరామ మహాక్రతు స్తంభమునకు శ్రీరామ కోటి వ్రాసిన భక్తుల వలన సమర్పింపబడిన ద్రవ్యము. (108 శ్రీరామ నామ లేఖమునకు ఒక్కొక్క నయాపైస చొప్పున) షుమారు రూ 200/ మాత్రమే. రూ 150/ సుభక్తులు (శ్రీరామ పట్టాభిషేక శిలకున్ను, కలశములకున్ను సమర్పించిరి.) మిగత ద్రవ్యమంతయును అప్పుచేసి పెట్ట వలసి వచ్చినది. ప్రథమ శ్రీరామ మహాక్రతువునకై యిప్పటికి సుమారు రూ6000/. నుఅప్పుచేసి పెట్ట వలశి వచ్చినది. ఇదే మోస్తరుగనైనచో మనము కోరు నటుల భారతదేశము నందంతటను 108 స్తంభములనిర్మాణము జరుగుట సంభవించదు. ఇంతియెగాక ఇప్పటికి కలిగిన యనుభవమును బట్టి ప్రతిక్రతువునకును, ఈ సంచారములో నూతన స్థలముల యందు, ఇంత తక్కువ వ్యవధి ఒక్కొక్క 'శ్రీరామ కోటిని' వ్రాయించుటయు అందులకై పత్రికలు పంచిపెట్టుట ప్రచారము చేయుట చాలా కష్టమైన పనిగా తోచుచున్నది. ఇది అసంభవము కాదు గాని ప్రచారక సిబ్బంది చాల హెచ్చుగ నున్న గాని ఈపని సక్రమముగా జరుగజాలదు.

మరియు ఇప్పటి వరకు గృహస్థులు తపోరూపమైనట్టియు, అందరు అన్నికాలములలోను ఇట్టి సిధనముల పాల్గొని పనిచేయు యజ్ఞరూపమైనట్టియు, ముముక్షువులకు సాధనానుష్ఠాన రూపమైనట్టియు, ఇహపర సౌభాగ్యప్రద శాంతిదాయి యైనట్టియు ఈ కార్యక్రమములో పాల్గొని నట్టియు. పాల్గొన గోరినట్టియు భక్తులు తాముతమ యిండ్లవద్దనుండి పని చేయుచుండుటకు వీలుగా

ఇకమీదట కూడ తాము కనీసము ఈ తొమ్మిది సంవత్సరముల కాలమైనను ఈ 108 క్రతువులలో పాల్గొనుటకు వీలుగా సరైన ఒక కార్యక్రమమును సూచింపవలసినదిగ మిక్కిలి ఉత్సాహముతో అడుగుచున్నారు.

అట్టివారందరి కొరకై మేము ఈ కార్య విధానమును సూచించుచున్నాము. మీరు మీ యిండ్లవద్దనే యుండి ప్రతినిత్యము కనీసము 108 పర్యాయములకు తక్కువగాకుండగ "శ్రీరామ" నామములను కనీసము ఈ 9 సంవత్సరములు వ్రాసి మాకు ప్రతి నెలయు పంపుచుండుడు. మేము వాటినన్నిటిని, భారతదేశమునందంతటను, శ్రీరామ మహాక్రతువు యొక్క శ్రీరామ పట్టాభిషేకము జరిగిన ప్రతిస్థలము నందును "శ్రీరామ మహాక్రతువు స్తంభము"ను నిర్మాణమును చేయించి, మీ రుపంపు శ్రీరామ నామ లిఖిత ప్రతముల నందుంచి ప్రతిష్ట గావించుచుండగలము.

ఈ పద్ధతి వలన మీరుకూడ ఈ 108 శ్రీరామ మహాక్రతు కార్యక్రమములో పాల్గొనిన పుణ్యవంతులు కాగలరు. ప్రతిక్రతువు పూర్తియైన స్థలమునందెల్ల క్రతుస్తంభమును నిర్మించుటను మీరు కారకులు కారణభూతులు కాగలరు మీరు వ్రాశిన శ్రీరామ కోటి కాగితములు భారత దేశమందంతటను ఆసేతు సీతాచలము క్రతు స్తంభమున విరాజిల్లుచు యావద్భారత దేశ ప్రజలచేతను ఆరాధింప బడుచుండగలవు తద్వారా మాకును ప్రతి క్రతువునకును శ్రీరామ కోటిని వ్రాయించుటలోను స్తంభమును నిర్మింప జేయుటలోను వ్యయ ప్రయాసలు కొంతవరకు తగ్గగలవు ఈ విధానము వలన కొన్ని స్తలములయందు శ్రీరామ కోటి వ్రాయించుట సాగక పోవుటచే గాని స్తంభ నిర్మాణమునకు ధనము లేక పోవుటచే గాని స్తంభమును నిర్మించకుండగ విడిచి పెట్టుటయునుతటస్థించదు—

27 రోజులలో పూర్తియగుచుండు ప్రతి క్రతువునకును కావలశిన శ్రీరామ కోటికైయ్యెన్ను, వానిని యుంచు స్తంభ నిర్మాణమునకగు ఖర్చు రూ 1500/- కొరకున్ను, 6000 మంది ప్రతినిత్యము 108 పర్యాయములకు తక్కువ గాకుండగ "శ్రీరామ" నామములను వ్రాశి, ఒక్కొక్క నయాపైస చొప్పున సమర్పింపవలశి యుండును ఇటుల 9 సంవత్సరములు అవిచ్ఛిన్నముగ జరిగినచో 108 క్రతువులన్ను, ఆక్రతువులు పూర్తియైన చోట్ల 108 క్రతు-స్తంభములు నిర్మాణమున్ను అవిచ్ఛిన్నముగ జరుగగలవు.

ఇందులకై ఈ శ్రీరామ కార్యక్రమమున ఉత్సాహము—అవకాశము సానుభూతి గలవారందరును, తమ తమ ప్రాంతములో నున్న భక్తులకు ఈ విషయమును వివరముగ తెలిపి ప్రోత్సహించి శ్రీరామ నామములను దినము 1కి కనీసము 108 చొప్పున వ్రాయునటులను, దినము 1కి ఒకనయాపైస చొప్పున సమర్పించు నటులను ప్రచారము చేయువలెను—

మీరు ప్రతివకరును మీ మీ ఉత్సాహ శక్తుల ననుసరించి మీ వీధిలోనో మీ గ్రామములోనో, మీ ప్రాంతములోనో యుండు భక్తులను 25 మందిగాని లేక, 50 మందిగాని లేక 100 మందిగాని

లేక, ఇంకను హెచ్చు మందిని గాని ఈకార్యక్రమము సభ్యులుగ చేర్చి ఆ సంఖ్యను మాకు తెలుపవలెను. మీరు తెలుపు సంఖ్యకు సరి పోవునటుల శ్రీరామ నామములను వ్రాయు రూళ్ళు వేసిన కాగితములను మేము మొత్తముగ మీకు పంపగలము. వాటిని మీరు నెలకొక పర్యాయము ఆయా భక్తులకు స్వయముగ అందజేసి వాటికి ప్రతిదినము 108 పర్యాయములకు తక్కువగాకుండగ శ్రీరామ నామములను వ్రాయునటులను, ప్రతిదినము దినమున కొక్కొక్క నయాపైస చొప్పున "శ్రీరామ కోటినిధి"కి సమర్పించుచుండు నటుల హెచ్చరించి, ఆ కాగితములను ఆ నయాపైసలను నెలకొక పర్యాయము మీరె స్వయముగ వసూలుపరచి, వాటి నన్నింటిని మాకు శ్రీవాసు దాసాశ్రమమునకు (గడిగడ్డపాలెము—(వయా) చేబ్రోలు గుంటూరుజిల్లా) పంపుచుండ వలెనది. మేము వాటిని ప్రతి నెలయు అచ్చట నుండి తెప్పించుకొని ఆయా క్రతుస్తంభములో ప్రతిష్టించు చుండగలము ఈ విధానముద్వారా మీరు 9 సంవత్సరములు అవిచ్ఛిన్నముగ శ్రీరామ మహా క్రతువులో పాల్గొని కైంకర్యము చేసినవారు కాగలరు. మీరు వ్రాయించిన కాగితములు ఆసేతు సీతాచలము క్రతుస్తంభము లో ప్రతిష్ఠితమై పూజింప బడుచుండగలవు మీ శ్రీరామ భక్తి—మీ రామకోటి లేఖనము ఆ సేతు సీతాచలము అనేక మందికి ఆదర్శభూతమై భక్తి జ్ఞానముల కలిగించి పునీతుల జేయుగలదు — మరియు మనము వహించిన శ్రీరామ మహా క్రతువు కార్యక్రమము — స్తంభ నిర్మాణము అను సత్కార్యము సుకరమై సులభముగ శ్రమ లేకుండగ దిగ్విజయము జరుగుచుండగలదు మీకెల్ల ప్రతి నెలయు సభ్యుల కందరకును శ్రీరామ నామముల వ్రాయు కాగితములను అందజేయు చుండుటయును క్రిందటి నెలలో వ్రాసిన కాగితములను అందులకై సమర్పించిన నయాపైసలను వసూలు చేయుటయును. మానివేసిన సభ్యులకు బదులుగా తిరిగి క్రొత్త సభ్యులను చేర్చు కొనుచుండుటయును, వసూలు చేసిన కాగితములను, డబ్బునుమాకు ప్రతి నెలయు పంపు చుండుటయును, అను కొద్ది శ్రమలు కలుగును గాని యిందు వలన కలుగు ఫలితము, ప్రచారము మాత్రము అత్యద్భుతమైనట్టి—మీరే ఆలోచించిచూడుడు ఇప్పటికి సుమారు 1000 మంది సభ్యుల—ప్రతిదినము దినము 1కి108 పర్యాయములు శ్రీరామ నామమును వ్రాయుటయును, దినమున కొక్కొక్క నయాపైస చొప్పున సమర్పించుచుండుటయును, మరియు దినము 1కి కనీసము 108, బియ్యపు గింజలను శ్రీరామ నామము నుచ్చరించుచు ఏరుట యును అను కార్యక్రమమును అవిచ్ఛిన్నముగ 9సం రములు జరుపుటకు వాగ్దానమును జేసియున్నారు—

గాన మీరు కూడ ప్రతినిధిగా వారి 25 లేక 50 లేక 100 మంది సభ్యులను చేర్చి మాకు తెలియ జేయుడు ఉచితము గానే పుస్తకములను మీకు పంపగలము.

రోజు 1కి 108 మంది కంటె వ్రాయగల వారు వ్రాయవచ్చును రోజు 1కి ఒక్కొక్క నయాపైస కంటెను అధికముగ నీయ దలచువారు తప్పక ఈయ వచ్చును

వెంటనే మీ సలహాలు సమ్మతములను తెలియజేయుడు.

శ్రీ. రా. జీయరు.

శ్రీహయగ్రీవాయ నమః

# ప్రచార విభాగము

## ఏలూరు

ఇచ్చట శ్రీవిశిష్టాద్వైత ప్రచారకశాఖా సంఘమువారు 30–10–60 వ తేదినాడు ఉత్థానైకాదశీ మహోత్సవమును పరమ విలక్షణముగా జరిపిరి. ఆనాడు శ్రీ జనార్ధనస్వామివారికి 108 సహస్రనామార్చనలు జరిపి రాత్రి శ్రీ కైశిక మహాత్మ్యమును పురాణ కాలక్షేపము గావించిరి. 31–10–60 వ తేది క్షీరాబ్ధి ద్వాదశి కైశిక పూజలు తీర్థప్రసాదగోష్ఠి జరిపిరి. ఏకాదశినాడు. శ్రీ ఆండాళ్ సేవామహిళా సమితివారు. సమష్ఠినామ సంకీర్తనము చాలా వైభవముగా జరిపిరి.

## బందరు

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు తమ సంఘ వార్షికోత్సవములను మూడుదినములు చాలా వైభవముగా జరిపిరి. ఈ సభలకు విదుషీ మణులు, విద్వాంసులు విచ్చేసిరి. ఈ మహిళా మండలిద్వారా సంప్రదాయాభివృద్ధి విరివిగా జరుగుచున్నందులకు చాలసంతోషించుచున్నాము. ఈ సందర్భములో సంఘ కట్నముగా 5/ లు సమర్పించిరి.

## అనకాపల్లి

ఇచ్చట మహిళామండలివారు అత్యంత శ్రద్ధాభక్తులతో ప్రతి శుక్రవారము లక్ష్మీపూజలు, శ్రీ పార్థసారథి భవనములో జరుపుచున్నారు. మరియు అప్పుడప్పుడు స్త్రీలు తమ తమ యిండ్లను ఆహ్వానించియు ఈ పూజలు గావించుచున్నారు. ఈ మహిళా మండలి వారితరుపున ఇటీవల కృష్ణాష్టమి ఉత్సవము చాలా వైభవముగా జరిగినది. మరియు ఆశ్వయుజ శుద ఏకాదశినాడు నామసంకీర్తనము ఏకాహముగా జరిపిరి, ఆనాడు విశేష భోగములు పూజలు జరిగినవి.

## వరంగల్లు

ఇచ్చట శ్రీ వెంకటేశ్వరస్వామి దేవస్థానములో గీతా ప్రచారక పరిషత్ వారి యాజమాన్యమున శ్రీహరే రామ నామ మహాక్రతు మహోత్సవములు 31-10-60 మొదలు 3-11-60 వ తేదీవరకు వరుసగా 4 రోజులు పరమ విలక్షణముగా జరిగినవి. శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము తిరువీధి పర్యటనము శ్రీమద్రామాయణోపన్యాసములు కవితాగోష్ఠులు, పూజలు, శ్రీహరేరామ నామ సంకీర్తనములు, నాదస్వర కచ్చేరీలు, ఉన్నతోద్యోగుల సమావేశములు. మహాపండితుల అభిభాషణములు, పండిత సన్మానములు ఇత్యాదులు వైభవముగా జరిగినవి. పరిషత్ వ్యవస్థాపకులుశ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులుగారీకార్యక్రమమును అత్యంతోత్సాహముతో గావించుచున్నారు. శ్రియఃపతి వీరిఉద్యమునకు సర్వదా తోడ్పడుగాకయని కోరుచున్నాము.

## నడిగడ్డపాలెం, శ్రీవాసుదాసాశ్రమము

ఇచ్చట కార్తీకశుద్ధ ఏకాదశినాడు శ్రీజియ్యర్ స్వామివారి చాతుర్మాసదీక్ష విరమణ కార్యక్రమము, విలక్షణముగా జరిగినది. ఆనాటికి శ్రీజియ్యర్ స్వామివారి శిష్యులు, అభిమానులు పెక్కురు స్త్రీలు పురుషులు కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలనుండి విచ్చేసిరి. ఏకాదశి తెల్లవారి జామున శ్రీకోదండ రామ స్వామివారి సన్నిధిలో శ్రీ కైశిక మహాత్మ్య కాలక్షేపమును కవిగారు గావించిరి. పిమ్మటఅఖండ తదీయారాధన జరిగెను.

బందరు

శ్రీమతేరామానుజాయనమః

## శ్రీయతి రాజసేవా మహిళామండలి బందరు స్థాపితము 1950
## 10వ సంవత్సర శుక్రవారోత్సవ వార్షిక సభలు.

శ్రీ శార్వరినామ సంవత్సర ఆశ్వీజ బహుళ విదియా గురువారం అనగా 6-10-1960 నుండి నాలుగు దినములు శ్రీయతి రాజసేవా మహిళామండలి శుక్రవారోత్సవ 10 వ సంవత్సర వార్షిక సభలు మహావైభవముగా జరిపించిరి, శ్రీయతిరాజ సేవా మహిళామండలివారు నూతనముగా కొన్న శ్రీయతి రాజభవనమునందు అత్యంతానందముతో కార్యక్రమము జరిపిరి 6 వ తారీఖు మధ్యాహ్నం 3 గంటలనుండి శ్రీయతి రాజభవనమునుండి శ్రీయతి రాజులవారి పటమును మంగళ వాద్యములతోను భజనలతోను శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణములతో తిరువీధి వుత్సవము సుమారు రెండు వందలమంది మహిళామణులు వెంటనడువ తిరువీధి వుత్సవము అత్యంత జనాహ్లాదకరముగా జరిగినది.

ప్రతిదినము తెల్లవారుఝాము 4 గం నుండి భవనమునందు సుప్రభాతములు మేలుకొలుపులు స్తోత్ర పారాయణము తిరువీరాధన సేవాకాలం తీర్థప్రసాదగోష్ఠి జరిగినది

ప్రతిదినము ఉదయం 9 గంటలనుండి శ్రీమాన్ సముద్రాల తిరువేంగళాచార్యులగారు నల్లందిఘళ్ శ్రీమన్నారాయణాచార్యులుగారు S. Y G. L పెరుమాళ్ళాచార్యులుగార్లు అధ్యక్షులు వహించిరి, ఉపన్యాసకులు. ఉ వే. ప్ర. శ్రీ. చ. వెం. నరసింహాచార్యులుగారు శ్రీమాన్ ఆసూరిమరంగంటి లక్ష్మీనరసింహాచార్యులుగారు శ్రీమతి కంతేటి తాయారమ్మగారు మరంగంటి సీతమ్మగారు.

మధ్యాహ్నం 3గం నుండి మూడురోజులు ప్రార్థనచేసినవారు శ్రీమతి తట్టా ఆండాళ్లమ్మగారు కోప్పర్తి యతిరాజవల్లి తాయారమ్మగారు కంతేటి సరోజినిగారు.

మూడురోజులు సాయంత్రం సభలకు ఉభయవేదాంత ప్రవీణురాలైన అమరవాది వెంకటనరసమ్మగారు శ్రీపతి సీతమ్మగారు యిరగవరపు నరసాయమ్మగారు అధ్యక్షత వహించిరి. కార్యదర్శిని మరంగంటి సీతమ్మగారు నివేదిక చదివిన తర్వాత బెజవాడ వాస్తవ్యురాలు శ్రీమతి ధూపాటి రాజ్యలక్ష్మమ్మగారు తమయొక్క ఉపన్యాసముచే మూడురోజులు మహిళామండలి వారిని ఆనందాబ్ధి నోలలాడించిరి. విజయవాడ వాస్తవ్యురాలు గొట్ల వెంకటసుబ్బమ్మగారు రుక్మిణీ కల్యాణఘట్ట సాంప్రదాయ సిద్ధిగా పద్యములతో ఉపన్యాస రూపకంగాచెప్పి ప్రేక్షకుల నానందాబ్ధి నోలలాడించి మన్ననపొందిరి.

మూడుదినములు.గుడివాడ వాస్తవ్యులు శ్రీ గంటసాల శ్రీనివాసరామానుజ గుప్తగారు సంస్కృత ఆంధ్ర, ద్రావిడ, హిందీ, మహారాష్ట్రి ఆంగ్లయాది బహుభాషీయ ఉపమాన ఉపమేయములచే ఉపన్యసించి సభికుల నత్యూత లూగించిరి.

విజయవాడ వాస్తవ్యులు శ్రీ నిడుముక్కల శ్రీరామమూర్తిగారి భార్యా శ్రీమతి అన్నపూర్ణ సేషగిరమ్మగారు సుశ్రావ్యమైన సంగీతసభ రాగం తానం పల్లవితోగూడా జరిపి ప్రసంశనందిరి వారికి విశిష్టాద్వైత ప్రవర్తక సంఘము వారు 10 రూ బహుమతి నొసంగిరి

శ్రీమతి శ్రీమత్ తిరుమల భాగ్యలక్ష్మమ్మ అమ్మవార్లగారును శ్రీమతి వింజమూరి జానికమ్మగారు (ముదునూరుపాడు) ప్రతి సంవత్సరము వారిచే పోషింపబడుచున్న సంగీత పోటీపరీక్షలు జరిపి మొదటి బహుమతి టి. శీతామాలక్ష్మి రెండవ ప్రైజు M. కుసుమ లకు ఈయబడెను.

## శ్రీ నడిగడ్డపాలెంలో శ్రీమన్నారాయణజీయరుస్వామివారు

### చేయించిన ప్రథమ శ్రీరామ మహాక్రతువునకు బీదలకు అన్నదాన కైంకర్యము నిమిత్తము చందాలిచ్చినవారి వివరము

| | రు.అ.పై. |
|---|---|
| కూనంనేని బాపయ్యదాసుగారు | రు 292-0-0 |
| మందలపు బాపయ్యగారు (బ్రదర్సు) | 292-0-0 |
| కూనంనేని సూర్యనారాయణగారు | 146-0-0 |
| కూనంనేని సత్యనారాయణగారు | 146-0-0 |
| కాజ బుచ్చయ్యగారు | 146-0-0 |
| మందలపు వరహాలమ్మగారు | 126-12-0 |
| కూనంనేని చినరాఘవయ్యగారు | 105-4-0 |
| చెరుకూరి సీతారామయ్యగారు | 105-4-0 |
| మందలపు వెంకట్రామయ్యగారు | 89-0-0 |
| కాజ సీతారామయ్యగారు | 95-8-0 |
| మందలపు వెంకటకృష్ణయ్యగారు | 89-0-0 |
| పట్టికూటి ఆనందయ్యగారు | 77-8-0 |
| కూనంనేని నాగయ్యగారు | 50-0-0 |
| కూనంనేని చుక్కమ్మగారు | 45-8-0 |
| కూనంనేని వెంకటప్పయ్య కుమారుడు సీతారామయ్యగారు | 38-12-0 |
| వేములపల్లి వెంకటప్పయ్యగారు | 38-12-0 |
| కూనంనేని మల్లిఖార్జునరావుగారు | 38-6-0 |
| కూనంనేని బసవపున్నయ్యగారు | 37-0-0 |
| కూనంనేని సుబ్బయ్యగారి కుమారుడు రాఘవయ్యగారు | 25-8-0 |
| గొట్టిపాటి మల్లిఖార్జునరావుగారు | 22-12-0 |
| కాజ గోపాలరావుగారు | 22-12-0 |
| వేములపల్లి పెదసుబ్బారావుగారు | 16-6-0 |
| కూనంనేని గోపయ్యగారు | 15-8-0 |
| కాజ రంగారావుగారు | 15-7-0 |
| నందిపాటి రామయ్య గుప్తాగారు (బెజవాడ) | 15-0-3 |
| కాజ పెదకోటయ్యగారు | 11-6-0 |
| వేములపల్లి చినసుబ్బారావుగారు | 9-1-6 |
| వేములపల్లి వెంకటేశ్వర్లుగారు | 5-0-0 |
| బొల్లు గోపాలరావుగారు | 5-0-0 |
| గుంటూరు వెంకటసుబ్బయ్యగారు | 5-0-0 |
| అయినేని సాంబయ్యగారు | 5-0-0 |
| కూనంనేని వెంకట్రామయ్యగారి కుమారుడు సీతారామయ్యగారు | 5-0-0 |
| కాజ రామకోటయ్యగారు | 4-0-0 |
| కూనంనేని వెంకటప్పయ్యగారు | 4-0-0 |
| కూనంనేని సాంబయ్యగారు | 2-0-0 |
| మందలపు బసవపరిపూర్ణచంద్రశేఖరరావు | 57-0-0 |
| వేములపల్లి తిరుపతయ్యగారు | 25-0-0 |
| కూనంనేని వెంకటరత్తయ్యగారు | 50-0-0 |
| కొల్లా నరసింహారావుగారు | 37-12-0 |
| కూనంనేని రామకోటేశ్వరరావుగారు | 30-8-0 |
| జాష్టి నాగయ్యగారు | 11-6-0 |
| | 2359-0-9 |

### సంభావన

శ్రీమాన్ డాక్టరు న. చ. జగన్నాథాచార్యులుగారు (అనపర్తి) తమతల్లిగారగు చూడమ్మగారి పరమపదోత్సవమును అత్యంత వైభవముగా జరిపించి మనసంఘమునకు రూ 10-0-0 లు సంభావన సమర్పించిరి. వీరి తల్లిగారికి శ్రియఃపతి శాశ్వత సాయుజ్య సౌఖ్యమును ప్రసాదించుగాక

# ద్వితీయ శ్రీరామ మహాక్రతువు

తెనాలితాలూకా, చుండూరు గ్రామంలో శ్రీ కోదండరామస్వామివారి సన్నిధి యందు 10-11-60 వ తేదినుండి ద్వితీయ శ్రీరామ మహాక్రతువు ఆరంభమైనది సువిశాలమై ఆలయములో చక్కని పెద్ద పందిరిని, క్రింద నాపరాయిని శ్రీ స్వామివారు వేంచేసియుండుటకు క్రొత్తగా ఒక శాల చుండూరు రామక్రతు కార్యకర్తలు అత్యంత శ్రద్ధాభక్తులతో సభాస్థలము నకు ఏర్పాటుచేసిరి. శ్రీరామక్రతు నిర్వహణార్థమై వేంచేసిన స్వాములకు, తదితర జనాలకు కార్యకర్తలు సకలవిధ సౌకర్యములు ఏర్పాటుచేసిరి. మొదటిరోజు శ్రీ గాదె నాగభూషణంరెడ్డి గారు క్రతువునకు వలయు సకలవిధ సౌకర్యములను ఏర్పాటుగావించిరి. రెండవనాడు శ్రీ గాదె రెడ్డి పున్నమ్మగారు, స్వాములకు తదీయారాధన గావించి ఒక దంపతులకు నూతన వస్త్రములు, చీరె, సమర్పించి దంపతి పూజగావించిరి.

మూడవనాడు :- శ్రీ పడాల దశరధరామయ్య, నారాయణ, వెంకటేశ్వర్లుగార్లు తదీయారాధనగావించి, అహల్యాశాపవిమోచన ఘట్టంలో దంపతులకు నూతన వస్త్రములను సమర్పించి దంపతి పూజగావించిరి.

నాల్గవనాడు :- అంబటి చినగురవయ్యగారు తదీయారాధన గావించిరి.

అయిదవనాడు :- శ్రీ కారుమూరు కోటిరెడ్డి కుమారుడు సీతారామిరెడ్డిగారు తదీయారాధన గావించిరి. ఈనాడు మహావైభవముగా గోపూజ జరిగినది. గ్రామంలో ఉన్న అన్ని గోవులకు పూజలు ఊరేగింపులు జరిగినవి.

ఆరవరోజు :- శ్రీ కళ్ళం అప్పిరెడ్డిగారు, దేవస్థానం ట్రస్టీగారు, తదీయారాధన గావించిరి, ఈనాడు విశేషదానములు జరిగినవి.

ధాన్యదానం- శ్రీ పడాల వెంకటేశ్వర్లుగారు.
గోదానం- శ్రీ గుదేటి బాపమ్మగారు.
భూదానం- శ్రీ బండారు సరస్వతమ్మగారు.
సువర్ణ, రజతదానములు- శ్రీ కారుమూరి శేషమ్మగారు.
వస్త్రదానం- శ్రీ తిప్పిరెడ్డి అప్పిరెడ్డిగారు.

తదితర దానములు- శ్రీ చుండూరు రామక్రతు కార్యకర్తలు, శ్రీ అంబటి గురవయ్య గారు, శ్రీ భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు, శ్రీ అంచ బుల్లెమ్మగారు, శ్రీ ఇందుకూరు శేషమ్మ గారు, శ్రీ వట్టిగుంట దమయంతమ్మగారు, జరిపిరి.

ఏడవరోజు :- కారుమూరి కోటిరెడ్డిగారి కుమారుడు సుబ్బారెడ్డిగారు, తదీయారాధన గావించిరి.

ఈనాడు గృహదానం ఉయ్యూరు సాంబిరెడ్డిగారి భార్య సుబ్బమ్మ గృహదానము చేయుచు 116/ లు సమర్పించిరి.

ఎనిమిదవరోజు :- శ్రీ ఉయ్యూరు సీతారామిరెడ్డిగారు, ఈనాడు తదీయారాధన గావించిరి.

తొమ్మిదవరోజు.- శ్రీ గుండవరపు వెంకటేశ్వర్లుగారు తదీయారాధనాదులు, ఈనాడు జరిపిరి.

పదియవరోజు :- ఈనాడు ఈమని నరసారెడ్డిగారు, తదీయారాధనాదులు జరిపించిరి.

పదకొండవరోజు :- శ్రీ కారుమూరు కోటిరెడ్డిగారు, తదీయారాధన జరిపించిరి.

పంన్రెండవరోజు :- మోదుగుల కోటిరెడ్డి సూర్యనారాయణ సోదరులు తదీయారాధన జరిపిరి

పదమూడవరోజు :- శ్రీ గుదేటి వీరారెడ్డిగారు తదీయారాధన జరిపిరి. (ట్రస్టీ)

పదునాలుగవరోజు :- ఉయ్యూరి సుబ్బారెడ్డిగారు (ట్రస్టీ) తదీయారాధన జరిపిరి.

## ప్రచార విభాగము

### పద్మనాభం

విశాఖజిల్లా పద్మనాభం గ్రామంలో శ్రీమదనంత పద్మనాభ భక్తమండలి వారి ప్రథమ వార్షికోత్సవము 13-11-60 వ తేదినాడు చాలవైభవముగా జరిగినది. ఈసభకు మహారాజశ్రీ వాసవల్లి సోమలింగ శాస్త్రి గారు B. A. B. E. D. అధ్యక్షత వహించిరి. స్వామివారి సన్నిధిలో విశేషపూజా కార్యక్రమము జరిగినది. ఈసభలో స్థానిక విద్వాంసులు స్వాములు పెక్కురు ఉపన్యసించిరి. పుర ప్రముఖులు భక్తులను శ్రీస్వామివారి సన్నిధిలో జీర్ణమైన ధ్వజస్తంభ ప్రతిష్ఠ త్వరలో జరుపుటకు సహకరించవలసినదిగా కార్యకర్తలు కోరిరి.

### వరంగల్లు

ఇచ్చట శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానములో గీతాప్రచారక పరిషత్తువారు నవంబరు 26, 27, 28, 29, తేదీలలో గీతాజయంతి ఉత్సవముల యందు సాంస్కృతిక, వైజ్ఞానిక, పోటీ పరీక్షలను ఏర్పాటు చేసి గీతాజయంతిని చాల వైభవముగా జరిపిరి. ఈకార్యక్రమును శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులు గారు ఈగీతాప్రచారకపరిషత్తుకు వ్యవస్థాపకులై మహోత్సాహముతో గీతాప్రచారమును గావించుచున్నారు.

శ్రీమతేరామానుజాయ నమః

# తృతీయ శ్రీరామ మహాక్రతువు

తృతీయ శ్రీరామ మహాక్రతువు 7-12-60 వ తేది మోతుకూరులో ప్రారంభమై, మామిళ్ళపల్లి, మునిపల్లె, పొన్నూరు, అప్పికట్ల, బాపట్ల, వెదుళ్ళపల్లి, గ్రామాదుల మీదుగా 20-12-60 వ తేది సాయంకాలమునకు శ్రీ జియ్యర్ స్వామివారు తమ పరివారముతో చీరాలకు వేంచేసి. అందు 21-12-60 వ తేది పాదుకా పట్టాభిషేకము జరిపి. తదాది వరుసగా చీరాలలో రామక్రతువును గావించుచూ 3-1-61 వ తేది శ్రీరామ పట్టాభిషేకముతో క్రతు సమాప్తిని గావింతురు.

ఇట్లు

కార్యదర్శులు

తెం. కం. గోపాలాచార్యులు

గుదిమెళ్ల రామానుజాచార్యులు

శ్రీజీయ్యర్ స్వామివారికి జాబులు వ్రాయువారు ఈదిగువ అడ్రసుకు వ్రాయవలెను.

శ్రీ జియర్ స్వామివారు
C/O శ్రీ నేరెళ్ల జగన్నాథ గుప్తగారు,
చీరాల
బాపట్ల తాలూకా
అని వ్రాయవలెను.

శ్రీరస్తు



# శ్రీరామ మహాక్రతువు - గాయత్రీ పురశ్చరణము

## ఋత్విక్ - ప్రవేశ - ప్రార్థనా పత్రిక

### శ్రీ రామమహాక్రతు - గాయత్రీ పురశ్చరణ కార్యకర్తలకు:—

అయ్యా !

ఆధ్యాత్మిక జ్ఞానశక్తుల యభివృద్ధికై — శ్రీసింహాచల క్షేత్రమున ది వి .23-4-1961 తేది మొదలు 28 దినములు. జరుగు గాయత్రీ పురశ్చరణ కార్యక్రమమున మాసంరక్షకుల యొక్క అనుజ్ఞతో నేను పాల్గొన గోరుచున్నాను.

ఇందులకు సంబంధించిన యావత్తు నియమ నిబంధనలకు లోబడి నడచుకొందును. ఈ క్రతువు ప్రారంభమునుండి చివరవరకు పూర్తిగ యుండి యిందు పాల్గొనగలను; కాన ఇందు నన్నొక ఋత్విజునిగా చేర్చుకొన గోరుచున్నాను.

(సంతకము) ... ... ...

నాపేరు :—

చిరునామా :—

నావయస్సు :—

చదువు, యోగ్యత, లేక, ఉద్యోగము :—

గోత్రము :—

సూత్రము :—

వేదశాఖ :—

ఋషులు :—

సంరక్షకుల పేరు చిరునామా :—

ఉపనయనము అయిన తేది :—

స్థలము :—

చేసినవారు :—

సంరక్షకుల సంతకము :— ఉపాధ్యాయుల సంతకము

ఇంతవరకు ఉపనయనము కాని వారైనచో, ఈ క్రింది భాగమును ఉంచిదాని క్రింద సంతకము చేయవలెను ఇదివరలోనే ఉపనయనము చేసుకొని యున్నచో గాని, లేక యీ పురశ్చరణ కార్యక్రమము ప్రారంభమగు లోపలనే తమ యింటి వద్దనే తామే యుపనయనము చేసు కొను వారికి గాని ఈ క్రింది భాగము నుంచ నవసరములేదు. దీనిని కొట్టి వేయవలెను.

(అయ్యా నేనింతవరకు ఉపనీతుడనుకాను అందుచే సింహాచలమున శ్రీలక్ష్మీవరాహానరసింహ స్వామి వారి సన్నిధి యందే మీ ద్వారా ది 24-4-61 తేదినే ఉపనయనము కూడ గావించు గొన కోరుచున్నాను. కాన అందులకు వలయు అవకాశమును కూడ తాముచేయగోరుచున్నాను.)

సంతకము ... ... ...

(1) యథావిధిగా ఉపనయన సంస్కారమును పూర్తిగా పొందినవారు మాత్రమే ఈ కార్యక్రమమున పాల్గొన నర్హులు. వయస్సు, వృత్తి ఆశ్రమభేదములు, ఏమైనను ఫరవా లేదు జుట్టు ఎటులుండినను సరియే గాని మొగమున తమతమ సంప్రదాయానుసారమగు బొట్టు, బట్ట కట్టు కలిగి, సత్ప్రవర్తన కలిగి యుండవలెను. త్రికరణాత్మనా పరిశుద్ధులై యుండవలెను.

(2) ముందుగ కార్యాలయమునకు దరఖాస్తును పంపి కార్యదర్శిచేత ప్రత్యేక ఋత్విక్ ఆహ్వానమును పొందినవారు మాత్రమే ఇందు పాల్గొనుట కవకాశము ఉండును. ప్రత్యేక ఆహ్వానము లేని వారు ఇందు చేర్చుకొనబడరు.

(3) 23-4 61 తేది సాయంకాలమునకే సింహాచలమునకు చేరవలెను ఇదివరలో ఉపనయనములు కానివారికి 24-4-61 తేదీన సింహాచలమున శ్రీ లక్ష్మీవరాహనృసింహస్వామి వారి సన్నిధిలో జరుపబడును. బీదలై కోరిన వారికి ఉపనయనము ఉచితముగానే చేయబడును. లేదా, ఉత్సాహము, అవకాశము, ఉన్నవారు తమంత తామే ఉపనయనము ఖర్చును భరించుకొనదలచినచో భరించుకొనవచ్చును. మేము చేయు ఉపనయనము ఒక్కొక్కటికి తదీయారాధన వ్యయము గాక సుమారు 30/లు మాత్రము ఖర్చు అగును.

(4) ఋత్విక్కులు అందరు నిస్స్వార్థపరులై కేవలము జగత్కళ్యాణమును మాత్రమే లక్ష్యముగ గలవారై యుండవలెను

(5) బట్టకట్టు, బొట్టు స్నానసంధ్యావందనములు, ఏకభుక్తము అథశ్శయనము; బ్రహ్మచర్యము, విలాస భోగవస్తువుల విసర్జనము, కలిగి యుండవలెను. పొగత్రాగుట; తాంబూలము, తలంటి పోసుకొనుట, ప్రయాణములు, క్షౌరమున్ను, వానిని, ఈ దీక్షాకాలములో విడువవలెను. సాత్త్విక మితాహారము, మితభాషణము సత్సహవాసము, కలిగి యుండవలెను.

(6) సకాలములో, సక్రమముగ, స్నాన సంధ్యావందనానుష్టానమున, జపహోమ, తర్పణ, పుష్పాంజలులు ఉపన్యాస కాలక్షేపములలో పూర్తిగ పాల్గొనుచుండవలయును.

(7) ఇందుపాల్గొను వారికి, అవకాశమున్నంతవరకు ఉచితముగ భోజనములు మాత్రము ఏర్పాటు చేయబడును. దీక్షా వస్త్రములుగాని, ఆసనములు, జపమాలలు, ఇత్యాదులు గాని సంభావనలు, దక్షిణాదికములు, రాక పోక ప్రయాణ వ్యయములు గాని ఈయబడవు. తగినంత విరాళములు సమకూరినచో, బీదలై, కోరిన వారికి, రాకపోక ప్రయాణ వ్యయములు, ఇచ్చుటకు, ప్రయత్నింపబడును అన్ని ఏర్పాటులున్ను వసతులున్ను, ఆర్థికావకాశానుసారముగ మాత్రమే ఏర్పాటు చేయబడును.

(8) గాయత్రీ జపదీక్ష 25-4-1961 తేది. ఉదయము నుండి ప్రారంభమై 16-5-61 తేది సాయంకాలము వరకు ఉండును. అంతవరకు ప్రతివారును మధ్య ఎట్టి విచ్ఛిత్తియును లేకుండగ, ఈ కార్యక్రమములో పూర్తిగ పాల్గొనవలసియుండును.

(9) నియమ భంగముగ ప్రవర్తించిన వారిని, ఈ కార్యక్రమమునకు, అవరోధము గాని అవమానముగాని, కలిగించు వారిని కార్యకర్తలు తమకు తోచినపుడు వెంటనే ఈ కార్యక్రమము నుండి తొలగింపబడుదురు.

(10) ప్రతివారు తమ సంరక్షకుల యనుజ్ఞను పొంది మాత్రమే యిందు పాల్గొనవలెను.

(11) ఈ కార్యక్రమ మంతయును శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజ జీయర్ స్వామి వారి నిర్ణయానుసారముగ జరుగగలదు.

(12) ఋత్విక్కులు, తమ తమ అనుష్టానమునకు వలయు బట్టలు, ఆసనములు, పంచపాత్ర, ఉద్ధరిణ, అరివాణములు జపమాలలు, తామే తెచ్చుకొనవలెను.



# శ్రీ గుణ రత్న కోశము

## 17 వ. శ్లోకము.

శ్లో॥ 17. రతిర్మతి సరస్వతీ ధృతి సమృద్ధిసిద్ధి శ్రియ
స్సుధాసఖి యతో ముఖం విచలిషే త్తవ భ్రూలతా,
తతో ముఖ మధేన్దిరే బహుముఖే మహంపూర్వికాం,
విగాహ్య చ వశంవదాః పరివవ న్తి కూలంకషాః.

## -: అర్థము :-

హే సుధాసఖి = ఓ అమృతముతో కలిసి అవతరించిన,
ఇందిరే = లక్ష్మీదేవి!
తవ = నీయొక్క,
భ్రూలతా = కనుబొమ
యతోముఖం = ఎవ్వని కభిముఖముగ
విచలిషేత్ = చలింపదలంపుగొనునో,
తతోముఖం = వానికభిముఖముగ,
రతిః = ప్రీతియు,
మతి సరస్వతీధృతి సమృద్ధిసిద్ధిశ్రియః,
మతి = బుద్ధియు,
సరస్వతి = వాక్కును,
ధృతి = స్థిరత్వమును,
సమృద్ధి = పరిపూర్ణత్వమును,
సిద్ధి = ఇష్టసిద్ధియు,
శ్రియః = సంపదయు,
అథ = అన్నియు
బహుముఖేం = అనేక విధములుగ,
అహంపూర్వికాం = దేనికదే తానుముందర యగునటుల
విగాహ్య = ప్రవేశించి,
వశంవదాః = స్వాధీనములై
కూలంకషాః = పరిపూర్ణములై,
పరివవని = ప్రసరించును,

## -: తాత్పర్యము :-

ఓ లక్ష్మీదేవి, నీవు అమృతముతోకూడ అవతరించితివిగదా ఎవనిపై నీయొక్క కటాక్ష వీక్షణము ప్రసరింప దలంపుకొనునో అట్టివానిని, ఆనందమున్ను, జ్ఞానమున్ను, వాక్కును. పట్టుదల దీక్షయు, ఇష్టకార్యసిద్ధియు, సంపదయు, ఇవన్నియు ఒకదాని కన్న మరొకటి తొందరగ ముందు ముందుగ ప్రవేశించి, వానిచే ననుభవింపబడుచు పరిపూర్ణములై ప్రకాశించుచుండగలవు.

శ్రీరామజయం.





అష్టోత్తర శత { శ్రీ సీతాకల్యాణ / శ్రీ రామపట్టాభిషేక / శ్రీ రామాయాణపారాయణ } శ్రీరామ క్రతువు

ఓం

శ్రీ

మదరాసు.

**1949.**

# నివేదిక

: నిర్వాహకులు :

(శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.)

కార్యాలయము 147 అణాపిళ్ల వీధి,

మదరాసు 1.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము మదరాసు శాఖ
యాజమాన్యమున జరిగిన

# శ్రీరామక్రతు ప్రయోగ

ఆహ్వానసంఘమువారి తిరునామములు.

—:అధ్యక్షులు:—

శ్రీ యస్. గోవిందరాజులనాయుడు ప్రిన్సిపాల్ లా కాలేజి; (ఆక్టింగు) వైస్ ఛాన్సిలర్ మద్రాసు విశ్వవిద్యాలయము.

కార్యదర్శులు :

శ్రీ మాదిరెడ్డి విరూపాక్షరావునాయుడు బి. యస్ సి.
,, సామి చెన్నకేశవులు శ్రేష్టి - కేశవరాం కంపెనీ,
,, కరాలపాటి రాధాకృష్ణయ్య.

కోశాధికారులు :

శ్రీ మట్టపల్లి రంగనాథయ్య.
శ్రీ యం. వి. నరసింహులునాయుడు.

సభ్యులు :

మెసర్సు అమీచంద్ నగీన్‌దాసు అండ్ కో.
శ్రీ కొత్తూరు అప్పయ్య శ్రేష్ఠి.
,, ముడుంబై వెంకటరంగ అణహరాచార్యులు.
,, అల్లత్తూరు కణ్ణన్ శ్రేష్ఠి.
,, కొత్తూరు గోవిందరాజులు శ్రేష్ఠి
,, కె. యస్ చంపకేశ అయ్యంగారు.
,, ధరంసీ ఆనందజీ.
,, వి. దేవరాజులుశ్రేష్టి
,, పసుమర్తి నరసింహులు శ్రేష్ఠి
,, కొప్పరం నటేశంశ్రేష్ఠి.
,, ఆర్. వి. నారాయణస్వామిశ్రేష్ఠి.
,, నారాయణదాసు దతియా.
,, ముక్కాల నమ్మాళ్వారుశ్రేష్ఠి
,, రావుబహద్దూర్ అల్లత్తూరు నాథమునిశ్రేష్ఠి
,, సి. నరసింహాచార్యులు. అడ్వొకేటు.
,, గుంటూరు నరసింహరావు. యం. యల్. ఎ.
,, సర్భత్ శంకరభట్టు.
,, ఊటుకూరి పిచ్చయ్యశ్రేష్ఠి.
,, రేపూరి పద్మనాభంశ్రేష్ఠి.
శ్రీ ఉమ్మిడి పాండురంగం శ్రేష్ఠి
,, పి. యస్. భాష్యంశ్రేష్ఠి. (కౌన్సిలర్)
,, సామి యతిరాజసంపత్తు శ్రేష్ఠి.
,, కంకిపాటి రామానుజంశ్రేష్ఠి.
,, రావుబహద్దూర్ వేమూరి రంగనాథంశ్రేష్ఠి.
,, రామానుజంకూరం రామానుజయ్య.
,, చవల రామానుజయ్యశ్రేష్ఠి.
,, సి. ఆర్. రాజగోపాలాచార్యులు
,, సామి రాధాకృష్ణశ్రేష్ఠి.
,, జె రంగయ్యశ్రేష్ఠి.
,, పోలేపల్లి రామానుజయ్య. బి. ఎ.
,, కొత్తూరు రంగనాయకులశ్రేష్ఠి.
,, కొప్పరం రాజాబాదర్‌శ్రేష్ఠి.
,, పి. వి. రాధాకృష్ణశ్రేష్ఠి.
,, పంచాంగం లక్ష్మీనరసింహాచార్యులు.
,, కె. వెంకటస్వామినాయుడు ఎం. ఎల్. సి. మద్రాసు కౌన్సిల్ ఉపాధ్యక్షులు.
,, కొప్పరం వీరరాఘవులు శ్రేష్ఠి.
,, యిన్నా వెంకటరామయ్యశ్రేష్ఠి.
,, పాతాళం వీరరాఘవులుశ్రేష్ఠి.
,, తాటికొండ వెంకటరాఘవులుశ్రేష్ఠి.
,, సత్రసాల వెంకటరంగంశ్రేష్ఠి.
,, సత్రసాల వెంకట్రామం. కౌన్సిలర్.
,, చిమటా శేషాచలం శ్రేష్ఠి.
,, ఉమ్మిడి శ్రీరాములు శ్రేష్ఠి.
,, జలగం సుబ్రమణ్యం నాయుడు.
,, నాదెళ్ళ సంపతుశ్రేష్ఠి.
,, గొల్లపూడి సూర్యనారాయణశ్రేష్ఠి.
,, చీకిరాల సుబ్రమణ్యంశ్రేష్ఠి.
,, మందారం రంగనాథంశ్రేష్ఠి.
,, కొంజేటి సుబ్బరాయలు శ్రేష్ఠి.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక కేంద్రసంఘకార్యదర్శులు :—

తే. కం. గోపాలాచార్యులు.

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు.

# శ్రీ రామ క్రతువునందలి కొన్ని ఛాయాపటములు



స్వయం సేవాదళం



శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ సన్నిధి
ఎదుటిపందిరి



శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ళ పురప్పాడు



సన్నిధి గోష్ఠి పురప్పాటు.



శ్రీ చెన్నకేశవల్ పెరుమాళ్ళ గోపురము



శ్రీ కోశముల పురప్పాడు



శ్రీ మట్టుపల్లి రంగనాథయ్యగారింటివద్ద గోష్ఠి



శ్రీ కోశములపురప్పాటు



పారాయణ సమయదృశ్యము

# శ్రీరామ క్రతువునందలి కొన్ని ఛాయాపటములు



పారాయణ మండపము



విద్వాన్. శ్రీమాన్. కారప్పంగాడు వెంకటా
చార్య స్వామివారు



శ్రీమాన్. ప్రతివాదిభయంకరం అణ్ణంగరా
చార్య స్వామివారు



శ్రీ కొరుకొండ సుదర్శన భట్టరువారు



శ్రీమాన్ కాండ్యూరి రామానుజాచారి
స్వామివారు



శ్రీ యతిరాజసేవా మహిళాసంఘమువారి
ఉపన్యాస దృశ్యము



శ్రీ యతిరాజసేవా మహిళాసంఘమున పాల్గొ
నిన యొకబాలిక



అధ్యక్షులు. శ్రీ. యన్. గోవిందరాజులు
నాయుడుగారు, వి. వి. శ్రీనివాసఅయ్యంగారు



ఉపన్యాస మండపము

# శ్రీరామ క్రతువునందలి కొన్ని ఛాయాపటములు



శ్రీమాన్. ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారు



పెరుమాళ్ళ పురప్పాటు



శ్రీ గోపాలస్వామిశెట్టిగారి గానకచ్చేరి



శ్రీ సంగీతాచార్యస్వామి వల్లభదాస్ మహారాజుగారు



శ్రీ. వి. వి. శ్రీనివాసఅయ్యంగారు. అధ్యక్షులు



శ్రీ బులుసు. సాంబమూర్తిగారు



శ్రీ. S. B. జ్యోషి హిందూ థియలాజికల్ హైస్కూలు ప్రధానోపాధ్యాయులు



శ్రీ చెన్నకేశవ చెన్నమల్లీశ్వర దేవస్థాన ఎక్సిక్యూటివ్ ఆఫీసర్



సముద్రతీరమునందలి స్నానదృశ్యము

# శ్రీరామ క్రతువునందలి కొన్ని ఛాయాపటములు



సముద్రమునకు వెళ్లుదృశ్యము



అవభృథ స్నానమునకై మరల సముద్ర తీరమునకు పోవునపుడు దృశ్యము



శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ళతారి



సముద్రతీరమున పోవునపుడు దృశ్యము



గోష్ఠి తిరువీధి పురప్పాడు



అవభృథ స్నానదృశ్యము



రాజాజీహాలులో జరిగిన ఉపన్యాససమయము



శ్రీమాన్. తే. కం. గోపాలాచార్యుల స్వామి వారు. శ్రీమాన్. ఆ. చి. ప్రసన్నారాయణాచార్యుల స్వామివారు

ఓం.



# శ్రీసీతా లక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్స మేత శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

---

(శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.)

## అష్టోత్తరశత { శ్రీ సీతా కల్యాణ / శ్రీ రామ పట్టాభిషేక / శ్రీ రామ పారాయణ } శ్రీరామక్రతువు

### —: నివేదిక :—

ప్రస్తుతము దేశములో అతివృష్టి అనావృష్టి మున్నగు ఈతిభాదలును బట్టియు అన్న వస్త్రాది కొరతలను బట్టియు, పరస్పర ఈర్ష్య ద్వేషము మోసము దురాశ హింస అధికారవాంచ మున్నగు అవినీతిని బట్టియు వ్యాపించియున్న అశాంతిపోయి సమస్తజీవులు సౌఖ్యవంతులై రాజు, రాష్ట్రము ప్రజలు ఆనందముతో వర్ధిల్లుచు లోకకల్యాణము సిద్ధించుటకొరకు ప్రజాసామాన్యమున ఆస్తికత – భక్తిభావన – సేవానిరతి – ధర్మము – వినమ్రత – వృద్ధిపొందుటకు మదరాసు నగరమున, శ్రీ చెన్నకేశవస్వామి పెరుమాళ్ కోవిలయందు స్వస్తిశ్రీ విరోధినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమీ బుదవారము (౩0-3-1949 తేది) నుండి. నవాహ్నిక దీక్షతో శిష్టాచార సంప్రదాయాను సారముగ అష్టోత్తరశత శ్రీ సీతాకల్యాణ శ్రీరామపట్టాభిషేక శ్రీరామాయణ పారాయణసహిత శ్రీరామక్రతువు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ మదరాసు శాఖవారిచే మహావైభవముగ జరుపబడినది, ఈక్రతు నిర్వహణమునకై ఒకఆహ్వాన సంఘ మేర్పాటు చేయబడినది.

వారుభక్తులగు పురప్రముఖుల సహాయముచే ఈకృతువును దిగ్విజయముగజరిపిరి. మదరాసు రాజధానిలోని నలుప్రాంతములవారు యిందు పాల్గొనిరి. ప్రతినిత్యము క్రతు సంబంధమైన

వైదిక ప్రక్రియతో పాటు, శ్రీరామాయణోపన్యాసములు, అనేక వేదాంతార్థములున్ను, రామ రాజ్యమును గురించి అనేకప్రముఖులు ఉపన్యాసములున్ను, స్త్రీలకై ప్రత్యేకము విదుషీమణు లచే ఉపన్యాసములున్ను ఏర్పాటు చేయబడినవి. మరియు గానవినోదములుకూడ జరుపబడినవి.

శ్రీయఃపతి కరుణా కటాక్షముచే ఈ శ్రీరామక్రతువు సలక్షణముగా జరిగినది.

—: సర్వజనా సుఖినోభవంతు :—

ఈ కృతునిర్వాహణకై ఆహ్వానసంఘముగ ఏర్పడి ఈ కృతువును మహావైభవముగ నడి పించిన ఆహ్వాన సంఘముకివారిన్ని; ఈ కృతువునందు పాల్గొని దీక్షితులై దీనిని సలక్షణముగ జరిపిన ఋషిస్థానీయులుకున్ను ఋత్వికులుకున్ను, అన్నివిధములైన పారాయణపరులుకున్ను, ఈ కృతువును అతివైభవముగా జరుపుటకై విరాళముల నొసగిన దాతలకున్ను,

ఈ క్రతువును జరిపించుటకు జార్జిటవునులోని శ్రీ శ్రీ శ్రీ చెన్నకేశవ పెరుమాళ్ళకోవిల నతను క్రతువు జరుగు కాలమునందు, మా ఆధీనములో యుంచిన సదరు దేవాలయ ధర్మకర్త లుకున్ను, ఎగ్జిక్యూటువు ఆఫీసరుగారికిన్ని: ఈ క్రతు నిర్వహణమునకై వలయు సమస్త సదు పాయములను చక్కగజేసి దీనిని వైభవముగ జరిపించిన ఈదేవాలయ మేనేజరు, మణిగారు స్వామివార్కి. అర్చక - పరిచారక - అధ్యాపక - స్థానాచార్య. పాచకాది కైంకర్యపరులందరికిన్ని,

యజ్ఞనాల - ఉపన్యాసమంటప, పారాయణమంటపాదుల నలంకరించుటకు వలయు అరటిచెట్లు, పోకచెట్లు, మామిడాకు, కొబ్బరియాకు వగైరాల ఉచితముగ నిప్పించిన శ్రీమాన్ మణలి. శ్రీనివాస మొదలియారు గారికిన్ని, ఈ క్రతు నిర్వాహణమునకున్ను, దర్శనమునకున్ను విచ్చే సిన భక్తబృందము బసచేయుటకున్ను, తదీయారాధనలు జరుగుటకున్ను తమ తమ రామానుజ కూటములను, సత్రములను ఉచితముగ యిచ్చి మాకు అన్ని విధములుగను తోడ్పడిన శ్రీ ఉప్పు టూరు ఆళ్వారుశ్రేష్ఠివారి రామానుజకూట ధర్మకర్తలకున్ను; శ్రీ సింగంశ్రేష్ఠి యతీంద్రులు శ్రేష్ఠివారి రామానుజకూట ధర్మకర్తలకున్ను; శ్రీ కలివి రామన్న శ్రేష్ఠివారి సత్ర ధర్మ కర్తలకున్ను; శ్రీ నారాయణ గురువయ్య శ్రేష్ఠివారి సత్ర ధర్మకర్తలకున్ను; శ్రీ కన్యకాపరమే శ్వరీ దేవస్థానము వారి సత్ర ధర్మకర్తలకున్ను; శ్రీ పప్పుశ్రేష్ఠి రాఘవులశ్రేష్ఠివారి రామానుజ కూట ధర్మకర్తలకున్ను,

ఈ క్రతు నిర్వహణమున అనేక కష్టముల కోర్చి చక్కగ తమ సేవాధర్మమును అను ష్ఠించిన స్వయంసేవక భక్తబృందమునకున్ను వీరికి నాయకత్వము వహించి నడిపించిన శ్రీ. సి. గోవిందరాజులు శ్రేష్ఠి గారికిన్ని; గాన మండపమునందు పోల్గొనిన, గాన విద్వాంసులకున్నూ, భజనమండలీల వారికున్ను, నాగస్వర కచ్చేరోనర్చిన వారికిన్ని, సన్నిధియందు తళిగీలు సమర్పించినీ వారికిన్ని, తదియారాదనకు సామాగ్రుల నొసంగిన వారికిన్ని ఇంకను అనేక విధముల ఈ పవిత్ర కార్యమున తోడ్పడిన భక్తవరులకున్ను మాకృతజ్ఞతా వందనముల నర్పించుచున్నాము.

శ్రీ

ఈ క్రతువున దీక్షితులైన వారందరికి శ్రీమాన్ అనంతకృష్ణశ్రేష్టి అనువారు దోవతుల సమర్పించిరి.

శ్రీ సీతాకల్యాణ సమయమున సుమారు 240 జతల బంగారుపూతగల రజిత మంగళ సూత్రములను, యజ్ఞోపవీతములను, మట్టెలను, పాదుకాలను మెసర్సు ఉమ్మిడి బంగారు శెట్టి అండు సన్సువారు సమర్పించిరి.

మరియు అనేకరకములైన చిన్నచిన్న వెండి సామగ్రులను, ఫల - పుష్పాదులను, చేతి సంచులను, అనేకమంది భక్తులు సమర్పించిరి. వీరందరికి మా కృతజ్ఞతా వందనములు.

ఈ మహత్కార్యమును అత్యంత-మహావైభవముగా నిర్వహించిన విశిష్టాద్వైత ప్రచారక సంఘ మదరాసు శాఖవారికి మాకృతజ్ఞతా వందనములు—

జరిగిన కార్యక్రమముల వివరములు :—

## 29 మార్చి 1949 మంగళవారము

స్వస్తిశ్రీ శర్వధారినామ సంవత్సర ఫాల్గున బ॥ అమావాస్య (పంగుని 16 వ) మంగళ వారము సాయంకాలం 6 గంటలకు కన్యాలగ్నమున ప్రారంభమై భగవత్ప్రార్థన, విష్వక్సేనారాధనము, ఋత్విగ్వరణము, దేవతాహ్వానము, దేవతాప్రార్థనము, మృత్సంగ్రహణము. అంకురార్పణము, పాలికాస్థాపనము, కుంభస్థాపనము, వాస్తుపూజ, వాస్తుహోమము, బలిప్రదానం ద్వాత్రింశత్కలశావాహనం. నవగ్రహక్షేత్రపాలక సర్వతోభద్రాది మండలారాధనం, దిక్పాలకపూజ, ధ్వజ, గరుడ ప్రతిష్ట, శ్రీరామయంత్ర స్థాపనముజరిగెను.

## 30 మార్చి 1949 బుధవారం.

ఉదయం 5-గం. లకు తిరువారాధనము (నారాయణ మొదలి వీధిలోని శ్రీ కలివివారి రామానుజ కూటములో) జరిగెను.

గం, 5-15 తిరుప్పావై సేవాకాలం గోష్టి. గం. 6-0 శ్రీరామానుజ కూటంనుండి తిరువీధి ఉత్సవము బయలుదేరెను. 7-.లకు యాగశాలచేరి మహాశాంతి, 7-30 గం.లకు కలశార్చన యంత్రములకర్చన, చతుర్దశకలశ తిరుమంజనం, ధ్వజారోహణము. రక్షాబంధనారాధనము, క్రతుదీక్షితులకు రక్షాబంధనము, హారతి, మంత్రపుష్పం శ్రీకోశాది ఆరాధనము శ్రీకోశాది వస్త్ర సమర్పణము.

గం. 9-30 శ్రీరామ మంత్రాది జపములు.

108. శ్రీరామాయణ పారాయణములు ప్రారంభమాయెను.

ఉభయ - వేదాంత, భారత, భాగవత, విష్ణుపురాణ, విరాటపర్వ శ్రీవిష్ణుసహస్రనామ, శ్రీరామాయణ పారాయణముల ప్రారంభము, లక్షతులసి అర్చనప్రారంభము, హోమము, ఉపన్యాస మండపమున శ్రీరామాయణోపన్యాస ప్రారంభము ఆయెను.

ప్రతినిత్యముకూడ జరిగిన హోమ విషయములు.

ఉదయమున 7-30 గం. నుండి 10-30 గం. వరకు

చతుర్వింశతినామ హోమము, నారాయణాష్టాక్షరి హోమము. సంగ్రహరామాయణ శ్లోక హోమము, పురుషసూక్త హోమము, హనుమన్మంత్ర హోమము, విష్ణుసూక్తహోమము, శ్రీరామ షడక్షరి హోమము, హనుమద్గాయత్రీ హోమము, శ్రీసూక్త హోమము. శ్రీరామ దశాక్షరీ హోమము, గాయిత్రీహోమము, శ్రీరామ గాయత్రీ హోమము, శ్రీరామమంత్రాది జపాదులున్ను.

సాయంకాలమున 5-30 గం. నుండి. 8-30 గం. వరకు.

తిరిగి యాగారంభము, పారమాత్మ్య హోమము, తదంగ వేద - ప్రబంధ పారాయణ సేవాకాలములు పూర్ణాహుతి నివేదనం, చాత్తుముత్తై జరుపబడుచుండెను.

ఇవిగాక ఆయారోజులలో జరిగిన ప్రత్యేక విశేష హోమములు.

మొదటి రోజున 30-3-49 ఉదయం :—పుత్రకామేష్టి హోమము. రెండవ రోజున 31-3-49 ఉదయం :—శ్రీ సీతారామ కల్యాణ హోమము (శ్రీ సీతా కల్యాణము), మూడవ రోజున 1-4-49 ఉదయం :— పాదుకా పట్టాభిషేక హోమము, నాలుగవ రోజున 2-4-49 ఉదయం :—చిత్తిప్రశ్న హోమము. (జటాయు మోక్షము), అయిదవ రోజున 3-4-49 ఉదయం :—సఖ్యహోమము (సుగ్రీవ సఖ్యము), ఆరవ రోజున 4-4-49 ఉదయం :—పంచ సంస్కార హోమము సుదర్శన హోమము (అంగుళీ ప్రదానము), ఏడవ రోజున 5-4-49 ఉదయం :—శరణాగతి హోమము (విభీషణ శరణాగతి), ఎనిమిదవ రోజున 6-4-49 ఉదయం :— బ్రహాస్త్ర హోమము, తొమ్మిదవ రోజున 7-4-49 ఉదయం :—కల్యాణ హోమము, పదవ రోజున 8-4-49 ఉదయం :—శ్రీరామ పట్టాభిషేక హోమము (శ్రీరామ పట్టాభిషేకము) శత కలశ తిరుమంజనము పూర్ణాహుతియు జరుపబడినవి.

ప్రతినిత్యము జపించబడిన మంత్రములు :—

శ్రీరామ షడక్షరి మంత్రము ; ఆంజనేయ గాయత్రీ మంత్రము ; విష్ణు సహస్రనామము ; శ్రీరామ దశాక్షరి మంత్రము ; నారాయణ అష్టాక్షరి మంత్రము ; శ్రీరామ సహస్రనామము;

శ్రీరామ గాయత్రీ మంత్రము ; నారాయణ గాయత్రీ మంత్రము ; శ్రీలక్ష్మీ సహస్రనామము; ఆంజనేయ మంత్రము గాయత్రీ మంత్రము శ్రీలక్ష్మీ అష్టోత్తరము ; జపించబడినవి.

ప్రతినిత్యము జరిగిన పండితుల ఉపన్యాసములు.:—

ప్రతి దినము ఉపన్యాస మంటపమున ఉదయం గం 7-30 లు మొదలు గం 10-30 వరకు ఒక్కొక్క ఉపన్యాసము యించుమించు అరగంట కాలము చొప్పన॥ జరుగుచుండెడివి.

విరోధినామ సం॥ ర చైత్ర శు ౧, 30-3-49 బుధవారము (మొదటిరోజు.)

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి నివేదిక.
అధ్యక్షులు :— శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యులువారు.
పుత్రకామేష్టి ; పాయసవిభాగము ; శ్రీరామజననము ఉపన్యాసము—

31-3-49 గురువారము. (రెండవరోజు.)

అధ్యక్షులు :—శ్రీ. ఉ. వె. శ్రీమాన్. పండిత చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులు గారు. మద్రాసు. అహల్యా:—శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తి. ప. లక్ష్మీనరసింహాచార్యులుగారు. పెంటపాడు. సీతాకల్యాణము:-శ్రీ అధ్యక్షులవారు. శ్రీరామవతారతత్వము:-రావుబహద్దూర్ శ్రీవేమూరి రంగనాథ శ్రేష్ఠిగారు. మద్రాసు. రామగుహ సమావేశము.

1-4-49 శుక్రవారము. (మూడవరోజు.)

అధ్యక్షులు. శ్రీ. ఉ. వే శ్రీమాన్ పండిత పురిశై కృష్ణమాచార్యులు గారు మద్రాసు. సభాప్రారంభకులు-శ్రీ. ఉ. వే. శ్రీమాన్ విద్వాన్ తైయాల్ జో. రంగాచార్యులుగారు. తిరువళ్లూరు. భరద్వాజాతిథ్యము:—శ్రీ. ఉ. వే. శ్రీమాన్ బెల్లపుకొండ రాఘవాచార్యులుగారు. గుంటూరు. భరతభక్తి:—మీమాంసా విశారద. శ్రీ. ఉ. వే. శ్రీమాన్ వంగిపురం రంగనాథాచార్యులుగారు. మద్రాసు.

పాదుకాపట్టాభిషేకం - శ్రీ. ఉ. వే. శ్రీమాన్ శొంతలూరి వెంకటాచార్యులుగారు:
,, ,, - శ్రీ. ఉ. వే. శ్రీమాన్. ఎ. వి. గోపాలాచార్యులుగారు.
అత్రి ఆశ్రమ ప్రవేశం - శ్రీ, ఉ. వే. శ్రీమాన్. ఆరవిల్లి అళహసింగరాచార్యులుగారు.

2-4-49. శనివారం (నాల్గవరోజు)

అధ్యక్షులు - శ్రీ. ఉ. వే. శ్రీమాన్ కు. యి. శ్రీనివాస రామానుజాచార్యులుగారు.
సీతాపహరణం.
కబంధ మోక్షము - శ్రీ అధ్యక్షులవారు.

# ప్రచార విభాగము.

## 'భక్తినివేదన'

జయ – శ్రావణము.

శ్రీబదరీనారాయణములో నిర్మించబోవు శ్రీమదష్టాక్షరీ మందిరమున ప్రతిష్ఠించబడు

## శ్రీభగవద్రామానుజులవారివిగ్రహ తిరువీధ్యుత్సవ విశేషములు.

(గతసంచిక తరువాయి)

మద్రాసులో గావింపబడిన యీ తిరువీధి మహోత్సవ సందర్భమున శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువునకు అధ్యక్షులగు శ్రీమాన్ యస్. వరదాచారిగారు (Ex-Judge Federal Court of India, New Delhi) గీతామందిరమునకు దయతో విచ్చేసి ఉత్సవప్రారంభమును అత్యంత వైభవోపేతముగ నొనగూర్చిరని తెల్పుటకు సంతసించుచున్నాము. హిందూమొదలగు పత్రికల విలేఖరులు యీసమయమున నీయుత్సవమున పాల్గొని ఛాయాచిత్రముల దీసి తమపత్రికలలో యీ యుత్సవవిశేషముల ప్రకటింపజేసిరి. అనేకమంది భక్తశిఖామణులు ఈ యతిరాజవరులకు శాలువలను, పట్టువస్త్రములను, ధనరూప విరాళములను సమర్పించి శ్రీవారి యనుగ్రహపాత్రులైరి. అటుపిమ్మట యీవిగ్రహము శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ మద్రాసుశాఖా కార్యదర్శులగు శ్రీమాన్ మట్టపల్లి రంగనాథయ్యంగారు వారిసతీమణి మట్టపల్లి చంద్రమ్మ (శ్రీయతిరాజసేవామహిళామండలి కర్యదర్శినీ) గార్ల యింటియందు సుమారు ఒకగంట కాలము వేంచేపుచేయబడెను. వారాసమయమున శ్రీ ఉడయవరుల విషయమై తమభక్త్యతిశయమును వెలిబుచ్చుచు వారికి రు 116–0–0 లను సమర్పించిరి. ఈ ఉత్సవసందర్భమున శ్రీ యస్. వెంకటరంగంచెట్టిగారును, శ్రీ కలిమిడి సంబెరుమాళ్ చెట్టి ఛారిటీసు ట్రస్టుబోర్డువారును శ్రీ ఉడయవరులకు పుష్పకైంకర్యమును గావించి వారి యనుగ్రహమునకు పాత్రులైరి. ఈతిరువీధ్యుత్సవమునకై ఛత్ర చామరాది సమస్తపరికరములను దయతో నొసంగుటద్వారా సహకరించిన శ్రీవరదరాజ పెరుమాళ్, మనవాళ మహామునుల సన్నిధి ధర్మకర్తలకు మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల తెలుపుకొనుచున్నాము.

## విజయవాడ:-

అటుపిమ్మట ఈ విగ్రహము విజయవాడకు వేంచేపు చేయబడెను. అచ్చట 3–7–54 వ తేదీని ఉదయము తిరుమంజనాదికము జరుపబడెను. మధ్యాహ్నము శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ఎమ్. ఆర్. సంపత్కుమారభట్టరు కుటుంబమువారు యీ విగ్రహమును అపూర్వ సౌందర్యముగ నలంకరించిరి. మధ్యాహ్నము 3 గంటలకు తిరువీధ్యుత్సవము అత్యంత వైభవముగ జరుపబడెను. ఇచట యీయుత్సవమునకై ఛత్ర చామర వాహనాది సమస్త పరికరముల నొసంగిన శ్రీకోదండరామ

ఆనాటి రాత్రి యీవిగ్రహము మనసంఘమువారిచే నేర్పాటు గావింపబడిన శ్రీ బదరీ యాత్రాస్పెషలునందు శ్రీబదరికాశ్రమము వేంచేపుచేసి తీసుకొని పోబడెను. మార్గమధ్యమున రాజమండ్రి, సింహాచలం, పూరీ, కలకత్తా, గయ, కాశీ, ప్రయాగ, అయోధ్య, ఋషీకేశము మొదలగు క్షేత్రములయందు అనేకమంది భక్తులు ఆ విగ్రహమును సేవించి తరించు భాగ్యము నొందిరి. కాశీలో నొక గొప్పసభ యేర్పాటు గావింపబడెను.

ఆసభకు శ్రీ ఉ. వే. శ్రీమాన్ దేవనాయకాచార్యజీ (రామానుజ సంస్కృత కళాశాలోపాధ్యాయులు) అధ్యక్షతవహించిరి. అనేకమంది పండిత ప్రకాండులచే శ్రీమదష్టాక్షరీ కోటి హవన మహాక్రతు ప్రాశస్త్యమును గూర్చియు, అట్టిక్రతువును నిర్వహించుచున్న శ్రీ శ్రీ శ్రీ స్వామీజీ దివ్యప్రభావమును గూర్చియు, ఉపన్యసించిరి. చంద్రగ్రహణ స్నానార్థమువచ్చియున్న యనేక వేలమంది భక్తు లీ సభలో పాల్గొనిరి.

అసర్థభవనములో స్వామి శ్రీమధుసూదనాచార్యజీ మహంతువారి మఠమునకు శ్రీ ఉడయవర్ల విగ్రహము కొనిపోబడి అలంకారవిశేషములతో వేంచేపుచేయబడెను. అనేకమంది శ్రీవైష్ణవస్వాములును, పురజనులును యీ గోష్ఠియందు పాల్గొని శ్రీవారిమూర్తిని సేవించుకొనిరి,

అటుపిమ్మట అయోధ్యలో నొక మహాసభగావింపబడెను. ఆసభకు శ్రీ ఉ. వే. శ్రీమాన్ పథమార్థరత్నస్వామి మధుసూదనాచార్యజీ అధ్యక్షత వహించిరి. పాంచరాత్రాగమ విద్వాంసులును, మైసూరు సంస్థాన విద్వాంసులునునగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఎమ్. ఆర్. సంపత్కుమార భట్టరువారును, యితర పండితవర్యులును శ్రీ మదష్టాక్షరీ క్రతువైభవమునుగూర్చి యుపన్యసించి తమ యుపన్యాసామృతముచే సభికుల నానందాబ్ధినోలలాడించిరి. ఇట్టిమహత్తర క్రతువును నిర్వహింప సంకల్పించిన శ్రీ శ్రీ శ్రీ 108 శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామిజీవారి ప్రభావాతిశయమును ప్రశంసించుచు అధ్యక్షులవారు తమ యానందాతిశయమును వెల్లడించిరి.

ఈ సభకు శ్రీ శ్రీ చోప్రారాణీ సాహేబావారు విచ్చేసిరి. అయోధ్యాపురవాసులగు భక్తవరేణ్యులు శ్రీ ఉడయవరుల విషయమై తమభక్తిని వెల్లడించుచు రెండు సవరనులను, సుమారు రెండువందలరూపాయలను, రెండుబంగారు గాజులను విరాళముగ సమర్పించి శ్రీబదరీశుని యొక్కయు, శ్రీఉడయవరుల యొక్కయు కృపకు పాత్రులైరి.

ఈ విగ్రహము 25—7—54 వ తేదీని ఋషీకేశములో వేంచేపు చేయబడెను. అచ్చటి నుండి బదరికాశ్రమము కొంపోబడి ,అచ్చట 5—8—54 వ తేదీని ప్రతిష్ఠామహోత్సవము జరుపబడును.



27. మాతాపితామహీశ్చైవ
తథైవ ప్రపితామహీ
మాతామహ స్త్రిపితాచ
ప్రమాతా మహకాదయః॥

28. తేషాం పిండో మయాదత్తో
హ్యక్షయ్య ముపతిష్ఠతు
ముష్టిమాత్ర ప్రమాణం చ
ఆర్ద్రామలక మాత్రకం॥

29. శమీపత్ర ప్రమాణేన
పిండం దద్యాత్ గయాశిరే
ఉద్ధరే త్సప్త గోత్రాణాం
కుల మేకోత్తరం శతం॥

27, 28, 29. తండ్రి, తాత, ముత్తాతయు, తల్లి, అమ్మమ్మ, ముత్తమ్మమ్మయు మొదలగు వారికి నేనొసగిన పిండమక్షయ్య మగునుగాక! పిండము పిడికెడు కాని, చిన్న ఉసిరిక ప్రమాణమున గాని, శమీపత్రమంతగాని ఉండునటుల జేసి గయుని శిరస్సున శ్రాద్ధము చేయవలెను, దానిచే 101 కులములను, సప్తగోత్రములను తరింపజేయును.

30. చతుర్వింశచ్చ వింశచ్చ
షోడశ ద్వాదశైవ హి।
రుద్రాదశ వసుశ్చైవ
కులాన్యేకోత్తరం శతం॥

31. అస్మత్కులే మృతా యే చ
గతిర్యేషాం న విద్యతే।
ఆవాహయిష్యే తాన్ సర్వాన్
కుశపృష్ఠే తిలోదకైః॥

30, 31. తండ్రి కులమువారు 24, తల్లిసంబంధీకులు 20, భార్యసంబంధీకులు 16, సోదరిబంధుగులు 12, కూతురుసంబంధమువారు 11, మేనత్తవారు 10, పినతల్లివారు 8, ఇట్లు 101 కులములును, మాకులమున చనిపోయి గతులులేని పితరులను, నువ్వులు కలిసిన ఉదకముచే కుశలయందు ఆవాహనముచేసెదను.

32. మాతామహకులే యే చ
గతి ర్యేషాం నవిద్యతే।
ఆవాహయిష్యే తాన్ సర్వాన్
కుశపృష్ఠే తిలోదకైః॥

32. తల్లితాతగారి కులమున చనిపోయి గతులను పొందని పితరుల నావాహన చేయుచున్నాను.

3. బంధువర్గకులే యే చ
గతి ర్యేషాం నవిద్యతే।
ఆవాహయిష్యే తాన్ సర్వాన్।
కుశపృష్ఠే తిలోదకైః॥

33. బంధుకోటిలోనెవరేని చనిపోయి గతిలేకయున్నచో వారినావాహనచేయుచున్నాను.

34. ఇత్యేతైః సజలై ర్మంత్రైః
దర్భేషు ధ్యానవాన్ పితౄన్।
ఆవాహ్యాభ్యర్చ్య తేభ్యశ్చ
పిండాన్ దద్యాత్ యథాక్రమం॥

34. నీటిని చేతియందుంచుకొని మంత్రములు చదువుచు పితరుల నావాహనము చేసి పూజించి వారికి యథావిధిగ పిండదానముచేయవలెను.

35. అస్మత్కులే మృతా యే చ
గతి ర్యేషాం న విద్యతే।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

35. మాకులమున చనిపోయి గతిలేకయున్న పితరులు తరించుటకై ఈపిండము నిచ్చుచున్నాను.

36. మాతామహకులే యే చ
గతి ర్యేషాం న విద్యతే।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

36. మాతామహ (ముత్తాత) కులమున చనిపోయి గతిలేని పితరులు తరించుటకై ఈపిండము నిచ్చుచున్నాను.

37. బంధువర్గకులే యే చ
గతి ర్యేషాం న విద్యతే।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

37. బంధు కులమున చనిపోయి గతిలేని పితరుల తరణమునకై నే నీపిండమునిచ్చుచున్నాను.

38. అజాతదంతా యే కేచిత్
యే చ గర్భే ప్రపీడితాః।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

38. పల్లురానట్టియు, గర్భముననే చనిపోయిన పితరులకై పిండమునిచ్చుచున్నాను.

39. అగ్నిదగ్ధాశ్చ యే కేచిత్
నాగ్నిదగ్ధా స్తథా ఽపరే।
విద్యుత్ చోరహతా యే చ
తేభ్యః పిండం దదామ్యహం॥

40. దావదాహే మృతా యే చ
సింహవ్యాఘ్రహతాశ్చ యే
దంష్ట్రిభిః శృంగిభి ర్వాపి
తేభ్యః పిండం దదామ్యహం॥

39. — 42. అగ్నిచే దహింప బడినవారును, ఇతర వస్తువులచే చంపబడిన వారు, విద్యుచ్ఛక్తి చోర, కార్చిచ్చు వలన చనిపోయిన వారు, సింహాము, పులులవలన చంపబడిన వారు, కోరలు కలవానిచేగాని, కొమ్ములుకల మృగములచేగాని చంపబడినవారు, ఉరిత్రాటిచేగాని, విషశస్త్ర

41. ఉద్బంధన మృతా యే చ
విషశస్త్ర హతాశ్చ యే।
ఆత్మనో ఘాతినో యే చ
తేభ్యః పిండం దదామ్యహం।

42. అరణ్యావర్త్మని రణే
క్షుధయా తృషయా హతాః॥
భూతప్రేత పిశాచాశ్చ
తేభ్యః పిండం దదామ్యహం।

ములచేగాని ఆత్మహత్య చేసికొనినవారు ఎవరు కలరో వారల కీపిండముల నిచ్చుచున్నాను. భూత ప్రేత, పిశాచము లైనవారును, అరణ్యమార్గ మునకాని యుద్ధమునగాని ఆకలి దాహములచే చనిపోయిన వారి కీపిండములనిచ్చుచున్నాను.

43. రౌరవే చాంధతామిస్రే
కాలసూత్రే చ యా గతాః।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

44. అసిపత్రవనే ఘోరే
కుంభీపాకే చ యే గతాః।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

45. అనేక యాతనాసంస్థా
ప్రేతలోకం చ యే గతాః।
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

46. అసంఖ్య యాతనాసంస్థా
యే నీతా యమశాసనైః
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

43. — 46. రౌరవ, అంధతామిస్ర, కాల సూత్ర, నరకమున కేగిన వారికిని, అసిపత్రవన మున, ఘోరమగు కుంభీపాక నరకముననున్న వారికి, అనేకయాతనల యందుండి ప్రేతలోక మున కేగినవారికి, అనేకయాతనలచే యమునిశాస నప్రకారము తీసికొనిపోబడినవారి ఉద్ధరణకై నేనీ పిండమునిచ్చుచున్నాను.

47. నరకేషు సమస్తేషు
యాతనాయాం చ సంస్థితాః
తేషా ముద్ధరణార్థాయ
ఇమం పిండం దదామ్యహం॥

47. నరకముల యందనేకబాధలతో నుండిన పితరుల ఉద్ధరణకై ఈపిండమునిచ్చుచున్నాను,

48. పశుయోనిగతా యే చ
పక్షికీటసరీసృపాః
అథవా వృక్షయోనిస్థాః
తేభ్యః పిండం దదామ్యహం॥

48. పశు, పక్షి, కీటకములు, పాములపుట్టుక యందున్న వారి కీ పిండ మీయబడుచున్నది.

49. జాత్యంతర సహస్రేషు
భ్రమంతః స్వేన కర్మణా
మానుష్యం దుర్లభం యేషాం
తేభ్యః పిండం దదామ్యహం॥

50. దివ్యంతరిక్ష భూమిష్ఠాః
పితరో బాంధవాదయః
మృతా అసంస్కృతా యే చ
తేభ్యః పిండం దదామ్యహం॥

49, 50. తమపూర్వకృతపుణ్యముచే జాత్యంతరములయందు తిరుగుచు మనుష్య జన్మమును పొందలేకున్నారో వారికిని ఆకాశము భూముల యందున్న పితరులు బాంధవులు చనిపోయి సంస్కరించ బడకయుందురో వారి కీ పిండము నిచ్చుచున్నాను.

51. యే కేచిత్ ప్రేతరూపేణ
వర్తంతే పితరో మమ
తే సర్వే తృప్తి మాయాంతు
పిండేనానేన శాశ్వతీం॥

51. నాపితరు లెవ్వరైన ప్రేతరూపమును నుండినచో వారీ పిండముచే తృప్తినొందుదురుగాక!

52. యే ఽబాంధవా బాంధవా యే
ఽన్యజన్మని బాంధవాః
తేషాం పిండో మయా దత్తో
హ్యక్షయ్య ముపతిష్ఠతు॥

52. బంధువులు కానివారు, బంధువులు, ఇతరజన్మమున బంధువులైన వారలకై నేనొసగిన ఈపిండమక్షయమగుగాక!

53. పితృవంశే మృతా యే చ
మాతృవంశే తథైవ చ
క్రియాలోపగతా యే చ
జాత్యంధాః పంగవ స్తథా॥

54. విరూపా ఆమగర్భాశ్చ
జ్ఞాతా ఽజ్ఞాతా కులే మమ
ధర్మపిండో మయా దత్తో
హ్యక్షయ్య ముపతిష్ఠతు॥

53, 54. పితృవంశమున, మాతృవంశమున చనిపోయినను చనిపోయిన తరువాత సంస్కారములు లోపించినను, పుట్టుగ్రుడ్డులైనవారికి, కుంటివారికి, విరూపులగువారికి, తెలిసినవారు నాకు తెలియనివారు నాకులమున నున్నవా రందరకు ధర్మపిండము నాచేనీయబడినది. ఇదివారికక్షయ్యమగుగాక!

55. ఆ బ్రహ్మణో యే పితృవంశజాతా
మాతు స్తథా వంశభవా మదీయాః
వంశద్వయే ఽస్మిన్ మమ దాసభూతా
భృత్యా స్తథైవా శ్రిత సేవకాశ్చ॥

56. మిత్రాణి సఖ్యః పశవశ్చ వృక్షాః
దృష్టాశ్చ స్పృష్టాశ్చ కృతోపకారాః
జన్మాంతరే యే మమ సంగతాశ్చ
తేభ్యః స్వధా పిండ మహం దదామి॥

55, 56. బ్రహ్మనుండి మాపితృ కులమున పుట్టినట్టియు లేక మాతృ కులమునుండి పుట్టినవారు ఈ రెండు వంశములవారి సేవకులు, ఆశ్రితులు, దాసులు, మిత్రులు, పశువులు, పక్షులు, వృక్షములు, నాకు తెలిసినవి, తెలియనివి, జన్మజన్మాంతర స్నేహితులగు వారికై ఈస్వధా పిండమునిచ్చుచున్నాను.

57. ఏతాంశ్చ సర్వమంత్రాంశ్చ
స్త్రీలింగాంతాన్ సమూహ్యాచ
పిండం దద్యాత్ యథాపూర్వం
స్త్రీణాం మాత్రాధికాత్ క్రమాత్॥

57. ఈ విధముగా సర్వమంత్రములను స్త్రీలకు స్త్రీలింగములతోను, పురుషులకు పుంలింగములతోను పిండములనీయవలెను.

58. స్వగోత్రే పరగోత్రే చ
దంపత్యోః పిండదానతః
అపృథక్ నిష్ఫలం శ్రాద్ధం
పిండేషూదక తర్పణం॥

58. తనగోత్రమున పరగోత్రమున నున్న స్త్రీపురుషులకు వేరువేరుగ చేయనిపిండదానము, ఉదక తర్పణము, శ్రాద్ధము నిష్ఫలము.

59. పిండపాత్రే తిలాన్ కృత్వా
పూరయిత్వా శుభోదకైః
పరిషిచ్య త్రిధా సర్వాన్
ప్రణిపత్య క్షమాపయేత్॥

59. పిండపాత్రమున నువ్వులనుంచి శుభోదకముచే పూరించి ఆచమనముచేసి మూడింటిని నమస్కరించి క్షమార్పణ చేసికొనవలెను.

క్ష మా ప ణ మ ం త్ర ం

60. యే చ వో ఽత్ర యే చాస్మా న్నాశం సంతే యాశ్చ వోఽత్ర యాశ్చాస్మా న్నాశం సంతే తే చైవహంతాం తాశ్చవహంతామ్ తృప్యంతు భవంతః తృప్యంతు భవత్యః తృప్యత తృప్యత పుత్రాన్ పౌత్రాన్ అభివర్ధయంతీ రాపో మధుమతీ రిమాః స్వధాపితృభ్యో అమృతం దుహానా ఆపో దేవీ రుభయాం స్తర్పయతు.

60. ఏపురుషుని పితరులు ఇచ్చట నూపై నాశయుంచుచుందురో వారందరు తృప్తినొందుదురుగాక! నాపుత్రులను పౌత్రులను అభివృద్ధి పరచును. ఈమధురములగు ఉదకములు స్వధా పిండము పితరుల కమృతమయమగుగాక! ఈ దేవరూపిణియగు ఉదకము మనలనిద్దరను సంతోషపరచునుగాక!

61. పితౄన్ విసృజ్య చాచమ్య
సాక్షిణః శ్రావయేత్ సురాన్
సాక్షిణః సంతు మే దేవాః
బ్రహ్మేశానాదయ స్తథా॥

తా. ఇట్లు పితరులకు తర్పణముల విడచి, పిండప్రదానములుచేసి ఆచమనముచేసి సాక్షులగు దేవతలను ఓదేవతలారా! బ్రహ్మరుద్రులారా! నాకు సాక్షులు కండు.

62. మయా గయాం సమాసాద్య
పితౄణాం నిష్కృతిః కృతా
ఆగతోఽస్మి గయాం దేవ
పితృకార్యే గదాధర॥

62. ఓగదాధరా! నేనిచటకు పితృకార్యము నకై వచ్చి ఇచ్చట గయలో పితాపులను ఉద్ధరించు కృత్యములచేసితిని.

63. త్వమేవ సాక్షీ భగవన్
అనృణోఽహం ఋణత్రయాత్
సర్వస్థానేషు చైవం స్యాత్
పిండదానం తు నారద॥

63. ఓనారద! అన్నితీర్థములయందును పిండదానమిట్లే యుండును.

64. ప్రేతపర్వత మారుహ్య
కుర్యాత్ తీర్థేషు చ క్రమాత్
తిలమిశ్రాన్ తతః సక్తూన్
నిక్షిపేత్ ప్రేతపర్వతే॥

64. గయలోనున్న ప్రేతపర్వతముపై నెక్కి క్రమముగానటనున్న అన్నితీర్థములలోను తిలలతోకలసిన సక్తుపిండితో పిండములనీయవలెను.

65. అపసవ్యేన దేవర్షే!
దక్షిణాభిముఖం క్రమాత్
యే కేచిత్ ప్రేతరూపేణ
వర్తంతే పితరో మమ॥

66. తే సర్వే తృప్తి మాయాంతు
సక్తుభి స్తిలమిశ్రితైః
ఆబ్రహ్మస్తంభ పర్యంతం
యత్కించి త్సచరాచరం॥

67. మయా దత్తేన తోయేన
తృప్తి మాయాంతు సర్వశః
ప్రేతత్వాచ్చ విముక్తాః స్యుః
పితరః తస్య నారద।

65. – 66. – 67. – ఓనారద! అపసవ్యముగ దక్షిణము వైపునముఖముండునట్లుండి" నావంశమున బ్రహ్మమొదలు చరాచరములన్నియు ప్రేతరూపముగనున్న పితరులందరు తిలలతోకలిసిన ఈసక్తుపిండముచే తృప్తులగుదురుగాక! నేనిచ్చిన ఉదకముచే తృప్తిని పొందుదురుగాక!" అనిచెప్పవలెను. ఓనారద! వానిపితరులామంత్రోదకముచే ప్రేతశరీరముల విడిచెదరు.

68. ప్రేతత్వం తస్య మాహాత్మ్యాత్
కులే చాపి న విద్యతే
నామ్నా ప్రేతశిలాఖ్యాతా
గయాశిరసి ముక్తయే॥

68. – ఓనారద! ఈప్రేతశిలామాహాత్మ్యము వినుటచే వానికులమున ప్రేతత్వమేయుండదు. పితరులకుముక్తినిచ్చుటకై ఆప్రేతశిలగయాశిరస్సున ఉంచబడెను.

69. తీర్థే మంత్రాదిరూపేణ
స్థిత శ్చాదిగదాధరః॥

69. – ఆశిలపై ఆదిగదాధరుడు తీర్థమంత్రరూపముచే నుండెను.

ఇది శ్రీవాయుపురాణమందున్న శ్వేతవరాహ కల్పమున చెప్పబడిన గయామాహాత్మ్యమున
ఆరవ అధ్యాయము సమాప్తము.

# గయామాహాత్మ్యము



## సప్తమాధ్యాయము

సనత్కుమారఉవాచ:

(సనత్కుమారుడు చెప్పుచున్నాడు)

1. ఆదౌ తు పంచతీర్థేషు
చోత్తరే మానసే విధిః
ఆచమ్య కుశహస్తేన
శిరశ్చాభ్యుక్ష్య వారిణా॥

1. ఓనారద! ప్రథమమున ఉత్తరమానసమున స్నానముచేసి పంచతీర్థములయందు ఆచమనముచేసి కుశలను చేతులయందుంచుకొని నీటిని శిరస్సున జల్లుకొని,

2. ఉత్తరే మానసే గచ్ఛన్
మంత్రేణ స్నాన మాచరేత్
ఉత్తరే మానసే స్నానం
కరో మ్యాత్మ విశుద్ధయే॥

2. ఉత్తరమానస తీర్థమునకు వెళ్లుచు "ఉత్తరమానస తీర్థమున ఆత్మపవిత్రతకై స్నానము చేయుచున్నాను" అని మంత్రము చదువుచు స్నానముచేయవలెను.

3. సూర్యలోకాది సంసిద్ధి
సిద్ధయే పితృముక్తయే
స్నాత్వాథ తర్పణం కృత్వా
శ్రాద్ధం కృత్వా సపిండకం॥

3, సూర్యలోకము పొందుటకును, పితృదేవతల ముక్తికొరకును స్నానముచేసి తర్పణమును విడచి సపిండక శ్రాద్ధమునుచేయవలెను.

4. మానసం హి సరో యస్మాత్
తస్మా దుత్తరమానసం
సూర్యం నత్వా చార్చయిత్వా
సూర్యలోకం నయేత్ పితౄన్॥

4. ఈ ఉత్తరమానస సరోవరమునకే మానససరోవరమందురు. ఇచ్చట సూర్యుని నమస్కరించి పూజించి పితరులను సూర్యలోకము పొందించవలెను.

5. ఓంనమో ధాతవే భర్త్రే
సోమ భౌమజ్ఞరూపిణే
జీవభార్గవ శనైశ్చర
రాహుకేతు స్వరూపిణే॥

5. ఓ సూర్యభగవానుడా! జగత్తునంతను భరించునట్టియు చంద్ర, మంగళ, బుధరూపుడైనట్టియు, బృహస్పతి, శుక్రుడు, శనైశ్చరుడు, రాహు, కేతు, స్వరూపముగు నీకునమస్కారము,

6. ఉత్తరాన్మానసాన్స్నాని
వ్రజే ద్దక్షిణమానసం
దక్షిణే మానసే చైవ
తీర్థత్రయ ముదాహృతం॥

6. ఉత్తరమానస సరోవరమునుండిమానముతో దక్షిణ మానస సరోవరమునకు వెళ్ళవలెను. దక్షిణమానస సరోవరమున మూడుతీర్థములున్నవని చెప్పబడుచున్నది.

7. స్నాత్వా తేషు విధానేన
కుర్యాత్ శ్రాద్ధం పృథక్ పృథక్
ఉదీచీతీర్థ మిత్యుక్తం
తత్రోదీచ్యాం విముక్తిదం॥

7. ఆతీర్థములయందు విధ్యుక్త ప్రకారముగ స్నానముచేసి వేరు వేరుగ శ్రాద్ధమునుచేయవలెను. మోక్షమునిచ్చు ఉదీచీతీర్థ మచ్చటకు ఉత్తరదిక్కుననున్నది.

8. అత్ర స్నాతో దివం యాతి
స్వశరీరేణ మానవః
మధ్యే ఖనకలంతీర్థం
త్రిషులోకేషు విశ్రుతం॥

8. ఇచ్చట స్నానము చేసినమనుష్యుడు తన శరీరముతోనే స్వర్గమునకు వెళ్ళును. ఉదీచీతీర్థమునకు మరియొక నదికిని మధ్య ముల్లోకముల యందుఖ్యాతినిగాంచిన "ఖనకల" తీర్థమున్నది.

9. స్నాత్వా కనకవద్భాతి
నరో యాతి పవిత్రతాం
తస్య దక్షిణ భాగేచ
తీర్థం దక్షిణమానసం॥

9. "ఖనకల" తీర్థమున స్నానముచేసిన మనుష్యుడు పవిత్రుడై బంగారమువలె ప్రకాశించును. దానికిదక్షిణ భాగమున దక్షిణమానస సరోవరమున్నది.

10. దక్షిణే మానసే స్నానం
కరో మ్యాత్మవిశుద్ధయే
సూర్యలోకాది సంసిద్ధ
సిద్ధయే పితృముక్తయే॥

10. దక్షిణమానస సరోవరమున ఆత్మపవిత్రతకై, సూర్యలోకాది సిద్ధికై, పితృదేవతల ముక్తికై స్నానము చేయుచున్నాను.

11. బ్రహ్మహత్యాది పాపౌఘ
ఘాతనాయ విముక్తయే
దివాకర కరోమీహ
స్నానం దక్షిణమానసే॥

11. దక్షిణమానసమున నేను బ్రహ్మహత్యాది పాతకనాశనమునకు స్నానముచేయుచున్నాను.

12. సూర్యం నత్వా చ స్మృత్వాచ
సూర్యలోకం నయేత్ పితౄన్
నమామి సూర్యతృప్త్యర్థం
పితౄణాం తారణాయ వై॥

12. సూర్యుని నమస్కరించినను, ధ్యానించినను పితరులను సూర్యలోకమును పొందించును. సూర్యునితృప్తిపరచుటకును పితరులను తరింపచేయుటకును సూర్యుని నమస్కరించుచున్నాను.

13. పుత్రపౌత్ర ధనైశ్వర్యా
యురారోగ్యాభి వృద్ధయే
అనేన స్నానపూజాది
కుర్యాత్ శ్రాద్ధ మనుత్తమం॥

13. పుత్రులు, మనుమలు, ధనము, ఐశ్వర్యము, ఆయువు, ఆరోగ్యము అభివృద్ధి చెందుటకై ఈస్నానము పూజ మొదలగువానిని, శ్రాద్ధమును చేయవలెను.

14. కృత్వా నత్వా చ మహాన్యర్కం
ఇమం మంత్ర ముదీరయేత్
ఫల్గుతీర్థం వ్రజే త్తస్మాత్
సర్వతీర్థో త్తమో త్తమం॥

14. ఇట్లుచేసిన తరువాత మహానార్కునినమస్కరించి ఈమంత్రమును చదువవలెను. అచట నుండి తీర్థములలో నుత్కృష్ట తీర్థమగు ఫల్గుతీర్థమునకు వెళ్లవలెను.

15. ముక్తిర్భవతి పితౄణాం
కర్తౄణాం తారణాయ చ
బ్రహ్మణా ప్రార్థితో విష్ణుః
ఫల్గురూపో౽భవత్ పురా॥

15. పూర్వము బ్రహ్మచే ప్రార్థింప బడినవాడై విష్ణువు ఫల్గు సమీపమునవచ్చుటపితరులను శ్రాద్ధము చేయువారిని తరింప చేయుటకు ఉండెను.

16. దక్షిణాగ్నిపహ తం నూనం
తద్భవం ఫల్గుతీర్థకం
తీర్థాని యాని సర్వాణి
భువనే ష్వఖిలే ష్వపి॥

16. ముల్లోకముల యందలి తీర్థములన్నియు ఫల్గుతీర్థమందలి దక్షిణాగ్ని యనియే చెప్పబడును.

17. తాని స్నాతుం సమాయాంతి
ఫల్గుతీర్థే సురైస్సహ
గంగాపాదోదకం విష్ణోః
ఫల్గుహ్యాదిగదాధరః॥

17. ఆనదులయందు స్నానముచేయుటకు దేవతలందరు వచ్చెదరు. ఆదిగదాధరుడగువిష్ణువునకు పాదోదకమగు గంగ ఫల్గుతీర్థ రూపముననున్నది.

18. స్వయం హి ద్రవరూపేణ
తస్మాత్ గంగాధికాం విదుః
అశ్వమేధ సహస్రాణాం
సహస్రం య స్సమాచరేత్॥

18. విష్ణుపాదోదక మగు ఫల్గుతీర్థము గంగ కన్న గొప్పదని చెప్పుదురు.

19. నాసౌ తత్ఫల మాప్నోతి
ఫల్గుతీర్థే యదాప్నుయాత్
ఫల్గుతీర్థే విష్ణుజలే
కరోమి స్నాన మాదృతః॥

19. ఫల్గుతీర్థముననొక మారుస్నానము చేసిన పుణ్యము వేనకు వేలు అశ్వమేధయజ్ఞముచేసినను పొందజాలడు. విష్ణుపాదోదకమగు ఫల్గుతీర్థమున ఆదరముగస్నానము చేయవలెను.

20. పితౄణాం విష్ణులోకాయ
భుక్తిముక్తి ప్రసిద్ధయే
ఫల్గుతీర్థే నరః స్నాత్వా
తర్పణం శ్రాద్ధ మాచరేత్॥

20. పితరులకు విష్ణులోకముకొరకు, భుక్తి ముక్తులకొఱకు నరుడు ఫల్గుతీర్థమున స్నానము చేసి తర్పణ శ్రాద్ధముల చేయవలెను.

21. సపిండకం స్వసూత్రోక్తం
నమే దథ పితామహం
నమశ్శివాయ దేవాయ
ఈశాయ పురుషాయ చ॥

21. సపిండక, స్వగోత్ర పితామహునికి నమస్కరించి - శివునకు, ఈశానునకు, పురుషోత్తమునకు

22. అఘోరవామదేవాయ
సద్యోజాతాయ శంభవే
ఫల్గుతీర్థే నరః స్నాత్వా
దృష్ట్వా దేవం గదాధరం॥

22. అఘోర, వామదేవ, సద్యోజాత, శంభులకొఱకు ఫల్గుతీర్థమున స్నానము చేసి గదాధరు నిదర్శించి

23. ఆత్మానం తారయేత్ సద్యో
దశపూర్వాన్ దశాపరాన్
నత్వా గదాధరం దేవం
మంత్రేణానేన పూజయేత్॥

23. గదాధరుని దర్శించుటచే దర్శనముచేసిన మనుష్యుని ఒకదశకు పూర్వులు, ఒకదశకు తరువాతివారగు పితరులుతరించెదరు. ఈ క్రిందచెప్పు మంత్రములతో దేవుడగు గదాధరుని నమస్కరించవలెను.

24. ఓంనమో వాసుదేవాయ
నమః సంకర్షణాయ చ
ప్రద్యుమ్నా యానిరుద్ధాయ
శ్రీధరాయ చ విష్ణవే॥

24. వాసుదేవుని కొఱకు, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, శ్రీధర, విష్ణువులకు నానమస్కారము.

25. పంచతీర్థ్యాం నరః స్నాత్వా
బ్రహ్మలోకం నయేత్ పితౄన్
అమృతైః పంచభిః స్నానం
పుష్పవస్త్రా ద్యలంకృతం॥

25. పంచతీర్థముల యందు స్నానముచేసిన నరుడు పితరులను బ్రహ్మ లోకమును పొందించును. ఎవడు పంచామృతములతో గదాధరుని స్నానముచేయించడో, పుష్పవస్త్రాదులతో నలంకరించడో

26. న కుర్యా ద్యో గదాపాణిం
తస్య శ్రాద్ధ మసార్థకం
నాగకూటాత్ గృధ్రకూటాత్
యూపాచ్చోత్తరమానసాత్॥

26. 27. వాడుచేయు శ్రాద్ధము సార్థకము కాజాలదు. నాగకూట, గృధ్రకూట, ఉత్తర మానసములు గయాశిరమని చెప్పబడును. ముండపృష్టనగము కన్నను ఫల్గుతీర్థము గొప్పది.

27. ఏతత్ గయాశిరః ప్రోక్తం
ఫల్గుతీర్థం తదుచ్యతే
ముండపృష్ఠాన్నగాధస్తాత్
ఫల్గుతీర్థ మనుత్తమమ్॥

28. తత్ర శ్రాద్ధాదినా సర్వే
పితరో మోక్ష మాప్నుయుః
ముఖం గయాసురస్యైతత్
తస్మాత్ శ్రాద్ధ మథాక్షయం॥

28. అచ్చట శ్రాద్ధముచేయుటచే పితరులు మోక్షమును పొందుదురు. ఇది గయాసురునిముఖమగుటచే నచటచేసిన శ్రాద్ధమక్షయ మగును.

29. ప్రథమేఽహ్ని విధిః ప్రోక్తో
ద్వితీయే దివసే వ్రజేత్
ధర్మారణ్యే తత్ర ధర్మం
తస్మాత్ యజ్ఞ మకారయత్॥

29. ఓనారద! నేను మొదటిదినము యొక్క కృత్యమును వర్ణన చేసితిని. రెండవదినమున అచటినుండి ధర్మరాజు యజ్ఞముచేసిన ధర్మారణ్యమునకు వెళ్లవలెను.

30. గచ్ఛతాం బ్రహ్మలోకాప్తిః
భవత్యేవం హి నారద
మతంగవాప్యాం యః స్నాత్వా
తర్పణం శ్రాద్ధ మాచరేత్॥

30. అచటకువెళ్లినవారికి బ్రహ్మలోకము కలుగును. మతంగ వాపికయందు స్నానముచేసి తర్పణమును శ్రాద్ధమునుచేయవలెను.

30. గత్వా నత్వా మతంగేశం
ఇమం మంత్ర ముదీరయేత్॥

30. మతంగేశుని నమస్కరించి ఈమంత్రమును చెప్పవలెను.

31. ప్రమాణం దేవతాః సంతు
లోకపాలాశ్చ సాక్షిణః
మయాగత్య మతంగేఽస్మిన్
పితౄణాం నిష్కృతిః కృతా॥

31. ఓదేవతలారా! ఇచటకువచ్చి నేను పితరులకు చేసినశ్రాద్ధాదివిషయమున దేవతలు లోకపాలురుసాక్షులుగానుందురుగాక!

32. తత్కూపయూపయోర్మధ్యే
సర్వాన్ తారయతే పితౄన్
ధర్మధర్మేశ్వరం నత్వా
మహాబోధితరుం నమేత్॥

32. ఈవిధముగయూపకూపములమధ్యమతంగతీర్థమున మనుష్యుడు తనపితరుల నందరును తరింపచేయుచున్నాడు. ధర్మ ధర్మేశ్వర మహాబోధి వృక్షమును నమస్కరించవలెను.

33. నమస్తేఽశ్వత్థరాజాయ
బ్రహ్మ విష్ణుమహేశ్వర
బోధిద్రుమాయ పితౄణాం
కర్తౄణాం తారణాయ చ॥

33. బ్రహ్మ,విష్ణు, మహేశ్వర, బోధివృక్షములకు, పితరులకు శ్రాద్ధముచేసి తరింప జేయు అశ్వత్థవృక్ష రాజమునకు నానమస్కారము.

34. ఏకాదశోఽసి రుద్రాణాం
వసూనా మష్టమో వసుః
నారాయణోఽసి దేవానాం
వృక్షరాజోఽసి పిప్పల॥

34. ఏకాదశరుద్రులును, అష్టవసువులును, దేవతలలో నారాయణుడవును నీవేకదా!

35. అశ్వత్థరూపిణం దేవం
శంఖచక్ర గదాధరం
నమామి పుండరీకాక్షం
శంఖరూపధరం హరిం॥

35. అశ్వత్థ రూపున నున్నట్టియు, శంఖచక్ర గదాధరుడగు దేవుడగు పుండరీకాక్షుడును శంఖరూపధరుడగు విష్ణువును నమస్కరింతును.

36. యేఽస్మత్కులే మాతృవంశే
బాంధవాః దుర్గతిం గతాః
త్వద్దర్శనాత్ స్పర్శనాచ్చ
స్వర్గతిం యాంతి తేఽక్షయాం॥

36. మాతులమునను, మాతృకులమునను బంధువులగు జనులు దుర్గతినిపొందుదురో వారందరు నిన్నుజూచుట, స్పృశించుటలచే అక్షయస్వర్గమునకు పోదురు.

37. ఋణత్రయం మయా దత్తం
గయా మాగత్య వృక్షరాట్
త్వత్ప్రసాదాత్ మహాపాపాత్
విముక్తోఽహం భవార్ణవాత్॥

37. ఓవృక్షరాజమా! గయకువచ్చి నాచే ఋణత్రయము తీర్చుకొనబడినది. నీఅనుగ్రహమున మహాపాపము నుండి, సంసారసాగరము నుండి విడువబడితిని.

38. తృతీయే బ్రహ్మశిరసి
స్నాత్వా శ్రాద్ధం సపిండకం
కృత్వా సర్వప్రమాణేన
మంత్రేణ విధివత్ సుతః॥

38. మూడవరోజున బ్రహ్మసరస్సున స్నానముచేసి ప్రమాణములు గల మంత్రములతో యథావిధిగ పుత్రుడు సపిండక శ్రాద్ధమునుచేయవలెను.

39. స్నానం కరోమి తీర్థేఽస్మిన్
ఋణత్రయ విముక్తయే
తత్కూపయూపయోర్మధ్యే
బ్రహ్మలోకం నయేత్ పితౄన్॥

39. ఈ తీర్థమున ఋణత్రయము విడుటకై ఈకూపయూపముల మధ్య తీర్థమున స్నానము చేయుచున్నాను. ఇందుచే నాపితరులు బ్రహ్మలోకమును పొందుదురుగాక!

# శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువు

## ప్రచారాదివిశేషములు

(ప్రత్యేక విలేఖరిద్వారా)

సికింద్రాబాద్:—

శ్రీబదరీనారాయణములో 21-6-54 వ తేదీనుండి ప్రారంభింపబడి అఖండ దీక్షతో వైభవముగ జరుగుచున్న శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువును దర్శింపనుత్సహించియు కారణాంతరములచే వెళ్లజాలకుండిన కొందఱు భాగవతశిఖామణులు తమకుగల క్రతుదీక్షా సముత్సాహమును వ్యక్తపరచుటకై తమస్థానముననే శ్రీమదష్టాక్షరీ లక్ష జపాత్మకమగు మహాక్రతువును జరుప నిశ్చయించిరి. ఈమహాక్రతువు జయసంవత్సర శ్రావణ శు. ౧౦ మీా సోమవారం (అనగా 9-8-54 వ తేదీన) సాయంత్రం గం. 5-30 లకు అంకురార్పణముతో ప్రారంభమగును. 10 వ తేదీనుండి ఉదయం గం. 8-0 ల నుండి మధ్యాహ్నం గం. 12-0 ల వఱకు జపహోమాదులు జరుపబడును. అటుపిమ్మట 14 వ తేదీని పూర్ణాహుతియు, 15 వ తేదీని అవబృధస్నానము, శ్రీవైష్ణవ తదీయారాధన, బీదలకు అన్నదానము గావింపబడును.

ఈమహాక్రతువునందన్వయింప దీక్షను బూనిన భక్తవరేణ్యుల శుభనామములు

1. శ్రీ కైలాస శంకరయ్యగారు
2. శ్రీ సాలికె కాశయ్యగారు
3. శ్రీ కోకల నారాయణగారు
4. శ్రీ జెకుసాని సూర్యనారాయణగారు
5. శ్రీ దుందిగళ్ళ జగదీశ్వరయ్యగారు

బదరీనారాయణములో జరుగు మహాక్రతువును దర్శింప నుత్సహించియు కారణాంతరములచే వెళ్ళలేకుండిన భక్తులందరును యీామహాక్రతువున నన్వయించి తరించవలసినదిగ ఈ శ్రీమదష్టాక్షరీ లక్ష జప మహాక్రతు కార్యనిర్వాహక వర్గమువారు కోరుచున్నారు.

రిజిష్టర్డు నెం. A 16.

# BHAKTINIVEDANA

[వేదాంత వార పత్రిక.]

బదరీయాత్రా స్పెషలులో ప్రయాణము గావించుచున్న భక్తుల బంధుమిత్రాదులకు

## శుభసందేశము

బదరికాశ్రమములో జరుపబడుచున్న శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువైభవమును దర్శించు భాగ్యము నొందుటకై 3-7-54 వ తేదీని శ్రీబదరీయాత్రా స్పెషలులో బయలుదేరిన తమ ఆప్తబంధువులు సౌఖ్యముగా ఉత్తరదేశమందలి ముఖ్యమగు క్షేత్రస్థలములను సేవించుకొని 25-7-54వ తేదీకి ఋషీకేశము చేరిరి. అచ్చటినుండి 28, 29, 30. వ తేదీలలో వరుసగా మూడు జట్లులుగ బదరికాశ్రమము చేరిరి. అంతియు సౌఖ్యముగను, ఉత్సాహముగను ప్రయాణము గావించిరి. 4-8-54 వ తేదీనుండి జరుపబడు శ్రీమదష్టాక్షరి హోమాదికార్యముల దర్శించుకొని తిరిగి 15-8-54 వ తేదీన బయలుదేరి ఋషీకేశము చేరుదురు. తమరు వారికేమైన ఉత్తర ప్రత్యుత్తరములు జరుప గోరుచో నీక్రింది చిరునామాను వ్రాయవచ్చును.

**SRIMAD ASHTAKSARI KOTI**
**HAVANA MAHAKRATUVU**
**OFFICE**
**BADRI NAD U. P.**



**Regd. No. A. 16.**



## విషాదవార్త

మన ప్రత్యేక రైలులో కైంకర్యపరులలో నొకరుగా ప్రయాణము చేయుచుండిన అర్తమూరు వాస్తవ్యులగు శ్రీనివాస వరదనారాయణాచార్యులుగారు ది 21-7-54 నడుదయం, 8. 30. లకు అకస్మాత్తుగా గుండె ఆగిపోయి పరమపదించిరి. అంతవరకు 10. నిమిషముల వరకు యెంతయో ఆనంద కరముగ మాట్లాడియున్నారు, సప్తమోక్షప్రదాయకములగు క్షేత్రములలో నొకటి యగు అయోధ్యలో, సరయూనది తీరమున అసువులు బాయుట వీరి యొక్క విశేషము. పూర్వజన్మ సుకృత ఫలము. 40-50 మంది స్వాములు విష్ణుసహస్రనామ, భగవద్గీత పారాయణాదులు తిరువారాధన సేవాకాలములు జరిపిరి.

ఎంతయు వైభవోపేతముగ సమస్త క్రియలును జరుపబడినవి. అస్తికలు సరయూలో కలుపబడినవి. యాత్రికులలో నొకరగు శ్రీ చిలకమర్రి నారాయణాచార్యులుగారికి భావమరిది యగువారిచే యీపోయినవారికి సమస్త క్రియలును జరుపబడినవి.

ఈసదర్భంలోవీరికుటుంబమునకు సానుభూతి దెలుపుచు తంతిమూలముగా వార్తపంపబడినది. ఈ 11 రోజులఖర్చులు రు. 100 లు 50 కుంచముల ధాన్యము కుటుంబమునకు సమర్పించ బడినది.





## ‘భక్తినివేదన’

జయ – శ్రావణము.

### శ్రీయతిరాజసేవామహిళామండలి [బందరు.]

## శుక్రవార చతుర్థవార్షిక సభానివేదిక

శ్రీయతిరాజ సేవామహిళా మండలి (బందరు) వారి యాజమాన్యమున ది 6–8–54 వ తేదీనుండి వరుసగా మూడురోజులు శుక్రవార వార్షికసభలు శ్రీ వెంకటేశ్వరస్వామివారి ఆలయములో కడువైభవముగ జరుపబడెను. 5 వ తేదీ మధ్యాహ్నము గం|| 3–0 లకు శ్రీభగవద్రామానుజులవారి పటమును చలవచప్పరమున వేంచేపుచేసి మేళతాళములతోను, శ్రీ భజయతిరాజ స్తోత్రానుసంధానముతోను తిరువీధ్యుత్సవము జరుపబడెను. అనేకమంది స్త్రీ పురుషులు ఈమహోత్సవమున పాల్గొనిరి. ప్రతిదినము ఉదయమున సత్రమునందు తిరువారాధన, సేవాకాలగోష్ఠి, తీర్థ ప్రసాద వినియోగములు జరుపబడి పిమ్మట ఉదయసభయు, తిరిగి మధ్యాహ్నం గం 3–0 ల నుండి మధ్యాహ్నసభయు జరుపబడెను. ఈ సభకు శ్రీ ఉ. వే. శ్రీమాన్ గోడవర్తి జగన్నాథస్వామి

ఎమ్. ఏ. గారును, సి. హెచ్. ఆర్. అండ్ సి ఇ. డిప్యూటీ కమీషనరు గారగు శ్రీ దుర్గా ప్రసాదరావు ఎమ్. ఏ. గారును, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఎస్. టి. జి. వరదాచార్యులు ఎమ్. ఏ. (ప్రిన్సిపాల్ ఆఫ్ నేషనల్ కాలేజీ బందరు) గారును, శ్రీ శ్రీ శ్రీ 1008 శ్రీ సీతారామయతీంద్రుల వారును వరుసగా మూడు రోజులు అధ్యక్షత వహించి యీ సభలను జయప్రదమొనర్చిరి. శ్రీ ఉ. వే. ప్ర. శ్రీమాన్ చ. వెం. నరసింహాచార్యులు గారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్రణవార్థ మహోపాధ్యాయ ముడుంబై కృష్ణమాచార్యులుగారు శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఘంటసాల శ్రీనివాసాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ మరంగంటి పార్థసారథి ఆచార్యులుగారు (డిస్ట్రిక్టు కమర్షియల్ టాక్సు ఆఫీసరు), శ్రీమాన్ మరంగంటి నరసింహాచార్యులుగారు. శ్రీమతి శ్రీపతి సీతమ్మగారు, శ్రీమతి మరంగంటి ఖిరాట్టెమ్మ గారు, శ్రీమతి యం. సీతమ్మగారలును వివిధవిషయములనుగూర్చి యుపన్యసించిరి. అనేకవందల మంది స్త్రీ పురుషులు ఈ సభలో పాల్గొనిరి. శ్రీమతి యం. కాంచనమాల (బి. ఏ. విద్యార్థిని)గారి యాధ్వర్యమున శ్రీయతిరాజసేవా మహిళామండలి వారిచే నడుపబడుచున్న సంస్కృత పాఠశాలా విద్యార్థినులచే బుర్రకథలు, నాటకములు, నాట్యములు, హరికథలు జరుపబడెను. ఆఖరురోజున ఈ బాలికలకు ఈ సంఘమువారిచే బహుమతు లొసంగబడెను. పండిత సత్కారము జరుపబడెను. ఈవార్షికసభలు జయప్రదముగ జరుగవలయునని ఆశీర్వదించుచు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది శ్రీ ఉ. వే. శ్రీమాన్ 108 శ్రీ శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు తమ శుభసందేశమును తంతిద్వారా కటాక్షించిరి. ఈసభల జయప్రద నిర్వాహణకు సహకరించిన సభ్యులకందరకును, పండితులకును, బాలికలకును కార్యదర్శినులగు శ్రీమతి మరంగంటి సీతమ్మ గారును, శ్రీమతి కందేటి తాయారమ్మగారును తమ ధన్యవాదముల తెలిపిరి. కార్యదర్శినుల అభివాదనములతో సభముగిసెను.



40. శ్రాద్ధాయ పిండదానాయ
తర్పణాయ విశుద్ధయే
యాగం కృత్వా స్థితో యూపో
బ్రహ్మణో యూప ఇత్యసౌ॥

40. శ్రాద్ధముచేయుటకు పిండదానమునకు తర్పణమిడుటకు పవిత్రుడనగుటకుగాను ఇందు స్నానముచేయుచున్నాను. యాగమును చేసిన వాడై బ్రహ్మ ఈయూపమును స్థాపించియుండెను.

41. కృత్వా బ్రహ్మసరః శ్రాద్ధం
సర్వాన్ తారయతే పితౄన్
యూపం ప్రదక్షిణీకృత్య
వాజపేయ ఫలం లభేత్

41. బ్రహ్మసరమున శ్రాద్ధముచేసిన పితరులుతరింతురు. యూపమును ప్రదక్షిణము చేయుటచే వాజపేయ యజ్ఞఫలమును పొందును.

42. బ్రహ్మాణం చ నమస్కృత్య
బ్రహ్మలోకం నయేత్ పితౄన్
ఓం నమో బ్రహ్మణేఽజాయ
జగజ్జన్మాధి కారిణే॥

42. బ్రహ్మను నమస్కరించి పితరులను బ్రహ్మ లోకమును పొందించును. జగత్సృష్టికి కారణమగు బ్రహ్మకు నా నమస్కారములు.

43. భక్తానాం చ పితౄణాం చ
తారణాయ నమో నమః
గోప్రచార సమీపస్థాః
ఆమ్రాః బ్రహ్మప్రకల్పితాః॥

43. భక్తులగుపితరులు తరించుటకై బ్రహ్మకునానమస్కారము. గోప్రచారమువద్ద బ్రహ్మచే వేయబడిన ఆమ్రవృక్షములున్నవి.

44. తేషాం సేచనమాత్రేణ
పితరో మోక్షగామినః
ఆమ్రం బ్రహ్మసరోద్భూతం
సర్వదేవమయం తరుం॥

44. వాటికి ఉదకముపోసి తడిపిన మాత్రమున మోక్షమును పొందుదురు. ఆమామిడి చెట్టు ప్రక్కన పుట్టిన "సర్వదేవమయ" మను

44. విష్ణురూపం ప్రసించామి
పితౄణాం ముక్తి హేతవే

44. విష్ణురూపమగు వృక్షమును పితరులకై తడుపుచున్నాను.

45. ఏకో మునిః కుంభకుశాగ్రహస్త
ఆమ్రస్య మూలే సలిలం దధానః
ఆమ్రాశ్చసిక్తాః పితరశ్చతృప్తాః
ఏకాక్రియా ద్వ్యర్థకరీ ప్రసిద్ధా॥

45. పూర్వకాలమున ఒకముని జలకుంభము నుతీసికొని కుశలను తీసికొని సాయంకాల సమయమున సంధ్యావార్చు చుండగా ఆనీరుపడుటచే అతనిపితరులు తరించిరి. మామిడివృక్షములుతడుపబడెను. ఒకేపనిచే రెండుఫలితములు కలిగినవి.

46. తతో యమబలిం క్షిప్త్వా
మంత్రేణానేన సంయుతః
యమరాజధర్మరాజౌ
నిశ్చలార్థం వ్యవస్థితౌ॥

46. తరువాత ఈమంత్రముతో యమబలిని చేయవలెను. యమరాజ, ధర్మరాజులు, శిలనిశ్చలముగానుండుటకై ఇచ్చటనుండిరి.

47. తాభ్యాం బలిం ప్రదాస్యామి
పితౄణాం ముక్తిహేతవే
తతః శ్వానబలిం క్షిప్త్వా
మంత్రేణానేన సంయుతః॥

47. పితరుల ముక్తికై వారికి బలిని ఇయ్యవలెను. తరువాత శ్వానబలి నీ మంత్రముతో నీయవలెను.

48. శ్వానౌ ద్వౌ శ్యామశబలౌ
వైవస్వతకులోద్భవౌ
తాభ్యాం బలిం ప్రదాస్యామి
రక్షేతాం పథి సర్వదా॥

48. వైవశ్వతకులమునబుట్టిన "శ్యామ, శబల అను కుక్కలను ఈబలినిచ్చుచున్నాను. ఇవి మామార్గమునన్నెల్లప్పుడు రక్షణజేయునుగాక.

49. తతః కాకబలిం క్షిప్త్వా
పునః స్నానం సమాచరేత్
ఇంద్రవారుణవాయవ్య
యామ్యనైరుతా స్తథా॥

50. వాయసాః ప్రతిగృహ్ణంతు
భూమ్యాం పిండం మయోజ్ఝితం
ఫల్గుతీర్థే చ తుర్థేఽహ్ని
గత్వా స్నానాదికం చరేత్ ॥

49. 50. తరువాత కాకబలినిచ్చి స్నానము చేయవలెను. ఇంద్ర, వరుణ, వాయవ్య, యామ్య నైరుత, వాయస భూమియందు ఉంచబడిన పిండమునుకాకులు తీసికొనునుగాక! తిరిగినాలుగవ రోజున ఫల్గుతీర్థమున స్నానముచేయవలెను.

51. గయాశిరసి యచ్ఛ్రాద్ధం
పదే కుర్యాత్ సపిండకం
నాభౌ ద్గయాశిరః తత్ర
ఫల్గుతీర్థాశ్రితం కృతం॥

51. గయుని శిరమున చేసినశ్రాద్ధమునే సపిండపదమున చేయవలెను. అదిఫల్గుతీర్థరూపమగు గయునిశిరస్సేకదా!

52. నగాత్ జనార్థనా ద్బ్రహ్మ
కూపాదుత్తరమానసాత్
ఏత ద్గయాశిరః ప్రోక్తం
ఫల్గుతీర్థం తదుచ్యతే॥

52. జనార్థన పరత్వమునుండి బ్రహ్మకూపము, ఉత్తరమానసము గయుని శిరస్సుగా చెప్పబడుచున్నది. కావున ఫల్గుతీర్థము గొప్పది.

53. పితామహం సమాసాద్య
యావదుత్తర మానసాత్
ఫల్గుతీర్థం తు విజ్ఞేయం
దేవానా మపి దుర్లభం॥

53. పితామహ తీర్థమునుండి ఉత్తరమానసమువరకు ఫల్గుతీర్థము. ఇది దేవతలకు కూడ దుర్లభము.

54. క్రౌంచపాదాత్ ఫల్గుతీర్థం
యావత్ సాక్షా ద్గయాశిరః
ముఖం గయాసురస్యైవ
తస్మాత్ శ్రాద్ధ మధాక్షయం॥

54. క్రౌంచపదతీర్థమునుండిఫల్గుతీర్థమువరకు గయాసురుని శిరస్సు. అదియేగయుని ముఖము. కావున నచట చేసిన శ్రాద్ధమక్షయమగును.

55. ముండపృష్ట నగాదస్తాత్
సాక్షా త్తత్ఫల్గు తీర్థకం
ఆద్యో గదాధరో దేవో
వ్యక్తావ్యక్తో వ్యవస్థితః॥

55. ముండ పృష్టపర్వతమునుండి ఫల్గుతీర్థము వరకు ఆద్యుడగు గదాధరుడు వ్యక్తావ్యక్తరూపమున నున్నాడు.

56. విష్ణ్వాది పదరూపేణ
పితౄణాం ముక్తిహేతవే
తత్రవిష్ణుపదం దివ్యం
దర్శనం పాపనాశనం॥

56. విష్ణువు మొదలగు నామములతో పితృలకు మోక్షమునిచ్చుటకై సర్వపాపవినాశకమగు దివ్యమైన విష్ణుపదమను తీర్థముగలదు. దానిని జూచిన పాపనాశనమగును.

57. స్పర్శనం పూజనం చైవ
తౄణాం దత్తమక్షయం
ాద్ధం సపిండకం కృత్వా
లసాహస్రమాత్మనః॥

58. నయే ద్విష్ణుపథం దివ్యం
అనంతం శివ మవ్యయం
శ్రాద్ధం కృత్వా రుద్రపదే
నయేత్ కులశతం నరః॥

57. 58. విష్ణుపదమును స్పృశించి, పూజించి పితరులకు చేసినశ్రాద్ధము అక్షయమగును. సపిండకశ్రాద్ధము తన సహస్రకులములను అనంతము మంగళప్రదము, నాశరహితమగు విష్ణుపదమును పొందించును. రుద్రపదమున స్నానము చేసి నూరుకులముల నుద్ధరించును.

59. మహాశ్మాన శివపురం
తథా బ్రహ్మపదే నరః
బ్రహ్మలోకం కులశతం
సముదృత్య జయేత్ పితౄన్॥

59. రుద్రపదమున శ్రాద్ధముచేసినవాడు తన కులముల నూటింటిని కైలాసమునుపొందించును. బ్రహ్మపదమున శ్రాద్ధముచేసిన శతకులముల పితరులను బ్రహ్మలోకము పొందించును:

60. దక్షిణాగ్ని పదే శ్రాద్ధం
వాజపేయ ఫలంలభేత్
గార్హపత్యపదే శ్రాద్ధీ
రాజసూయ ఫలం లభేత్॥

60. దక్షిణాగ్ని పదమున శ్రాద్ధము చేసిన వాజపేయ యజ్ఞఫలము గార్హపత్యపదమున శ్రాద్ధముచేసిన రాజసూయఫలమును పొందును.

61. శ్రాద్ధం కృత్వా ఽఽహవనీయ
పదేఽశ్వమేధ ఫలం లభేత్
శ్రాద్ధం కృత్వా సభ్యపదే
జ్యోతిష్టోమ ఫలం లభేత్॥

61. ఆహవనీయ పదమున శ్రాద్ధముచేసిన అశ్వమేధఫలము సభ్యపదమున శ్రాద్ధముచేసిన జ్యోతిష్టోమ ఫలమును పొందును.

62. ఆవసథ్యపదే శ్రాద్ధీ
సోమలోకం నయేత్పితౄన్
శ్రాద్ధం కృత్వా శక్రపదే
ఇంద్రలోక మవాప్నుయాత్॥

62. ఆవసథ్యపదమున శ్రాద్ధముచేసిన పితరులు సోమలోకమును శక్రపదమునచేసిన ఇంద్రలోకమును పొందుదురు.

63. అగస్త్యస్య పదే శ్రాద్ధీ
పితౄన్ బ్రహ్మపురం నయేత్
క్రౌంచమాతంగయోః శ్రాద్ధీ
బ్రహ్మలోకం నయేత్పితౄన్॥

63. అగస్త్యపదమున శ్రాద్ధముచేసిన పితరులు బ్రహ్మలోకమును క్రౌంచమాతంగ పదముల శ్రాద్ధముచేసిన బ్రహ్మలోకమును పొందుదురు.

64. శ్రాద్ధీ సూర్యపదే పంచ
పాపినో ఽర్కపురం నయేత్
గజకర్ణికాయాం తర్పణకృత్
నిర్మలం స్వర్న యేత్పితౄన్॥

64. సూర్యపదమున స్నానముచేసిన మహాపాతకులైనను సూర్యపదమును పొందుదురు. కార్తికేయ పదమున శ్రాద్ధముచేసిన పితరుల శివలోకమును పొందించును.

65. గణేశస్య పదే శ్రాద్ధీ
రుద్రలోకం నయేత్ పితౄన్
గజకర్ణికాయాం తర్పణకృత్
నిర్మలం స్వర్న యేత్పితౄన్॥

65. గణేశపదమున శ్రాద్ధముచేసిన పితరుల రుద్రలోకమును గజకర్ణికయందు తర్పణమిడిన నిర్మలమగు స్వర్గమును పొందించును.

66. అన్యేషాం చ పదే శ్రాద్ధీ
పితౄన్ బ్రహ్మపురం నయేత్
సర్వేషాం కాశ్యపం శ్రేష్ఠం
విష్ణో రుద్రస్య వా పదం॥

67. బ్రహ్మణోపి పదం శ్రేష్ఠం
సర్వేషాం తత్ర కీర్తితం
ప్రారంభే చ సమాప్తౌ చ
తేషా మన్యతమం స్మృతమ్॥

66. 67. ఇతరపదముల యందు శ్రాద్ధముచేసిన పితరులను బ్రహ్మపురమును పొందించును. అన్నిటిలోను కాశ్యపపదము, విష్ణుపదము, రుద్రపదము, బ్రహ్మపదము, మిక్కిలిగొప్పవి. ప్రారంభమునను, అంతమునను ఇచ్చటి కృత్యములు వేరుగనుండును.

68. శ్రేయస్కరం భవే త్తత్ర
శ్రాద్ధక ర్తుశ్చ నారద
కశ్యపస్య పదే దివ్యే
భారద్వాజో మునిః పురా॥

69. శ్రాద్ధం కృత్వోద్యతో దాతుం
పితాదిభ్యశ్చ పిండకం
కృష్ణశుక్లౌ తతో హస్తౌ
పద ముద్భిద్య నిర్గతౌ॥

70. దృష్ట్వా హస్తద్వయం తత్ర
మునిః సంశయ మాగతః
తతః స్వమాతరం శాంతాం
భారద్వాజశ్చ పృష్టవాన్॥

68. 69. 70. ఓనారద! ఇచ్చట శ్రాద్ధముచేసిన మంగళమగును. ప్రథమ కశ్యప పదముపై భారద్వాజముని శ్రాద్ధముచేసి పిండదానము చేయునంతలో పదమును భేదించుకొని నలుపు, తెలుపురంగులుకల రెండుచేతులు పైకివచ్చెను. వాటిని జూచి భారద్వాజముని గొప్పసంశయము కలవాడై తనతల్లియగుశాంతను గూర్చి ఇట్లడిగెను.

కశ్యపస్య పదే దివ్యే
కృష్ణశుక్లోద్భవా కరే
పిండో దేయో మయా మాతః
జానాసి పితరం వద॥

71. కశ్యపునిపదమున తెల్లని, నల్లని చేతులు రెండువచ్చినవి. అమ్మ! ఎవరికి నేను పిండము నీయవలయునో నాతండ్రి ఎవరో తెలుపుము.

72. భారద్వాజ మహాప్రాజ్ఞ!
దేహి కృష్ణాయ పిండకం
భారద్వాజః తతః పిండం
దాతుం కృష్ణాయ చోద్యతః॥

72. (శాంతచెప్పెను) మహాప్రాజ్ఞుడవగు నో భారద్వాజ! నల్లని హస్తమునపిండమునుంచుము భారద్వాజుడట్లు చేయుటకు ప్రయత్నించగా

73. శ్వేతో దృష్ట్వాబ్రవీత్ తత్ర
పుత్ర స్త్వంహి మమౌరసః
కృష్ణోఽబ్రవీత్ మమ క్షేత్రం
తతో మే దేహి పిండకం॥

73. తెల్లనిచేయి అతనిని జూచి నీవు నా ఔరసపుత్రుడవు కావున పిండము నాకిమ్ము అనెను. అంత నల్లని చేయి నీవు నా క్షేత్రము వాడవుకాన నాకిమ్మనిపలికెను.

74. శుక్లోఽబ్రవీత్ స్వైరిణీయం
పుత్ర స్త్వంహి మమౌరసః
స్వైరిణ్యథాబ్రవీత్ వాక్యం
క్షేత్రిణే వీర్యజే తతః॥

74. తెల్లచేయి ఈమెస్వైరిణి నీవు నా ఔరసపుత్రుడవు. అని చెప్పగానే శాంతవారిరువురిని గూర్చిఇట్లుపలికెను.

75. భారద్వాజ స్తతః పిండం
కశ్యపస్య పదే దదౌ
హంసయుక్త విమానేన
బ్రహ్మలోక ముభౌ గతౌ॥

75. తరువాత భారద్వాజుడు కశ్యపపదమున పిండదానముచేయగానే రెండుచేతులును హంసలతో గూడిన విమానమున బ్రహ్మలోకమున కేగిరి.

76. రామో రుద్రపదే శ్రాద్ధీ
పిండదానాయ చోద్యతః
పితా దశరథః స్వర్గే
ప్రసార్య కర మాగతః॥

76. రుద్రపదమున రాముడు శ్రాద్ధమునుచేసి పిండదానమునకు ఉద్యుక్తుడుకాగా తండ్రియగు దశరథుడు స్వర్గమునుండి వచ్చి చేయిజాపెను.

77. నాదాత్ పిండం కరే రామో
దదౌ రుద్రపదే తతః
శాస్త్రార్థాతిక్రమాత్ భీతో
రామం దశరథోఽబ్రవీత్॥

78. తారితోఽహం త్వయా పుత్ర
రుద్రలోక మవాప్నుయాం
హస్తే పిండ ప్రదానేన
స్వర్గతి ర్నహి మే భవేత్॥

77, 78. రాముడు అతనిచేతియందు పిండమును ఉంచక రుద్రపదమునపిండదానముచేసెను. అంత శాస్త్రార్థాతిక్రమమునకై భీతి చెందు రాముని దశరథుడు చూచి నాయనా! నేను పనికి చాల సంతసించితిని. నీవొసగిన పిండముచే నేను రుద్రలోకమునకు వెళ్ళుచున్నాను. నీవు నా హస్తమున పిండదానముచేసిన నాకు స్వర్గము కలుగకుండెడిది.

79. త్వం చ రాజ్యం చిరం కృత్వా
పాలయిత్వా ద్విజాన్ ప్రజాః
యజ్ఞాన్ సదక్షిణాన్ కృత్వా
విష్ణులోకం వ్రజిష్యసి॥

79. నీవుచాలకాలము ద్విజులను ప్రజలను పాలించుచు రాజ్యముచేసి సదక్షిణముగ యజ్ఞముల చేసి విష్ణులోకమును పొందుదువు.

80. పుర్యాయోధ్యాజనైః సార్థం
పక్షికీటాదిభి స్సహ
ఇత్యుక్త్వాసౌ దశరథో
రుద్రలోకం పరం యయౌ॥

80. నీతో కూడ అయోధ్యా పురియందలి ప్రజలు, పక్షి, కీటకాది జంతువులు కూడ విష్ణు లోకమును పొందునని చెప్పి దశరథుడు రుద్ర లోకమునకు వెళ్ళెను.

81. భీష్మో విష్ణుపదే దివ్యే
ఆజుహావ స్వకాన్ పితౄన్
శ్రాద్ధకృతోద్యతో దాతుం
పిత్రాదిభ్యశ్చ పిండకం॥

81. భీష్ముడు విష్ణుపదమున తనపితరుల నావాహన చేసి శ్రాద్ధముల చేసిన తరువాత పిండదానమునకై సంసిద్ధుడాయెను.

82. పితు ర్వినిర్గతో హస్తో
గయాశిరసి శంతనోః
నాదాత్ పిండం కరే భీష్మో
దదౌ విష్ణుపదే తతః॥

82. అపుడు తండ్రియగు శంతనుని చేయి గయాశిరస్సుపై కిరాగా భీష్ముడాతనిచేతి యందు పిండము నీయక విష్ణుపదమున చేసెను.

83. శంతనుః ప్రాహ సంతుష్టః
శాస్త్రార్థే నిశ్చలో భవ
త్రికాలదృష్టి ర్భవతు
అంత్యే విష్ణుశ్చ తే గతిః॥

84. స్వేచ్ఛయా మరణం చాస్తు
ఇత్యుక్త్వా ముక్తి మాగతః
కనకేశం చ కేదారం
నరసింహం చ వామనం॥

83. 84. శంతనుడు సంతసించి "ఓపుత్ర! నీవుశాస్త్రార్థమున నిశ్చల మైనవాడవు, భూతభవిష్యద్వర్తమానముల నెఱిగిన వాడవు, స్వేచ్ఛామరణము కలవాడవు, తుదకు విష్ణులోకమును పొందు వాడవగు"మని పలికి ముక్తికేగెను. కనకేశుని, కేదారుని, నరసింహుని, వామనుని,

రథమార్గం సమభ్యర్చ్య
పితౄన్ సర్వాంశ్చ తారయేత్
గయాశిరసి యః పిండాన్
యేషాం నామ్నా తు నిర్వపేత్॥

85. 86. రథమార్గముల పూజించిన పితరులు తరింతురు. గయాశిరమున ఎవడు ఎవనిపేరున పిండప్రదానము చేయునో అతడు నరకమున నున్నను స్వర్గమునకు వెళ్ళును. స్వర్గమందున్న మోక్షమునుపొందును. గయాశిరమునశమీపత్ర మితముగా పిండమునుచేసి

86. నరకస్థో దివం యాతి
స్వర్గస్థో మోక్ష మాప్నుయుః
గయాశిరసి యః పిండం
శమీపత్ర ప్రమాణతః॥

87. కందమూల ఫలాద్యైర్వా
దద్యాత్ స్వర్గం నయేత్ పితౄన్
పదాని యత్ర దృశ్యంతే
విష్ణ్వాదీనాం తదగ్రతః॥

88. శ్రాద్ధం కృత్వా తేషు పిండాన్
తేషాం లోకం నయేత్ పితౄన్
సర్వత్ర ముండపృష్ఠాద్రిః
పాదై రేఖిః సులక్షితః॥

87. 88. కందమూల ఫలములతో పిండముల చేసి పిండములనిచ్చి పితరులను స్వర్గము పొందించవలెను. గయయందు విష్ణ్వాదిపదములు కనుపించినచోట శ్రాద్ధముచేసిపిండప్రదానముచేసిన పితరులు స్వర్గలోకమును పొందుదురు. ముండపృష్ఠ పర్వతము గయయందు విష్ణుపదాదులచే చుట్టుకొనియుండి బాగుగా కనబడును.

89. ప్రయాంతి పితరః సర్వే
బ్రహ్మలోక మనామయం
పంచమేహ్ని గదాలోకే
స్నానం కృత్వా సపిండకం॥

90. శ్రాద్ధే పితౄన్ బ్రహ్మలోకం
నయే దాత్మాన మేవ చ
గదాలోల ఇతిఖ్యాతం
సర్వేషా ముత్తమోత్తమం॥

89. 90. ఇచ్చట పిండదానముచేసిన పితరులు బ్రహ్మలోకమును పొందుదురు. అయిదవరోజున గదాలోకమున స్నానముచేసిసపిండులకు శ్రాద్ధము చేసిన తనకుకూడ బ్రహ్మలోకము సిద్ధించును. గదాలోలమను తీర్థమన్నిటికన్న శ్రేష్ఠము.

91. హేత్వాసురస్య యచ్ఛీర్షం
గదయా చ ద్విధా కృతం
యతః ప్రక్షాళితా తీర్థే
గదాలోలం తతః స్మృతం॥

91. హేతియను అసురుని శిరస్సును గదచే రెండుగజేసి గదను ఏతీర్థమున కడిగెనో అది "గదాలోల" తీర్థము.

92. గదాలోలే మహాతీర్థే
గదాప్రక్షాళనే వరే
స్నానం కరోమి శుద్ధ్యర్థం
అక్షయ్యాయ స్వరాప్తయే॥

92. గదనుకడుగుటచే శ్రేష్ఠమగు గదాలోల తీర్థమున పవిత్రతకొఱకు అక్షయస్వర్గ ప్రాప్తి కొఱకును స్నానము చేయుచున్నాను.

93. బ్రహ్మప్రకల్పితాన్ విప్రాన్
భోజయేత్ తోషయేత్తతః
తైస్తుష్టైః తోషితాః సర్వాః
పితృభిస్సహ దేవతాః॥

93. బ్రహ్మ సృష్టించిన బ్రాహ్మణులకచ్చట భోజనమిడవలెను. వారుసంతోషించిన పితరులందరు దేవతలందరు సంతసింతురు.

94. కృతే శ్రాద్ధేఽక్షయవటే
అన్నేనైవ ప్రయత్నతః
దృష్ట్వా నత్వా చ సంపూజ్య
వటేశం చ సమాహితః॥

94. అక్షయ వటమునకు వెళ్లి అన్నముచే శ్రాద్ధముచేయవలెను. ఏకాగ్రచిత్తముతో వటేశుని చూచి నమస్కరించి

95. పితౄన్నయేత్ బ్రహ్మలోకం
అక్షయ్యం చ సనాతనం
వటవృక్షసమీపే చ
శాకేనాప్యుదకేన వా॥

94. పితరులను అక్షయము, సనాతనమగు బ్రహ్మలోకమును పొందించవలెను. మఱ్ఱిచెట్టు వద్ద కూరచేగాని ఉదకముచేగాని

96. ఏకస్మిన్ భోజితే విప్రే
కోటిర్భవతి భోజితాః
గయాయాం ధర్మపృష్ఠే చ
శిరసి బ్రహ్మణ స్తథా॥

97. గయాశీర్షే వటే చైవ
పితౄణాం దత్త మక్షయం
దేయం దానం షోడశకం
గయాతీర్థే పురోధసే॥

96. 97. ఒక విప్రుడు భుజించిన కోటిమంది విప్రులు భుజించినట్లగును. గయయందు ధర్మపృష్ఠమున, బ్రహ్మసరమున, గయాశీర్షమున,వటవృక్షముక్రింద, పితరులకు చేసిన శ్రాద్ధమక్షయమగును. షోడశోపచారములతో గయాతీర్థమున పురోహితునకు దానమీయవలెను.

వస్త్రగంధాదిభి స్సమ్యక్
సంపూజ్య చ ప్రయత్నతః
ఏకార్ణవే వటస్యాగ్రే
యః శేతే యోగనిద్రయా॥

99. బాలరూపధరః తస్మై
నమ స్తే యోగశాయినే
సంసారవృక్ష శస్త్రాయా
శేషపాపహరాయ చ॥

98. 99. వస్త్ర గంధాక్షతలచే పూజించి బ్రాహ్మణులకుదానమీయవలెను. ఏకార్ణవమున వటవృక్షమున కెదురుగ బాలుడుగనై యోగనిద్ర నుండి నట్టియు, సంసారవృక్షమును నశింప చేయునట్టి,

100. అక్షయ్యబ్రహ్మదాత్రే చ
నమోఽక్షయ్యవటాయ వై
కలౌ మాహేశ్వరా లోకా
యేన తస్మాత్ గదాధరః॥
లింగరూపం భవంతం చ
వందే శ్రీప్రపితామహం॥

100. అక్షయ బ్రహ్మనిచ్చునట్టి అక్షయవట రూపునకు నానమస్కారము. కలియుగమున మాహేశ్వరరూపమున లోకములన్నియు ఎవని యందుండునో అట్టిలింగరూపధారియగు గదాధర! ఓపరబ్రహ్మ! నీకునమస్కారము.

ఇది శ్రీవాయుపురాణమందున్న శ్వేతవరాహ కల్పమున చెప్పబడిన గయామాహాత్మ్యమున సప్తమాధ్యాయము సమాప్తము.



# గయామాహాత్మ్యము



## అష్టమాధ్యాయము



సనత్కుమారఉవాచ:

(సనత్కుమారుడు చెప్పుచున్నాడు)

1. యజ్ఞం చక్రే గయో రాజా
బహ్వన్నం బహుదక్షిణం
యత్ర ద్రవ్యసమూహానాం
సంఖ్యా కర్తుం న శక్యతే॥

1. గయుడను రాజు చాల ద్రవ్యములతో గూడిన లెక్కించతరముగాని దక్షిణలు, చాల అన్నమును బ్రాహ్మణుల కిచ్చి యజ్ఞముచేసెను.

2. స్థితా గయాయా మన్నానాం
పర్వతాః పంచవింశతిః
సికతావా యథా లోకే
యథా చ దివి తారకాః॥

2. గయయందు అన్నపర్వతములు ఇరువది యైదు ఉన్నవి.

3. బహు సువర్ణాద్యైః
అసంఖ్యాతాః సుదక్షిణాః
నైవేహ కేచిత్ ఇహ న
కరిష్యంతి తథా ఽపరే॥

3. భూలోకమున ఇసుకరేణువులును ఆకసమున నక్షత్రములవలె అసంఖ్యాకములగుసువర్ణాదులచే దక్షిణలు లెక్కపెట్ట శక్యముకాకుండెను. ఇట్టియజ్ఞము నెవరును చేయలేదు. ముందుచేయజాలరు.

4. ప్రవిశంతి ద్విజాః తృప్తాః
దేశే దేశే సుపూజితాః
గయం విష్ణ్వాదయ స్తుష్టాః
వరం బ్రూహీతి చాబ్రువన్॥

4. ద్విజులు సంతోషముతో తమతమ దేశములకు పూజింపబడినవారై వెళ్ళిపోయిరి. విష్ణ్వాదిదేవత లప్పుడు గయుని వరమడుగుమనిరి.

5. గయ స్తాన్ ప్రార్థయామాస
విప్రాః శప్తాశ్చ యే పురా
బ్రహ్మణా తే ద్విజాః పూతాః
భవంతు క్రతుపూజితాః॥

5. పూర్వము బ్రహ్మచే శపింపబడిన బ్రాహ్మణులు పవిత్రులును యజ్ఞములయందు పూజింపబడువారును అగుదురుగాక.

6. గయాశ్రాద్ధవిధానాయ
ద్విజామూర్తా శ్చతుర్దశ
తేషాం వాక్యం ప్రకుర్వీత
యది బ్రహ్మా స్వయం భవేత్॥

6. గయాశ్రాద్ధము చేయుటకు గయ యందున్న పదునాలుగు గోత్రముల బ్రాహ్మణులు పూజింపబడుదురుగాక! బ్రహ్మకూడ వారిమాటలను అంగీకరించవలెను.

7. గౌతమం కాశ్యపం కౌత్స్యం
కౌశికం కణ్వాశ్రమేవ చ
భారద్వాజం హ్యౌశనసం
వాత్స్యం పారాశరం తథా॥

8. సనత్కుమారం మాండవ్యం
లోగాక్షిం లోమశం మహత్
వాసిష్ఠంచ తథాఽఽత్రేయం
గోత్రా ణ్యేషాం చతుర్దశ॥

9. గయాపురీతి నామ్నా చ
ఖ్యాతా బ్రహ్మపురం తథా
ఏవమస్తు వరం దత్వా
తదా చాంతర్దధు స్సురాః॥

7. 8. 9. గౌతమ, కాశ్యప, కౌత్స, కౌశిక, కణ్వ, భారద్వాజ, హ్యౌశనస, వాత్స్య, పారాశర, సనత్కుమార, మాండవ్య, లోగాక్షి, లోమశ, వసిష్ఠ, ఆత్రేయ అనుపదునాలుగు గోత్రములు. ఈపురి గయాపురియని నాపేరున ప్రసిద్ధిచెందునుగాక! అనివరిమమగగా వారట్లే యగుకాక యనిచెప్పి అంతర్ధానము నొందిరి.

10. గయశ్చ భోగాన్ సంభుజ్య
విష్ణులోకం పరం యయౌ
విశాలాయాం విశాలోభూత్
రాజపుత్రో ఽబ్రవీత్ ద్విజాన్॥

10. గయుడనురాజు అనేకభోగముల ననుభవించి విష్ణులోకమును పొందెను. పూర్వము విశాలపురమున విశాలుడను రాజుబ్రాహ్మణులను అడిగెను.

11. కథం పుత్రాదయో మే స్యుః
విశాలం చాబ్రువన్ ద్విజాః
గయాయాం పిండదానేన
తవ సర్వం భవిష్యతి॥

11. నాకు పుత్రులెట్లు కలుగుదురు? త్తిషు ద్విజు లా విశాలునిజూచి "గయయందు పిండకి న ఎ చెసిన నీకోరిక నెరవేరును" అనిరి.

12. విశాలోపి గయాశీర్షే
పిండదః పుత్రవా నభూత్
దృష్ట్వా ఽఽకాశే సితం రక్తం
కృష్ణం పురుష మబ్రవీత్॥

12. విశాలు డీ రీతిగ గయాశిరమున పిండమునిచ్చి పుత్రులు కలవాడాయెను. పిండదానముచేయునపు డతడాకాశమున తెలుపు ఎఱుపు నలుపు రంగులుకలపురుషులను చూచి అడిగెను.

# శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువు

సందర్భములో తమ తమ ప్రాంతములనుండి భక్తులవద్ద విరాళములు వసూలుచేసి స్వయముగగాని, యితరులద్వారాగాని, ఎమ్. ఒ. ద్వారాగాని యీ ఆఫీసునకు సొమ్ము చేర్చిన భక్తుల శుభనామము లీదిగువ నీయబడినవి.

| | | | |
|---|---|---|---|
| నందివెలుగు | గుంటూరుజిల్లా | | శ్రీ యమ్. సాంబాజీరావుగారు |
| నందివెలుగు | గుంటూరుజిల్లా | | శ్రీ ఉండవల్లి వెంకట్రావుగారు |
| చిరువోలులంక | గుంటూరుల్లా | | శ్రీ బి. నాగేంద్రుడుగారు |
| వనపర్తిరోడ్ | సి. ఆర్. వై. | | శ్రీ యస్. ఆర్. డి. స్వామిగారు |
| పెరవలి | గుంటూరు | ,, | శ్రీ తాడికొండ కోటేశ్వరరావుగారు |
| సిలోన్ | కొలంబో | | శ్రీ ఆర్. యమ్. వలియప్ప చెట్టియార్ గారు |
| గుంటుపల్లి | కృష్ణా | ,, | శ్రీ మారుపల్లి మధుసూదనరావుగారు |
| నూజివీడు | కృష్ణా | ,, | శ్రీ ఐ. వి. రంగసీతారామారావుగారు |
| వరంగల్ | వరంగల్ | ,, | శ్రీ రాచర్ల గురుపాదంగారు |
| కంకిపాడు | కృష్ణా | ,, | శ్రీ కె. యస్. ఆర్. ఆంజనేయులుగారు |
| బెజవాడ | ,, | ,, | శ్రీ ఎ. నాగభూషణరావుగారు |
| చిక్ బలపూర్ | | | శ్రీ సి. సీతారామ్‌గారు |
| కాకినాడ | తూ. గో. | ,, | శ్రీ టి. వి. అప్పారావుగారు |
| కొత్తపేట | శ్రీకాకుళం | ,, | శ్రీ ఎ. నారాయణప్పడుగారు |
| ఐలవరం | గుంటూరు | ,, | శ్రీ తుంగలవీరరాఘవయ్యగారు |
| గోరింట | విశాఖ | ,, | శ్రీ చిన రామదాసుగారు |
| విజయనగరం | విశాఖ | ,, | శ్రీ దాసరి రాఘవస్వామిగారు |
| తుందుర్రు | ప. గో. | ,, | శ్రీ చోడే సుబ్బారావుగారు |
| స్టైడేటి | | | శ్రీ జె. కృష్ణమూర్తిగారు |
| ల్లమండ | ప. గో. | ,, | శ్రీ వి. యస్. ఆర్. ఆంజనేయాచార్యులుగారు |

ఖ్యసూచన: విరాళములు కార్యాలయములో చేర్చిన వారిలో తమ పేరులు కనబడక పోయిన వారు ఎవరైనను పొరపాటున మిగిలిపోయినవారు, తమతమ నామధేయములను, వసూలు గావించిన విరాళములను ఆఫీసునకు చేర్చిన వివరము, తేదీలతో సహా మాకు తెలియపర్చిన వచ్చేమాస విభాగములో ప్రచురించగలము. ఇంకను కొందరిపేర్లు ప్రకటించవలసినవి మిగిలియున్నవి. అవి అన్నియు కలిపివచ్చే మాస పత్రికలో చూడగలరు.

రిజిష్టర్డు నెం. A 16.

BHAKTINIVEDANA

[వేదాంత వార పత్రిక.]

# ఆండాళ్ తిరునక్షత్రోత్సవ విశేషములు

కళింగపట్నం:-

ఇ... ...స్వాద్వైత ప్రచారక సంఘము సకను నేర్పడిన శ్రీగీతామండలి వారిచే 3 శనివారము మొదలు మూడు ...కోదండరామస్వామి వారి యాలయమున ఆండాళ్ తిరునక్షత్రోత్సవము అత్యంత వైభవముగ జరుపబడెను. ప్రతి దినముఉదయము గం. 8-0 నుండి గం. 11-0 లవరకు ప్రబంధ సేవాకాల గోష్ఠియు, సాయంత్రం పండితోత్తములచే ప్రపన్నామృతము లోని ఆండాళ్ వైభవమును గూర్చి యుపన్యాసములును జరుపబడెను. అనేకమంది స్త్రీ పురుషులీయుత్సవమున పాల్గొని ఉత్సవమును జయప్రదమొనర్చిరి.

బందరు:

29-7-54 వ తేదీ మొదలు వరుసగా 5 రోజులు బందరులోని శ్రీయతిరాజ సేవా మహిళా మండలివారి యాజమాన్యమున ఆండాళ్ తిరునక్షత్రోత్సవము చాలవైభవముగ జరుపబడెను ప్రతిదినం ఉదయము తిరువాయిమొళి సేవాకాల గోష్ఠియు, సాయంకాలమున శ్రీ ఉ.వే. శ్రీమాన్ చ.వెం. నరసింహాచార్యులుగారిచే నాచ్చియార్ తిరుమొళి యుపన్యాసములును జరుపబడెను. శ్రీ శ్రీ శ్రీ 1008 శ్రీ సీతారామయతీంద్రులవారు తమ భజనలతో భక్తులనానందాబ్ధి నోలలాడించిరి.

★

Regd. No. A. 16.

57. Sri Venkateswara Oriental Library,
TIRUPATI,
Chittoor Dt.

VIJAYAVADA
19 AUG
5 30PM
1954

..lited Published and printed by A. Ch. Srimannarayanacharya at
Sriman press, Nadigaddapalem




భక్తి "నివేదన"
పత్రికానుబంధము

★

విజయ - కార్తీకము

# ★ శ్రేయాంసి బహువిఘ్నాని ★




ఏ పనికి పెక్కు విఘ్నములు తటస్థించి చివరకు సఫలమగునో ఆ పనియే శ్రేయస్కరమైనదగు సత్కార్యముగా వ్యవహరింపబడునని పెద్దల యనుభవము.

పూర్వము దేవతలు గాని, రాక్షసులు గాని, రాజులుగాని, మునులుగాని గొప్ప తపస్సులను ప్రారంభించి మహత్తరవిఘ్నముల నెదుర్కొని చివరకు సఫలతగాంచినదీ హిందువత్స్వ్రత చరియలయందే. అట్లే యీ కలియుగమునందు శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘముచే ప్రారంభింపబడిన శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువుకూడ జప-హవనాది మహత్తరకార్య గర్భితమగుటచే పూర్వమువలెనే మానవదానవులచే ప్రతిఘటింపబడియు నిర్విఘ్నముగా కొనసాగి శ్రేయస్కర మహాక్రతువుగా లక్షితమైనది.

ఈ క్రతువునకు విఘ్నమును కల్పించనెంచిన మానవదానవులు — ధనాశా పిశాచగ్రస్తులు, సూర్యునిగన్న గుడ్లగూబలవలె పరసమృద్ధిని జూచి సహింపనేరని ఈర్ష్యాగ్రహగ్రస్తులు, ద్రాక్షకాశించిన నక్కబావవలె స్వాభీష్టసిద్ధిని బడయజాలక దూషించు జంబుకదాయాదులును మాత్రమే.

అంచనావేయబడిన ఆరు లక్షలు అనర్గళముగా వసూలుకాబడి యుండునని భ్రమించి ప్రచారవ భాగమున్నైనను అపహరింపవలెనని యూసించి మన పనులను మనమే చేసుకొనుటచే తమకట్టి యవకాశము లభించక వంచనచేయ నెంచిన దురాశాపిశాచములను శ్రీ స్వాములు గావించిన అష్టాక్షరీమహామంత్రానుసంధాన ముసురగొట్టివేసెను. ఉత్తరప్రాంతము నంతను తమకీర్తిజ్యోతులను వెలిగించిన ఆచార్యపుంగవులవలె తాము నట్టిపదవి నాక్రమించనెంచి మించిన కపటవేషభాషలతో సంచరించుకొందరు యీ మహాక్రతునిర్వహణముచే సంఘమునకు సంభవించు దివ్యతేజస్సుముందు తాము దివసతారకము లగుదుమని భయపడి పుండునే వెతికి దానిపై వ్రాలి చీమునే ఆస్వాదించు కీటకవిశేషములవలె తప్పులనే వెతకజూచిన ఈర్ష్యాకషాయితహృదయులు, మానవులకు సహజముగ తటస్థించు నత్యల్ప స్ఖాలిత్యముల నూతగాగొని శబ్దవిస్తరయంత్రములవలె వినినను వివేకములేని వెర్రుల బుర్రల కెక్కునట్లు విలపించిరి. నిజము నెరింగించినను దానిని బహిరంగపరచక పక్షపాతమునకు పాల్పడిరి. కార్చిచ్చులు కాలమేఘములచేవలె వారి ప్రలాపాగ్నులు క్రతుకార్యనిర్వాహకుల క్షమాప్రభావముచే చల్లారెను.

నిజముగ నార్తియున్నను తమ ఖర్చులు తామే వహించవలసివచ్చునని భయపడి రాజాలని భాగవతోత్తములు కొందరు తమ ప్రాంత

ములందే దేశకల్యాణకాంక్షతో శ్రీసుదర్శన మహాక్రతు దీక్షను యథాశక్తి జరిపి తోడ్ప డిరి. కొందరట్లు చేయజాలక క్రతునిర్విఘ్న పరిసమాప్తికై శ్రియఃపతికి అర్చన భోగరాగా దులను సల్పిరి, అందుకును శక్తిలేని మరి కొందరు తమ పవిత్రహృదయములతోనే నిర్వి ఘ్నపరిసమాప్తికై భగవత్ప్రార్థనల గావించిరి. కాని సంఘద్రవ్యములతో తమకగు ఖర్చులను గడపి గయా, బ్రహ్మకపాల శ్రాద్ధములను నిర్వ హించుకొని యిల్లు చేరనెంచి నిషేధింపబడియు ననుగమించిన కొందరు రావణసన్యాసులు తమ పని తీరగనే కాలు పగిలినదని కొందరు, నోరు పూసినదని కొందరు, కడుపు నొప్పునేమోయని కొందరు వంకలుబెట్టి బ్రతిమాలినను లక్ష్య పెట్టక తిరిగిపోవు ఖర్చుల నపేక్షించి బడయ జాలక ముఖము చాటుగానిచ్చి యిచ్చవచ్చినట్లు తిట్టనారంభించిరి.

మరికొందరు స్వాముల నెపమున తమ కుటుంబపోషణము సుకరముగా జేసుకొన నెంచి ధనము నపేక్షించి లభించక శత్రుపక్షమున చేరి హుంకరించిరి. అందులకు కొన్ని ఉదాహరములు నిందు పొందుపరచుచున్నాను. దక్షిణదేశము నుండి విచ్చేసిన నొక వడగల్‌స్వామి నాతో ప్రత్యక్షముగా నే నింటివద్ద గృహకృత్యములకై చేసిన అప్పు నిప్పుడే తీర్పుమని ఒత్తిడిచేయబడు చున్నాను. మీ రిప్పుడు నాకొక నూరు రూకల నిత్తురా? లేక స్థానికాధికారికి మీ క్రతువునకు ప్రతికూలముగ వ్రాసియిచ్చి వానినుండి ధనము సేకరించనా యని బెదరించెను. ఒక స్వామి నాకు కావలసిన ద్రవ్యమునంత నిత్తురా లేనిచో మీరు నా సౌకర్యమునకై యిచ్చుట నిచ్చిన వస్తుసామగ్రిని గంగపాలుచేయునా యని బడి రించెను. మరియొక స్వామి నాకొక కొలువను బహూకరింతురా లేక నీపై కొలువ నపహ రించమందురాయని భయపెట్టెను. మరియొక స్వామి నా బిడ్డల విద్యాలయ జీతమును పంపు కొనుటకై చాలినంత ధనమిత్తువా? లేక సంఘ మున కపఖ్యాతి నాపాదించు వ్రాతలు వ్రాసి చెరపమందువా యని గద్దించెను. వీరి యెల్లరు లన్నియు ఛందానురోధముచే చెల్లార్పవలసి వచ్చెను. మరికొందరు ప్రాజ్ఞులయ్యును కార్య నిర్వహణభారమును గుర్తెరింగినను తాత్కా లికముగ తటస్థించిన సామాన్యావరోధములు ప్రమాదములుగా భావించక పరితపించి విన్న వించుకొనినను చెవినిబెట్టక వాటిని తెలిసిచేసిన యుపచారములుగా తలంచి చాటసాగిరి. అందుల కేమి చేయుదుము? నిజము నిలకడమీదనే తెలియునని మే మన్నిటికి నుపేక్షించుచున్నా ము. నిష్కపటహృదయముతో నిజము నారయ గోరువారు ఆసాంత మచ్చటనుండి విచ్చేసిన భాగవతోత్తముల నారసి యెరుంగుదురుగాక!

నిజముగ నిట్టి మహత్తర యపూర్వకార్య మును సంకల్పించి నిర్విఘ్నముగ నిర్వహించిన శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి యతిమానుషసామర్థ్యము జన్మాంతర దుష్కృతవిశేషముచే దూషితహృద యులు సర్వాత్మనా అంధులగుటచే వారికి గోచరించనిచో పోనిండు. పవిత్రహృదయులకు గోచరించకపోదు. మూల కారణభూతులు శ్రీ శ్రీ శ్రీ జీయర్ స్వాములైనను వారు మన సంఘముపేరుతో దీనిని నిర్వహించుటచే నిది ఆంధ్రదేశమున ఆంధ్రశ్రీవైష్ణవులచే నెల కొల్పబడినది గాన మనమెంతయు గర్వించవలసి యున్నది. ఈ క్రతువునందు పాల్గొనిన ఋత్వి గ్వరేణ్యులలో 3 వంతులు ఆంధ్రస్వాములే. దేశకల్యాణమున కింత త్యాగమే సంఘము, ఏసంస్థ గావించెను? హిమవత్పర్వతమున ఎంద రెందరు తపస్సులను గావించినను గావించు

చున్నను తమ శ్రేయస్సునకే గావించుచున్నారు గాని లోకకల్యాణమునకై జేయు సాధుపుంగవు నొక్కని జూపగలరా ?

శ్రీ జీయర్ స్వామివారు తమ లోపము నెరుంగుటకై ఋత్విక్కుల కందరకు తెల్లకాగితము లొసంగి వ్రాతమూలముగ నిర్మొగమాటముగా లోటుపాటుల నెరిగింప ప్రార్థించిరి.

ఎల్లరు నేకముఖముగా నిచ్చట గావింపబడు సదుపాయములు, భోజనములు, ఫలహారములు, సుహృద్భాషణములు, వైద్య సహాయములు తామింటివద్దనైనను బడయజాలమని వ్రాసియిచ్చిన పత్రిక లిప్పటికిని భద్రపరచబడియున్నవి. పేరులైన నెరుంగజాలని పిండివంటకములు ప్రతి నిత్యము ఫలహారమునకై పంచబడుచుండెను.

పప్పు, పూరీ, పరమాన్నము, పులుసు, పచ్చడి, బంగాళాదుంపకూరలేని భోజనమే లేదు. ఈ పర్వతమున నిట్టి సౌకర్యములతో నింతకాల మిట్టి మహాక్రతువు నే యుగమందును వినిగాని యీ జీవితమున కనిగాని యెరుంగమని స్థానిక మతాంతర పండితప్రకాండులే వేనోళ్ళ పొగడిరి. మొదటలో వారందరును పై మానవ దానవకోటికి చెందినవారలే. అట్టితరి మన దేశీయులకు, మన ఆంధ్రులకు మన శ్రీ వైష్ణవ సోదరుల కీపాటి యభిమానము యీపాటి యాదరము యీపాటి వివేకము లేకుండుట కడుంగడు శోచనీయము.

ఇట్లు భాగవతపాదదాసుడు,
కె. కం. గోపాలాచార్యులు
కార



సికిందరాబాదులో జరుపబడిన శ్రీ మదష్టాకరీ క్రతువు సందర్భమున అవబృథ స్నానమున కేగునప్పటి మహోత్సవము.

ఋత్విక్కుల యొక్క ఏనుగుపై నూరేగింపు.





# ★ బదరీ క్షేత్రపు విశేషములు ★

## అఖిలభారత విజ్ఞాన సమ్మేళనము



బదరికాశ్రమమున నీ పవిత్ర క్రతువుతో పాటు నానాదేశీయపండిత పుంగవులను సమావేశపరచి 'అఖిలభారత విజ్ఞాన సమ్మేళనము'ను పేరుతో నొక ధార్మిక సభనుకూడ నిర్వహించవలెనను ఆశతో సమస్తయూనివర్సిటీలకును, ఆంగ్ల - సంస్కృత కళాశాలలకును - సంస్థానములకును - సమితులకు సంఘములకును ఒక్కొక్క పండితులను పంపించమని ప్రార్థనా పత్రములను ముందుగనే పంపుకొని యుంటిమి. క్రతువు ప్రారంభించిన ఆరవదినమగు 21—6—54 వ తేదీని శ్రీ శ్రీ శ్రీ యతిరాజ సంపత్కుమార జీయర్ స్వామివారి అధ్యక్షత క్రింద న్యాయ వ్యాకరణ వేదాంత విద్వాంసులై వైరాగ్య మహాభాగ్య భూషితులగు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి స్వామివారిచే నీసమ్మేళనము ప్రారంభింపబడినది. మేము ఆశించినంతమంది పండితులు విచ్చేయక పోయినను ప్రధానమగు నీదిగువ నుదహరించిన పండిత ప్రకాండులందు పాల్గొని తమ యమూల్యోపన్యాసములతో తనివిదీర్చిరి. ఈ సభ 14_8_54 వరకు నిర్విఘ్నముగా సాగినది. ఋత్విక్కులు విచ్చేసిన దాక్షిణాత్య పండితవరేణ్యులుకూడా నిందు పాల్గొనిరి. ఉపన్యాసము లన్నియు సంస్కృతము — హిందీ భాషలలో వివిధ వేదాంత ధార్మిక విషయములను గూర్చియే గావింపబడినవి. వాటిని తత్తద్భాషా పరిజ్ఞానములేని ఆస్తిక శ్రోతృ జనమునకు కార్యదర్శియగు తె. కం. గోపాలాచార్యులుగారు ఆంధ్రభాషలో ననువదించిరి.

8_8_54 వ తేదీని ప్రత్యేకము విదుషీమణుల సమావేశము జరుపబడెను. అందు - శ్రీమతి అమరవాది వెంకట లక్ష్మీనరసమ్మగారు శ్రీమతి ముడుంబై సింహాద్రి అమ్మగార్లచే సంస్కృతమున గూడా ఉపన్యసింపబడెను. శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు, శ్రీమతి కర్రి లక్ష్మీనరసమ్మగారు, శ్రీమతి సూరి రామానుజమ్మగారు శ్రీమతి శౌవలూరి చూడికుడుతమ్మగారు మొదలగువారు పాల్గొని ఆంధ్రభాషలో నుపన్యసించిరి. ఆంధ్రభాష నెరుంగని ఔత్తరీయ శ్రోతృజనమునకు హిందీభాషలో ననువదించి సుబోధకము గావింపబడెను.

ఈ సమ్మేళనమున కొన్నితీర్మానములు గావింపబడెను. అందుముఖ్యమైనవి:-

1. గోసంరక్షణకై ఉత్తరదేశమున ప్రారంభింపబడిన మహోద్యమములో నన్నిదేశముల పండితులును పాల్గొని తమతమ ప్రాంతములలో సంబద్ధ సంస్థల నేర్పరచి ఏకముఖముగా ప్రచారమును సలుపుట.

2. ధర్మవిప్లవము విజృంభించు నీకాలములో మతసంప్రదాయ విభేదములను పాటించక పండితులందరు సామరస్యముతో దాని నెదుర్కొని ఎట్టి కష్టపరంపరలనైనను సహించి పనిచేయవలెను.

3. దేవభాషయగు సంస్కృత భాషను రాజభాషగా చేయుటకును ప్రపంచ మంతటను వ్యాపించుటకును అన్నివిధముల ప్రయత్నించుట.

# ఇందు పాల్గొనిన మహాశయుల శుభ నామధేయములు

## ఔత్తరీయులు

1. న్యాయ - వ్యాకరణ - వేదాంత పండిత ప్రకాండ శ్రీ శ్రీ శ్రీ త్రిదణ్డి వేదాన్త రామానుజపాదుకాజీయర్ స్వామీజీ (నిరంతర బదరీవాసీ.)
2. సుప్రసిద్ధ పండాపుంగవ — శ్రీ నరహరి శాస్త్రీజీ, దేవప్రయాగ, గార్వాల్.
3. జ్యోతిర్మఠాధివాసీ- శ్రీ ప్రకాశానంద సరస్వతీస్వామీజీ.
4. శ్రీ మన్మథ్వస్వామిపాదాః- శ్రీబోధరాయాచారిణః- (కొర్లహాళ-ధార్వాడ్.)
5. సాహిత్యాచార్య - విద్యాలంకార జ్యోతిష్మీఠ సంస్కృత పాఠశాలాప్రధానాధ్యాపక శ్రీ రామేశ్వరప్రసాదజీ, (జ్యోతిర్మఠ్.)
6. శ్రీయుత యోగేశ్వర ప్రసాదజీ, (నందప్రయాగ)
7. విశ్వకల్యాణ ప్రతినిధిసభాస్థాపక శ్రీ బ్రహ్మచారి విశ్వకల్యాణహితైషీజీ, (లాహోర్.)
8. శ్రీ బదరీనాథ్ మందిర ధర్మాధికారీ — శ్రీ శివకుమారశాస్త్రీజీ
9. వేదాంతాచార్య - శ్రీధనీరామశాస్త్రీజీ (బృందావన్.)
10. శ్రీ ఏకదండీ స్వామీజీ, పంజాబ్.
11. తర్కతీర్థ శ్రీ వాసుదేవాచార్యస్వామీజ కాశి.
12. శ్రీ మదన్‌లాల్ వ్యాసజీ - సనాతన ధర్మ ప్రతినిధి సభా కార్యదర్శి, ఢిల్లీ.
13. శ్రీ భోగలాల్ మణిలాల్ త్రివేదీజీ, కాశ్మీర్.
14. విశ్వకల్యాణమండలీ అధ్యక్ష శ్రీదండిస్వామీజీ, ఆత్మదేవాశ్రమం, కాన్పూర్.
15. దర్శనకేసరీ, శ్రీ గోపాలశాస్త్రీజీ, బదరీ టెంపిల్ కమిటీ సదస్య, కాశీ.
16. పురాణాచార్య, చక్రవర్తిసుధీ, బదరీ.
17. శ్రీహరిప్రసాద్ జీ డిమరీ, డిమ్మర్.
18. శ్రీ కుశలానంద శాస్త్రీజీ, బదరీనాథ్ పురోహిత్.
19. శ్రీ గణేశశాస్త్రీజీ, దేవప్రయాగ.
20. శ్రీ గదాధరశాస్త్రీజీ.
21. శ్రీ మహేశానందజీ, రయుగామ్.
22. శ్రీ భోగీలాల్ మణిలాల్ త్రివేదీ.
23. శ్రీ జయనారాయణ త్రివేదీ, త్రిమోటీ
24. శ్రీ హరినారాయణదాస్‌జీ - రిటైర్డుజర్నలిస్టు

మొదలగువారు.

## దాక్షిణాత్యులు

1. శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామీజీ.
2. శ్రీ శ్రీ శ్రీ యతిరాజ సంపత్కుమార జీయర్ స్వామీజీ.
3. మీమాంసా-వ్యాకరణ విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ టి. వరదాచార్య స్వామీజీ, రిటైర్డు తిరుపతి సంస్కృతకళాశాలాధ్యాపకులు, కాంచీపురం.
4. మైసూరు సంస్కృతకళాశాలా రిటైర్డు వేదాంతవిద్వాన్ బెంగుళూరు.
5. పురాణవాచస్పతి, శ్రీ ఉ. వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యులుగారు, పెద్దవరం.
6. శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ.
7. శ్రీ ఉ. వే. శ్రీమాన్ గోవర్ధనం శేషభట్టర్ అయ్యవార్లంగారు, పాలకొల్లు.
8. సాలాయిరాధ్యాపక, శ్రీ ఉ. వే. శ్రీమాన్ పెద్దింటి సంపత్కుమారాచార్యులుగారు, సింహాచలం దేవస్థాన విద్వాన్.
9. హిందీప్రచారక విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ పిప్పర రంగాచార్యులుగారు. ముగ్గుళ్ళ అగ్రహారం.

మొదలగువారు ఇందు పండితులచే నుపన్యసింపబడిన కొన్ని ముఖ్యములగు నుపన్యాసములు అప్పుడప్పుడు ప్రకటింపబడుచుండును.





సికిందరాబాదులో జరుపబడిన శ్రీ మదష్టాక్షరీ క్రతువు సందర్భమున అవబృథస్నానమున కేగునప్పటి మహోత్సవము.



శ్రీమతే రామానుజాయనమః

# సమన్వయ ప్రమాణ పత్రము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ యాజమాన్యమున శ్రీ బదరీనారాయణమున జరిగిన ది 15-8-1951 తేది సభయందు పరమపవిత్రమైన శ్రీమదష్టాక్షరి కోటిహవన మహాక్రతువును జరుపుటకై విచ్చేసిన శ్రీ విశిష్టాద్వైతస్వాముల సమావేశమునందు తీర్మానింపబడిన ముఖ్య తీర్మానములు.

ధర్మగ్లాని కలుగుచున్న ప్రస్తుత దేశకాల పరిస్థితులందు ప్రామాణికులగు పెద్దలే ఔత్తరీయులు, దాక్షిణాత్యులు, వడగల్ - తెంగల్ యిత్యాది భేదభావములచే పరస్పర యీర్ష్యా విద్వేషములు కలిగియుండుటను కని, విని మిక్కిలి దుఃఖించుచున్నాము. ఇవి స్వరూప విరుద్ధములును, విశ్వశాంతి భంగకరములును అనుట అనుభవసిద్ధము.

కావున నేటినుండియు యిట్టి భేదభావములను రూపుమాపుటకు మేము పరస్పరము సమన్వయము, సహిష్ణుకలిగియుండుటయే గాక యిందులకై యితరులనుకూడ ప్రోత్సహించి పనిచేయ ప్రతిన గావించుచున్నాము. ఇందునిమిత్తమై యీ క్రింది ప్రాథమిక నియమములను, మనోవాక్కాయములతో ననుసరింతుమని పరమ పవిత్రమగు నీ పుణ్యభూమి యందు శ్రీ బదరీనాథుని సన్నిధిలో నిఖిల భాగవతబృందముల మ్రోల శ్రీమదష్టాక్షరి కోటిహవనదీక్షలో నుండి సద్యః ప్రతిష్ఠితమైన శ్రీ భగవద్రామానుజుల సన్నిధిలో ప్రమాణ మొనరించుచున్నాము.

## నియమములు,

ఎవరికివారు తమ వ్యక్తిగత సంప్రదాయముల ననుసరించియు, సిద్ధాంతవిశ్వాసముల ననుసరించియు, వడగల తిరుమణినిగాని, తెంగల్ తిరుమణినిగాని, పచ్చ శ్రీచూర్ణమునుగాని, ఎర్ర శ్రీచూర్ణమునుగాని ధరించవచ్చును. దానినిబట్టి యెవరుగాని పరస్పర ద్వేష యీర్ష్యాదులను జెందరాదు. ఆ చిహ్నల మార్పునకు ప్రచారమునుగాని, ప్రేరేపణనుగాని, పరిహాసమునుగాని, వాగ్వివాదములను గాని ఎవరును, ఎప్పుడును, ఎట్టి పరిస్థితులలోను చేయరాదు.

వ్యక్తిగతవిశ్వానుష్ఠానము లెటులున్నను, సార్వజనీనస్థలములయందును, కార్యములయందును, పరస్పరాంగీకృతములైన సంప్రదాయసిద్ధ విధానములనే యనుష్ఠించుచుండవలెను. ఇందులకై ప్రస్తుతము యీ క్రింది విధానము అనుసరింప నిశ్చయింపబడినది.

(అ) పురాతనమైన స్థలములయందు నేటివరకు అనుసరింపబడు ఆచారములే యికముందుకూడ అనుసరింపబడవలయును. వాటి మార్పునకై ఎవరును ఎట్టి ప్రచారమునుగాని, వివాదమునుగాని, కోర్టువ్యవహారములనుగాని, చేయరాదు. కాని యికముందు యేర్పాటుచేయబడు సార్వజనీన స్థలములయందు ధనప్రదాతల ఆశయానుసారముగ తక్కిన యేర్పాటులు జరుపబడినను అందరును కలసి గోష్ఠిగ ప్రబంధాదులను అనుసంధించవలసిన సమయములలో మాత్రము "శ్రీశైలేశదయాపాత్రం" లేక "రామానుజ

దయాపాత్రం" లేక "శేశవార్యదయాపాత్రం" ఇత్యాది తమ తమ అభిమతతనయాదులను, మణవాళమామునులకుగాని, లేక శ్రీ వేదాంత దేశికులకుగాని, సంబంధించినవాళ్లి తిరునామములను, స్తోత్రములను మానసికముగ అనుసంధించుకొని పైకి అనుసంధించవలసినవిమాత్రము సర్వసమ్మతవిషయములే అయియుండవలయును. మరియు అట్టి దేశకాలములయందు ప్రబంధాధ్యయనాదులను "లక్ష్మీనాథసమారంభాం"అను తనయ మొదలుకొని మాత్రమే ప్రారంభించవలయును.

తమ తమ అభిమతవిషయములను మాత్రము తమ గృహములయందును, తమ గోష్ఠులయందును అనుసంధించుకొనవలయును.

(ఇ) సంప్రదాయాభివృద్ధికరమగు కార్యములలో అందరును ఏకీభవించి, ఏకోదరులవలె పని చేయుచుండవలయును.

(ఈ) గ్రంథములు, కరపత్రములు, పత్రికలు ఇత్యాది వాఙ్మయముఖముగ కూడ సర్వసమ్మతమై వివాదమున కవకాశమీయని విషయములనే ప్రకటించుచుండవలయును.

(ఉ) సార్వజనీనమైన నూతన కోవిలలు, మందిరములు, గ్రంథములు ఇత్యాది నిర్మాణములయందు.

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాలయతీం ద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశ మునిం ప్రణతోస్మి నిత్యం.

అను ప్రమాణానుసారముగ (1) పూదత్తాళ్వారు, (2) పొయ్‌గైయాళ్వారు, (3) పేయాళ్వారు, (4) పెరియాళ్వారు, (5) గోదాదేవి, (6) తిరుమళ్లిశైయాళ్వారు, (7) కులశేఖరాళ్వారు, (8) తిరుప్పాణియాళ్వారు, (9) తొండరడిప్పొడియాళ్వారు, (10) తిరుమంగైయాళ్వారు, (11) శ్రీ రామానుజస్వామి, (12) మధురకవియాళ్వారు, అనుపన్నిద్దరాళ్వారాచార్యులను మాత్రమే ప్రతిష్ఠించవలయును. వారికి సంబంధించిన ప్రబంధములు, స్తోత్రములు, వాళ్లి తిరునామములు, కట్టియములు, గద్యలు మాత్రమె అనుసంధించుచుండవలయును.

తదితర ఆళ్వారులయొక్కగాని, ఆచార్యులయొక్కగాని, ఋష్యాదులయొక్కగాని, ఏ విగ్రహములను ప్రతిష్ఠించుటగాని, వారలకు సంబంధించిన ప్రబంధములు, స్తోత్రములు, వాళ్లి తిరునామములు, కట్టియములు, గద్యలు మున్నగు వాటిని చదువుటగాని, తిరునక్షత్రములు ఉత్సవములు జరుపుటగాని కూడదు.

ఎవరిమట్టుకు వారు తమ తమ స్వాంతస్థలములలో, తమ తమ సంప్రదాయ సిద్ధాంతములననుసరించి జరుపుకొన్న ప్రతిష్ఠ ఉత్సవాదులను గురించిగాని, పఠించుకొను తనియప్రబంధాదులను గురించిగాని, ఎవరును ఎట్టి ఆక్షేపణలను, ఆటంకములను, పరిహాసములను, విరుద్ధప్రచారములను, వివాదములను సలుపరాదు.

పై వాటి నన్నింటిని త్రికరణాత్మనా అంగీకరించుచూ, తదనుసారముగ నడచుకొన ప్రమాణ మొనరించుచున్నాను.



శ్రీపతే రామానుజాయ నమః.

శ్రీ బదరీనారాయణమున

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముచే ది 12-8-1954 తేదీన ప్రతిష్ఠింపబడిన

శ్రీ శ్రీనివాస సహిత భగవద్రామానుజ స్వామివారి

కైంకర్యము నిమిత్తమై భక్తులు సమర్పించిన విరాళ వివరములు.

| వస్తువుల వివరము. | తూకం. | ఖరీదు రూ | దాతల తిరునామములు |
|---|---|---|---|
| తామ్రవిగ్రహములు<br>శ్రీ శ్రీనివాసమూర్తి<br>శ్రీదేవి, భూదేవి,<br>శ్రీ రాజ్యలక్ష్మి<br>ఆండాళ్లమ్మ | — | అనంతము | మదాసులోని నెం. 217 గోవిందప్పన్ నాయకర్ వీధి వాస్తవ్యులు, శ్రీరంగం శ్రీపరాశర రంగనాయకభట్టర్ తిరువడి సంబంధులగు ఉత్తకాలగోత్రోద్భవులగు శ్రీ సామి వెంకట చెంచు రామయ్య శెట్టి<br>మరియు<br>శ్రీ సామి వెంకటరామస్వామి శెట్టిగార్లు |
| మట్టెలు మంగళసూత్రములు<br>యజ్ఞోపవీతములు | | 25/- | " " |
| తామ్రవిగ్రహము<br>భగవద్రామానుజస్వామి - 50 పౌనులు | | 350/- | శ్రీ బోయిన సీతారామానుజదాసుగారు<br>చేతవోలు - గుడివాడ. |
| | | 500- | శ్రీ చెలికాని సీతాయమ్మారావుగారు<br>c/o. శ్రీ చెలికాని వెంకటరావుగారు<br>బొబ్బిలి. |
| | | 200- | శ్రీ నరసమ్మగారు<br>c/o- శ్రీ కైలాసం శంకరయ్యగారు<br>సికింద్రాబాదు |
| ప్రతిష్ఠాది-కవచం - కిరీటాదులకై | | 50- | శ్రీ దామెర్ల లక్ష్మీవెంకాయమ్మగారు<br>పిఠాపురం |
| | | 300- | శ్రీ దామెర్ల బాపయ్యమ్మగారు కాకినాడ. |
| | | 150- | శ్రీ దామెర్ల లక్ష్మీవెంకయ్యమ్మగారు |
| | | 150- | శ్రీ చెలికాని వెంకయ్యమ్మగారు బొబ్బిలి. |
| వెండి పూజాబిందె-79½ తులములు | | 160- | మదరాసు శ్రీ యతిరాజ మహిళామండలి వారు - 107, వరదాముత్తియప్పన్ వీధి-<br>గీతామందిరం |

| | |
|---|---|
| ప్రపన్నపాగా | 32- మదరాసు శ్రీయతి రాజమహిళామండలి వారు గీతామందిరం. |
| వెండిదీపస్తంభము-341½ తులములు | 69- శ్రీ సి. ఎస్. వెంకటలక్ష్మమ్మగారు కృష్ణగిరి |
| వెండి కిరీటము | 50- శ్రీ మద్దాల రంగమన్నారు శెట్టిగారు |
| వెండి కిరీటము | 27- శ్రీ కోటా శ్రీరాములు శెట్టిగారు |
| వెండి పళ్లెము_79½ తు | 100- శ్రీ సూరిశెట్టి పొన్నమ్మాళ్ గారు |
| వెండి సహస్రధార పళ్లెము-40 తు | 80- శ్రీ గుంటూరు భక్తురాలు |
| వెండి వట్లు గిన్నెలు 20 తు | 35- శ్రీ వేమా బాపయ్య శెట్టిగారు |
| " " 20 తు | 35- శ్రీ కొత్తూరు గోపాల శెట్టిగారు |
| " " 20 తు | 35- శ్రీ వేమా పుష్పాలమ్మగారు |
| " " 20 తు | 35- శ్రీ పి. లక్ష్మీకాంతమ్మగారు |
| " " 20 తు | 35- శ్రీ మల్లుకొండ కమలమ్మగారు |
| వెండి స్ఫటికం39-¼ తు | 70- శ్రీ పెనుగొండ నారాయణశెట్టిగారు |
| వెండి పూర్ణకుంభం_50 తు | 90- శ్రీ జొన్నలగడ్డ రుక్మిణిఅమ్మాళ్ గారు |
| వెండి ఉద్ధరిణ | 10- ఒకభక్తులు |
| వెండి హారతిపళ్ళెము | 25- ఒకభక్తులు |
| వెండి ధూపహారతి | 21- శ్రీ బొమ్మిశెట్టి అమ్మాళ్ గారు |
| వెండి శఠారి-104 తు | 250- శ్రీ దొడ్డా ఆండాళమ్మగారి ద్వారా |
| వెండి పంచపాత్రి | 10- ఒకభక్తులు |
| సరిగ ప్రపన్నపాగ | శ్రీ సుబ్రహ్మణ్యం శెట్టిగారి భార్య సుందరమ్మాళ్ గారు |
| సరిగ చిన్నతలగడలు 2 | 20- శ్రీ కొప్పురాల పద్మాలమ్మగారు |
| సరిగ బాలీసు 1 | 70- ఒకభక్తురాలు |
| శోలగ్రామం కర్రిది | శ్రీ పువ్వాడ సీతారాములు శెట్టిగారు |
| వితానము_కురలము | శ్రీ మట్టపల్లి చంద్రమ్మగారు |
| భైరవాసముల జత | 75- ఒకభక్తులు |
| 27 రత్నములుగల బంగారపుహారం | 500- శ్రీ రామానుజకూటం రంగనాథయ్యగారు |
| వెండి యజ్ఞోపవీతము (బంగారు గిల్టుది) | శ్రీ సముద్రాల అమ్మాణమ్మగారు |
| | శ్రీ కరాలపాటి కమలవల్లి తాయారమ్మగారు |
| బంగారుగిల్టు త్రిదండం | శ్రీ కె. ధనమ్మగారు |
| తెంగలి తిరుమణికాప్పు (రంగూన్ రాళ్ళది) | శ్రీ కోటా శకుంతలమ్మగారు |

# విరాళముల వివరములు

రు.

300 శ్రీ భోన్నాడ పేరయ్యగారు తాళ్ళరేవు.
50 " నండూరి నారాయణస్వామిగారు సికిందరాబాదు.
50 " ముదురిబై సింహాచలమ్మగారు కాకినాడ.
25 " కందాడై శోభనాద్రిచార్యులుగారు
108 " కూరగిరిశెట్టి తిమ్మక్కగారు
25 " సత్తి మీనాక్షమ్మగారు
25 " గొల్లపూడి నారాయణగుప్తగారు చీరాల
25 " నల్లమిల్లి బుచ్చిరెడ్డిగారిభార్య మాణిక్యంగారు పేకేరు
116 " చిన్నం ఆదెమ్మగారు అర్తమూరు
25 " ముత్తి లక్ష్మమ్మగారు
25 " తటవర్తి బాలంబగారు
25 " వేదాల రాఘవమ్మగారు
58 " ఉదయగిరి వెంకటకృష్ణారావుగారు విజయవాడ.
100 శ్రీ మీర్జాపురంరాణీ శ్రీలక్ష్మీవెంకాయమ్మగారు, మద్రాసు
100 శ్రీ మీర్జాపురం కుమారరాణి రాజ్యలక్ష్మమ్మగారు మద్రాసు.
216 శ్రీ రాజానవనీతకృష్ణయాచేంద్రులు గారు మద్రాసు.
86 " రామప్రపన్నాచార్య చోటాల్లబృందావనం
50 " శ్రీ మత్తిరుమలపురిఘుళ్ళ వె... మాధవ...
58 " కోటవెన్ను భక్తులు c/o శ్రీ ఎలమంచిలి భగవన్నామంగారు
151 " నీలంరాజు ఆదిమూర్తిగారు ఒంగోలు.
55 " డాక్టరు దేశింశెట్టి కమలమ్మగారు నిజామాబాద్.
50 ,, యెండూరి తాయారమ్మగారు, విజయవాడ.

రు

51 " డాక్టరు సి. అప్పలాచార్యులుగారు సికింద్రాబాదు
51 " తె.కం. కుమారరామానుజాచార్యులుగారు తాటిపర్రు.
30 " తె. కం. గోపాలాచార్యులుగారు
50 " రావు సూరయమ్మగారు మద్రాసు.
25 " కొడాలి బ్రహ్మయ్యగారు ముదునూరు.
116 " చిట్టినేని రంగమ్మగారు రామాంబిపేట కరీంనగరుజిల్లా.
58 " మోరంపూడి వెంకటరాజుగారు గొడుగుపేట బందరు.
25 " కావూరి శీతారావమ్మగారు పెద్దపాలెం బాపట్లతాలూకా.
25 " కూనాప్మాల శేషమ్మగారు చీరాల.
116 " మాదాడి భోజయ్యగారు కొరెం శిరిశిళ్ళతాలూకా కరీంనగరుజిల్లా.
25 " అయితా హనుమంతంశెట్టిగారు నెల్లూరు.
101 " రామినీడి రాయలమ్మగారు రాజమహేంద్రవరం.
50 " మాడా కనకవల్లి తాయారమ్మగారు రాజమహేంద్రవరం.
25 " మొవ్వా నాగభూషణమ్మగారు ముదునూరు.
25 " తాతినేని యశోదమ్మగారు ముదునూరు.
450 }
5 } శ్రీ సూరానేని శ్రీవరమంగయ్యమ్మారావుగారు
101 } మైలవరం.
51 శ్రీ వానరాశి సూర్యరాజుగారు రాజమహేంద్రవరం.
101 " పెరుమాళ్ళ సూర్యకాంతంగారు
c/o గ్రంధి వెంకటరాజు అండుసన్సు, రాజమహేంద్రవరం.
25 " సుండూరు లీలావతమ్మగారు నవాబుపేట నెల్లూరు.

రు

| | | |
|---|---|---|
| | కంఠంనేని శాంతమ్మగారు జమీగొల్వేప | 51 |
| ,, | కంఠంనేని వెంకటసుబ్బయ్యగారు జమీగొల్వేపల్లి, | 51 |
| ,, | ఉప్పలపాటి నాగయ్యగారి భార్య విమలమ్మగారు గుడివాడ తాలూకా | 51 |
| , | తె. కం. కుమారరామానుజాచార్యులుగారు ... పుర | 101 |
| ,, | పూలపల్లి రామానుజాచార్యులుగారు వు...పుర (వయా) పాలకొల్లు | 101 |
| ,, | చిలకపాటు శ్రీరంగనాయకమ్మగారు కొ...పాడు గుంటూరు జిల్లా. | 108 |
| ,, | కందాడై వెంకటనరశింహాచార్యులుగారు వడ్డేశ్వరం గుంటూరుజిల్లా. | 108 |
| | ఈయుణ్ణి మంగాచార్యులుగారు హైదరాబాద్ | 108 |
| ,, | తె. కం. రామానుజాచార్యులుగారు నర్సాపురం | 116 |
| ,, | శాతలూరి చూడికుమత్తమ్మగారు నర్సాపురం | 116 |
| ,, | అమరవాది వెంకట నరసమ్మగారు నర్సాపురం | 116 |
| ,, | మరింగంటి రంగనాయకమ్మగారు కొరుకొండ | 116 |
| ,, | కదాండై కనకమ్మగారు నర్సాపురం | 101 |
| ,, | కోమాండూరి గోపాలాచార్యులుగారు దొడ్డిపట్ల (వయా) పాలకొల్లు | 101 |
| | దాసరి ఆండాళమ్మగారు విశాఖపట్నం | 250 |
| ,, | త్రోత్రాది మఠ శిష్యులగారు శ్రీ సూరపునేని | |
| ,, | శ్రీవర మంగయమ్మారావు బహద్దూరు జమీందారిణిగారు | 1001 |
| ,, | గుదిమెళ్ళ అప్పలనరసమ్మగారు పిచ్చికలపాడు గన్నవరం తాలూకా కృష్ణాజిల్లా | 501 |

25 ,, చెక్కా తాయారమ్మగారు c/o చెక్కా వెంకటరత్నంగారు పాలకొల్లు.
100 ,, దేసు కణ్ణమ్మగారు మద్రాసు.
110 0 3 శ్రీ రాజా దుర్గమ్మగారు కొత్తవరం [గారి ద్వారా
32 5 0 ,, ఒక భక్తులు c/o శ్రీ పీసపాటి అప్పలాచార్యులు
45 0 0 ,, భక్తులు c/o.N. ch. శఠగోపాచార్యులుద్వారా
35 0 0 ,, భక్తులు
84 0 0 ,, భక్తులు

## జరిగిన వాగ్దానములు

| | | |
|---|---|---|
| శ్రీ | ఆసూరి నరశింహాచార్యులు ... విజయవాడ | 25 |
| ,, | కె. ధనమ్మగారు 9. గిరిరోడ్డు త్యాగరాజనగర్ మద్రాసు. | 25 |
| ,, | కరి లక్ష్మీనరసమ్మగారు సింహాచలము | 25 |
| ,, | బచ్చు సుబ్బారావుగారు కాకినాడ. | 25 |
| ,, | పుమకోట్ల బంగారమ్మగారు | 25 |
| ,, | కైలాసం వెంకట్రామయ్యగారు శికింద్రాబాదు | 25 |
| ,, | డాక్టరుH. P. పద్మనాభంగారు పెర్నంబట్ నార్తు ఆర్కాటుజిల్లా. | 25 |
| ,, | పోలిశెట్టి కనకవల్లి తాయారమ్మగారు నూజివీడు. | 25 |
| ,, | యార్లగడ్డ శేషయ్యగారు పెదమద్దాల కృష్ణాజిల్లా. | 25 |
| ,, | వల్లూరిపల్లి వెంకట్రామారావుగారు పెదమద్దాల. | 25 |
| ,, | చెరుకూరు సీతారత్నంగారు పెదమద్దాల. | 25 |
| ,, | బొబ్బా రామారావుగారు అగినపర్రు కృష్ణాజిల్లా. | 25 |
| ,, | మయినేని రామారావుగారు అగినపర్రు | 25 |
| ,, | యలమర్తి పద్మావతమ్మగారు రాజమహేంద్రవరం | 25 |

# శ్రీ మ ద ష్టా క్ష రీ కో టి హ వ న మ హా క్ర తు

# ఋ త్వి క్స్వా గ త ము

### తి రు వూ రు — కృ ష్ణా జి ల్లా.

——— (౦) ———

శ్రీ బదరికాశ్రమమున జరుపబడిన మహా క్రతువునకు నిస్స్వార్థభావముతో తిరువూర్ నగరమునుండి విచ్చేసి పవిత్రహృదయములతో నిర్విఘ్నముగా కొనసాగించిన ఋత్విగ్వరేణ్యులలోని శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొడమసింహం శ్రీరంగాచార్యస్వామిగారు శ్రీ ఉ. వే. శ్రీమాన్ మరంగంటి పార్థసారథాచార్యస్వామిగారున్ను, సదరు తాలూకా యర్రబోయినపల్లినుండి మన రాష్ట్ర సంఘ కార్యదర్శులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొడమసింహం శ్రీమన్నారాయణచార్యుల స్వామిగారున్ను సురక్షితముగా 5-9 54 వ తేదీని తిరువూర్ నగరము ప్రవేశించినప్పుడు ఆ గ్రామ ప్రముఖులు తమ కర్తవ్యమును గుర్తించి విశ్వకల్యాణమునకై యిట్టి పవిత్ర కార్యములో పాల్గొనిన ఋత్విక్ప్రవరుల యెడ్ల తమకుగల గౌరవాదరణలను వ్యక్తపరచుచు వారికి తిరువీధి మహోత్సవమును బ్రహ్మాండ వైభవోపేతముగా జరిపిరి.

ఆనాటి మధ్యాహ్నము తిరువేంగడముడయాన్ సన్నిధిలో హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ కిడాంబి వెంకటాచార్యస్వామివారి అధ్యక్షత క్రింద గొప్ప బహిరంగసభ ఏర్పాటుగావింపబడినది. అందు ఋత్విక్కులు ముగ్గురును బదరీక్షేత్ర మాహాత్మ్యమును, తిరుమంత్రప్రభావమును, క్రతువైభవమును, యాత్రావిశేషములను, అచ్చటి వాతావరణపరిస్థితులను గూర్చి విపులముగా నుపన్యసించిరి.

పిమ్మట శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధిలో ౭0 శేర్లు భోగము నివేదింపబడినది. అందరును తీర్థప్రసాదములు స్వీకరించి ఆనందముతో వెడలిపోయిరి.

ఇట్లే 6వ తేదీని మునికుళ్ళగ్రామమున పంచాయితీబోర్డు అధ్యక్షులగు శ్రీయుత ఊటుకూరి చక్రధరరావుగారు, ఉపాధ్యక్షులగు శ్రీయుత ముక్కు రామిరెడ్డిగార్ల యొక్క ఆధ్వర్యమున పురజను లందరును ఘనమగు స్వాగత మొసంగి ఋత్విక్కులను సన్మానించిరి. శ్రీ చక్రధర రావుగారింట వీరి గౌరవార్థమై గొప్ప తదీయారాధన జరుపబడెను. బహిరంగసభ, ఉపన్యాసములతో ఉత్సవము ముగిసెను.

తిరిగి 7వ తేదీని క్రొత్త-పాత యర్రబోయినపల్లి గ్రామములలో బ్రహ్మాండ స్వాగతోత్సవమున్ను శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొడమసింహం వెంకట రాఘవాచార్యులగారిచే వారి స్వగృహమునను, 8వ తేది శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొడమసింహం శ్రీమన్నారాయణచార్యులగారి

స్వగృహమునను బ్రహ్మాండ తదీయారాధన లున్న శ్రీ సీతారామస్వామివారి సన్నిధిలో బహిరంగసభ సమష్టిపారాయణ భోగము తీర్థ ప్రసాద వినియోగములున్ను జరుపబడినవి. శ్రీమాన్ కో. సిం వెంకట చిన్నరంగాచార్యులు గారు శ్రీ వగుళ్ల గోపాలంగారున్ను యీ ఋత్విక్కులను గూర్చి ప్రశంసించి అభివందనములతో సభను ముగించిరి.

ఈ సందర్భమున ప్రజలకు యీ క్రతువునందు గల ఆదరము, ఋత్విక్కుల త్యాగము పట్ల గౌరవము, వారి ఆస్తికత మొదలగు ఎన్నియో విషయములు ప్రత్యక్షీకరింపబడుటయే గాక లోకమున క్రతువుపట్ల ఈర్ష్యాళులు గావించిన దుష్ప్రచారము ఖండింపబడినది. ఇట్లు తమ కర్తవ్యమును గుర్తించి యీ మహాస్వాగతమును ఇంత వైభవోపేతముగా జరిపించిన ఆయూ పురవాసులకు శ్రీ యఃపతి బదరీనాథుడు సమస్త సన్మంగళములను ప్రసాదించుగాక.



తిరువూరు ప్రజలచే సన్మానింపబడిన
శ్రీమదష్టాక్షరీ మహాక్రతు ఋత్విక్త్రయము.

# మహాక్రతువు సంబద్ధ కార్యక్రమము

చెన్నపురిలోని వరదా ముత్తియప్పన్ వీధిలో మద్రాసు శ్రీ యతిరాజ సేవామహిళామండలి వారిచే నెలకొల్పబడిన గీతా మందిరమున 4-8-1954 వ తేదీ మొదలు 14-8-1954వ తేదీ వరకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ ఆదేశాను సారముగ యీ దిగువ కార్యక్రమము నారీమ ణులచే అత్యుత్సాహముతో నపరిమితవైభవో పేతముగా జరుపబడినది.

ప్రతిదినము సాయంకాలమున షుమారు 500 మంది స్త్రీలు గీతామందిరమున సమావేశ మై శ్రీ ఉ. వే. శ్రీమాన్ అనూరి నరసింహా చార్య స్వామివారి నిరీక్షణక్రింద శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమును శ్రీ లక్ష్మీరామానుజ అష్టోత్తర శతనామ స్తోత్రములను సమష్టిపారా యణ గావించుచుండిరి. పిమ్మట శ్రీ నరసింహా చార్యస్వామిగారు సూత్రానుక్రమణికగా శ్రీమ దష్టాక్షరీ మహామంత్ర వైభవమును, స్తోత్రార్థ ములను ఉపన్యసించుచుండిరి. శుక్రవారమునాడు పై కార్యక్రమముతోపాటు గీతాపారాయణము శ్రీస్తుతి పారాయణముకూడా అధికముగా జరుప బడెను.

క్రతువున కంత్యదివసమగు 14-8-54 వ తేదీని గీతామందిరమున నెలకొల్పబడియున్న శ్రీ రాధాకృష్ణుల పాలశిలావిగ్రహములకు బదరీ నాథుని అలంకారము సమర్పింపబడెను. దానిని దర్శించుటకు ఆనాడు వేలకొలది ప్రజలు గీతా మందిరమునకు వచ్చిరి. నిత్యపారాయణాదులు పూర్తియైన పిమ్మట గీతామందిరమున షుమారు 4 మాసముల నుండియు కాలక్షేపకార్యక్రమ మును నిర్వహించుచున్న శ్రీమాన్ పార్థసారథ య్యగారు క్రతువునుగూర్చి విపులముగా నుపన్య సించి సంఘమునకు ప్రస్తుత కార్యకర్తలకును ధన్యవాదము లర్పించిరి.

పిమ్మట పుష్పాంజలియు హారతియు సమ ర్పించబడెను.

అంతట క్రతువుయొక్క ఆరంభదివసమగు 21-6-54 వ తేదీని గీతామందిరమున స్వామి సన్నిధిలో నెలకొల్పబడిన అఖండజ్యోతి, గీతా మందిరాధ్యక్షురాలగు ఉయ్యూరు మహారాణి వారగు శ్రీమతి విజయలక్ష్మీ అమ్మాళ్ వారి నాయకత్వమున మేళ తాళ భజన పారాయణ లతో పెక్కురు స్త్రీలు పురుషులు అనుగమింప శ్రీ వరదరాజ పెరుమాళ్ సన్నిధికి ప్రదక్షిణ ముగా నగరపరిభ్రమణము గావించుచు కోవెలకు వేంచేపించబడెను: అచ్చటికి చేరునరికి షుమారు వేయిమంది భక్తు లుత్సవమున సమావేశమైరి. ఆ జ్యోతి కోవెలలో శ్రీ స్వామిపాదారవింద సాన్నిధ్యమున సమర్పింపబడెను. పిమ్మట పెరు మాళ్ళకు, తాయార్లకు, ఉదయవరులకు, శిరయ తిరువడికు అలంకారములు సమర్పింపబడి సహ స్రనామార్చనలు గావింపబడెను.

తీర్థప్రసాద వినియోగములతో ఉత్సవము ముగింపబడెను.

## బరంపురం

### శ్రీ యతిరాజసేవా మహిళామండలి

స్వస్తిశ్రీ జయనామ సంవత్సర శ్రావణశుద్ధ పాడ్యమీ శుక్రవారమున బరంపుర నగరమున వేంచేసియున్న శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళ కోవె లలోని శ్రీమదలివేల్ మంగతాయారుల సన్నిధి లో శ్రీమతి తిరువేంగడ తాయారమ్మగారి అధ్య క్షత క్రింద శ్రీ యతిరాజ సేవామహిళామండలి

వారిచే నాలుగు సంవత్సరములనుండి నిర్విఘ్నముగా నతివైభవముతో నిర్వహింపబడుచున్న శుక్రవార మహోత్సవముతో నిర్వహింపబడుచున్న శుక్రవార మహోత్సవములకు నాల్గవ వార్షికోత్సవము యీ దిగువ కార్యక్రమానుసారము జరుపబడినది.

కార్యక్రమము

శ్రీశ్రీశ్రీ వెంకటేశ్వర స్వామివారి సన్నిధియందు ప్రాతఃకాలమున శౌర తిరుమంజన నూతన వస్త్రాలంకారమును జరిపి సాయంకాలమున పెరుమాళ్ళ పిరాట్టి సన్నిధుల యందు అష్టోత్తరశతనామార్చనలు పుష్పాలంకారము జరిపి శెన్నియోంగు-శ్రీగుణ రత్నకోశము. అనుసంధానము గావించి మంగళాశాసన తీర్థప్రసాద గోష్ఠితో ముగించిరి.

రెండవ శ్రావణ శుక్రవారమున 6 గంటలకే ఉంజలి ఉత్సవమును, వారణమాయిరం సేవాకాలము మంగళాశాసన తీర్థప్రసాద వినియోగములు జరిగినవి.

శ్రీ అధ్యక్షులు పిరాట్టి వైభవమును గూర్చి ఉపన్యసించిరి. ఆ ఉపన్యాసము ఈపత్రికలో వేరొకచోట ప్రచురించితిమి.

తక్కిన 3 వారములు సమాన్య కైంకర్యాను సన్థానాదులతో వైభవముగా గడుపబడెను.

## ఆండాళ్ తిరునక్షత్రోత్సవం

(శ్రీ గీతామండలి - కళింగపట్నం)

---

ఈ జయసంవత్సర శ్రావణ శు 3 స్థిరవారము మొదలు 3 దినములు కళింగపట్నం శ్రీ గీతామండలిచే క్రోదండరామస్వామివారి యాలయమున శ్రీ ఆండాళ్ తిరునక్షత్రోత్సవము జరిగింపబడెను. ప్రతిదినం ఉదయం. 8 గంటల మొదలు 10½ గంటలవరకు ప్రబంధసేవా కాలము గోష్ఠి, సాయంత్రం శ్రీగీతామండలి యందు ప్రపన్నామృత మందలి ఆండాళు చరిత్ర-దివ్య ప్రబంధముల గూర్చి యుపన్యాసము ఈ విధమున 3 దినములు జరిపి, అర్చావతార సౌలభ్యాలను గూర్చి ముచ్చటించుకొనుచు ముగింపబడినది.

ఇట్లు,

కార్యదర్శి,

"శ్రీ గీతామండలి"



గంగానది సమతల ప్రదేశమునకు దిగి ప్రవహించ ప్రారంభించిన దీ ప్రాంతమునుండియే. అందుచే యిచ్చట గంగాస్నానము చాల ఆహ్లాదమును కలిగించుచుండును. ఇచ్చటదృశ్యములు కడు రమణీయములు. ఇచ్చటి వాతావరణము అత్యంత సహ్యమై హృదయంగమమై ఆకర్షించుచుండును,

అందుచే బదరినాథ్, కేదార్‌నాథ్, గంగోత్రి యమునోత్రి యిత్యాది యాత్రలకు వెళ్ళు యాత్రికులేగాక, సంవత్సరములో 360 రోజులు హిందూదేశము యొక్క అన్ని ప్రాంతమునుండియు యాత్రికులు, దర్శకులు, శరీర - ఆత్మస్వాస్థ్యాపేక్షకులు ఋషీకేశమునకు ఎడతెరపిలేకుండగ వచ్చుచునే యుందురు. కొంతకాల మిచ్చట నివసించి, నూతన ఉత్సాహ - జ్ఞాన శక్తుల నార్జించుకొని, పునీతులై వెళ్ళుచుందురు. ఆంధ్ర ప్రాంతమునుండియు కూడ, అనవరతము అనేక భక్తు లిచ్చటికి వచ్చిపోవుచుందురు.

ఆంధ్రులకు యీ ప్రాంతము చాలా దూర దేశముగుటచేతను, మరియు యిచ్చటి భాషయు సాంప్రదాయములును పూర్తిగ మార్పుగలవై యుండుటచే యిచ్చటకు వచ్చు ఆంధ్రదేశీయ యాత్రికులందరు చాల యిబ్బంది పడుచుండిరి. దీనిని జూచి శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద సరస్వతి స్వామిజీ మహరాజ్‌గారు ఆంధ్రులనిమిత్తమై ఋషీకేశమున ఒక ధర్మశాలను ఏర్పాటుచేయవలెననియు, అందు కేవలము శారీరక సదుపాయములు మాత్రమే గాకుండగ, ఆధ్యాత్మిక సదుపాయములు కూడ కల్పింప నిశ్చయించి, శ్రీ లక్ష్మీనారాయణ దేవస్థానము, శ్రీ అనంత పద్మనాభ దేవస్థానము, శ్రీ వెంకటేశ్వరస్వామి దేవస్థానము, శ్రీ మహాలక్ష్మీ - ఆళ్వార్లు దేవస్థానములు, చంద్రమౌళీశ్వర దేవస్థానము, నవగ్రహ దేవస్థానములను కూడ కట్టించవలెననియు, మరియు అందు ఒక ఉచితవైద్యశాల, ఒక సంస్కృతపాఠశాల కూడ నేర్పాటు చేయవలెననియు సంకల్పించుకొనిరి.

వీరు పూర్వాశ్రమమున, తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా అవిడి గ్రామకాపురస్థులైన ఉత్తమక్షత్రియులు. బాల్యమునందే జ్ఞానవైరాగ్యములు గలవారై గృహమును విడచి తపోవనముల నాశ్రయించిరి. వీరు పాపికొండలు, షికార్‌గంజ్ అనే విజయనగరము మహారాజావారి అరణ్యములలో కొంతకాలము, చీపురుపల్లి తాలూకా పెనుమాళు గ్రామంలో ఒక తోటలో కొంతకాలము, పూరీ జగన్నాథ దేవాలయములో లక్ష్మీదేవస్థానములో కొంత కాలమున్నూ, కాశి, ప్రయాగ, అయోధ్య, నైమిశారణ్యము, ఋషీకేశము, ఉత్తరకాశి, బదరీనారాయణము, యిత్యాది తపోభూముల యందును, యింతవరకు తపస్సు చేయుచుండిరి.

ఈ ధర్మశాల - దేవస్థానముల నిర్మాణముల సంకల్పము కలిగిన పిమ్మట ఋషీకేశములోనే స్థిరనివాస మొనర్చుకొని, ఆంధ్రసోదరులయొక్క అమూల్య సహకార సానుభూతులతో, వసుధైకకుటుంబీకులగు యీనిస్వార్థపరులగుస్వామి వారు, తమ అమోఘతపశ్శక్తిని వినియోగించి, "ఆంధ్రఆశ్రమము" అనుపేర, ఆంధ్రుల ఉత్సాహ-శౌర్య-ధైర్య-తేజస్సుల ప్రకాశింప జేయుచున్నట్టి, సువిశాల ధర్మశాలను ఋషీకేశము ఉత్తరభాగమున, చంద్రభాగా నదియొడ్డున, బదరీనాథ్, కేదార్‌నాథ్, గంగోత్రి, యమునోత్రి యున్నగు యాత్రలకు వెళ్ళురోడ్డు పైని నిర్మించుచున్నారు.

ఇప్పటికి సువిశాలమైన 64 మామూలు గదులు, 35 రామానుజకూటమునకై గదులు 31 వంటగదులు, మొత్తము 120 గదులున్నూ, 7 పెద్దహాలులు, 3 గుహలు, 1 పెద్ద గుహావిహారము, 4 భావులు, 1 పుష్కరిణి పూర్తిచేయబడినవి. ఇంకను సంస్కృత కాలేజికై 30 గదు

లు కట్టించుటకున్నూ, వైద్యశాల కట్టించుటకు న్నూ, ధర్మశాల కట్టించుటకున్నూ ఏర్పాట్లు జరుగుచున్నవి.

తేదీ 12-8-195 నాడు మన హిందూదేశ ఉపాధ్యక్షులగు శ్రీశ్రీశ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు వచ్చి శ్రీ లక్ష్మీనారాయణ దేవస్థానమునకు పునాది రాయి వేసిరి. రాబోవు నెలయి మాసములో యీ దేవస్థానముల పని ప్రారంభించబడనున్నది. ఈ దేవస్థానము పునాదులకే ఒక లక్షరూపాయలవరకు అంచనా వేయబడినది ఈ దేవస్థానములందు రెండు ధ్వజస్తంభములున్ను, 2 గోపురములున్ను, 2 కళ్యాణమంటపములు కూడ ఏర్పాటు చేయబడుచున్నవి. ఇప్పటి వరకు సుమారు నాల్గులక్షల రూపాయలవరకు పని జరిగియున్నది. ఇందులకై ఆంధ్రులందరు చాల విరాళముల నిచ్చియున్నారు. ఈ మధ్యనే ఆంధ్రగవర్నమెంటువారి ప్రోత్సాహముచే తిరుపతి తిరుమలై దేవస్థానమువారు 3,250 రూపాయల విరాళమిచ్చియున్నారు.

శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య చౌదరిగారు శ్రీ వెంకటేశ్వర దేవస్థానము కొరకై యాభై వేల రూపాయల విరాళమిచ్చుటకు వాగ్దాన మొనర్చి, యిరువదివేల రూపాయలను యిప్పటికి యిచ్చియున్నారు. దేవాలయమునకు వల యు విగ్రహములన్నియు సుమారు 60 వరకు వచ్చియున్నవి. వీటికి కిరీటాదులు వగైరా వెండి సామగ్రి సుమారు పదివేలరూపాయల ఖరీదు గలవి, బెంగుళూరు పనివారలకు పురమా యించబడినవి. ఈ దేవస్థానములను దివ్యస్థానములు చేయించి, మరియు నిత్య నైమిత్తిక విశేషారా ధనలను, యథావిధిగా జరిపించు చుండుటకై శ్రీమాన్ శ్రీమన్నారాయణ రామానుజజీయరు స్వామివారు, స్వామిజీచే కోరబడి అంగీకరించి యున్నారు. వీటికై యిప్పటికి పదివేలరూపాయ ల స్థిరమైన మూలధనము ఫండు ఏర్పాటుచేయ బడియున్నది. స్వామీజీ తమ తదనంతరము ఈసం స్థను మేనేజుమెంటు చేయుటకు శ్రీ కొండి రామ మూర్తిగారిని మేనేజింగు ట్రస్టీగా నేర్పాటు చేయుచు ఒక ట్రస్టుబోర్డును ఏర్పాటుచేసియు న్నారు. ఇట్టి ధార్మిక సంస్థ ఉత్తరదేశమున ఎచ్చ టనులేదు. దీనిని పెద్దదానిగజేసి పోషించుభారము, బాధ్యత ప్రతి ఆంధ్రునిపైనను గలదు. గాన ఆంధ్రులందరు విరివిగ ఉదారముతో విరాళము లిచ్చి, తమ యశశ్చంద్రికల నీధార్మిక సంస్థ నిర్మాణరూపమున ఉత్తర భారతదేశమున ప్రకాశింప జేయుదురుగాక.

## విజ్ఞప్తి

పత్రికాపాఠక మహాశయులారా !

ఈమార్గశిరశుద్ధ ఏకాదశి 6-12-54 గీతాజయంతి పర్వదినము. ఆదినముగీతాభిమానులందరును ఉదయమున అభ్యంగన స్నానమాచరించి నూతన వస్త్రధారణము గావించి శ్రద్ధాభక్తులతో గీతాకోశమునకు షోడశోపచారములు జరిపించుకొని యర్చించవలెను. గీతాష్టోత్తరశతనామావళియు గీతాస్తుతియు పత్రికలో ప్రచురింపబడును. పిమ్మట అవకాశానుసారముగ 18 అధ్యాయములుగాని అభిమతమగు కొన్ని అధ్యాయములనుగాని పారాయణగావించి మృష్టాన్నముల నివేదించి ఆప్తమిత్రాదులతో కలిసి భుజింపవలెను. ఇవి వ్యష్టిగగాని సమష్టిగగాని చేయవచ్చును.

ఆనాటి సాయంకాలము ఆలయమునందో మరియొక సార్వజనీన స్థలమునందో అందరును సమావేశమై గీతోపన్యాసములను విని యానందించవలెను. ఉపన్యాసములుయిచ్చువారు లేనిచో సమర్థులొకరు మేము మార్గశిర మాసమున మహాత్ముల ఉపన్యాసములతో ప్రత్యేకముగా ప్రచురించుచున్న గీతాంకములోని ఉపన్యాసములను చదివి వినిపించి ఆనందింపజేయగోరుచున్నాము.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం.

## ఆంధ్రాశ్రమము - ఋషీకేశం - యు.పి.





ఋషీకేశమున శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానంద సరస్వతీ స్వామీజీ మహరాజ్‌గారిచే నిర్మింపబడిన "ఆంధ్రాశ్రమము"

ఆస్తికుడగు ప్రతిహిందువుడు తన జీవితములో నెప్పుడో వకప్పుడు ఉత్తరదేశ యాత్రను జేయకుండ తృప్తిపడజాలడు. అందులకు కారణము "స్థావరాణాంహిమాలయః" అని సాక్షాత్తు భగవంతుని చేతనే తన యవతారరూపముగ కొనియాడబడిన హిమవన్నగ మిచ్చటనుండుటయే. అందు బదరీనారాయణమున మోక్షకారణమైన అష్టాక్షరి మహామంత్రమును పర్వతరూపమున నున్న నారాయణుడే యిచ్చట ప్రకాశింపజేయుచున్నాడు, మరియు శ్రీవిష్ణుపాదోద్భవియై లోకపావనియైన గంగామాత యిచ్చటనే ఉద్భవించినది.

భగవదవతారమున జలక్రీడలచే పునీతమైన యమునానది యిచ్చట అవతరించినది. శబ్దబ్రహ్మకాటపట్టయిన సరస్వతీనది యిచ్చట ప్రకాశించినది. పితృదేవతలకు సద్గతిని కల్గించు బ్రహ్మకపాల మిచ్చటనున్నది. జ్ఞాన ప్రదాతయగు కేదారనాథు డిచ్చట వెలుగొందుచున్నాడు. ఇంకను యిట్టి పుణ్యక్షేత్రములెన్నియో యిచ్చటనున్నవి. హరిద్వారమునుండి ఉత్తరముగ హిమవన్నగము వ్యాపించి యున్నంతవరకు ప్రతి అంగుళ ప్రదేశము దేవభూమియే తాపసాశ్రమమే. పుణ్య పవిత్రప్రాంతమే.

ఈ ఉత్తరదేశ యాత్రికంతకు కంఠప్రదేశము వంటిది ఋషీకేశము. ఇది అత్యంత ప్రధాన పవిత్ర ప్రదేశము. ఋషి, ముని, సాధు, సత్పురుష విరాజిత ప్రాంతము. ఆధునిక నాగరిక చిహ్నముల వలన పట్టణరూపముగ తోచినను ఇది నిజముగ తపోవనమే. ఇచ్చట నెచ్చట జూచినను, జ్ఞానవైరాగ్య విరాజితులయిన కాషాయాంబర ధారులే కానబడుదురు. ఎచ్చట నెప్పుడు జూచినను, హరినామస్మరణములే. ఎచ్చట జూచినను సాధువులను అన్నవస్త్రములచే సత్కరించు క్షేత్రములే. మనశ్శాంతిని గోరు ప్రతిమానవుడు నివసించగోరునట్టియు, నివసించుచున్నట్టియు మనోహరమైన ప్రదేశము ఋషీకేశము.

# నివేదిక

ప్రియ పాఠక సోదరులారా!

మహాక్రతువును సంకల్పించి సుమారొక సంవత్సరమునుండియు క్రతుప్రచార మావశ్యక మగుట చేతను యాత్రికులకు పితృఋణ విమోచనకు ముఖ్యస్థానములగు గయ - బ్రహ్మకపాలముల మహాత్మ్యము నెఱింగినచో నాస్థలముల యందును అచ్చట నియతముగ జరుప వలసిన కర్మలయందును ఆదర మధికమై శ్రద్ధాభక్తులతో నచ్చట వర్తింతురను సంకల్పముచేతను పత్రికా సంపాదకులు క్రతుకార్యమున నిర్మగ్నులైయుండవలసి వచ్చుట చేతను మన పత్రిక వ్యాసములు లేకయే ప్రచురింపబడవలసి వచ్చినది. అందులకు మన్నించి విసుగుకొనక పాఠకులు తత్త్వము నెఱింగి సంతుష్టులైయే యున్నారు.

ఇప్పుడు ఆశ్వయుజ మాస పత్రిక మొదలు ముందు పత్రికలన్నియు ముఖ్యమగు నుపన్యాసములతోనే హెచ్చుగా నింపబడి ప్రకటింపబడును. నూతనముగా బాలులకు నీతిని గఱపు శ్రుతి పురాణాది గ్రంథములయందలి బాలప్రసంగము లన్నిటిని యెత్తి క్రమముగ ప్రచురించుచుండుము. పత్రిక ఆగామి సంవత్సరాదివరకు మాసమాసము వెలువడుచుండును. అటుపిమ్మట వెనుక ప్రకటించినటుల వారపత్రికగామార్చబడి అష్టాదశ రహస్యానువాదములు, చక్కని సంప్రదాయ సిద్ధమైన టీకా తాత్పర్యములతో భగవద్గీత - మొదలగు గ్రంథభాగములున్ను అమూల్యమగు దక్షిణోత్తర పండితోపన్యాసములున్ను, ఇతర ప్రచార కార్యక్రమములున్ను వారమున కొక రకముగా పంపబడుచుండును.

ఇంత వరకు ఆరుసంవత్సరముల నుండి పత్రిక నిర్వహింప బడుచున్నను పూర్తిగ చందాను చెల్లించిన వారు బహు విరళముగ నున్నారు. పత్రికను పెక్కువిధముల పాఠకుల రుచి భేదము ననుసరించి పండిత పామరరంజకముగా పెంచి ప్రచురించ నెంచితిమిగాని చందాదారుల ఉపేక్షాభావము మమ్ము నిరుత్సాహ పరచినది. చందాలను సక్రమముగ చెల్లించి తమ ఆదరగౌరవములను ప్రకటించు పెద్దల ప్రేరణచే నిప్పటినుండి పత్రికను పెంచి ప్రచురించ నిశ్చయించితిమి. ఇప్పటికైనను మా చందాదారులు తమ బకాయి చందాలను వెంటనే యింద పొందుపరచిన మనియార్డరు ఫారముద్వారా మా కందజేసి ఇతరులను చందాదారులుగా చేర్పించి చేయూత నొసంగుదురని ఆశించుచున్నాము.

బదరీ క్రతువు జమాఖర్చులు ఆడిటర్లచే తనిఖీ చేయబడుచున్నవి. సుమారొక నెలలో వాటి వివరములు వివిధభాషలలో ప్రకటింపబడు ను.

యాత్రాస్పెషల్ రైలు భద్రముగా యాత్రికులను స్వస్థానములకు జేర్చెను. ఇది వరకే దీర్ఘకాలమునుండి యుండు వ్యాధిరోగములవ తాత్కాలిక జ్వర విరేచనాదులవల్లను [illegible] సంవత్సరముల పైబడిన వయస్సుగల 7 గురు రాకపోకలలో పరమపదించిరి. వారి సామాగ్రిలను వారి బంధువులకు మా సానుభూతులతో పాటు భద్రముగా నందజేయించితిమి.

భోజనములకు, హృషీకేశమునుండి బదరీకి రాకపోకలకు, కంట్రాక్టు చేసినవారు గావించిన దగాలవలన కొంతనష్టమున్ను వ్యావహారిక చిక్కులున్ను తటస్థించినవి. అందువలన కూడా జమాఖర్చుల ప్రచురణ మాలస్యమగుచున్నది. శ్రీబదరీనాథుని కృపచేతను మీ వంటి భక్తుల శుభాకాంక్షా బలముచేతను అన్నియు వీడి మా

బాధ్యతనుండి త్వరలో విముక్తులముకాగలమని ఆశించుచున్నాము.

'శ్రేయాంసి బహువిఘ్నాని' యని యిదియొక యతిమానుషకృత్యమగుటచే కొన్ని విఘ్నములు తటస్థించినను శ్రీ శ్రీ శ్రీ జీయర్ స్వామివారి సత్యసంకల్ప బలముచేతను, సంఘపవిత్రతచేతను, శ్రీ బదరీ విశాలలాల్ కృపా విశేషముచేతను, భాగవతుల నిష్కల్మష కరణత్రయాత్మక సహాయసంపదచేతను, భక్తుల శుభాకాంక్షాబలము చేతను, యీలోక కల్యాణార్థమైన క్రతువు ఇట్లు నిర్విఘ్నముగా సమాప్తి చెందినది. సంఘకీర్తి ఆసేతుహిమాచలమువ్యాప్తమైనది. పెక్కుమందికి ఉత్తరయాత్ర పూర్తియైనది. పెక్కురు పితరులు తరించు సదవకాశము లభించినది. మరచిన మహామంత్ర ము త్తేజింప బడినది. భిన్నభిన్న వ్యక్తుల స్వరూప స్వభావాదులనుభవములైనవి.

---

## నీవు వైష్ణవుడగుటకు ప్రయోజనమేమి?

(కోవెల వీధిలో వేంకటేశ్వరులు- రామస్వామి తారసిల్లుదురు)

వెంక:- ఓహో! రామస్వామి తాతా ! ఎందాకా?

రామ- ఆ. ఇక్కడికే. మనరామానుజకూటానికి.

వెంక:- ఏం. పనిమీాద? అయ్యవార్లంగారు వేం చేశారా ఏమిటి?

రామ:- లేదయ్యా ! ఇక్కడ మన విశిష్టాద్వైత ప్రచారక గ్రంథాలు అమ్ముతారు కాదూ !

వెంక:- మరే-మరే. బలే పనిచేశారు. వెతుక్కోనక్కరలేకుండా ఒక్కచోట అన్ని గ్రంథాలు మాకు బాగా దొరుకుతున్నా యయ్యా! అయితే ఏంకొంటావేమిటి?

రామ:- ఈమధ్య భక్తినివేదనలో వైష్ణవులకి ముఖ్యంగా కావలసిన రహస్యాలు తెలుగులో అచ్చువేశారని చదివేను. అదేదో చూద్దామని.

వెంక:-ఆ రహస్యాలు మనకెందుకయ్యా! బాబూ !

రామ:- ఎంతమాటన్నావు. వర్ణంలో భేదం ఉన్నా వైష్ణవంలో భేదం లేదు. వైష్ణవులంతా ఒకేధర్మం. ఒకేమంత్రం. ఒకే దైవం. ఒకే మతం. ఆ తేడాల్లేవు. నీవు వైష్ణవు డవడానికేమిటి ప్రయోజనం. ఈ రహస్యాలు తెలుసుకోవడమే.

వెంక:- ఏమిటా రహస్యాలు ?

రామ:- అవా !

ముముక్ష్వాది, తన్యాది, తత్వాది,సాదీన్
చతుస్త్రిద్విక ద్విత్వ సంఖ్యాన్ క్రమేణ
ప్రాదీ, నవాదీ, తథా శ్ర్యాది మాదీ
జగుః కార్త పాది ప్రణీతాన్ ప్రబంధాన్॥

అనగా- ముముక్షు మొదలగు నాలుగు-

1. ముముక్షుప్పడి, 2. పరందపడి 3. శ్రియఃపతిపడి 4. యాదృచ్ఛికపడి,

'తని'తో ప్రారంభించునవి మూడు.

1. తనిద్వయము 2. తనిచరమము 3. తని ప్రణవము.

'తత్వ'తో ప్రారంభించునవి రెండు:-

1. తత్వత్రయము 2. తత్వశేఖరము.

'సా'తో ప్రారంభించునవి రెండు.

1. సారసంగ్రహము. 2. సంసార సామ్రాజ్యము.

'ప్ర'తో ప్రారంభించునవి రెండు.

1. ప్రమేయ శేఖరము. 2. ప్రపన్నపరిత్రాణము.

'నవ'తో ప్రారంభించునవి రెండు.

1. నవరత్నమాల 2. నవిధసంబంధము.

'శ్రీ'తో ప్రారంభించునది ఒకటి,

1. శ్రీవచన భూషణము.

'అ'తో ప్రారంభించునవి రెండు.

1. అర్థపంచకము - అర్చిరాది.

అని శ్రీకృష్ణపాదుల కుమారులగు పిళ్ళెలోకాచార్యులు సాయించిన 18 రహస్య గ్రంథాలు.

వెంక:- ఇవి రహస్యాలెల్లా అయినాయి ?

రామ:- మనకు గురువుగారు చంక్రాంకితాల్నాడు సెలవిచ్చిన మూడు మంత్రాల్లేవూ- అదిగో వాటి అర్థాలన్నమాట.

మంత్రోపదేశానికి ఎంత కట్టుబాటో, అంత కట్టుబాట్టుతో యీ యర్థాలు చెపతారు. చక్రాంకణంకాని వార్ని యీకాలక్షేపంలో అడుగెట్టనివ్వరే! ముక్తుడంటే-ముక్తియంటే మోక్షసాధనం అంటే అబ్బో! ఒడి వడబోసిన నిగ్గుకాదూ - మెడ్రాసుల్లో ఇల్లా ఒకడు నీలాగ అడిగితే అందరూ పకపకనవ్వి తాటాకులు కట్టెయ్యరూ ! అమ్మా !

ఇంకులో అర్థాలన్నీ వెనుకటివారు దాచి ఎవడేనా అడిగితే పరీక్షచేసి ప్రాణాలుతీసి అతిరహస్యంగా చెప్పేవారట. కంచి వరదరాజులు ఒకనాడు ఈ పిళ్ళెలోకాచార్యుల వారి కల్లో కనిపించి ఇవన్నీ చక్కగా అందరికీ తెలిసేటట్లు గ్రంథంక్రింద వ్రాసెయ్యమని సెలవిచ్చారట. అప్పుడీ మహాత్ముడు ఆ త్రిగల అబాలగోపాలం తెలుసుకొని తరించేటట్లు సులభశైలిలో యీ అర్థాలన్ని పద్దెనిమిది గ్రంథాలుగా విభాగంచేసి వ్రాసేశారు.

వెంక-అయితే వైష్ణవులన్నమాటేమిటి అందరూ చదవొచ్చన్నమాటే.

రాము-అమ్మా ! అంతే ! ఎన్నిమతాలు ఎన్ని దార్లు చూపించినా మనపెద్దలు పిచ్చివాళ్ళై యందులోకి దిగేరా! ఇందుల్లో ఇటు వశిషుడవనీ-అటు చండాలుడవనీ-ఒకే మోక్షమార్గం-ఇదే ఈ సిద్ధాంతంలో గొప్ప. పవిత్రంటే గంగ కావేరి అనుకో. ఎవడు దిగితే వద్దంటుంది. అల్లాగే ఎవడేమిటి? ఏంకావాలంటే ఏమిటి? యిదొక్కటే దారిచూపిస్తుంది. అదేగా ఆ మూడు మంత్రాల సారం.

వెంక:- అయితే రామానుజులవారి మతం ఇదేనా ?

రామ:- ఇంకా సందేహమా ! ఈ మంత్రం ఉపదేశం అయితేనేగాని యీ అర్థాలు తెలియవని తహతహలాడి పోయ్యేగా రామానుజులవారు శ్రీరంగానికి పరిగెత్తుతూంటే మధురాంతకం చెరువుగట్టుమీద పెరియనంబిగార్ని కలుసుకొని యిక్కడే ఆపని పూర్తి కావాలని ఆయన్ని కదల్నీయక చక్రాంకణం అయి మంత్రోపదేశం పొందారు ? ఈ యర్థాలు తెలుసుకోవాలనేగా 18 సార్లు గురువుచుట్టు తిరిగి తిరిగి నిద్రాహారాలు లేక చిక్కి శల్యమయ్యారు. ఈ యర్థాలు అందరికి తెలియాలనేగా గురువు తిట్టినాసరే దుమ్మెత్తినాసరే గోపురం ఎక్కి బొబ్బలెట్టేశారు, (దగ్గరగాచేరి) ఇతరమతాలు చెక్కిచెండాడేటప్పటికే కాలంకాస్తాతీరి పోయింది. యీ అర్థాలన్నీ అందరికి బాగా గ్రంథాలుగా రాసిపారెయ్యడం పడలేదనేగా మన మన వాళ్ళ మహామునులుగా అవతరించి అర్థంబద్దలుకొట్టేశివ్యాఖ్యానాలు వ్రాసిపారేశారు.

వెంక:- నిజమేగాని - అయితే అవి అరవంలో వ్రాశేశారుగదా ? దిక్కుమాలిన కర్మం.

రామ:- అదుగో అదినిజం. అదే ఒక్కలోటు - అయితే ఏంలే. ఆలోటు తీరడానికే ఇప్పుడు యీ సంఘం కార్యదర్శిగారు గోదావరిజిల్లా అత్తమూరు... ... ... ...

వెంక:- ఏమిటయ్యా నీ చాదస్తం బంగారంగాను-మనజీయంగారని చెప్పరాదటయ్యా !

రామ:- (లెంపలు వాయించుకొని) మరేమరే - బుద్ధి, బుద్ధి, ఆ మహానుభావుడే ఇప్పుడన్నీ చక్కని తెనుగులో వ్రాసి అతిచౌకగా అమ్మిస్తున్నారు. అదిగో ఆపుస్తకాల కోసమే నాప్రయాణం.

వెంక:- అవునయ్యా! మొన్న గుంటూరునుంచి మా భావగారుకూడా వ్రాశాడు-కనుక్కుందామంటే బదకం. మొన్న బందరు పుల్లయ్య బావగారి గుమాస్తాకూడాఏవో కొనుక్కుపోతున్నాడయ్యో. ఇవేకావును.

రామ:- వాళ్లేమిటి వీళ్ళేమిటి హోరెత్తిపోతుంది. వైష్ణవుడవడానికి ఫలం ఏమిటి? అని తెలుసుకొన్నవాడల్లా కొనేయ్యవలసిందే. అంతాచేస్తే ఎంతయ్యా!

ముముక్షుపడి మొత్తం 80 పేజీలు గ్రంథం.

అందులో పాశురాలకి శ్లోకాలకి మంత్రాలికి తెలుగు అర్థం - చక్కని అట్ట. అట్టపై అందమైన పరమ పదనాథునిబొమ్మ ఇన్నిటికీ ఒక రూపాయి - నిగమనప్పడి ఆ అట్టమీదబొమ్మ కీయవచ్చునయ్యా ఆ అర్ధరూపాయిని - అర్థపంచకం ఆ వంశవృక్షం ఒకచేచాలు పుస్తకం అంతా జ్ఞాపకం ఉంచుకోవాలంటే. ఇంతాచేస్తే 0-12-0. తన్త్రిక్షణవం 0-8-0. సారసంగ్రహం 0-6-0. ఇవన్నీ కలిస్తే ఒక సినిమా కుర్చీ టిక్కెట్టు ఖరీదులేవు.

వెంక:- సరే బాగానే ఉందికాని మనం అంటే ఊళ్ళోవాళ్ళం. ఎప్పుడుబడితే అప్పుడు కొనుక్కుంటాం. దానికేంగాని పాపం యీ పొరుగూళ్ళవాళ్ళ కెలాగయ్యా! రావాలంటే మాటలా?

రామ:- అదేమిటయ్యా-శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘ కార్యాలయం విజయవాడ- అని ఒక్కకార్డు మన సరియైన అడ్రసు యిచ్చి వ్రాసి పారేస్తే కావలసినన్ని గ్రంధాలు యింట్లో వచ్చిపడతాయి. సరే, దానికేం. ఆలస్యమైంది రా వెళ్ళిచూద్దాం.

---

# గీతాప్రచురణములు

సకల జగత్తుచే నాదరింపబడుచున్న భగవద్గీతను సర్వాధికారమగు భక్తిప్రపత్తులు ప్రధానముగాగల మత సంప్రదాయాను సారముగ నర్థము చేసుకొనుట కనుకూలమైన తాత్పర్యార్థములతో ముద్రింపబడిన గ్రంథమొక్కటియు లేకుండుట గొప్ప లోటుగ నున్నది. ఆ లోటును తీర్చుటకై నిర్దుష్టమగు శ్రేష్టమైన తాత్పర్యముతో మన సంఘముచే ముద్రింపబడిన భగవద్గీతాగ్రంధము సిద్ధముగానున్నది. వెల రు 1-8-0 మాత్రమే.

ప్రతిపదార్థ తాత్పర్యములతో కూడ నిప్పుడచ్చగుచున్నది. త్వరలో వెలువడును.

ఎట్టి యల్పజ్ఞానముకల వారైనను ఒక కథను వినునట్లుగా గీత నర్థము చేసుకొనుటకు చక్కని ప్రశ్నోత్తరరూపముగా ప్రథమ షట్కమువలెనే మధ్యమ షట్కము అతి సరళశైలిలో ముద్రింపబడుచున్నది.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ మన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి 'అష్టోత్తర శతనామస్తోత్రము నామావళియుముద్రింపబడియున్నవి. వెల 0-2-0

చిన్నసైజులో స్తోత్రరత్నము, ముకుంద మాల అచ్చయి సిద్ధముగనున్నవి. ప్రతి ఒక్కటికి వెల 0-2-0.

పై గ్రంథములు వలయువారు వెంటనే యీ క్రింది యడ్రసుకు వ్రాసిన లభించగలవు.

మె నే జ రు

శ్రీ విశిష్టాద్వైతప్రచారకసంఘము.

వి జ య వా డ 1.

## కావలసియున్నది

పత్రికా ప్రచారమునకై విజయవాడనుండి బరంపురమువరకు ఒకరిని మద్రాసువరకు నొకరిని, నైజాం ప్రాంతమునకొకరిని ప్రచారకులను ఏర్పరచదలంచుచున్నాము. వారు సంప్రదాయ విషయముల నుపన్యసించగల వాగ్ధాటీ కలవారును, నెలకు 20 దినములు తిరిగి ప్రచారము చేయగల శక్తి కలిగి విశ్వాసపాత్రులై యుండవలెను.

భక్తినిప్రబోధించుట, చందాలను వసూలు చేయుట – క్రొత్త చందాదారులను చేర్పించుట సభ్యులను చేర్చుట, సంఘ, తదితర సంప్రదాయ గ్రంధములను భగవద్భాగవతాచార్యాదుల పఠములను, వస్తువిలను అమ్ముట లేక అమ్మించుట వాటి జమాఖర్చులను వ్రాసి ఒప్పగించుట మొదలగు పనులు చేయగల సమర్ధులై యుండవలెను. అట్టివారికి వారి యోగ్యతల ననుసరించి ప్రస్తుతము ఖర్చులుగాక 30-0-0 లు మొదలుకొని రు 50-0-0 లు వరకు జీతమున్ను వారి ద్వారా అమ్మబడిన సంఘగ్రంధములకు నూటికి రు 25-0-0 ల చొప్పునను పై వారి వస్తు గ్రంధ పఠాదులకు నూటికి రు 12-8-0 చొ॥ నను కమీషను యివ్వబడును.

మరియు తమ స్థానములలో నుండియే పైన వ్రాయబడిన పనులుచేయు ఏజంట్లుగా నుండగోరువారికి అమ్మకమునకు పై విధముగానే కమీషనున్ను, వసూలుచేసిన చందాలకు కూడా నూటికి రు 12-8-0 లు కమీషనున్ను యివ్వబడును,

కావున నట్టియుత్సాహము కలవారు వెంటనే తమ యోగ్యతలను తెలుపుచు ఇచ్చటి కార్యాలయమునకు దరఖాస్తులు పంపగోరుచున్నాము.

## విషాదవార్త

శ్రీమాన్ గోవర్ధనం శేషభట్టరాచార్యులుగారు (నిజాం స్టేటు – ఇనుగుర్తి) గ్రామవాస్తవ్యులు. వీరు బాల్యమున తమ ప్రాంతమునందే కావ్యజ్ఞానము నార్జించి పిమ్మట తమ శిష్యుల ఆదరాభిమానములతో పాలకొల్లునందు శ్రీ ఉ. వే. శ్రీమాన్ శాంతలూరి వెంకటాచార్యులు గారివద్ద సంప్రదాయ గ్రంధములను కొంతవరకు భగవద్విషయమును సేవించి మన సంఘ పండిత పరిషత్తులోచేరి ప్రచారమున కెంతయో తోడ్పడుచుండిరి. రెండుసంవత్సరముల క్రిందట నడిగడ్డపాలెంలో శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారివద్ద భగవద్విషయమును పూర్తి చేసుకొని వారితో కలసి శ్రీమదష్టాక్షరి కోటి హవన మహా కృతువునకు ఉత్తర దక్షిణ దేశములు ప్రచారమునకు మిక్కిలి తోడ్పడిరి. వీరు క్రతు దీక్షలో పాల్గొని రెండు మాసములు బదరికాశ్రమమున వేంచేసియుండిరి. తిరిగివచ్చి విజయవాడలో శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులగారి వద్ద గీతాభాష్యమును కాలక్షేపము గావించుచు సుదర్శన పత్రికకు సహాయ సంపాదకులై శ్రీమాన్ నడాధూరి గోపాల కృష్ణమాచార్యులుగారికి కుడిభుజమువలె పత్రికా ప్రచారమును చేయుచుండిరి వీరు జయనామ సం॥ ర॥ ఆశ్వీజ బ॥ సప్తమీ సోమవారం రాత్రి ఆకస్మికముగా జ్వరముతో విజయవాడలోనే పరమపదించిరని తెలుపుటకు మిక్కిలి విచారించుచున్నాము. వీరు పరమపదించుటచే సంఘప్రచారమునకు పెద్ద లోటేర్పడినది. వీరి వియోగమునకు వీరి తల్లి దండ్రులకు మా సానుభూతిని చూపించుచు వీరి ఛాయా చిత్రమును మన కార్యాలయమున నెలకొల్ప సంకల్పించు చున్నాము.

ఇట్లు
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

## కట్నములు

1. ఏలూరు కాపురస్థులు (ప్రస్తుతం తెనాలి) శ్రీ శిరం అప్పలరాజుగారు తమ తల్లిగారైన శ్రీ శిరం సరసమ్మగారి ఆరోగ్యాభివృద్ధికి మనసంఘమునకు రు 1-0-0 కట్నము సమర్పించిరి. ఈమెకు శ్రియఃపతి సంపూర్ణారోగ్య మహాభాగ్యమును ప్రసాదించుగాక.

2. విజయనగర వాస్తవ్యులు శ్రీ కలగర్ల సూర్యనారాయణ మూర్తి గారు చిరంజీవి తమ మను మని బాలసాల మహోత్సవసమయమున మన సంఘమునకు రు 1-0-0 కట్నం సమర్పించిరి. ఈ చిరుతడు చిరంజీవియై సుఖించునట్లు శ్రియఃపతి యనుగ్రహించుగాత!



★ రాజమండ్రిలో శ్రీ జూపూడి లక్ష్మీనరసింహాంగారి పరమపదోత్సవ సందర్భమున వియలునకు వేంచేయు స్వాములగోష్ఠి - నరసింహాం గారి కుమారులు వారి కుటుంబము. ★

## పుస్తక ప్రచురణములు

అష్టాదశరహస్య గ్రంథములను వరుసగా ఆంధ్రాను వాదముతోను ప్రమాణాను వాదముతోను అచ్చువేయించి మతాభిమానులగు వైష్ణవుల కందరకు నందజేయ దలంచితిమి. ఇంతవరకు ముముక్షుప్పడి - నిగమనప్పడి-తని ప్రణవము-సారసంగ్రహాము అచ్చుపడి అందుబాటులో నున్నవి. ప్రస్తుతము యాదృచ్ఛికపడి వ్రాత ప్రతి సిద్ధముగానున్నది. దాని అచ్చునకై (రూ125/-) అంచనా వేయబడినది. శ్రీవచన భూషణం- తత్త్వత్రయము వ్రాయబడుచున్నవి. వాటిని అచ్చువేయించుటకున్ను ఒక్కొక్క-దానికి 200-0-0 లు లోపుగా అగునని అంచనా వేయబడినది.

మరియు భగవద్గీతను రామానుజ సంప్రదాయానుసారముగ టీకా తాత్పర్యములతో అచ్చువేయుటకు ప్రారంభించితిమి మూడు అధ్యాయములు పూర్తియైనవి.

తొమ్మిదవ అధ్యాయమునకు శ్రీరంగపురం కాపురస్థులు శ్రీమాన్ వేదాల సుందరరాజ గోపాలాచార్యులుగారున్ను, 11 వ అధ్యాయమునకు చావలి కాపురస్థులు శ్రీమాన్ విష్ణుమొలకల వీరరాఘవయ్యగారున్ను 1:వ అధ్యాయమునకు శ్రీమాన్ దేశంశెట్టి ఆళ్వందారయ్యగారున్ను ద్రవ్యసహాయమును చేయుటకు వాగ్దానములు గావించియున్నారు. మిగిలిన అధ్యాయములకు ఇంతవరకు వాగ్దానములు జరుగ లేదు, ఒక్కొక్క అధ్యాయమునకు రు 150లు అంచనా వేయబడినది. దాతల ఫొటోలతోను పేరులతోను ఆయా అధ్యాయములు ముద్రింపబడును. కావున గీతాభిమానులు మతాభిమానులు ఒక్కొక్క అధ్యాయమును ఒక్కొక్క రహస్య గ్రంథమును అచ్చునకు ఆర్థికముగా సహాయమును చేయుటకు వాగ్దానములను సంఘకార్యాలయమునకు తెలిపి యీ ఆధ్యాత్మికజ్ఞానయజ్ఞమునకు తోడ్పడ ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

వి జ య వా డ-1.

రిజిష్టరు నెం. A. 16

# భక్తి "నివేదన"

( వేదాంత మాస పత్రిక )

## విభీషణశరణాగతి

ఇయ్యది ఆంధ్రవాల్మీకి శ్రీవాసుదాసుగారిచే వ్రాయబడిన మందర వ్యాఖ్యానముతో కూడిన ఆంధ్రపద్యాత్మక రామాయణాంతర్గతమగు యుద్ధకాండలోని సుందరమైన ఘట్టము. షడ్విధ అంగములతో కూడిన ప్రపత్తికి లక్ష్యమీ ఘట్టమొక్కటి ద్రావిడ భాషలో శ్రీపెరియవాచ్చాంబిళ్లైగారు ద్రావిడములో రచించిన అభయ ప్రదానసారము, సంస్కృతములో శ్రీ గోవిందరాజాచార్య ప్రణీతమగు వ్యాఖ్యాన సారమున్ను ఆ రెండు భాషలు తెలియని ఆంధ్రులు అనుభవింపవలెనని యీ గ్రంథమేశరణ్యము.

ఖరీదు రూ 2-8_0 మాత్రమే. పోస్టేజి వేరు.

వలయువారు:_

సంఘ కార్యాలయమునకు వ్రాయవలెను.

సంపాదకుడు : శ్రీ "భక్త" విజయరాఘవ 1. R. S.

**Book Post**

To



### శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతు ప్రసాదము

శ్రీ మదష్టాక్షరీ మహామంత్రమును దీక్షతో జపించి సిద్ధిని పొందిన మహాభాగవతోత్తములచే శాస్త్రోక్తముగా ఆమహామంత్రముతోనే హోమము గావింపబడిన అపరమ పవిత్రభస్మమున్ను వారిచేతనే ఆ మహామంత్రానుసంధానముతో స్వామికి సమర్పింపబడిన పుష్పాంజలి తులసీప్రసాదమున్ను అచ్చట నిత్యము స్వామికి నివేదింపబడిన ప్రసాదమున్ను భక్తుల సౌకర్యార్థమై పొట్లములుగా కట్టి మన సంఘకార్యాలయమునుండి కోరిన వారి కందరకు నందజేయబడుటకు సంసిద్ధముగానున్నవి. వీటిని పంపించుటకగు ఖర్చులు మాత్రమే ముందుగా పంపినవారికి వెంటనే ఆ ప్రసాద మందజేయబడును. తక్కువ ఖర్చులో నందవలెనని కొందరుకలసి డబ్బు పంపించుట మంచిది.

ప్యాకెట్టు యొక్క ఖరీదు 0-3_0 మాత్రమే

ఒక ప్రక్క అష్టాక్షరీ యంత్రమును ఒక ప్రక్క శ్రీ బదరీనారాయణుని మూర్తితోను వెండిరేకుపై బంగారు పూతతో తయారు చేయించబడ్డ ప్రతిష్ఠింపబడిన పతకము 1-8_0 మాత్రమే-ప్రత్యేక పోస్టేజి

భక్తినివేదన చందాదారులకు యీపతకము రూ 1_౬_0 లు మాత్రమే పోస్టేజీ మాత్రము వేరు,

…ed by A Ch-Srimannarayanacharya at Sri Satyanarayana
Vijayawada for Sriman Press Nadigaddapalem.

# క్రతు స్మృతి

శ్లో. ధ్యాయతేఽర్చయతే యోఽన్యం।
విష్ణులింగ ముపాశ్రితః।
కల్పకోటి శతైశ్చాపి।
గతి స్తస్య న విద్యతే॥

విష్ణుభక్తుడై, తచ్చిహ్నములను ధరించినవాడై యుండి, తదితర దేవతలను ధ్యానించినను, అర్చించినను అట్టివానికి ఎన్ని కోట్లజన్మములు ఎత్తినను మోక్ష మనునది లేనే లేదు.

## —: సంభావన :—

చీరాల వాస్తవ్యులైన శ్రీ గొల్లపూడి కోటమ్మగారు అధిక వైశాఖ బ॥ సప్తమీ మంగళ వారం (5-5-53) వ తేదీని నారాయణ యాత్రకు వెళ్లిన సందర్భమున 16-5-53 తేదీని 12 వ రోజున ఆమె కుమారులు శ్రీ గొల్లపూడి రామమోహన్‌రావుగారు సేవాకాలాది పరమవైదిక గోష్ఠిని భక్తితో జరిపి మనసంఘమునకు రు 5-0-0 లు సంభావన సమర్పించిరి. వీరి తల్లిగారికి శ్రియఃపతి శాశ్వత పరమ పదమును ప్రసాదించు గాక!





వారివిష్టాగమము





శ్రీమతే రామానుజాయనమః

# "అన్నియు మన మంచికే"

జిజ్ఞాసువు : శ్రీ శ్రీ శ్రీ పాపాయమ్మా రావుగారు.

ప్రశ్న:—ప్రయోజన రహితమైనదాని యందు మందుడు కూడ ప్రవర్తించడు కదా. సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు అవాప్తసమస్త కాముడు యగు శ్రియఃపతి లౌకిక - అలౌకిక పురుషార్థవిరోధములగు కామాదుల నేల సృజించెను ? వానిని సప్రయోజకములుగ జేయుటెటుల ?

సమాధానము ;— "శ్రీమన్నారాయణ"

శ్రియఃపతి ప్రయోజన రహితమైన సృష్టినొక్క దానిని చేయలేదు. మనము మందుల మగుటచే మాత్రమే కాని వాని ప్రయోజనముల తెలుసుకొన జాలకున్నాము.

కఠోపనిషత్ : పరాంచి । ఖాని । వ్యతృణత్ । స్వయంభూః
తస్మాత్ । పరాఙ్ । పశ్యతి । నాంతరాత్మన్ ।
కశ్చి । ద్ధీరః । ప్రత్యగాత్మాన । మైచ్ఛత్
ఆవృత్తచక్షుః । అమృతత్వ । మిచ్ఛన్ ॥

(బ్రహ్మ ఇంద్రియములను బహిర్ముఖములై ప్రాకృతిక విషయముల ననుభవించు నటుల సృజించి విడిచిపుచ్చెను. అందుచే పామరజనులు ప్రాకృతిక విషయములయందే లాలసులై యనుభవించుచున్నాడేగాని అంతరాత్మను దర్శించ జాలకున్నాడు. ధైర్యశాలి యగువాడు అమృతత్వమును పొందగోరి చక్షురాదింద్రియముల బాహ్యవిషయములనుండి మరలించి అంతర్ముఖులుగ జేసి ప్రత్యగాత్మ సాక్షాత్కారము నొంద గలుగుచున్నాడు.)

అనుసటుల అజ్ఞాని యగువాడు దైవసంకల్ప మను తత్సృష్టి ప్రయోజనమును తెలుసుకొన జాలక లౌకికా లౌకిక పురుషార్థముల నేనిని పొందజాలకున్నాడు. అట్టివానికి కామాదులు బోధములై బాధకరము లగుచున్నవి.

జ్ఞానియగు వాడు భగవత్సంకల్ప సృష్టిప్రయోజనముల తెలుసుకొని అజ్ఞానికి బంధకము లైన ఆ కామాదులనే భగవత్ప్రీతికరములుగ వినియోగించుకొని లౌకికా లౌకిక పురుషార్థములపొంది శాశ్వతానందముల ననుభవించ కలుగుచున్నాడు.

అంతియెకాని ఇంద్రియముల పనిచేయకుండగ జేయ ప్రయత్నించుటగాని; వానిచే విషయముల ననుభవించకుండ జేయజూచుటగాని శక్యమైన పనిగాదు. అట్టి ప్రయత్నము వ్యర్థము. అది దేహవంతులకు అసంభవము. భగవంతుడు శరీరమును దానికి పదునొకండింద్రియములను, అవి యనుభవించుటకై పదునొకండురకముల విషయవిశిష్ట ప్రకృతిని తెలివిమాలినవాడైగాని, పనిలేకగాని సృజించి యుండలేదు.

కంటకాదులను చేధించి సుఖనివాసమును కల్పించుకొని ధర్బలు పండ్లు ఫలములను కోసి తెచ్చుకొని యజ్ఞయాగాది నిత్యనైమిత్తిక కర్మల సుఖముగ జేసుకొని ఇహపర సౌఖ్యముల ననుభవించుటకై ఈయబడిన కత్తితో అవుశోకకోసియు, కనపడినవారిని గాయరపచియు, తన గొంతుకనే కోసుకొని ఆత్మహత్య జేసుకొనియు బాధపడువానిని గురించి ఏమనవలెను ? శరీరేంద్రియ విషయముల భగవత్ప్రీతి కరముగ వినియోగించుకొనువాడు ఇహపరసుఖముల ననుభవించగలడు. అందులకు వ్యతిరేకముగ నడచుకొనువాడు అజ్ఞానియై. కర్మలంపటుడై శాశ్వతబాధల నొందుచుండును. మన శాశ్వతానంద సౌఖ్యములకు సుఖసాధనముల ననుగ్రహించిన పరమకారుణికుడైన భగవంతుడు మందుడు. ప్రయోజనగిహిత ప్రవర్తకుడు యగునా ? సాధనముల దురుపయోగము జేసుకొని బాధపడువారు మందులగుదురా ?

కృపాలుడైన భగవంతుడు తన నిర్హేతుక జాయమానకటాక్షముచే ఈ శరీరేంద్రియ విషయరూప సాధనముల మనకు అనుగ్రహించియే యుండక పోయినదో మనము ఆనందసౌఖ్యాను భవగంధమే లేకుండగ మూలప్రకృతిలో మగ్గవలసిన వారమే కదా.

గాన కామాది విషయములు కూడ సప్రయోజకములే.

"జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం ।
చేతో భజ శ్రీధరం ।
పాణిద్వంద సమర్చ యాచ్యుతకథా
శ్రోత్రద్వయ త్వం శృణు ।
కృష్ణం లోకయ లోచనద్వయ హరేః
గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుంద-పాద-తులసీ
మూర్ధ న్నమా ధోక్షజం ॥

అని శ్రీకులశేఖరుల యుపదేశాను సారముగ జిహ్వేంద్రియముచే కేశవ నామోచ్చారణమును; మనస్సుచే మురరిపుని ధ్యానమును; రెండు హస్తములచే శ్రీధరుని అర్చనాదికమును; రెండు శోత్రములచే అచ్యుతుని గుణగణశ్రవణమును; రెండు నేత్రములచే శ్రీకృష్ణుని దర్శనమును;

రెండు పాదములచే శ్రీహరి సాన్నిధ్యగమనమును; ఘ్రాణేంద్రియముచే ముకుందార్పిత పాదతులసీఘ్రాణమును: శిరస్సుచే అధోక్షజునకినమస్కారమును!

ఇటులనే మిగత ఇంద్రియములను భగవత్ప్రీతికర కార్యములయందును వినియోగమును జేయుచుండుటచే ప్రతిమానవుడును సకలపురుషార్థములను సమస్త శ్రేయస్సును పొందగలడు.

ఇంద్రియముల విషయముల ననుభవించకుండగ నరికట్టుట యసంభవము కావుననే శ్రీకృష్ణ పరమాత్మ గీతలలో ఇటుల నుపదేశించెను.

"యత్కరోషి యదశ్నాసి ।
యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ !
తత్కురుష్వ మదర్పణం ॥

ఏపని నాచరించినను, ఏపదార్థము ననుభవించినను ఏద్రవ్యమును యజ్ఞాదుల యందుపయోగించినను; ఏవస్తువు నెవరిచ్చినను; ఏ సంకల్పమును గూర్చి తపస్సు జేసినను వాటినన్నింటిని నాకర్పణము జేయుము. దానివలని బంధవిముక్తుడ వగుదువు శాశ్వతానందము నందగలవు,

శ్లో॥ కామాత్ గోప్యః భయాత్ కంసః ।
ద్వేషాత్ చైద్యాదయో నృప ।
సంబంధాత్ వృష్ణయః స్నేహాత్ ।
యూయం భక్త్యావయం నృప॥

అను శ్రీమద్భాగవత ప్రమాణము ననుసరించి యౌవ్వన స్త్రీజన సహజమగు కామముచే గోపికలును; దేహాత్మభ్రాంతుడైన రాక్షసస్వభావమగు భయముచే కంసుడును; ప్రాకృతజన ప్రకృతియైన ద్వేషముచే శిశుపాలుడును; బాంధవముచే వృష్ణులును; సజ్జనసిద్ధమగు స్నేహముచే సాధువులును; భక్తజనపాలనమైన భక్తిచే భక్తులును తమతమ సహజస్వాభావిక్యమైన యింద్రియవిషయానుభవములచే మాత్రమే సులభముగ నిశ్చయముగ ముక్తులుకాగలిగిరి. దేహధారణకై మాత్రమే భుజించుట యను సిద్ధాంతమునకు వ్యతిరేకముగ భుజించుచుండుటకై మాత్రమే సృజించబడినవని వాదించు కొందరు బుద్ధిమంతులు "భగవంతుడు మనకు పదునొకండు నింద్రియములను వాటిని బహిర్ముఖములుగను సృజించి అవి యనుభవించుటకై పదునొకండు ప్రాకృతవిషయములను సృజించి యనుగ్రహించి యుండగా వాటిని యావిధముగ ననుభవించకుండగ యుండుట ఏమంత తెలివైనసంగతి యని వితండవాదన చేయుచుందురు. ఇందులకు సమాధానముగ భారతములోని ఒక ఐతిహ్యమును ఉదహరించ గోరుచున్నాము,

పూర్వము కురువంశమున నహుషుడనుచక్రవర్తికి యయాతి యను కుమారుడుదయించెను. ఆయన పెక్కేండ్లు ధర్మయుక్తముగా ప్రజల బాలించుచు నంత రూపమును జెఱుపునదియు. మిక్కిలియు ఘోరమైనదియు నగు ముదిమిని బొందెను. అతనికి దేవయాని యనుభార్య యందు యదువు, తుర్వాసుడు అను నిద్దరు కుమారులును; శర్మిష్ఠయను భార్యయందు ద్రుహ్యుడు, అనువు, పూరుడు అను ముగ్గురు కుమారులును కలిగిరి.

యయాతి తనముదిమివలన మిగుల వ్యథనొంది ఒకనాడు తన పుత్రులను బిలిచి "పుత్రులారా! నేను యౌవనప్రాయముతో భోగముల

ననుభవించుచుండు యువతులతోడ వయసుకాడనై యింకను క్రీడింపగోరుచున్నాను, నా ముదిమిని మీలో నొకరు పుచ్చుకొని రాజ్యము చేయుచుండుడు. నేను మీ యౌవనమును దీసుకొని భోగముల ననుభవించుచుండగలను. నాకు కామసుఖము నికను ననుభవించవలెనని యున్నది, ఇంతవరకు దానినెంతె యనుభవించినను తనివిదీరకున్నది'' అనెను.

ఇందులకతని నలుగురు పుత్రులు ఎంతమాత్రము నంగీకరించలేదు. గాని చివరి పుత్రుడగు పూరుడు యిందుల కంగీకరించి తన యౌవనమును తండ్రికిచ్చి అతని ముదిమిని తాను స్వీకరించి రాజ్యభారము వహించి యుండెను.

పిమ్మట బెబ్బులివలె పరాక్రమశాలియైన యారోజోత్తముడు పెక్కువేల వత్సరములు తన యిరువురు పత్నులంగూడియు, విశ్వాచి యను యప్సరసంగూడియు కుబేరుని యుద్యానవనమందు రమించెను.

ఎన్నివేల వత్సరము లిటుల యౌవనముతో స్త్రీలతో రమించినను యారాజు ఎంతమాత్రము కామతృప్తి నొందజాలడయ్యెను. విసువు జనిలచెనేగాని దనివి దీరలేదు.

అపుడా యయాతి యిటుల నాలోచించెను, ''కామము. కోరినవానిని ననుభవించుట వలన దీఱుట యొకప్పుడును లేదు. అది నేతిచే నగ్గి జ్వలించినటుల మఱియు నధికముగానే పెరిగియుండున్నది. భూమియందు సస్యము, యునధాన్యము, బంగారు పశువులు, స్త్రీలు. మొదలుగా నేవిగలవో యవి యెల్లను నొక్కనికి జాలవని తెలిసి శమమును బొందవలయును. ఎప్పుడొకడు కర్మచేతగాని. మనసుచేతగాని. వాక్కుచేతగాని, యే కాలమందును నేప్రాణులకును గీడు సేయకుండునో యప్పుడు వాడు బ్రహ్మము నొందును. ఎప్పుడు వీడు భయమునూలి యున్నాడో, ఎప్పుడు వీనివలన దక్కినవారు భయమునూలి యుందురో, ఎప్పుడు వీడు వకోరికయు లేక ద్వేషమును లేకయుండునో యప్పుడు బ్రహ్మము నొందును. మహాప్రాజ్ఞుండైన యాయయాతి కామసుఖములు హేయములని యిటుల విచారించి. తెలివిచే మనస్సును గుదురుపరచుకొని, విరిగియై పుత్రుని యొద్దనుండి తనముదిమిని మరలపుచ్చుకొని యాతని యవ్వనము నాతనికిచ్చి తనభార్యలతో తపంబాచరించబోయెను.

గాన కామాదులు ప్రాకృతానుభవముల కొలది మరింత యనుభవించవలెననెడి కోరిక కలిగి బాధహేతువులగునే గాని ముక్తి హేతువులు గావు. గాన వాని భగవత్ప్రీతికరములుగ మాత్రము ననుభవించవలెను.



# నారీవిభాగము

## భగవద్గీత తృతీయాధ్యాయ ప్రభావము

రచయిత:- శ్రీభగవత్పాదరేణువు.

### 3. కర్మయోగము

లక్ష్మీదేవి 'స్వామీ 3 వ అధ్యాయము వలన ఫలమేమని' శ్రీమహావిష్ణువును అడుగగా శ్రీమహావిష్ణువు చెప్పుచున్నాడు.

కుశిక వంశమునందు బుట్టిన జడుడను పేరు గల బ్రాహ్మణు డొకడు గలడు. అతడు పంచ మహాపాతకుడు. జారచోరత్వముల వలన గడించిన ధనముచే విదేశవస్తువులు కొనుటకై పర దేశమునకు వెళ్ళెను. కావలసిన వస్తువుల నన్నింటిని కొని యోడనింపుకొని తిరుగు ప్రయాణము సాగించుచుండెను. దైవవశాత్ మార్గమధ్యమున దొంగలడ్డుపడి జడుని జంపి యతని వస్తువులను దోచుకొనిరి.

పూర్వజన్మ కర్మఫల మనుభవించుటకై జడునకు పిశాచజన్మ కలిగెను. కాళ్లు అతిదీర్ఘములుగను తల పెద్దదిగను కండ్లు వికృతములుగను వెండ్రుకలు కడునిడుదలై శూలములవలెను నేర్పడి ధైర్యవంతులకు సహితము భయము గల్గించు రూపమేర్పడెను. ఆకలిబాధచే పీడింపబడి పొట్ట వెన్నున కంటుకొని పోయెను.

కొంతకాలమునకు తండ్రి దొంగలవలన చంపబడినాడను వార్త జడుని కొమారునకు తెలిసెను. తన తండ్రి ప్రేతరూపములో నున్నాడని తెలుసుకొనెను. జడునిపుత్రుడు విద్వాంసుడును ధర్మాత్ముడును అగుటచే తండ్రి ప్రేతరూపమును నివారణచేయ దలచి కావలసిన సామాగ్రులను జాగ్రత్తపరచుకొని గంగాయాత్రకు బయలు దేరెను.

ఒకనాటి సాయంకాలమున అరణ్యమధ్యమున యొకచెట్టుక్రింద బసయేర్పరచుకొని భగవద్గీత లోని మూడవ అధ్యాయమును పారాయణచేయ నారంభించెను. దైవవశాత్ పిశాచరూపుడైన జడుడు చెట్టుపైనుండి తన పుత్రుడు భగవద్గీత మూడవ అధ్యాయము చదువుట వినెను.

గీతాశ్రవణ ఫలమువలన జడునకు ప్రేతశరీరము పోయి దేవశరీరియై విమానారూఢుడై పుత్రుని కడ కరుదెంచి 'పుత్రకా! నేను నీతండ్రియైన జడుడను నీవు చేసిన గీతాపారాయణ శ్రవణమువలన నా ప్రేతశరీరము పోయి దేవశరీరి నైతిని' అనిసుతు నాశీర్వదించి నీ ప్రయత్నముచే నేను స్వర్గమునకు పోవుచున్నానను' అనిచెప్పెను. సుతుడంత 'తండ్రీ నేనింక తమకేమి కార్యము చేయవలెను' అని యడిగెను. 'కుమారా! నా పితృదేవతలు యేడుతరములుగా నరకమునబడి దుఃఖించుచున్నారు. వారికై నీవు గీత మూడవఅధ్యాయమును పఠించి దాని ఫలమును పితరుల కిచ్చిన వారు పదమపదమును జేరుదురు' అనిచెప్పి స్వర్గలోకమునకు బోయెను. జడపుత్రుడు అట్లే యొనర్చి పితృదేవతలకు ముక్తిని గలిగించెను.

ఇట్లుండగా యమలోకము పాడుపడెను. యముడు పరమాత్మ కడకేగి నమస్కరించి 'పాపులందరు విమానారూఢులై పుణ్యలోకములకు పోవుచున్నారే, ఇక నా గతి యేమి' అని యడిగెను.

'యమధర్మరాజా! చింతిల్లకుము. ఇది గీతా ప్రభావము, ఏపుణ్యాత్ముడు గీతాపారాయణము

ప్రాపుకచ్చెను. కావున ఓ వైశ్యకులరత్నమా! మీ అనుగ్రహముననే మేము శాపనివృత్తినంది బ్రాహ్మణుని యింట కన్యలమై జన్మించితిమి. ఇదియె మాపూర్వవృత్తాంత మని చెప్పి వెడలి పోయిరి.

ఓ లక్ష్మీ! కన్యకల వలన గీతాప్రభావమును విని యాభరతుడు పరమానంద భరితుడాయెను. కన్యకలు వైశ్యుని పూజించి జీవితాంతము వరకు గీతాపారాయణ జేసి స్వర్గస్థులైరి. కేవలము శ్రవణము మాత్రముననే జడరూపమున నున్న అప్సరసలకు మానవదేహము లభించెను. గీతాప్రభావము సామాన్యమైనది గాదు. అని శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవికి తేటపరిచిరి,

## తిరుక్కోవలూర్ పెంబిళ్ళై రహస్యము

### శ్రీ మహాభారతము.

అ॥ అంతరంగం పుక్కేనో సంజయనై ప్పోలే॥
తె॥ అంతరంగమును జొచ్చితినా సంజయునివలె॥

కురుపాండవ యుద్ధసన్నాహ సమయమున నొక రోజున దుర్యోధనుడు సంజయుని బిలిచి పాండవు లెంతలో నున్నారో పోయి కనుగొని రమ్మనమని చెప్పెను. జగదంతర్యామియగు శ్రీకృష్ణపరమాత్మకు యీ యుదంతము దెలిసి అర్జునుడు ద్రౌపదియు ఏకశయ్యపైనుండు సమయమున తానును వారితో కలసి అదే శయ్యపై వేళాకోళముగ శయనించి యుండెను.

సంజయుడు పరమభక్తి యుతుడు గనుక తదేకధ్యానముతో వాకిటనుండు కావలివారి నడుగకయే నేరుగా వారల యంతఃపురమును ప్రవేశించి యేకశయ్యలో వీరుముగ్గురును అణుమాత్రము భేదము లేక పరుండి నిద్రించు చుండుటను జూచి ఆహా! ఏమిచిత్రము ఈ పరమాత్మునితో ఇట్టి యరమరిక లేని ప్రవృత్తిగల అర్జునునేనా దుర్యోధనుడు జయించుట. ఇది దుస్సాధ్యము. ఆహా! ఇదేమి వైభవము? ఇదేమి శయ్య? ఇదెట్టినిద్ర? యనియనుకొనుచూ వెళ్లెనట.

(2.) ధృతరాష్ట్రునికి శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూప దర్శన మిచ్చిన వెనుక ధృతరాష్ట్రుడు కృష్ణా! నాకుయుద్ధ వృత్తాంత మంతయు నెటుల తెలియ నగునని యడుగగా; శ్రీకృష్ణుడు మామా! నీ మంత్రియగు సంజయునికి శ్రీవ్యాసమహర్షిచే జ్ఞానచక్షుస్సు యివ్వబడగలదు. దానిచేనతడు యుద్ధకాలమునజరుగు ప్రతిసంఘటనను వారి వారి అంతరంగికాభిప్రాయములు; మాటలు రహస్యములు, చర్యలు, అన్నియు నీకు తేటతెల్లముగా వివరింపగలడు. అనిచెప్పి వెళ్లిరట.

ఓ వి॥ సంజయునివలె భగవంతుని యంతరంగమున ప్రవేశించితినా!

## -:శ్రీమద్రామాయణము:-

అ॥ కర్మత్తాల్ పెత్రేనో జనకరై ప్పోలే॥
తె॥ కర్మమువలన లభించితినా జనకచక్రవర్తి వలె॥

(1) యజ్ఞకర్మారంభమునందు జనకునివలె లోకమాతను లభించితినా అని యొకఅర్థము.

శ్రీమద్రామాయణము:- జనకచక్రవర్తి ఒకకాలమున యాగమొనర్చుటకై మిథిలాపట్టణములో భూమిని చదునుచేయించు చుండగా నాగలి మొన కొక పెట్టె తగిలెను. ఆపెట్టెను తెరచి చూడగా నందొక స్త్రీ శిశువుండెను. నాగలి మొనవలన యేర్పడిన చాలునకు సంస్కృత భాషయందు 'సీత' యని పేరుగనుక సీతయందు దొరికిన యీబిడ్డను సీతయని పేరిడిరి.

(2) కర్మయోగమువల్ల కడతేరితినా జనకమహారాజు వలె అని రెండవ యర్థము.





శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ జ్యేష్ఠమాస పండిత పరిషత్సభలు.

బేతవోలు — గుడివాడ.

కృష్ణా జిల్లా.

స్వస్తిశ్రీ విజయ నామసంవత్సర జ్యేష్ఠ శుద్ధ విదియ శనివారము (తా 13-6-1953 తేదీ మొదలు వరుసగ మూడు దినములు కృష్ణాజిల్లా, గుడివాడ పట్టణమున బేతవోలువందలి శ్రీ వేణుగోపాల స్వామివారి ఆలయమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ జ్యేష్ఠమాస పండిత పరిషత్ సభలు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య ఉభయవేదాంత ప్రవర్తకులైన ఉపన్యాసకేసరి, సుబోధక సుధీమణి శ్రీమాన్ కోయిల్ కందాడై రంగాచార్య స్వామిగారి అధ్యక్షత క్రింద జరుగును. గాన తాము తప్పక యిందులకు విచ్చేసి యుండ ప్రార్థనగోరుచున్నారము.

కేంద్రసంఘ కార్యదర్శులు..  ఇట్లు

తె. కం. గోపాలాచార్యులు  ఆహ్వాన సంఘము,

అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు.  శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘశాఖ

గుడివాడ

## కార్యక్రమము

ప్రతినిత్యము ఉదయము గం. 6-30. లగాయతు, గం. 7-30 వరకు బేతవోలు శ్రీ సీతారామాంజనేయ భజన సమాజమువారి తిరునామ కాలక్షేపముతో సహా తిరువిమ్యుత్సవము.

7-30 లగాయతు గం. 9-30 వరకు పండితుల ఉపన్యాసములు.

మధ్యాహ్నము :- గం. 2-30 లగాయతు గం. 4-30 వరకు స్త్రీలకు ప్రత్యేకము విదుషీ మణులచేఉపన్యాసములు గావింబడును.

సాయంత్రము:- గం. 4-30 లగాయతు గం. 7-30 వరకు పండితుల ఉపన్యాసములు.

మూడవరోజు రాత్రి గం. 9-0 నుండి గ. 12-0 వరకు గుసప్రభ రూపక ప్రదర్శనము.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ,

## ప్రకటన

శ్రీ వైష్ణవులకు ముఖ్యముగ కావలసిన పుస్తకములను, వస్తువులను అందజేయు నుద్దేశముతో "గ్రంథ-విక్రయశాఖ"ను ఒకదానిని ఇదివరకే ఏర్పాటు చేసియున్నాము. దానినిప్పుడు బాగుగా నభివృద్ధి చేయదలంచి అవకాశ మున్నంతవరకు మన సంఘము తరపున యున్న ఆశ్రమముల లోను, శాఖా సంఘములలోను, శ్రీచూర్ణము, తిరుమణి, యజ్ఞోప వీతములు, తులసిమాలికలు మున్నగు వాటిని యథావిధిగ తయారుచేయించి విధ్యుక్త రీతిగా ప్రతిష్ఠాదులను చేయించి వలయు వారికి అందజేయుచున్నాము. ఇందు వలన బీదలగు ఆశ్రమవాసులకున్ను, శాఖాసంఘముల కున్ను కొద్ది ఆర్థికలాభమున్ను, వలయు వారికి స్వచ్ఛమైన వస్తుసామాగ్రి చౌకగ దొరకు టయు, రెండులాభములు సిద్ధించును.

వైవస్తువు లన్నియు శాస్త్రోక్తరీతిగా ప్రతిష్ఠాదులు చేయక ధరించరాదు. కాని విధానము తెలియకయు, తెలిసినను చేసుకొను అవకాశము లేకయు ప్రతిష్ఠించకయే ధరించుచున్నారు.

ఆ లోటును తీర్చుటకై మనసంఘ వైదిక పండితులచే వీటినన్నిటిని శాస్త్రరీతిగా ప్రతిష్ఠ చేయించి అమ్మించుచున్నాము. (ప్రతిష్ఠావిధానము కూడా త్వరలో మన పత్రికలో ప్రకటింప బడును)

ఇచ్చట తయారు కానట్టి బొట్టుపెట్టెలు, గోకర్ణములు, పవిత్రములు, పెరుమాళ్ళ యొక్కయు, ఆళ్వారాచార్యుల యొక్కయు పటములు మొదలగు వాటిని శ్రీరంగాది క్షేత్రముల నుండి తెప్పించి ప్రతిష్ఠాదులు చేయించి విక్రయించు చున్నాము.

కావున కావలసిన వారు వీటిని తెప్పించుకొని ఉపయోగింతురుగాక.

| | | | |
|---|---|---|---|
| గురుపరంపరాది. | 0-2-0 | ప్రపన్న తిరువారాధన క్రమము (లఘుతరవిధానం) | 0-2-0 |
| శ్రీ విష్ణు సహస్ర నామావళి. | 0-3-0 | భజయతి రాజస్తోత్రం (మూలం) | 0-1-0 |
| శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్రము. | 0-2-0 | భజయతి రాజస్తోత్రం (అర్థసహితము) | 0-2-0 |
| శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర వైభవము. | 0-2-0 | చతుశ్శ్లోకి. | 0-2-0 |
| శ్రీ కృష్ణాష్టోత్తర శతనామస్తోత్రం. | 0-2-0 | 108 దివ్యతిరుపతుల వైభవము. | 0-1-0 |
| శ్రీ గోదాష్టోత్తర శతనామస్తోత్రం. | 0-2-0 | ద్వయమంత్రార్థ ప్రకాశిక (పద్యములు కవిరత్నకృతం) | 0-4-0 |
| నిత్యాను సంధానము (పెద్దది) | 3-0-0 | నారదభక్తి సూత్రములు. | 0-4-0 |
| నిత్యాను సంధానము (చిన్నది) | 0-4-0 | శ్రీ రంగరాజ వైభవము. | 0-6-0 |
| రామానుజ సహస్ర నామావళి. | 0-8-0 | అచ్యుతానంద గోవిందశతకము. | 0-6-0 |
| లక్ష్మీ స్తవము. | 0-2-0 | ముముక్షుప్పడి | 1-4-0 |
| రామానుజ చరిత్రము. | 0-2-0 | గీతాసందేశం. | 0-6-6 |
| ప్రపన్నసంధ్యానుష్ఠానము. | 0-2-0 | భక్తరమునాధ. | 0-6-0 |
| ప్రపన్న తిరువారాధన క్రమము (లఘువిధానం) | 0-6-0 | కైశిక మహాత్మ్యము. | 1-0-0 |

# ప్రకటన

శ్రీ మతే రామానుజాయ నమః

మా వద్ద దొరకు వస్తువులు వాటి ఖరీదులు.

ధావళీలు మేలురకం కాశీవి.

సైజు 9౦ × 3౦ రు.15-౦-౦
.. మధ్యరకం 1౦-౦-౦
.. సాదారకం 8-౦-౦

మడిసంచులు, కిత్తనారవి.

శ్రీరంగమువి

18 × 24 సైజు రు. 2 8
1౦ × 2౦ రు. 2

బొట్టు పెట్టెలు శ్రీరంగమువి
సంప్రోక్షణ చేయబడినవి

3 సైజు 4 × 3 = ఒకఅరది మేలురకం రు. 1-4
.. సాదారకం అ.12
సైజు 2 × 3 మేలురకం అ.10
.. ..సాదారకం అ. 8
కర్రబొట్టుపెట్టె 4 × 3 = సాదారకం అ.12
కర్రబొట్టుపెట్టె 3 × 2 = .. అ. 8

మారేడుకాయలు

శ్రీచూర్ణముంచుకొనుటకు

శంఖచక్రములు చెక్కినది. అ. 8
.. సాదా మారేడుకాయ అ. 4

నారికేళపుకాయలు

శ్రీచూర్ణము ఉంచుకొనుటకు

శంఖచక్రములు చెక్కినది. అ. 8
.. సాదాకాయ అ. 4

నారికేళపు గోకర్ణం

శంఖచక్రము చెక్కినది. అ. 4
సాదాది అ. 2

యజ్ఞోపవీతములు మేలురకం

శ్రీరంగమువి. రెండుముళ్ళు. విధ్యుక్తముగా ప్రతిష్ఠ చేయబడినవి. అ. 4

యజ్ఞోపవీతములు మధ్యరకం

శ్రీరంగమువి రెండుముళ్ళు విధ్యుక్తముగా ప్రతిష్ఠచేయబడినవి. అ. 3

యజ్ఞోపవీతములు సాదారకం

శ్రీరంగమువి రెండుముళ్ళు విధ్యుక్తముగా ప్రతిష్ఠ చేయబడినవి. అ. 2

మూడురంగుల పఠములు

సైజు "1౦ × 14" రామానుజులవారు అ. 4
నమ్మాళ్వార్లు అ. 4
మణవాళ మామునులు అ. 4
శ్రీ వేదాంత దేశికులు అ. 4
శ్రీ ఆండాళ్ అ. 4
శంఖచక్రములస్వరూపము, వడగలబొట్టు తెంగలిబొట్టుకలది అ. 4
కార్డుసైజు మూడురంగుల పఠములు అ. 1
రామానుజులవారు అ. 1
నమ్మాళ్వార్లు అ. 1
మణవాళ మామునులు అ. 1
శ్రీ వేదాంత దేశికులు అ. 1
శ్రీ ఆండాళ్ అ. 1

పవిత్రములు

శ్రీరంగమువి విధ్యుక్తముగ ప్రతిష్ఠ చేయబడినవి. రు. 2-8

తులసిమాలికలు

ఆశ్రమములో పెరిగిన తులసిచెట్ల కర్రతో ఆశ్రమములోనే తయారుచేయించి గోమూత్రముతోనుమంచినూనె పసుపుతోను సంస్కరించి పంచసూక్తవిధానమున హోమముతో ప్రతిష్ఠ చేయబడినవి, ధరించుటకుగాని, జపము చేయుటకుగాని అత్యంత యోగ్యమైనవి. రు. 1

తిరుమణి

శ్రీరంగముది విధ్యుక్తముగ ప్రతిష్ఠచేయబడినది,
మేలురకం కణిక అ. 1
.. మధ్యరకం పై. 6
.. సాదారకం పై. 3

శ్రీ చూర్ణము

మేలురకం (కేవలం పచ్చిపసుపుతో మాత్రం వియ్యపుపిండి చేర్పకుండగ తయారుచేయబడినది.) పచ్చకర్పూరం కుంకుమపువ్వు చేర్చబడి విధ్యుక్తముగా ప్రతిష్ఠింప బడినది.
తు. 1, 8 అ. 1
ఎండుపసుపుతో చేసినది వియ్యపుపిండి కలిసినది, తు.1కి పై. 6

# ప్రకటన

## భక్తి "నివేదన" పత్రిక 1950—1951

వికృతి సంవత్సరము యొక్క మొత్తము జమ-ఖర్చు వివరము,

| జమలు | |
|---|---|
| విరాళములవలన రాబడి | 956_0_0 |
| కట్నముల వలన రాబడి | 75_0_0 |
| చందాల వలన రాబడి | 1793-11_0 |
| చేబదుళ్ళు చేసినవి | 110_0_0 |
| క్యాలండరుఅమ్మకమువలనరాబడి | 49_0_0 |
| శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ సభల వలన వసూలైన పోస్టేజీ | 25_0_0 |
| శ్రీ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారివద్ద తీసుకున్న బదులు వలన | 1515_3_3 |
| | 4523_14_3 |

| ఖర్చులు | |
|---|---|
| కాగితమునకై | 952_15_9 |
| అచ్చునకై | 1439_ 6_0 |
| బ్లాకులకై | 215_0_0 |
| బైండింగునకై | 183_ 0_0 |
| జీతములకై | 410_14_6 |
| క్యాలండరుపంచాంగము ప్రచురణకై | 758_ 6_0 |
| పోస్టేజి | 211_ 5_3 |
| ప్రయాణములకై | 219_13_0 |
| నిరుటిచేబదులు తీర్చినవి | 75_ 0_0 |
| స్టేషనరీ | 2_ 4_0 |
| చిల్లర అనామతు ఖర్చులు | 55_13_9 |
| | 4523_14_3 |

### శుక్రవారోత్సవములు

బందరులో శ్రీమతి మరింగంటి శేషమ్మగారు ఈశుక్రవారోత్సవమును ఈపట్టణములో నలుగడలను చాల ఉత్సాహముతో ఏర్పాటు చేసిజరిపించుచున్నారు

నూజివీడులో శ్రీమతి మరింగటి శేషమ్మగారు బందరునుండి యిచ్చటకు విచ్చేసి కోవిలలో స్త్రీలకై సభను జరిపించి ఇచ్చట శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క శాఖ నొకదానిని ఏర్పాటుచేసిరి.

శ్రీఉయ్యూరు రాజావారు ఈ కార్యక్రమమునకు చాల ప్రోత్సాహమిచ్చిరి.

### సంభావన

మచిలీపట్టణ వాస్తవ్యులైన శ్రీమతి మరింగంటి శేషాచార్య దంపతులు తమ పెద్ద కుమారుని వివాహ మహోత్సవ సందర్భమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 2_0_0 సంభావనను సమర్పించిరి. వీరికి శ్రీయఃపతి ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి రక్షించుగాక.



# ప్రచారవిభాగము

## 'భక్తినివేదన'

జయ — ఆషాఢము

## బదరీ యాత్రా ప్రత్యేక రైలు

### ప్రయాణ వివరములు

మన సంఘము వారిచే ఏర్పాటు గావింపబడిన ప్రత్యేక రైలు 7_54 వ తేదీని విజయవాడ స్టేషను నుండి బయలుదేరి నాలుగవ తేదీ రాజమండ్రి చేరుటయు, అచ్చట యాత్రీకులు చాల ఉత్సాహముగ అచ్చటి విశేషముల దర్శించిన విషయమును భక్తినివేదన పత్రికా పాఠకులగు తమకు క్రిందటి పత్రిక ద్వారా తెలిసియేయున్నది గదా!

నాలుగవ తేదీ రాత్రి అచ్చటినుండి బయలుదేరి బండి చాల విజయవంతముగ పయనించుచున్నది. 5 వ తేదీని సింహాచలములో బండి ఆగెను. యాత్రీకులు సింహాచలము కొండపైకేగి యచట ఆకాశగంగ నరసింహధార మొదలగు ధారలయందు స్నానముచేసి శ్రీ వరాహ నృశింహస్వామిని దర్శించిరి. అంతట వారలకై అచ్చట సత్రములో ఏర్పాటుచేయబడిన బసలయందు భోజనముల గావించుకొని విశాఖపట్టణములోని ముఖ్య ప్రదేశముల జూచివచ్చిరి. ఆరాత్రియే రైలు తిరిగి బయలుదేరెను. మర్నాడు ఉదయమునకు రైలు జగన్నాధముచేరెను. యాత్రికులు

5. హేతిరక్షో బ్రహ్మపుత్రః
తపస్తేపే సుదారుణం।
దివ్యవర్షసహస్రాణాం
శతం వాయు మభక్షత॥

5. బ్రహ్మపుత్రుడగు హేతియను రాక్షసుడు దారుణముగా నూరుసంవత్సములు పవనాశనుడై తపస్సుచేసెను.

6. ఉన్ముఖ శ్చోర్ధ్వబాహుశ్చ
పాదాంగుష్ఠవరేణ హ।
ఏకేన తిష్ఠతే వ్యగ్రః
శీర్ణాంపర్ణానిలాశ్రయః॥

6. ముఖమాకాశము వంకకు త్రిప్పియు, బాహువుల నెత్తియు, పాదాంగుష్ఠమునందు నిలబడి యుండియు పర్వతమందున్న ఆకులను భక్షించుచు సావధానముగా తపస్సు చేసెను.

7. బ్రహ్మాదీన్ తపసా తుష్టాన్
వరం వవ్రే వరప్రదాన్।
దేవై ర్దైత్యైశ్చ శస్త్రాస్త్రైః
వివిధైః మనుజై రపి॥

8. కృష్ణేశానస్య చక్రాద్యైః
అవధ్యః స్యాం మహాబలః।
తథేత్యుక్త్వాంతర్హితా స్తే
హేతి ర్దేవా నథాజయత్॥

7, 8. తపస్సుచే సంతోషించిన బ్రహ్మాదులను వారు వరమునిచ్చువారగుటచే వారలను దేవతలచేగాని, రాక్షసులచేగాని, శస్త్రాస్త్రములచేగాని, అనేకవిధములగు మనుష్యులచేగాని కృష్ణునియొక్క చక్రముచేగాని, శివునియొక్క త్రిశూలముచేగాని నేను చంపబడకుందును గాక "అని వరమువేడెను. వారును వరమునిచ్చి అదృశ్యులైరి, అపుడు హేతిదేవతలజయించెను.

9. ఇంద్రత్వ మకరో ద్ధేతి
ర్భీతా బ్రహ్మహరాదయః।
హరిం తే శరణం జగ్ము
రూచు ర్హేతిం జహీతి తాః॥

9. ఇంద్రుని జయించుటచే తానే ఇంద్రుడయ్యెను. ఇందువలన బ్రహ్మ, రుద్రుడు భయబడినవారై విష్ణువును "ఓ ప్రభువా! నిన్ను శరణుజొచ్చుచున్నాము. హేతినిజయించుము. అని ప్రార్థించిరి.

10. ఊచే హరిః అవధ్యోయం
హేతి ర్దేవాసురైః సురాః।
మహాస్త్రం మే ప్రయచ్ఛధ్వం
హేతిం హన్యాం హి తేన తం॥

10. అంతవిష్ణువు "ఈహేతియనువాడు దేవాసురులచే చంపబడడు. నాకొకమహాస్త్రమును తెచ్చిన నేనుదానితో అతనిని జంపుదును,

11. ఇత్యుక్తాః తే తతో దేవాః
గదాం తాం హరయే దదుః।
దధార తాం గదామాద్యో
దేవైః సుక్తో గదాధరః॥

11. అని చెప్పబడినవారై దేవలాతనికాగదనిచ్చిరి. దానిని ఆద్యుడగు విష్ణువు ధరించెను. అప్పుడు దేవతలాతనిని "గదాధరుడు అనిపిలచిరి.

పంచాగ్నీనాం పదాన్యత్ర
ఇంద్రాగస్త్యపదే వరే॥

19. తవేచ్చ కార్తికేయస్య
క్రౌంచమాతంగ యోరపి
దధీచం చాంద్రగణేశే
కాణ్వాంచ పద ముత్తమం॥

19. సూర్యపద, కార్తికేయపద, క్రౌంచపద, మాతంగపద, దధీచిపద, చంద్రపద, గణేశపద, ఉత్తమకణ్వపద

20. ముఖ్యలింగాని సర్వాణి
వ్యక్తావ్యక్తాత్మకా నపి
ఆద్యో గదాధరశ్చైవ
వ్యక్తరూపో గదాధరః

20. ఇంకను ముఖ్యములగు సంపూర్ణలింగ పదములు, వ్యక్తావ్యక్త రూపములతో నున్నవి. ఆదిగదాధరుడు వ్యక్తరూపముతోనున్నాడు.

21. గాయత్రీచైవ సావిత్రీ
త్రిసంధ్యేయం సరస్వతీ
గయాదిత్యశ్చోత్తరార్కో
దక్షిణార్కోపి నైమిషః
శ్వేతార్కో గణనాథశ్చ
వసవోష్టౌ మునీశ్వరాః॥

21. గాయత్రి, సావిత్రి, త్రిసంధ్యా, సరస్వతీ, గయా, ఆదిత్య, ఉత్తరార్క, దక్షిణార్క, నైమిష, శ్వేతార్క, గణనాథ, అష్టావసు,

22. రుద్రాశ్చైకా దశశ్చాథ
తథా సప్తర్షయః పరే
నారసింహో వామనశ్చ
కేదారః కనకేశ్వరః
ఫల్గీశః ఫల్గుచండీశో
ముండపృష్ఠో ఽథచండికా॥

22. ఏకాదశరుద్రులు, సప్తర్షులు, నారసింహ, వామన, కేదార, కనకేశ్వర, ఫల్గీశ, ఫల్గుచండీశ, ముండపృష్ట, చండికా,

సోమనాథశ్చ సిద్ధేశః
కపర్దీశో వినాయకః

సోమనాథ, సిద్ధేశ, కపర్దీశ, వినాయక,

23. నారాయణో మహాలక్ష్మీ
బ్రహ్మా శ్రీ పురుషోత్తమః
మార్కండేయోథ కోటీశో
హ్యాంగిరేశః పితామహః

23. నారాయణుడు, మహాలక్ష్మి, బ్రహ్మ, శ్రీపురుషోత్తమ, మార్కండేయ, కోటీశ, అంగిరస, పితామహ

31. శిలాయాం దేవరూపిణ్యాం
నతిష్ఠామ స్త్వయావినా।
సంస్థాస్యామో త్వయాసార్ధం
నిత్యవ్యక్తాదిరూపిణా॥

31. అంతవారు "ఓజగత్ప్రభో! నీవులేనిదే దేవరూపిణియగు శిలయందు మేముండజాలము. అందుచే వ్యక్తరూపాదులచే నీవుండిన మేమును ఉండగలము.

32. ఏవమస్తు శ్రియాసార్ధం
స్థిత శ్చాదిగదాధరః।
లోకానాం రక్షణార్థాయ
జగతాం ముక్తిహేతవే॥

32. "అట్లేయగుగాక" అనిగదాధరు డచట లోకరక్షణ కొరకును, జగత్తునకు మోక్షము నిచ్చుటకును లక్ష్మితోగూడనుండెను.

33. సువ్యక్తః పుండరీకాక్షో
జనార్దన ఇతి శ్రుతేః।
దేవైరగమ్యా మూర్తి
రాదిభూతా సనాతనీ॥

33. శ్వేతకల్పమున ఆది గదాధరుడు సువ్యక్త, పుండరీకాక్ష జనార్దన నామములతో దేవతలకు పొందశక్యము కాని సనాతన రూపము ధరించి ఉండునని భగవానుడు చెప్పినట్లు వినికిడి కలదు.

34. సువ్యక్తః శ్వేతకల్పే తు
భవిష్యామి తథా పునః।
వారాహకల్పే హ్యవ్యక్తో
దేవో మయ్యాగమ త్సురా॥

34. శ్వేతకల్పమున వ్యక్తరూపమునను, వారాహకల్పమున అవ్యక్త రూపమునను ప్రకటమగును.

35. సంతారణాయ లోకానాం
దేవానాం రక్షణాయ చ।
గయాశిరసి సువ్యక్తో
భవిష్యతి న సంశయః॥

35 లోకముల తరింపజేయుటకును, దేవతలను రక్షించుటకొఱకును గయునిశిరస్సున నావిర్భవించును. ఇందుసంశయము లేదు.

36. యే ప్రదక్ష్యంతి సదా భక్త్యా
దేవ మాదిగదాధరం।
కుష్ఠాదివ్యాధి నిర్ముక్తాః
మోక్షం తే ప్రాప్నువంతి చ॥

36. ఎవరు ఆదిగదాధరుని భక్తితోసేవించు కొందురో వారు కుష్ఠు మొదలగు రోగముల నుండి విడువబడి మోక్షమును పొందుదురు.

37. యే ప్రదక్ష్యంతి సదా భక్త్యా
దేవ మాదిగదాధరం।
తే ప్రాప్స్యంతి ధనం ధాన్యం
ఆయురారోగ్య మేవ చ॥

37. ఎవరు ఆది గదాధరదేవుని భక్తితోసేవింతురో వారు ధనధాన్య ఆయురారోగ్యములపొందుదురు.

45. శిలాయాం దేవరూపిణ్యాం
స్థితో బ్రహ్మాదిభి స్సురైః
పూజితం సంస్తుతం దేవం
నమామ్యాదిగదాధరం॥

45. దేవరూపిణియగు శిలపై బ్రహ్మాదిసురలతోగూడ ఉన్నవాడై పూజంపబడుచు స్తోత్రము చేయబడుచుండెడు ఆదిగదాధరునకు నానమస్కారము.

46. మహాదాదేశ్చ జగతో
వ్యక్తస్యైకం హి కారణం
అవ్యక్త జ్ఞానరూపం తం
నమామ్యాదిగదాధరం॥

46. మహాదాదిజగత్తునకు వ్యక్తరూపమున కారణమును, జ్ఞానమున అవ్యక్తుడగు ఆదిగదాధరునకు నమస్కారము.

47. యం చ దృష్ట్వా తథా స్పృష్ట్వా
పూజయిత్వా ప్రణమ్య తం
శ్రాద్ధాద్యైః బ్రహ్మలోకాప్తిః
నమామ్యాది గదాధరం॥

47. ఎవనిని సేవించి, స్మరించి, నమస్కరించి, శ్రాద్ధాదుల చేయుటచేత బ్రహ్మలోకము కలుగునో అతనికి నానమస్కారములు.

48. దేహేంద్రియ మనోబుద్ధి
ప్రాణాహంకార వర్జితం
జాగ్రత్స్వప్న వినిర్ముక్తం
నమామ్యాది గదాధరం॥

48. ఎవనికి, దేహ, ఇంద్రియ, మన, బుద్ధి, ప్రాణ, అహంకారములు లేవో, మేలుకొనుట, నిద్రించుట అనునవికూడ లేవో ఆ ఆది గదాధరునకునమస్కారము.

49. వ్యక్తావ్యక్త స్వరూపేణ
పదరూపేణ సంస్థితం
ముఖాది లింగరూపేణ
నమామ్యాదిగదాధరం॥

49. వ్యక్తావ్యక్త స్వరూపముచేతను,పదరూపముచేతను ముఖము మొదలగు అనయవరూపముతోనుండునో అతనిని నమస్కరింతును.

50. నిత్యానిత్య వినిర్ముక్తం
పరమానంద మవ్యయం
తురీయం జ్యోతి రాత్మానం
నమామ్యాదిగదా ధరం॥

50. స్థిరము అస్థిరమను భావములేని పరమానంద మయుడును, నాశరహితుడును, అంతిమావస్థనొందిన జ్యోతిర్మయమగు ఆత్మఅగువానికి నానమస్కారము.

(సనత్కుమారుడు చెప్పుచున్నాడు)

51. ఏవం స్తుతో మహేశేన
ప్రీత్యా హ్యాది గదాధరః
స్థితో దేవశిలాయాం చ
దేవైః బ్రహ్మాదిభి స్సురైః॥

51. ఇట్లు రుద్రునిచే ఆదిగదాధరుడు స్తోత్రము చేయబడినవాడై బ్రహ్మాది దేవతలతోగూడ దేవశిలయందుండెను.

# గయామాహాత్మ్యము



## షష్ఠాధ్యాయము

సనత్కుమార ఉవాచ.

1. గయాయాత్రాం ప్రవక్ష్యామి
శృణు నారద ముక్తిదాం।
నిష్కృతిస్త్విహ కర్తౄణాం
బ్రహ్మణా గీయతే పురా॥

2. ఉద్యతశ్చేత్ గయాం గంతుం
శ్రాద్ధం కృత్వా విధానతః।
విధాయ కార్పటీ వేషం
కృత్వా గ్రామం ప్రదక్షిణం॥

3. తతో గ్రామాంతరం గత్వా
శ్రాద్ధశేషాన్నభోజనం।
తతః ప్రతిదినం తత్ర
సతీర్థ ఫల మశ్నుతే॥

4. యస్య హస్తౌ చ పాదౌ చ
మనశ్చాపి సుసంయతం।
జితేంద్రియో దానశీలః
సతీర్థ ఫల మశ్నుతే॥

5, గృహాచ్చలిత మాత్రేణ
గయాయాం గమనం ప్రతి
స్వర్గారోహణ సోపానం
పితౄణాం చ పదేపదే॥

(సనత్కుమారుడు చెప్పుచున్నాడు)

1. ఓనారద! ముక్తినిచ్చుగయాతీర్థయాత్రను చెప్పెదను వినుము. గయాతీర్థయాత్రచే మోక్షముకలుగు నని పూర్వము బ్రహ్మచే చెప్పబడినదిగదా!

2. మనుష్యుడు గయకువెళ్ళుటకు సంసిద్ధుడగుచో విధివిధానముగ శ్రాద్ధమునుచేసి కార్పటీవేషమును ధరించి తనగ్రామమునకు ప్రదక్షిణముచేయవలెను.

3. తరువాత గ్రామాంతరమునకు వెళ్ళిశ్రాద్ధముసమిగిలిన అన్నమును భుజించవలెను. తరువాత ప్రతిదినమునను భుజింపకయే యుండిన తీర్థఫలమును పొందును.

4. ఏపురుషుని చేతులు, పాదములు,మనస్సును నియమించ బడినవై యుండునో, ఇంద్రియములజయించిన వాడును, ధ్యానశీలుడునై యుండునో ఆతడు తీర్థఫలము నొందును.

5. ఇంటినుండి గయకు వెళ్ళుటకై యాత్ర చేసినమాత్రమున పితరులకు అడుగడుగునకు స్వర్గసోపానములు వేసినవా డగును.

13. కవ్యవాహో ఽనలః సోమో
యమశ్చైవార్యమా తథా।
అగ్నిష్వాత్తా బర్హిషదః
సోమపాః పితృదేవతాః॥

13. ఓ కవ్యవాహనుడగు అగ్నిదేవ, సోమ, యమ, అర్యమా, అగ్నిష్వాత్తా, బర్హిషద, సోమప, పితృదేవతలారా!

14. ఆగచ్ఛంతు మహాభాగా
యుష్మాభీ రక్షితా స్త్విహ।
మదీయాః పితరో యే చ
కులే జాతాః సనాభయః॥

14. ఓ మహానుభావులారా! ఇచ్చటకురండు. మీచే ఈస్థానము రక్షింపబడుచున్నది. నా కులమున ఒకేనగరమున పుట్టిన పితరులును సపిండులు గదా! వారిని మీరురక్షించుచున్నారు.

15. తేషాం పిండప్రదానార్థం
ఆగతోఽస్మి గయా మిమాం।
తే సర్వే తృప్తి మాయాంతు
శ్రాద్ధేనానేన శాశ్వతీమ్॥

15. నేనువారికి పిండమునిచ్చుటకై గయకు వచ్చియున్నాను. వారంద రీశ్రాద్ధముచే నెల్లకాలమును తృప్తినొందుదురు గాక!

16. ఆచమ్యాక్త్వా తు పంచాంగం
ప్రాణాయామం తు యత్నతః।
పునరావృత్తిరహిత
బ్రహ్మలోకాప్తి హేతవే॥

16. ఆచమనముచేసి పునరావృత్తి రహితమగు బ్రహ్మలోకమును పొందుటకై పంచాంగ ప్రాణాయామమునుచేసి శ్రాద్ధమునుచేయువలెను.

17. ఏవంచ విధివత్ శ్రాద్ధం
కృత్వా పూర్వం యథాక్రమం।
పితౄనావాహ్య చాభ్యర్చ్య
మంత్రైః పిండప్రదో భవేత్॥

17. ఈవిధముగా యథావిధిగా పితరులపిలచి వారిని ప్రార్థించి మంత్రములతో పిండప్రదానము చేయవలెను.

18. తీర్థప్రేత శిలాద్రౌ చ
చరుణా ఽథ ఘృతేన చ
ప్రక్షాళ్య పర్వతస్థానం
పంచగవ్యైః పృథక్ పృథక్॥

18. తీర్థస్థానమగు ప్రేతశిలా పర్వతముపై చరువుచేగాని నేతితోగాని ప్రేతశిలను పంచగవ్యములతోను వేరు వేరుగా కడిగి శ్రాద్ధముచేయవలెను,

19. స్వమంత్రైరథ సంపూజ్య
పదే చ పదదైవతం
యావన్తి లాజముష్టీశ్చ
గృహీంత్వాః పితృకర్మసు॥

19. మంత్రానుసారముగ దేవతాపదముల పూజించి శ్రాద్ధముచేసిన ఎన్ని నువ్వులను మనుష్యుడు శ్రాద్ధమున నుపయోగించునో,

20, గచ్ఛంతి భీతా స్త్వసురాః
సింహం దృష్ట్వా యథా మృగాః॥

20. అందరు రాక్షసులు సింహమునుచూచి మృగములు పరుగిడునట్లు భయముతో పారిపోదురు.

21. అష్టకాసు చ వృద్ధౌ చ
గయాయాం చ మృతే ఽహని
మాతుః శ్రాద్ధం పృథక్ కుర్యాత్
అన్యత్ర పతినా సహ॥

21. తండ్రి వృద్ధుడైనను, గయయందు చని పోయినను తల్లి శ్రాద్ధమును వేరుగాచేయవలెను. మరియొకస్థలమున సపత్నీక శ్రాద్ధముచేయ వచ్చును.

22. వృద్ధిశ్రాద్ధం తు మాత్రాది
గయాయాం పితృపూర్వకం
పాదపర్వసమారభ్య
దక్షిణాగ్రైః కుశైః క్రమాత్॥

23. సక్తునా ముష్టిమాత్రేణ
దద్యా దక్షయ్య పిండకం
తిలాజ్య మధుదధ్యాదీన్
పిండద్రవ్యేషు యోజయేత్॥

23. నువ్వులు, నేయి, తేనె, పెరుగు మొదలగువానిని పిండద్రవ్యములతో కలిసి పిడికెడు పేల పిండితో అక్షయపిండమును చేయవలెను.

24. సంబంధిన స్తిలాద్భిశ్చ
కుశేష్వావాహయే త్తతః
ఆబ్రహ్మ స్తంభపర్యంతం
దేవర్షి పితృమానవాః॥

24. నువ్వులు కలిపిన జలముతో సంబంధులగు పితరులను కుశలయందు పిలువవలెను. బ్రహ్మ మొదలు సమస్త దేవలు, ఋషులు, పితృదేతలు, మానవులు

25. తృప్యంతి పితర స్సర్వే
మాతృమాతామహాదయః
అతీతం కులకోటీనాం
సప్తద్వీప నివాసినాం॥

25. సప్తద్వీపములలో నివసించు కోట్లకొలది పితరులు తృప్తి చెందుదురు.

26. ఆబ్రహ్మ భువనాల్లోకా
దిద మస్తు తిలోదకం
పితా పితామహశ్చైవ
లినాచ ప్రపితామహః॥

26. బ్రహ్మలోకమునుండి అధోలోకమువరకుండెడు, పితా, పితృతండ్రి, ముత్తాతలవరకును తృప్తికలుగునట్లకై మేము తర్పణము నిచ్చుచున్నాము.

# శ్రీమదష్టాక్షరీ కోటిహవన మహాక్రతువు

జయప్రద నిర్వహణకై స్వపర హస్తముల ద్వారా విరాళముల సేకరించి పంపుచున్న

## భక్తులకు విజ్ఞప్తి

మహాశయా!

శ్రీమదష్టాక్షరీకోటి హవన మహాక్రతువునందు ప్రధాన కార్యక్రమమగు జపదీక్ష 20వ తేదీని ప్రారంభింపబడి అత్యంత దీక్షతో వైభవముగ జరుగుచున్నది. సుమారు ఒకనెల గడచినచో హోమాది కార్యక్రమము ప్రారంభించుటకు యికనెంతయో వ్యవధిలేదు. సుమారు 600 మంది యాత్రికులు యీ మహాక్రతువు సేవించుటకై ఉత్తరాది పుణ్యక్షేత్రముల దర్శించుచు త్వరలో 3వ తేదీనే అచ్చటికి చేరనున్నారు. ఈమహాక్రతువునకై విరాళముల నొసంగిన దాతల గోత్రనామములుగల రశీదులుగూడ అచ్చటి క్రతువున శ్రీబదరీశుని సన్నిధానమున నివేదింప బడుటకై మనసంఘ ప్రత్యేకరైలునందు తీసికొనిపోబడినవి. ఇంకను యిచ్చటికి వచ్చుచున్నవి కూడ యేదినమున వచ్చినవి యాదినముననే అచ్చటికి పంపివేయబడుచున్నవి. "అస్త్యుత్తరస్యాం దిశిదేవతాత్మాహిమాలయోనామనగాధిరాజః" అని దేవతారూపముగ శ్రీ కాళిదాసమహాకవిచే స్తోత్రము గావింపబడిన ఆమహా పుణ్యభూమియగు హిమవత్పర్వతమున సమస్తేంద్రియముల యందును నేత్రములవలె ప్రకాశించుచున్న ఆ బదరికాశ్రమమున మన్త్రరత్నముగ ప్రసిద్ధివడసిన అష్టాక్షరీ మంత్రజపము పదికోట్లసార్లు జపింపబడుటయు, తచ్ఛాంతికై యింతటి మహోత్కృష్ట మును, అభూతపూర్వమునగు క్రతువుజరుగుటయు చరిత్రమున నిదియేగదా ప్రథమపర్యాయము. ఇట్టి మహాక్రతువున విరాళములనొసగి తమనామధేయము బదరీశుని సన్నిధానమున నివేదింప జేసికొనిన భక్తుల సుకృతము నెన్నతరమే? ఈ భారతావనిలో జన్మించిన ప్రతివారును యిందు పాల్గొని యిట్టి మహాక్రతువు నన్వయించి తమజన్మసాఫల్యమును నొందుటకు వీలుగా నుండునటుల గదా ఆహుతి 1కి ఒక్క అణామాత్రమే నిర్ణయించబడినది? ఈసమయమును చేజార్చుకొని పిదప విచారించి లాభములేదు. ఇచ్చటనుండి తమవిరాళముల బదరికాశ్రమము చేర్చుటకు సుమారు 15 రోజులు పట్టును. కావున త్వరపడి హోమాది కార్యక్రమము ముగియకపూర్వమే మీ విరాళముల బదరికాశ్రమమునకు పంపి మీధనమును యిట్టి సత్కార్యమున నుపయోగపడు నటుల జేసికొని యీమహాక్రతువు నన్వయించి పుణ్యభాగస్థులై తరింతురుగాకయని కోరుచున్నాము. ఆలస్యము ఆశాభంగ జనకము. సమయము ముందునకు పోవుచుండునే గాని యెన్నడును తిరిగిరాదు. కాబట్టి త్వరపడి వెంటనే మీప్రాంతమండలి ప్రచారకులద్వారా తమ తమ విరాళములను బదరికాశ్రమము 3-8-54 వ తేదీలోగా చేరునట్లు పంపగోరుచున్నాము.

విరాళముల వసూలుజేసి పంపుటద్వారా సహకరించుచున్న భక్తులారా!

తమవద్ద సేకరించియుంచబడిన విరాళములను, పూర్తిగావింపబడిన రసీదు పుస్తకము లను వెంటనే 3వ తేదీ లోపుననే బదరికాశ్రమమునకు చేరునటుల పంపగోరుచున్నాము. తమరు యీ మహాక్రతువు జయప్రద నిర్వహణలో చూపుచున్న శ్రద్ధకు, చేయుచున్న సహకారమునకు మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. క్రతువు జయప్రదముగ సాగుచున్నది. ఈ సమయముననే తమ యమూల్య సహకారమునొసంగి ఆక్రతువును లోకకల్యాణ, శాంతి వ్యవస్థా నాది ఫలదాయినినిగ జేయవలసియున్నది. కావున ఉత్సాహముతో కృషిసల్పి సాధ్యమైనంత శీఘ్రము ముగ విరాళముల సేకరించి యీమహాక్రతు పుణ్యము నొందుదురుగాకయని కోరుచున్నాము.

# శ్రీ జీయరుస్వామివారి – చాతుర్మాస్యదీక్ష – ఆశ్రమంలోనే

[ గుంటూరుజిల్లా తెనాలి తాలూకా – నడిగడ్డపాలెం – శ్రీ వాసుదాసాశ్రమంలో ]

ఈ సంవత్సరము కూడ శ్రీ జియ్యరు స్వామివారి చాతుర్మాస్య దీక్షా కార్యక్రమము గుంటూరు జిల్లా తెనాలితాలూకా నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమములో శ్రీ కోదండ రామస్వామివారి సన్నిధియందు జరుగును – ప్రారంభము ఆషాఢశుద్ధ ఏకాదశి (1–7–63) ముగింపు కార్తీక శుద్ధద్వాదశి (28–11–63).

ఈ సంవత్సరము ఆశ్వయుజములు రెండు వచ్చుటచేత చాతుర్మాస దీక్ష ఒక మాసము పెరిగినది.

ఈ 5 మాసములు శ్రీ జీయరు స్వామివారు ఆశ్రమమునందే వేంచేసియుండి చాతుర్మాస్య దీక్షా కార్యక్రమమును జరుపుదురు. ఈ చాతుర్మాస్య దీక్షలో యథాపూర్వకముగా శ్రీ రామ మహాక్రతు కార్యక్రమము కూడ నిరంతరము నిరవచ్ఛిన్నముగా జరుగుచునే యుండును. కాని యీ దీక్షలో నుండగా నిలచి పోయిన క్రతు స్తంభము లన్నియు నా యా గ్రామాదుల యందు ప్రతిష్ఠించ బడును కాన భక్తులు తాము వ్రాసిన రామకోటి పుస్తకములను ఆశ్రమమునకే పంపవలసినది.

తమ తమ గ్రామాదులలో క్రతు స్తంభములు ప్రతిష్ఠింప జేయ దలచుకొన్న భక్తులు ఆశ్రమమునకు వచ్చిగాని, లేదా లేఖల ద్వారాగాని, శ్రీ జియ్యరు స్వామివారికి విన్నవించుకొని వారి యనుమతిని స్వీకరించు కొనవచ్చును.

మరియు ఈ చాతుర్మాస దీక్షా కాలములో పూర్వము మాదిరిగా భక్తులు తమ తమ గ్రామాదులలో హరేరామ నామ సంకీర్తనము విరివిగా జరిపింప కోరుచున్నారు.

ఈ సంవత్సర మీ చాతుర్మాస్యదీక్ష కలకత్తాలో జరుపుటకు శ్రీ స్వామివారు సంకల్పించిరి. అచ్చట ఏర్పాటులన్నియు చేయబడినవి కాని మార్గములో కటకం వద్ద మహా నదియును, మరియు ముందుకొన్ని నదులున్ను నీరువచ్చి యాత్రాప్రయాణమునకు అసౌకర్యము కలుగుట చేతను మరియుకొన్ని యితర కారణముల చేతను శ్రీ జీయరుస్వామివారు వెనుకకు తిరిగి ఆశ్రమమునకు విచ్చేసిరి. ఇకనుండి శ్రీ స్వామివారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపువారు ఈ చిరునామాకు వ్రాయవలెను.

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు
శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం (P. O.) (Via) చేబ్రోలు
గుంటూరు జిల్లా (A. P.)

## ఆ ము దా ల వ ల స లో - 36వ క్రతువు

శ్రీకాకుళం జిల్లా అముదాలవలస గ్రామంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి సన్నిధి యందు 36వ శ్రీరామ మహాక్రతువు వైభవముగా జరుగుచున్నది. ఈ క్రతువుతో పాటుగా ఆలయముముందు ప్రదేశములో శ్రీరామ మహాక్రతు స్తంభ నిర్మాణము ప్రారంభింపబడి 6 రోజులలో పూర్తిచేయ బడినది. ఇచ్చట క్రతు స్తంభమునకు ఒకరోజులోనే తగిన ద్రవ్యమును ఉదారులగు దాతలు విరాళము లిచ్చిరి ఇచ్చట క్రతు స్తంభమునకు 15—6—63 తేదినాడు పురప్రముఖులు రాజకీయముగాను, ఆధ్యాత్మికముగాను మంచి ఉత్సాహము శ్రద్ధాభక్తులు గల శ్రీ బొడ్డేపల్లి సత్యనారాయణమూర్తిగారు సతీసమేతముగా వైదిక దీక్షతో మహావైభవముగా శిలావిన్యాసోత్సవము గావించిరి. ప్రతిదినము ఉదయము రాత్రి గ్రామములోనున్న స్త్రీలు, పురుషులందరు రామక్రతు కార్యక్రమములో పాల్గొనిరి ఈ క్రతు స్తంభ ప్రతిష్ఠ 23—6—63వ తేదినాడు మహావైభవముతో సమాప్తమైనది. చాతుర్వర్ణముల వారికి విరివిగా అన్నదానము జరిగినది. పరిసర ప్రాంతములనుండి భక్తులు ప్రతిదినమువచ్చి క్రతు స్తంభమును సేవించు కొను చుండిరి. ఈ క్రతువులో మరొక విశేషమేమనగా క్రతు స్తంభ నిర్మాణము నిమిత్తమై ఈ గ్రామములోని ప్రతియింటికిన్ని ఒక్కొక్క యిటుకను యిచ్చి దానిపై "శ్రీరామ" అని వ్రేలితో వ్రాసి 108 పర్యాయములు దిద్ది వానిని తిర్గి యథోచిత యథాశక్తి దక్షిణతో ఈయ వలసినదిగ కోరబడెను. గ్రామస్థులందరును అటులనే గావించిరి. ఆ యిటుకలతో ఈ స్తంభ నిర్మాణము గావింపబడెను.

ఈ క్రతుకార్యక్రమములో అత్యంత శ్రద్ధాభక్తులతో వీరు చాల కృషిచేసిరి :—

(1) శ్రీ బొడ్డేపల్లి సత్యనారాయణ మూర్తిగారు (2) శ్రీవైశ్యరాజు చంద్రయ్యరాజుగారు (3) శ్రీవైశ్యరాజు సవరరాజుగారు (4) శ్రీ మోణంగి వెంకట సూర్యప్రకాశరావుగారు శ్రీ K. సత్యవతమ్మగారు. శ్రీ వర్తక సంఘమువారు శ్రీ అన్నదాన సమాజమువారు శ్రీ యువజన సంఘమువారు. శ్రీ మహాలక్ష్మి శుక్రవార పూజామహిళా మండలివారు పెక్కురు పురప్రముఖులు పాల్గొనిరి.

శ్రీ హ య గ్రీ వా య న మః

## ప్ర చా ర వి భా గ ము

శ్రీమాన్ మనజీయరు స్వామివారు కటకంలో బక్షీబజారులో శ్రీ జగన్నాథ - అమరేశ్వర - ఆలయముల ప్రాకారమందు నిర్మింప జేసిన శ్రీరామ మహాక్రతు స్తంభమును ది 6—6—63వ తేదినాడు— ఒరిస్సారాష్ట్ర డిప్యూటీ చీఫ్ మినిష్టరు. శ్రీ మాననీయ 'బిరెన్ మిత్రా' మహాశయులు ఆవిష్కరణ మహోత్సవము గావించిరి. ఆ నాడు కటకంలోనున్న భక్తులందరు విచ్చేసి యీ మహోత్సవమును సేవించి చాలయానందించిరి.

[illegible] శ్రీ [illegible] స్వా[illegible] తెప్పించినాము మన్నా
శిలాశాసనమునుండి మేళతాళములతో, స్వస్తివాచకములతో హరేరామ సంకీర్తనలతో భక్తులందరూ వెంటనుండగా దాదాపు రెండుమైళ్ళు నడచి యూరేగింపుతో, యంత్రములను రామపట్టాభిషేక విగ్రహమును కలశములను రామకోటి పుస్తకములను రామక్రతుస్తంభము వద్దకు తోడ్కొని వచ్చిరి. సరియగు ముహూర్తమునకు శ్రీజీయ్యరుగారు యంత్రములను కలశములను పట్టాభిషేక విగ్రహమును స్థాపన చేయగా శ్రీడిప్యూటీ చీఫ్ మినిష్టరుగారు కొబ్బరికాయకొట్టి శ్రీరామునకు పూలమాల సమర్పించి అఖండజ్యోతిగా కర్పూర నీరాజన మిచ్చిరి. అటు పిమ్మట క్రతుస్తంభములో రామకోటి పుస్తకములు సమర్పించ బడెను.

ఈ కార్యక్రమము తరువాత రెండుగంటల కాలము క్రతుస్తంభము వద్దసభ జరిగెను. ఆ సభలో ఒరిస్సారాష్ట్ర డిప్యూటీ చీఫ్‌మినిష్టరు శ్రీ మాననీయ బెహెన్ మిత్రాగారు క్రతుస్తంభమును గురించి యుపన్యసించుచు ఈ క్రతుస్తంభమునకు నేనే శిలావిన్యాసము గావించి ఆవిష్కరణోత్సవము కూడ నేనే జరుపుట ఇది నా భాగ్యవిశేష మనియు ఇంత త్వరలో ఈ స్తంభనిర్మాణము గావించిన శ్రీ జీయరు స్వామివారికి జోహారు లర్పించు చుంటిననియు, యీ స్తంభముయొక్క వైభవము చాలా విలక్షణ మైనదనియు ఇందులకుగా నేనీ క్రతుస్తంభమునకు వెయ్యి రూపాయలుపెట్టి ప్లాష్టిక్ గ్లాసులు సంక్షేప రామాయణ శిలాఫలకలకు రక్షణ నిమిత్తమై సమర్పింతుమని వాగ్దానము గావించిరి.

తరువాత శ్రీ జీయరు స్వామివారు యీ క్రతుస్తంభము ఇచ్చట జరిపిన రెండు క్రతువుల తపఃఫలమనియు, దీనిని ప్రదక్షిణ పూజానమస్కారములతో అర్చించి తరించుడని యుపదేశ మిచ్చి శ్రీ మంత్రిగారి కోరికపై భగవంతుడెవ్వడు ? యతని స్వరూప స్వభావము లేమి ? యతనిని మన మేల పూజించవలెను ? యను విషయమును గురించి విపులముగా ఉపన్యసించిరి.

అటు పిమ్మట యీ క్రతువులలో వాల్మీకి స్థానీయులుగానున్న మనసంఘ కవిగారైన శ్రీ మాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్య స్వామివారు. తాము రచించిన సంస్కృత శ్లోకములలో సభకు అభినందన మిట్లు తెలిపిరి.

## అభినందన పత్రిక

శ్లో॥ శ్రీమతే సర్వలోకానా మత్యంత క్షేమహేతవే ।
సేతవే చ భవాంభోధే శ్రీరామ క్రతవే నమః ॥ 1

శ్లో॥ శ్రీమానయం క్రతుస్తంభః కటకం పురవాసినాం ।
సర్వేషాం భవతాం దద్యాత్ మంగళాని నిరంతరం ॥ 2

శ్లో॥ స్వాగతం మంత్రివర్యాణాం స్వాగతం సభ్యధీమతాం ।
స్వాగతం మహితోద్యోగ శాలినాం యోషితామపి ॥ 3

శ్లో॥ 'ఒరిస్సారాష్ట్ర డిప్యూటీచీఫ్ మినిష్టర్' మహాశయః ।
ఇతో ఽధిక మహోద్యోగ సంపదా వర్ధతాం సదా ॥ 4

శ్లో॥ [illegible] ప్రధానమంత్రి శ్రీ 'బెరిన్ మిత్రా' మహోదయైః ॥
కటకే ఽస్మిన్ క్రతుస్తంభే శిలాన్యాసోత్సవః కృతః ॥ 5

శ్లో॥ తచ్ఛిలాన్యాస భాగ్యేన క్రతుస్తంభో ఽయ ముద్ధృతః
'బెరిన్ మిత్రా' జగన్మిత్రం కృపాపాత్రం రఘుప్రభోః ॥ 6

శ్లో॥ అహో !! కటకపౌరాణాం భాగ్యం కిమితి కథ్యతే ।
ఆస్తే యత్ర క్రతుస్తంభః సురద్రుమ ఇవాపరః ॥ 7

శ్లో॥ జీయా దష్టోత్తర శతక్రతుస్తంభ ప్రచారకః ।
శ్రీమాన్, త్రిదండీ, భగవాన్, 'శ్రీ - రా - జీయర్' జగద్గురుః ॥ 8

శ్లో॥ శ్రీమన్నారాయణాచార్య రామానుజ జయతీశ్వరైః
స్థాపితో ఽయం క్రతుస్తంభః వర్ధతామభి వర్ధతాం ॥ 9

శ్లో॥ అత్ర రామ క్రతుస్తంభ నిర్మాణే ఽతి సహాయతాం ।
కుర్వతాం మహతాం దద్యాత్ శుభాని రఘునందనః ॥ 10

శ్లో॥ శ్రీమతాం 'అడ్వకేట్' 'యన్ - వి' రామదాసు మహాత్మనాం
శ్రీ 'కటావ్' 'మాధవబాబు' ముఖ్యానా మయ మంజలిః ॥ 11

శ్లో॥ అన్యేషామపి పౌరాణాం క్రతుస్తంభోప కారిణాం ।
భక్తిశ్రద్ధా సమేతానాం భక్తానా మస్తు మంగళం ॥ 12

శ్లో॥ క్రతుస్తంభస్య ప్రారంభం సమాప్తిం చ వికుర్వతాం ।
శ్రీమతాం మంత్రివర్యాణాంసన్తు సంపత్సమృద్ధయః ॥ 13

శ్లో॥ క్రతుస్తంభస్య యేపూజాం కుర్వన్తి పరయా ముదా ।
తేషాం సర్వార్థ సిద్ధిస్స్యాత్ సీతారామ ప్రసాదతః 14

శ్లో॥ ఒరిస్సా ప్రథితే రాష్ట్రే కటకం నామపట్టణే ।
జగన్నాథామరస్వామి దేవాలయ పురస్థలే ॥ 15

శ్లో॥ భక్తానా మిష్టసిద్ధ్యర్థం లోకకళ్యాణ కాంక్షయా ॥
స్థాపితో ఽయం క్రతుస్తంభః జీయాదా చంద్రతారకమ్ ॥ 16

ఆటు తరువాత శ్రీమాన్ అడ్వకేట్ N. V. రామదాసుగారు క్రతు స్తంభ మహాత్మ్యమును గురించి ఉపన్యసించి, పిమ్మట శ్రీ డిప్యూటీ చీఫ్‌మినిష్టరుగారికి, సభ్యులకు క్రతు స్తంభ నిర్మాణ సహాయకారకులకు అందరకు కృతజ్ఞతలు నుడివిరి. శ్రీజియ్యరు వారిక్కడకు నిర్హేతుక జాయమాన కటాక్షములో విచ్చేసి పవిత్రమైన రామక్రతువులు జరిపి యీ క్రతు స్తంభమును మన కొసంగి నందులకు వారికనేక కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పించిరి. తరువాత బీదలకు విరివిగా అన్నదానము జరిగెను. ఆ నాటిరాత్రి సభలో శ్రీమాన్ మనకవిగారికి కటకం ఆంధ్ర సంఘము వారు కవిసన్మానము గావించిరి.

కటకంలో శ్రీజియ్యరు స్వామివారు 24, 35, క్రతువులు పూర్తిగా జరిపి 36వ క్రతువులో 10రోజులు క్రతుకార్యక్రమమును జరిపిరి. ఓఢ్రదేశములో భక్తిశ్రద్ధలు మెండే. అయినను అన్యరాష్ట్రీయులచ్చటికివచ్చి ప్రచారము చేయుట బహు ప్రయాసకరము, అందుచే ఇచ్చటఇంత సౌచ్యకాలము ఆగవలసి వచ్చినది. చివరకి ఈ క్రతువులో ఓఢ్రప్రముఖులందరును పాల్గొనిరి. వారే విరివిగా విరాళములిచ్చిరి శ్రీరామ కోటిని వ్రాసిరి 2 క్రతువులను వారే పూర్తిగ నిర్వహించిరి. అప్పటికికాని క్రతు స్తంభము పూర్తికాలేదు. ప్రతిదినము సాయం కాలము గం. 6–00 లకు శ్రీజియ్యరు స్వామివారు విన్నా విలాసుకు విచ్చేసి అచ్చట రాత్రి గం 9–00 ల వరకు శ్రీరామాయణోపన్యాసములను హిందీలోను, ఆరవములోను, తెలుగులోను, ఉపన్యసించిరి. యీ సభకు పెక్కురు స్త్రీ పురుషులు ప్రతిదినము వచ్చుచుండెడివారు అచ్చటనే సుమారు 50మంది సభ్యురాండ్రతో శ్రీయతిరాజసేవా మహిళామండలిని స్థాపించిరి.

ఈ క్రతువులోను క్రతు స్తంభ నిర్మాణములోను శ్రద్ధగా కొందరు మహనీయులు పూనుకొనిరి.

(1) శ్రీ N. V. రామదాసుగారు (హైకోర్టు అడ్వకేట్) (2) శ్రీమాన్ కటావ్ గారు (3) శ్రీ మాధవ బాబుగారు (4) శ్రీపరాంకుశం బాలకృష్ణమూర్తిగారు (హైకోర్టు అడ్వకేట్‌గారు) (5) శ్రీమాన్ తిరుమల పెద్దింటి జగన్నాథాచార్యులుగారు (6) శ్రీమాన్ పరాంకుశం పార్థసారథిగారు (బరంపురం ఆడిటరు) (7) శ్రీగాదె రాఘవరావుగారు (8) శ్రీ P. V. రమణమూర్తి గారు (9) శ్రీ P. జగన్నాథరావు గారు. (10) మరియు కటకంలో సుప్రసిద్ధులైన న్యాయవాదులు. శ్రీ మార్వాడీ సంఘమువారు — కొందరు పురప్రముఖులు వీరందరకు శ్రీ సీతారాములు సమస్త సన్మంగళము లొసంగుగాక. శ్రీమాన్ ప. పార్థసారథిగారి యొక్కయు, శ్రీమాన్ న్యా. రామదాసు గారియొక్కయు భక్తిశ్రద్ధలు ప్రత్యేక ప్రశంస నీయము. వీరి కృషియే ఈ సఫలతకు కారణము. ఆ మరునాడు 7వ తేది శ్రీజగన్నాథ క్షేత్రములో జ్యేష్ఠాభిషేకోత్సవము జరుగునని తెలిసి శ్రీ స్వామివారు శ్రీపూరీ క్షేత్రమునకు వేంచేసి అచ్చట ఆ మహోత్సవమును తృప్తితీర సేవించి సాయంకాలమునకు కటకమునకు విచ్చేసిరి. మరునాడు 8—6—6?వ తేది కటకంనుండి బయలుదేరి రాత్రి బరంపురంలో రామక్రతు రాత్రికార్య

క్రమము గావించి మరునాడు ఉదయం ఇచ్ఛాపురమునకు చేరిరి. ఇచ్ఛాపురంలో ధ్వజ స్తంభమువద్ద పగలు శాస్త్రోక్త కార్యక్రమమును జరిపి సాయంకాలమునకు ఆముదాలవలస గ్రామమునకు సపరివారముగా స్వామివారు చేరిరి.

## సాంఘిక వార్తలు

కటకంలో ఇటీవల శ్రీ జియ్యరు స్వామివారు శ్రీయతిరాజసేవా మహిళా మండలిని ఏర్పాటు గావించిరి.

(1) శ్రీమతి న్యాయపతి లక్ష్మీనరసమ్మగారు (అధ్యక్షురాలు)
(2) శ్రీమతి పరాంకుశం లక్ష్మీనరసమ్మగారు (ఉపాధ్యక్షురాలు)
(3) శ్రీమతి కొత్తపల్లి విశాలాక్షమ్మగారు (కార్యదర్శిని)
(4) శ్రీ న్యాయపతి సుభద్రగారు (కోశాధికారిణి)
(5) శ్రీమతి పరాంకుశం రాజామణిగారు } సహాయకార్యదర్శినులు
(6) శ్రీ కొత్తపల్లి విజయలక్ష్మిగారు }

ఈ మహిళా మండలివారు అత్యంత శ్రద్ధాభక్తులతో మంచి యుత్సాహ సంపదలో కటకం శ్రీరామ క్రతు స్తంభము వద్ద ప్రతిశుక్రవారము సమావేశమై మహావైభవముగా లక్ష్మీ పూజా కార్యక్రమమును గావించుచున్నారు.

## బదరీ వార్త

శ్రీమాన్ మన సంఘప్రధాన కార్యదర్శి ఉ. వే. న్యాయవేదాన్త విద్వాన్ తే. కం. గోపాలాచార్య స్వామివారు బదరికి వేంచేసిరి. అచ్చట ఆ అష్టాక్షరీ మందిరములో శ్రీ శ్రీనివాస రామానుజ స్వామివారికి అధ్యయనోత్సవము జరిపించి భక్తుల గోత్ర నామములతో పూజలు జరిపి ప్రసాదమును బదరినుండి విరాళదాత లందరకు పంపుదురు.

## పాలకొండ

శ్రీకాకుళం జిల్లా పాలకొండ గ్రామములో వేంచేసియున్న శ్రీ సీతారామస్వామివారి దేవాలయమందు పూర్తిగ శిథిలమై జీర్ణమైన ధ్వజస్తంభమును తొలగించి క్రొత్తగా మరల ధ్వజ స్తంభ ప్రతిష్ఠ గావించుటకు శ్రీమాన్ మనజీయరు స్వామివారు సంకల్పించుకొని పాలకొండకు వేంచేసి యచట తగిన యేర్పాట్లు గావించిరి. ఈ ఆలయమునకు క్రొత్తధ్వజస్తంభ కర్రను శ్రీ వైశ్యరాజు నరసరాజుగారు (ఆముదాలవలస) ఉచితముగా సమర్పించుటకుగా వాగ్దానము చేసిరి. మిగత కావలసిన ఏర్పాటులన్నియును చురుకుగా జరుగుచున్నవి.

శ్రీ లక్ష్మీహయవదన పరబ్రహ్మణేనమః

# ప్రపన్న ధర్మసార సముచ్చయము.

## (గోపాలాచార్య)

## వైష్ణవేష్టి

పంచసంస్కార సంస్కృతులు కాకపోవుటచే వైష్ణవులు కాని తల్లిదండ్రి మొదలగు వారు మరణించినచో వారికి కర్మనాచరించు పుత్రాదులట్టి సంస్కార సంపన్నులగుటచే వైష్ణవులైతిను మరణించిన పిత్రాదులకున్ను వైష్ణవత్వము నపేక్షించుచో వైష్ణవేష్టిని గావించవలెను, ఇందులకు ప్రమాణము వాసిష్టస్మృతి యందలి సప్తమాధ్యాయమున—

శ్లో॥ పిత్రాదయో మృతాయస్య భవేయు ర్యద్య వైష్ణవాః ।
ఇష్టించ వైష్ణవీం కుర్యాత్తేషాం పాపవిశుద్ధయే ॥
యః కుర్యా ద్వైష్ణవీ మిష్టిం విధినా వైష్ణవోత్తమః ।
వైష్ణవత్వం ప్రయాత్యేవ కుల మేకోత్తరం శతమ్ ॥

అనగా చనిపోయిన పిత్రాదుల వైష్ణవులగుచో పుత్రాదులు వారి పాప పరిహారము కొఱకై వైష్ణవేష్టిని గావించవలెను. ఇట్లు శాస్త్రోక్తముగా నా వైష్ణవేష్టి నొనరించినచో నాతని నూటొక్క తరము వారు వైష్ణవులగుదురు,

ఈ వైష్ణవేష్టి నాచరించు విధానమును పెద్దలవలన నెఱుంగవలెను. ఇట్టి వైష్ణవేష్టి విప్రోత్తములచే నేస్థలమున నాచరింపబడునో ఆ స్థలము వైష్ణవ దేశమని పిలువ బడుచు సకల బంధములను బాపును. కావున కులమును పవిత్ర మొనరించుటకును, దేశమును సుభిక్షము గావించుటకును వైష్ణవుడగువాడు తప్పక వైష్ణవేష్టి నొనరించవలెను.

## ప్రపత్తి

ఈ విధముగ పంచ సంస్కారములచే సంస్కృతుడైన ముముక్షువు భగవంతుని విషయమై ప్రపత్తిని చేయవలెను. ప్రపత్తియనగా తన సకలవిధమగు రక్షణ భారమును సర్వేశ్వరుని యందుంచి తనరక్షణలో తానిసుమంతయు యత్నింపక నిర్భరుడై యుండుట

దీని కందరు నధికారులే. దేశనియమముగాని కాలనియమముగాని ఫలనియమముగాని ప్రకార నియమముగాని లింగనియమముగాని లేదని భరద్వాజ మహర్షి భరద్వాజ సంహితలోని ప్రథమాధ్యాయమున నిట్లునిర్ణయించెను,

శ్లో॥ న జాతిభేదం న కులం న లిఙ్గం న గుణక్రియాః ।
న దేశకాలౌ నావస్థాం యోగో హ్యాయ మపేక్షతే ॥
బ్రహ్మక్షత్రియ విట్శూద్రాః స్త్రియశ్చాన్త్యజాస్తథా ।
సర్వఏవ ప్రపద్యేరన్ । సర్వధాతార మచ్యుతమ్ ॥

— ఇది మూల విధులు —

కాయిక ప్రపత్తి, వాచిక ప్రపత్తి, మానస ప్రపత్తియని. **కాయిక** ప్రపత్తియనగా ప్రపత్తవ్యుడగు పరమేశ్వరుని ముందు సాష్టాంగ మొనరించుట మొదలగునవి.

వాచిక ప్రపత్తి యనగా—

'త్వమేవోపాయ భూతో మేభవ'

అని ప్రార్థించుట.

మానస ప్రపత్తి యనగా — శ్రియఃపతియే దిక్కని మనస్సునందు దృఢమగు నధ్యవసాయము కలిగియుండుట. ఇదియే 'మామేకం శరణం వ్రజ' అను విధియందును

'(శ్రీ) మన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే'

అనెడు యనుష్ఠానము నందును గాంచనగును. బాలమూక బధిర జడాద్యంగవికలు లీ మానస శరణాగతి చేతనే ప్రసన్నులైన యాచార్యులచే కటాక్షింపబడి పరమగతిని బడయ గలుగు చున్నారు.

తిరిగి యీ ప్రపత్తి సాత్విక రాజస తామస ప్రపత్తులని మూడువిధములు. ఇందు సాత్విక ప్రపత్తియే మోక్షప్రదము. తక్కిన వాయాతుచ్ఛ ఫలార్థు లాచరింప దగినవియే.

ఇట్లు శ్రియఃపతికి శరణాగతి యొనర్చి దేవతాంతర పరిత్యాగ పూర్వకముగా సకల పరివార సమన్వితుడై యాతనిని సమస్త భోగములతో చర్చింపవలెను.

## — ప్రపన్నుడు పాటింపవలసిన నియమములు —

భారద్వాజ సంహితాయాం చతుర్థేఽధ్యాయే :—

శ్లో॥ వర్జయే దన్యదేవానా । మాలయాద్యుప సర్పణమ్ ।
తథాగోపుర హర్మ్యాది । విమాన స్యావలోకనమ్ ॥
న చ మన్త్రోఽపి జీవీస్యా । న్నచా ప్యర్చోఽపి జీవనః ।
నానివేదిత భోజిస్యా । న్నచనిన్ద్యా నివేదకః ॥
స ఏకాన్త్యన్య విముఖో । హరిం సర్వేశ్వరం పరమ్ ।
యస్సమాశ్రయతే కిఞ్చి । త్ఫల మభ్యర్థయన్నరః ॥
న్యస్తాశేషభర శ్రీశే । యస్తుదాస్యైక జీవనః ।

స ఏష పరమైకాన్తీ । ద్వావేతౌ వైష్ణవోత్తమౌ ॥
అన్యేత్వ వైష్ణవాస్సర్వే । మానుషా జిహ్మదృష్టయః ।
అసత్తస్తాన్విదుర్దేవా । స్తైస్సతాం నాస్తి సఙ్గమః ॥
ప్రపన్నైశ్చాన్య భజనాద్యుక్తాపాయ సమన్వితైః।
వైష్ణవో వర్జయేత్సఙ్గం । ప్రచ్యావేతహ్య వైష్ణవాత్ ॥
దైవేషు పిత్ర్యేషు తథా । ధర్మార్థేష్వితరేషు చ ।
అవైష్ణవం న గృహ్ణీయా । త్పాత్రం దానేషు కర్హిచిత్ ॥

అనగా ప్రపన్నుడు దేవతాంతరముల మందిరముల చెంతకు పోరాదు. వారిగోపురములను గుళ్ళను, మండపములను చూడరాదు. తనజీవికకై ధనాపేక్షతో మంత్ర మంత్రార్థముల నుపదేశింపరాదు. అట్టి ప్రయోజనమునకై దేవతార్చనను సేయరాదు. భగవంతునకు నివేదించని పదార్థములను వేటినిగాని తినరాదు. శాస్త్రములో తినరాదని చెప్పబడిన వస్తువులను భగవంతునకు నివేదించరాదు.

ఇట్టి ప్రపన్నులు ఏకాంతులనియు పరమైకాంతులనియు రెండు విధములు. అందు ఏకాంతి యనగా — ఇతర దేవతలను విడిచి కేవల శ్రీమన్నారాయణునే ఏవోయొక ఫలాపేక్షతో నాశ్రయించువాడు.

పరమైకాంతియనగా — తన సమస్తరక్షణ భారమును శ్రియః పతియందే యుంచి యాతని కొలువే తనకు జీవనోపాధిగా భావించువాడు. వీరిరువురును వైష్ణవు లనబడుదురు. ఇక కనబడిన దేవతలకెల్ల మ్రొక్కులిడుచు తుచ్ఛఫలముల నర్థించు కుదృష్టులు వైష్ణవులన బడరు. దేవతలు వారిని సత్పురుషులుగా పరిగణింపరు. అట్టి వారితో సజ్జనులకు మైత్రితగదు. ప్రపన్నులయ్యును దేవాంతరములను ఫలాంతరములకు భజించు నీచులతో సద్వైష్ణవుడు సహవాస మొనరింపరాదు. ఒనరించెనో, దానతాను పతితుడగును. దేవకార్యములలోగాని పితృ శ్రాద్ధాదులలోగాని ఇతరములగు వైదిక క్రియాకలాపములు వేటిలోగాని. దాన ధర్మాదులలో గాని వైష్ణవేతరుని చేరదీయరాదు.

ఆ గ్రంథమందే పంచమాధ్యాయమున—

వైష్ణవుని పరిసరములలోగాని, వారి గృహములలోగాని వారు తిరుగాడు గ్రామాదులలో గాని, నివసించువారు సద్గతిని బడయ గలుగుదురు.

## —పద్మపురాణమున—

దేవతాంతరములను నమస్కరింపరాదు.

దేవతాంతరముల నాలోకింపరాదు.

దేవతాంతరముల మేడల నెక్కరాదు.

దేవతాంతరముల మందిరముల లోనికేగరాదు.

పితృమాతృ సుత భ్రాతృ । భార్యాది మరణే సతి ।
అశ్రుపాతం ప్రపన్న శ్చే । త్కుర్వీత పతితో భవేత్ ॥

అనగా — తండ్రి, తల్లి, కొడుకు, సోదరుడు, భార్య మొదలగువారు చనిపోయినపుడు ప్రపన్నుడు కన్నీరు కార్చరాదు. కార్చెనో పతితుడై పోవును.

కావున ముముక్షువు శ్రియః పతియందే సకల భారముల నుంచి పరమైకాంతియై మన్వాదు లామోదించిన ధర్మదేశమున తనశక్తికి తగినటుల నొకభవనమునో గుడిశనో నిర్మించుకొని యందుండి తనశక్తికొలది తనవర్ణమునకును ఆశ్రమమునకును తగిన కర్మలను భగవత్ప్రీతిగా నాచరించుచు సమస్త సాంసారిక దుఃఖములను బాపుకొని శరీరము విడుచువరకు నుండవలెను.

శ్రీమతే రామానుజాయ నమః

## — గమనిక —

భక్తాగ్రేసరులారా !

ప్రస్తుతము పోస్టల్ చార్జీలు పెరుగుటచే పుస్తకములు రిజిష్టరు పోష్టుద్వారా పంపుటలో గ్రాహకులకు హెచ్చుఖర్చు భరింపవలసి వచ్చుచున్నదని యీ దిగువ గ్రంథము లీదిగువ నుదహరించిన సెంటర్లలో లభించు ఏర్పాటు చేయబడినది. గాన అయా ప్రాంతీయు లచ్చటి నుండియే గ్రహింతురు గాకయని తెలుపు చున్నాము.

## లభించు గ్రంథములు

1. సుమారు 800 పేజీలతో ఫుల్ క్యాలికో బైండు చేయబడిన ప్రపన్నామృతము:- శ్రీ రామానుజుల వారియొక్కయు వారి ముఖ్యశిష్యుల యొక్కయు సమగ్ర చరిత్ర సంస్కృతమున కాంధ్రాను వాదము— వెల. రూ. 6-50

2. శ్రీ సూక్తము :— ఋక్కులవినియోగము - ఇందలి మంత్రములు - వాటి ఫలితములు శ్రీసూక్తసంగ్రహ ఆంధ్రానువాదము - ప్రతిపదార్థము సంస్కృత వ్యాఖ్యానము దానికి ఆంధ్రానువాదము. వెల. రు. 0-50లు.

3. శ్రీకృష్ణావతార వైభవము :— తమద్భుత మిత్యాది శ్రీకృష్ణావతార ఘట్టమునకు సంబంధించిన శ్రీ భాగవత శ్లోకములకు అపూర్వమైన సంస్కృత వ్యాఖ్యానము - నాగరిలిపిలో ముద్రితము -- సంస్కృత భాషాభిజ్ఞుల కత్యంతోపకారము - వెల రు. 0-50లు

## ఈ గ్రంథములు లభించు కేంద్రములు

1. శ్రీ బలభద్ర వెంకటరాజుగారు, పాండురంగ కలరు కంపెనీ, రాజమండ్రి - తూర్పు గోదావరిజిల్లా

2. శ్రీ ఇళంకిళి పార్థసారథిగారు, గీతామందిరం, 107 వరదా ముత్తియప్పన్ స్ట్రీటు, మదరాసు-1

3. శ్రీనూనె వెంకటేశ్వర్లుగారు. కిరాణామర్చంటు, వంగోలు - గుంటూరుజిల్లా

4. శ్రీమతి కంచేటి తాయారమ్మగారు శ్రీయతిరాజ భవనము బలరామన్నపేట మచిలీపట్నం కృష్ణాజిల్లా

5. శ్రీ నిడముక్కల శ్రీరామమూర్తిగారు, రామానుజ కూటము క్రొత్తగుళ్ళవద్ద - విజయవాడ-1 కృష్ణాజిల్లా

6. శ్రీ చలంచర్ల వెంకటాచార్యులుగారు, జనార్థనస్వామివారి ఆలయం గుడివాడ - కృష్ణాజిల్లా

7. శ్రీ కూనంనేని వెంకటప్పయ్యగారు, ఆశ్రమం నడిగడ్డపాలెం, (వయా) చేబ్రోలు గుంటూరు జిల్లా.

8. శ్రీ దాసరి ఆనందమోహన్ రావుగారు, మోహన్‌స్టోర్సు మెయిన్‌రోడ్డు విశాఖపట్నం

9. శ్రీ జైసాని పైడిశెట్టిగారు, ఐరన్ మర్చంటు మెయిన్‌రోడ్డు విజయనగరం విశాఖపట్నం జిల్లా

10. శ్రీ న్యాయపతి బాలకృష్ణమూర్తిగారు, అడ్వకేటు శ్రీకాకుళం Dt.

11. శ్రీకాదా సత్యనారాయణ శ్రేష్ఠిగారు, మందుల వ్యాపారం, బరంపురం - (ఒరిస్సా)

12. శ్రీ ఉత్పల రాజగోపాలాచార్యులుగారు, టీచరు A. V. H. M. హైస్కూల్ వరంగల్

13. శ్రీ వి. సుగుణమ్మగారు C/o గాది రాజగోపాల్‌రావుగారు, అడ్వకేట్ బాటాకంపెనీవద్ద సికిందరాబాద్

14. శ్రీమట్లపల్లి అనసూయమ్మగారు. సలాది బిల్డింగ్సు, ఏలూరు ప. గో. జిల్లా

15. శ్రీ నేరెళ్ళ జగన్నాథ గుప్తగారు, పేరాల Via చీరాల, గుంటూరు జిల్లా

16. శ్రీ తటవర్తి రామమోహన్‌రావుగారు, రైల్‌పేట మెడికల్‌స్టోర్సు, రేపల్లె గుంటూరుజిల్లా

## బదరీ విరాళములు

శ్రీ K. V. S. రామదాసుగారు, ఛత్రపురం 27-00
శ్రీ సేక్ల అనసూయమ్మగారు, తెనాలి 32-00
శ్రీ V. జానకమ్మగారు, సుల్తానపల్లి 18-00
శ్రీ కొలిపాక భ్రమరాంబగారు వయ్యాలు పరచి పంపినది 130-00
శ్రీ నందిపాటి రామయ్యగారు విజయవాడ 11-15
శ్రీ బదరీ తదీయారాధనకు 1-50
శ్రీ 18వ పూజకు 2-55
శ్రీ G. S. బ్రహ్మాజీగారు, విజయవాడ 11-00
శ్రీ K. V. నరసింహులు శెట్టిగారు శ్రీకాకుళం 50-00
శ్రీ K. విమలావతి గారు కవుతవరం 65-00
శ్రీ నందిపాటి జగన్నాథములుగారు, విజయవాడ 11-00
శ్రీ మల్లికార్జున మల్లయ్యగారు, సికింద్రాబాద్ 29-00
శ్రీ కొప్పోలు బుచ్చయ్యగారు చెరుకూరు 27-00
శ్రీ సింగవరపు చంద్రమ్మగారు పెంజెంద్ర 11-00
శ్రీ కొలిపాక భ్రమరాంబగారు కంభము వసూలు పరచి ఆశ్రమమునకు M.O గా పంపినది 200 00
శ్రీ దొడ్డపనేని రాఘవయ్యగారి భార్య వెంకట లక్ష్మీనరసమ్మగారు వలివేరు 58-00
శ్రీ దొడ్డపనేని వెంకటలక్ష్మీనరసమ్మగారు వలివేరు బదరీలో 1రోజు అతిథి ఆతిథ్యమునకు 2-00
శ్రీ ముసునూరు లక్ష్మీనరసరాజుగారు విజయనగరం 100-00
శ్రీ కిల్లంశెట్టి విశ్వనాథం గారు చీపురుపల్లి 29-00

## కట్నములు

శ్రీ గొల్లపూడి అమ్మన్నమ్మగారు, ఒంగోలు. 5-00
శ్రీ కొండూరి వెంకటనరసమ్మగారు, చదలవాడ 5-00
శ్రీ పుట్టగుంట వెంకటేశ్వరరావుగారు, కామలపాలెం 2-00
శ్రీ E. కృష్ణమూర్తిగారు, కాములపాలెం -.00
శ్రీ E. అన్నపూర్ణమ్మగారు. కాములపాలెం. 2-01
శ్రీ E. శ్రీమన్నారాయణగారు కాములపాలెం. 3-00
శ్రీ లక్ష్మీనృసింహస్వామి దేవస్థానం, టెక్కలి 2-00
శ్రీ B. గోపాలరావుగారు, మహబూబ్ నగర్, పత్రికసంస్థకు 45-00
శ్రీ గుదిమెళ్ల లక్ష్మణాచార్యులు గారు బూరుగడ్డ 1-00
శ్రీ చిక్కాల నరసింహాచార్యులుగారు సింగరాయకొండ, తండ్రిగారు పరమపదించిన సందర్భమున 5-00
శ్రీ న. చ. రఘునాథాచార్యులు గారు వేణుగోపాలపురం ముదుంబై లక్ష్మీ నరసమ్మగారి తిరువధ్యయిన సందర్భమున 2-00
శ్రీ డా. అ. చి. కృష్ణమాచార్యులుగారు రాజమండ్రి కుమార్తె వివాహ సందర్భమున 10-00
శ్రీ గుదిమెళ్ల అంటాళమ్మగారు వలిగొండ కుమారుని ఉపనయన సందర్భమున 2-00
శ్రీ చిక్కాల నరసింహాచార్యులుగారు సింగరాయకొండ తండ్రిగారు నాచార్యులుగారు పరమపదించిన సందర్భమున 5-00
శ్రీ చిక్కాల నరసింహాచార్యులుగారు ద్వారక తిరుమల 2-00
శ్రీ రామానుజ సింహాచలంగారు శ్రీకాకుళం 5-00
శ్రీ తి. కొ. గాయత్రీజస్వామిగారు రామతీర్థం కుమార్తె వారి కోర్కెన సందర్భమున 3-00
శ్రీ మాడభూషి A C కృష్ణమాచార్యులుగారు రాజమండ్రి తమ కుమార్తె వివాహ కట్నముగా పంపినవిరాళము 10-00
శ్రీ గాదె సత్యవతమ్మగారు బరంపురం తమ కుమారుని పెండ్లి కట్నముగా పంపినది 5-00
శ్రీ కైకలపాటి చంద్రయ్యరాజుగారు (అనుగాలవలస) తమ కుమారుడు చి॥ కేశవరాజుగారి శోభనమహోత్సవ సందర్భమున పంపినకట్నం 4-00

## శ్రీరామానుజకూటవిరాళములు

శ్రీ మందరాడ యతిరాజసేవా మహిళా మండలి వారు భక్తభోజ్యములుగా సమర్పించినది 4-00
శ్రీ రుద్రరాజు సీతారామరాజుగారు పోడూరు 9-00
శ్రీ జంపన రంగరాజుగారు పోడూరు 6-00
శ్రీ కొత్త సరస్వతమ్మగారు వలివేరు 2-12
శ్రీ K. V. N. రామారావుగారు. Pohot 11-00
శ్రీ G. ఆళ్వారాచార్యులు గారు మహబూబ్ నగర్ 3-00
శ్రీ గ్రంథి రంగనాయకమ్మగారు సింగరాయకొండ 1-00
శ్రీ K. సావిత్రమ్మగారు కోదాడ 1-00
శ్రీ M. గుణవతీదేవిగారు కమారెడ్డిబానగర్ 8-00
శ్రీ B. గోపాలరావుగారు మహబూబ్ నగర్ 100-00
శ్రీ అడుసుమల్లి రంగనాయకమ్మగారు నూజెళ్ల 11-11
శ్రీ ఉరటు జానికమ్మగారు మచిలీపట్నం 5-00
శ్రీ కంచర్ల వీరరాఘవులుగారు విజయవాడ 2-50
శ్రీ బాచిరెడ్డి కాంతారెడ్డిగారు కణతాల (P. o) 16-68
శ్రీ V. V. రంగమ్మగారు హైదరాబాద్ 1-00
శ్రీ గుత్తా వెంకయాయమ్మగారు 5-00
శ్రీ దాశరి శ్రీదేవమ్మగారు 6-50
శ్రీ నందూరి వెంకటరమణమ్మగారు 10-00
శ్రీ N. రాజగోపాలయ్యంగారు 6-00
శ్రీ జి. రాజేశ్వరిగారు 2-00
శ్రీ N. V. రామదాసుగారి కుమార్తెలు కటకం 5-00
శ్రీ ఆరవిల్లి శ్రీరంగనాయకాచార్యులుగారు 6-00
శ్రీ బలివాడ సుందరరావుగారు 2-00
శ్రీ సత్యనారాయణ మేష్టరుగారు 1-00

శ్రీ రామాయనమః

## 37వ, శ్రీరామ మహాక్రతువు

శ్రీమాన్ మనజీయరు స్వామివారు 37వ శ్రీరామ మహాక్రతువును శ్రీకాకుళం జిల్లా పాలకొండ గ్రామములో శ్రీకోదండ రామాలయమందు 24-6-63వ తేదీనుండి ప్రారంభించిరి. ఇచ్చట క్రతు స్తంభ నిర్మాణముకూడ ఆరంభమైనది. ఈ క్రతు స్తంభ నిర్మాణమునకు విశేష ప్రోత్సాహకులు ఆముదాలవలస వాస్తవ్యులు శ్రీమాన్ వైశ్యరాజు నవరరాజుగారు పాలకొండ గ్రామంలో శ్రీవైశ్య సంఘము వారా క్రతు స్తంభమును నిర్మించుచున్నారు. శ్రీ స్వామివారిచ్చట 10 రోజులుండి పాదుకా పట్టాభిషేక ఘట్టమునాడు (అనగా 3-7-63) వ తేదీ క్రతు స్తంభ ప్రతిష్ఠ జరుపుదురు.

6-7-63 వ తేదీ నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమమునకు వేంచే[సి] ఆషాఢశుద్ధ పూర్ణిమనాడు అనగా 6-7-63వ తేదీనుండి చాతుర్మాస్య దీక్ష జరుపుదురు.

3-7-63వ తేది ప్రారంభించ వలసిన చాతుర్మాస్యదీక్ష ఈ క్రతు స్తంభం మూలకముగ 6-7-63వ తేదికి నిర్ణయింప బడినది.

## విషాదవార్త

బరంపురంలో సుప్రసిద్ధ న్యాయవాదులును కాంగ్రెసు సేవకులును ప్రముఖులును కొక్కలి శ్రీ లక్ష్మీనృసింహ దేవాలయ వంశపరంపరాధర్మకర్తలును గోల్కొండ శ్రీ వైష్ణ[వ] ప్రముఖులగు శ్రీమాన్ బచ్చు నరసింహ స్వామిగారు పరమ పదించిన వార్తవిని చా[లా] విచారించితిమి. వీరి యాత్మను శ్రీయఃపతి స్వీకరించుగాక.

---

పోలుఖండా రు. 6 లు భక్తినివేదన BOOK—POST రి నెం A 264

వాసుదాసాశ్రమం:- నడిగడ్డపాలెం పోస్టు [వయా చేబ్రోలు] గుంటూరు జిల్లా

28. శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్
తిరుపతి చిత్తూరు జి.



Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Liberty Press, Tenali For Sriman Press, Nadigaddapalem.